# విశ్వకోశము

## ( విశ్వ ప్రకాశము )



## సంస్కృతాంధ్ర నిఘంటువు

కోశ కర్త :

**శ్రీ మహేశ్వర సూరి**



**రోహిణి పబ్లికేషన్స్**

మెయిన్ రోడ్, రాజమండ్రి - 1.

# VISWA KOSAM

(VISWA PRAKASAM)

By : **SRI MAHESWARA SURI**

SANSKRIT - TELUGU DICTIONARY





First Edition :
OCTOBER 1996

DTP at :
**UNIVERSAL TYPE SETTERS**, Rajamundry.

Printed at :
**SRI ARUNODAYA PRINTING PRESS,**
**Seetharampuram, VJA-2. Ph : 431422**

*Published by :*

**Phone : 73444**

**ROHINI PUBLICATIONS**

**MAIN ROAD, RAJAMUNDRY - 1**

**PRICE : Rs.75/-**

# మనవి

సంస్కృత శబ్దకోశాల్లో అమరకోశం తర్వాత ఎన్నదగినది విశ్వకోశం.

శ్లో : కోశం విశ్వ ప్రకాశాఖ్యం నిరమాస్త్రీ మహేశ్వరః

అనే శ్లోకాన్ని బట్టి సమస్తమును ప్రకాశింపజేయబడినది'' అనే అర్థం స్ఫురించే విధంగా కోశకర్త శ్రీ మహేశ్వర సూరి ఈ నిఘంటువుకు ''విశ్వప్రకాశము'' అన్న ఔచిత్యనామాన్ని ఏర్పరచాడు. కాని సంజీవినీ వ్యాఖ్యాత శ్రీ మల్లినాథ సూరి తన వ్యాఖ్యానాలలో ఉచ్చారణ సౌలభ్యం కొరకు ''ఇతి విశ్వః'' అని పేర్కొనటంతో దీనిపేరు విశ్వకోశంగానే స్థిరపడిపోయింది.

ప్రామాణిక పరంగా పరిశీలిస్తే రమారమి పది నిఘంటువులను సంప్రదించి నిర్మించటం వలన శబ్ద బాహుళ్యత, సౌష్ఠవాలను సంతరించు కుని సప్రామాణిక నిఘంటువుగా నేటికీ నిలువగలిగింది.

శ్లో : ఏతత్కవీంద్రైరథ పండితేంద్రైః ప్రయోగ సంబోధ ఫల ధ్వయాప్త్యై
యైర్నామ కంఠాభరణం కృతంతైః సర్వజ్ఞతా స్వప్రణయీ కృతైవ

అనే శ్లోకాన్ని ప్రయోజన పరంగా పరిశీలిస్తే ఈ విశ్వకోశం కవీంద్రులకు, పండితులకు, విద్యార్థులకు మిక్కిలి మహోపకారిగా అవగతమవుతోంది.

ఇటువంటి అత్యుత్తమమైన నిఘంటువును విద్వాంసులు, విద్యార్థులు ఆదరిస్తారనీ, విశ్వప్రకాశంతో విద్యార్థులు స్వయం ప్రకాశితులు అవశ్యం కాగలరని ఆశిస్తున్నాం.

ధాతృనామ సంవత్సరం
విజయ దశమి

రోహిణి పబ్లికేషన్స్.

## ఈ నిఘంటువునందు సూచించిన సంకేతములు

| | | |
|---|---|---|
| పు | ..... | పుంలింగము |
| స్త్రీ | ..... | స్త్రీలింగము |
| న | ..... | నపుంస లింగము |
| త్రి | ..... | త్రిలింగము |
| అ | ..... | అవ్యయము |

# విశ్వకోశః

## ముఖఖండ ప్రారంభః

స్తుమీ మహి మహామోహక్లేశాంతక భిషగ్వరం।
త్రైధాతుకనిదానజ్ఞం సర్వజ్ఞం దుఃఖహానయే॥ 1

కలావిలాసాన్మకరందబిందు ముద్రాం వినిద్రే హృదయారవిందే।
యా కల్పయంతీ రమతే కనీనాం దేవీం నమస్యామి సరస్వతీం తాం॥ 2

కవీంద్రకుముదానంద కందోద్గమసుధాకరం।
వాచస్పతిమతి స్పర్ధి శేముషీ చంద్రికోజ్జ్వలం॥ 3

క్షుభ్యత్క్షీరాబ్ధికల్లోలమాలోల్లాసి యశశ్శ్రియం।
గురుం వందే జగద్వంద్య గుణరత్నైక రోహణం॥ 4

శ్రీసాహసాంకనృపతే ర నవద్యవైద్య విద్యాతరంగ పదమద్వయమేవ బిభ్రత్।
యశ్చంద్రచారుచరితో హరిచంద్రనామా స్వవ్యాఖ్యయా చరకతంత్రమ లంచకార॥ 5

ఆసీద సీమ వసుధాధిప వందనీయే తస్యాన్వయే సకల వైద్యకులావతంసః।
శక్ర స్య దస్ర ఇవగాధిపురాధిపస్య శ్రీ కృష్ణ ఇత్యమల కీర్తిలతావితానః॥ 3

సంకల్ప నంభవదనల్ప వికల్పజల్ప కల్పాన లాకులిత వాదిసహస్ర సింధుః।
తర్క త్రయత్రిణయన స్తనయో యదీయో దామోదర స్సమభవద్భిషజాం వరేణ్యః॥ 7

తస్యాభవత్సూ నురుదారవాచో వాచస్పతి శ్రీలలనావిలాసీ।
సద్వైద్య విద్యానళినీదినేశః శ్రీమల్లణ స్సత్కుముదాకరేందుః॥ 8

యద్భ్రాతృజ స్సకలవైద్యక తత్వరత్న రత్నాకర శ్రియమవాప్య చ కేశవో భూత్।
కీర్తేర్నికేతన మనింద్యపదప్రమాణ వాక్య ప్రపంచరచనా చతురాననశ్రీః॥ 9

కృష్ణస్య చాజ జని సుత స్స్మితపుండరీక షండాతపత్ర పరభాగయశః పరాగః।
శ్రీ బ్రహ్మ ఇత్యవికలాత్మ ముఖారవింద సోల్లాసలాసిత రసార్ద్ర సరస్వతీకః॥ 10

తస్యాత్మజ స్సరసకైరవ కాంతకీర్తిః శ్రీమాన్మహేశ్వర ఇతి ప్రథితః కవీంద్రః।
నిశ్శేషవాఙ్మయ మహార్ణవపారదృశ్వా శబ్దాగమాంబురుహ షండరవిర్బభూవ॥ 11

య స్సాహసాంకచరితాది మహాప్రబంధ నిర్మాణనైపుణగుణాగత గౌరవశ్రీః।
యో వైద్యకత్రయ సరోజ సరోజబంధుః బంధు స్సతాం సుకవికైరవ కాననేందుః॥ 12
ఇయం కృతి స్తస్య మహేశ్వరస్య వైదగ్ధ్యసింధోః పురుషోత్తమానాం।
దేదీప్యతాంహృత్కమలేషు నిత్య మాకల్ప మాకల్పిత కౌ స్తుభశ్రీః॥ 13
లబ్ధైః కథంచిదభిజాత సువర్ణకార లీలేన కోశవరరత్ననిధి శబ్దరత్నైః।
విశ్వప్రకాశ ఇతి కాంచనబంధ శోభాం బిభ్రన్మయా ఘటితో ముఖఖంధ ఏషః॥ 14
క్షోణీశ్వరో దీరితశబ్దకోశ రత్నాకరాలోడనలాల సానాం।
సేవ్యః కథం నైష సువర్ణ శైలో విశ్వప్రకాశో విబుధాధిపానాం॥ 15
భోగీంద్ర కాత్యాయన సాహసాంక వాచస్పతి వ్యాడి పురస్సరాణాం।
సవిశ్వరూపా మలమంగలానాం శుభాంగ వోపాలిత భాగురాణాం॥ 16
కోశావకాశాత్ప్ర కటు ప్రభావ సంభావితా నర్ఘ్యగుణస్స ఏషః।
సంపాదయ స్నేష్యతి వాంఛితార్థా కథం న చింతామణితాం కవీనాం॥ 17
ఆమిత్రశైల చరమాచలమే (క) ఖలాద్రి కైలాసభూమి పలయాద్య దిహాస్తికించిత్
ఏకత్ర సంభృతమగోచర శబ్దరత్న మాలోక్యతాంత దఖిలం సుధియః కవీంద్రాః॥ 18
యద్యస్తి వాఙ్మయమహార్ణవ మంథనేచ్ఛా ప్రాప్తుం పదం ఫణి పతేర్యది కౌతుకం వః।
విశ్వప్రకాశమనిశం తదిమం నిషేవ్య సంభావ్య తాం పరమశాబ్దిక శేఖరశ్రీః॥ 19
సతాం పుస్తక సంభారభార మోక్షః కృతో మయా।
నామానుశాసనమిదం సంపూర్ణం తన్వతాఽద్భుతం॥ 20
యద్యపూర్వతయా కించిన్నామాత్ర ప్రతిభాతి చ।
తత్తదన్విష్యతాం సద్భిర్నామ పారాయణాదిషు॥ 21
ఏతత్కవీంద్రై రథ పండితేంద్రైః ప్రయోగ సంబోధ ఫలద్వయాప్త్యై।
యైర్నామ కంఠాభరణం కృతం తై స్సర్వజ్ఞతా స్వప్రణయీ కృతైవ॥ 22
స్వైరప్రచారైః పరికల్పితాభిః శబ్దార్థ సంబోధ కథా ప్రథాభిః।
వ్యాఖ్యాభి రప్రాప్తముదాం ప్రమోదమాదాతు మత్రైష పరిశ్రమోనః॥ 23
ఏతాంకృతిం కృతధియః కృతకృత్యభావ మాపాదయన్ను సదయం సదయంతు చేతః।
నిత్యం మహేశ్వరకవేః పరిభావయంతః సంతః పరోన్నతిరతా హి భవంతి లోకే। 24
రామా నల వ్యోమ రూపైశ్శకకాలే వ ఖిలక్షితే కోశం విశ్వప్రకాశాఖ్యం నిరమాచ్ఛ్రీ మహేశ్వరః॥ 25

# నియామాః

**మూ :** ఏకద్విత్రి చతుః పంచ షడ్వర్ణాను క్రమోజ్జ్వలైః
కాంతాదివర్గైర్నానార్థసంగ్రహోఽయం వితన్యతే 1

**టీ.** ఏక ... జ్జ్వలై - ఏక ... షట్ = ఒకటి మొదలుకొని యారు వరకు నైన, వర్ణ = అక్షరముల యొక్క, అనుక్రమ = వరుసచేత, ఉజ్జ్వలైః = ప్రకాశించుచున్న, కాంతాది వర్గైః = కాంతము మొదలగు వర్గములచేత, అయం = ఈ, నానార్థసంగ్రహః = అనేకార్థ సంగ్రహము, వితన్యతే = విస్తరింపబడుచున్నది.

**మూ :** నానార్థః ప్రథమాంతోఽత్ర సర్వత్రాదౌ ప్రదర్శితః
సప్తమ్యంతేషు శబ్దేషు వర్త మాన స్సునిశ్చితః 2

**టీ :** అత్ర = ఈ కోశమునందు, సర్వత్ర = అంతట, సప్తమ్యంతేషు = సప్తమీ విభక్తి యంతమందుగల, శబ్దేషు = శబ్దములయందు, వర్తమానః = వర్తించు చున్నయదియు, సునిశ్చితః = సుష్టుగా నిశ్చయింపబడినదియు, ప్రథమాంతః = ప్రథమావిభక్తియంతమందుగలదియు( నగు) నానార్థః = అనేకార్థశబ్దము, ఆదౌ= ముందుగా, ప్రదర్శితః = చూపబడెను.

**మూ :** దృష్టాంతేన సహ క్వాపి సప్తమ్యాధార ఏవ చ
స్పష్టాయ లింగభేదాయ క్వాప్యత్ర పునరుక్తతా 3

**టీ :** క్వాపి = ఒక్కొక్కచోట, దృష్టాంతేన సహ=దృష్టాంతముతోగూడా సప్తమ్యాధారఏవ= సప్తమీ విభక్తి యాధారముగల శబ్దము నందే ( ప్రవర్తించు చున్నది) ఉ: శ్లో 'దవో దావ ఇవ ఖ్యాతో దవాగ్ని వనయోరపి' అత్ర = ఈ కోశమునందు, క్వాపి= ఒక్కొక్కచోట, పునరుక్తతా = ( నానార్థపదముయొక్క) పునరుచ్చారణము, స్పష్టాయ = స్పష్టమైన, లింగభేదాయ = లింగవిభేదము కొఱకు ( నగుచున్నది)

★ కాంత ఏకవర్ణః ★

కో బ్రహ్మాత్మా నిలార్కేషు
శమనే సర్వనామ్ని చ
పావకే చ మయూరేచ
సుఖ శీర్షజలేషు కం

క : పు. ఇది బ్రహ్మకును, ఆత్మకును, వాయువునకును, సూర్యునకును, యమునకును, సర్వనామ వాచకముకును, అగ్నికిని, నెమలికిని, న. సుఖమునకును, శిరమునకును, జలమునకును పేరు.

★ అథ కాంతోద్వివర్ణః ★

అకం పాపే చ దుఃఖేచ
శకో రాజన్య దేశయోః

**అక** : న. ఇది పాపమునకును, దుఃఖమునకును పేరు. **శక**: పు. ఇది రాజశ్రేష్ఠునకును, (శాలివాహనాదులు) దేశవిశేషమునకును పేరు.

బకస్తు బకపుష్పే స్యా
త్కుహ్వే శ్రీదే చ రక్షసి
శుకో వ్యాససుతే కీరే
రావణస్యచ మంత్రిణి
గ్రంధిపర్ణే శిరీషే చ
శుకం స్యాచ్ఛోణకే క్వచిత్
ద్వికః కాకే చ కోకే చ
సృకో బాణానిలోత్పలే

**బక**: పు. ఇది బకపుష్పపుచెట్టునకును, వాలుకొంగకును, కుబేరునకును, బకాసురునకును పేరు.
**శుక** : పు. ఇది శుకమహామునికిని, చిలుకకును, రావణుని మంత్రికిని, న. స్థౌణేయమను గంధద్రవ్యమునకును, దిరిశనచెట్టునకును, దుండిగపుచెట్టునకును పేరు.
**ద్విక** : పు. ఇది కాకికిని, చక్రవాక పక్షికిని పేరు.
**సృక**: పు. ఇది బాణమునకును, వాయువునకును, కలువకును పేరు.

అర్కోఽర్క పర్ణే స్ఫటికే
రవౌ తామ్రే దివస్పతౌ(7)
కర్కః కర్కో రాశిభేదే
శుక్లాశ్వేదర్పణే ఘటే
తర్కః కాంక్షావితర్కోహ
కర్మభేదేషు కీర్త్యతే
శ్లోకో యశసి పద్యే చ
లోకస్తుభువనే జనే
స్తోకోఽల్పే చాతకే

**అర్క**: పు. ఇది జిల్లేడుచెట్టునకును, స్ఫటికమణికిని, సూర్యునకును, రాగికిని, ఇంద్రునకును పేరు.
**కర్క** : పు. ఇది పీతకును, కర్కాటక రాశికిని, వెల్ల గుఱ్ఱమునకును, అద్దమునకును, కుండకును పేరు.
**తర్క** : పు. ఇది ఆశకును, సంశయ వితర్కమునకును, ఊహకును, కర్మవిశేషమునకును పేరు.
**శ్లోక** : పు. ఇది కీర్తికిని, పద్యమునకును పేరు.
**లోక** : పు. ఇది లోకముకును, మనుజునకును పేరు. **స్తోక** : త్రి. ఇది స్వల్పమైనదానికిని, పు. వానకోయిలకును పేరు.

తోకం త్వపత్యే తనయే పిచ॥(9)

**తోక** : న. ఇది స్త్రీ పుంరూప సంతానమునకును, పుత్రునకును పేరు.

కోకశ్చక్రేవృకే జ్యేష్ఠ్యాం
ఖర్జూరీద్రుమ భేకయోః।

**కోక**: పు. ఇది చక్రవాకపక్షికిని, తోడేటికిని, బల్లికిని, ఖర్జూరపుచెట్టునకును, కొంగకును పేరు.

రోకో దీప్తౌ బిలే రోకం
నౌకా క్రయణభేదయోః॥

**రోక** : పు. ఇది ప్రకాశమునకును, న. రంధ్రమునకును, ఓడకును, కొనుటకును పేరు.

ఛేకో విదగ్ధే ఛేకస్తు
విశ్వస్తమృగ పక్షిణోః।

**ఛేక** : త్రి. ఇది నేర్పరికిని, విశ్వసింపజేయబడిన మృగపక్ష్యాదులకును పేరు.

రేకో విరేకే శంకాయాం
రేక స్స్యాదవమేఽపి చ॥

**రేక** : పు. ఇది విరేచనమునకును, శంకకును, నీచునకును పేరు.

కాక స్స్యాద్వాయసే.వృక్ష
ప్రభేదే పీఠసర్పిణి।
కాకా స్యాత్కాకనాసాయాం
కాకోలీ కాక జంఘయోః॥(12)
రక్తికాయాం మలయ్యాంచ
కాకమాచ్యాంచ కీర్తితా।
కాకం స్త్రీరత బంధే స్యా
త్కాకానాం సంహతావపి॥(13)
వేశవారేచ ధృష్టే చ జ్యేష్ఠే చ
క్వచిదిష్యతే శిరక్తేవ క్షాలనే।
మానవిశేష ద్వీపభేదయోః॥(14)

**కాక**: పు. ఇది కాకికిని, కొండగోగుచెట్టునకును, కుంటివానికిని, స్త్రీ. కాకిదొండచెట్టునకును, తేలుమణిచెట్టునకును, వెలుమసంధిచెట్టునకును, కాచిచెట్టునకును, న. స్త్రీల రతిబంధవిశేషమునకును, కాకులసమూహమునకును, సంబారపుగుండకును, దిట్టరికిని, వృద్ధునకును, తలరుద్దుకొనుటకును, పరిమాణభేదమునకును, ద్వీపభేదమునకును పేరు.

పాకశ్శిశౌ జరానిష్ఠా
వచన క్లేదనే షు చ।

**పాక**: పు. ఇది పిల్లవానికిని, ముసలితనమునకును, వండుటకును, పండుటకును పేరు.

శాకో ద్వీపాంతరే శక్తౌ
నృప ద్రుమవిశేషయోః॥ (15)
శాకం హరీతకే చాపి

**శాక** : పు. ఇది శాకద్వీపమునకును, సామర్థ్యమునకును, శాకరాజునకును, శాకవృక్షమునకును, కరకచెట్టునకును పేరు.

నాకస్స్వర్గాంతరిక్షయోః।

**నాక**: పు. ఇది స్వర్గమునకును, ఆకాశమునకును పేరు.

మూకోఽపవాక్చ్రుతౌ దీనే

**మూక** : పు. ఇది మూగవానికిని, దీనునకును పేరు.

శూకో నుక్రోశ శృంగయోః॥(16)
భూక శ్ఛిద్రే మరాళే చ
భేకో మండూక మేఘయోః।
ఏకంతు కేవలే శ్రేష్ఠ
ఇతరస్మింశ్చ వాచ్యవత్॥
శౌకం శుకసమూహేచ
స్త్రీణాం చ కరణాంతరే।
అంకస్స్యానేం తికే మంతా
రూపకో. త్సంగలక్ష్మసు॥(18)
నాటకాది పరిచ్ఛేదే
చిత్రయుద్ధేచ భూషణే।

**శూక** : పు. ఇది దయకును, కొమ్మునకును పేరు.

**భూక** : పు. ఇది రంధ్రమునకును, హంసకును పేరు.

**భేక** : పు. ఇది కప్పకును, మబ్బునకును పేరు.

**ఏక** : త్రి. ఇది అసహాయమైనదానికిని, శ్రేష్ఠమైన దానికిని, వేరైనదానికిని పేరు.

**శౌక** : న. ఇది చిలుకల గుంపునకును, స్త్రీల రతి బంధవిశేషమునకును పేరు.

**అంక** : పు. ఇది ప్రదేశమునకును, సమీపమునకును, అపరాధమునకును, నాటక విశేషమునకును, తొడముందరి భాగమునకును, చిహ్నమునకును, నాటకమందలి భాగమునకును, యుద్ధవిశేషమున కును, అలంకారమునకును పేరు.

కంకశ్ఛద్మద్విజే ఖ్యాతో
లోహపృష్ఠ కృతాంతయోః॥(19)
వంకః పల్యాణభాగే స్యా
న్నదీపాత్రే చ. భంగురే।
టంకః కపిత్థభేదే స్యా
న్మానాంతర ఖనిత్రయోః॥(20)
కోపేఽసికోశే జంఘాయాం
టంకణె గ్రావధారణే।
రంకస్తు కృపణే మల్లే
పంకః కర్దమ పాపయోః॥
న్యంకు ర్మృగే ఋషౌ

**కంక**: పు. ఇది బ్రాహ్మణవేషధారునకును, రాపులుగునకును, యమునకును పేరు.

**వంక**: పు. ఇది గుఱ్ఱపు కళ్ళెము యొక్క ముందరి భాగమునకును, నదీవక్రమునకును పేరు.

**టంక**: పు. ఇది నల్లవెలగచెట్టునకును, రెండుధరణముల ప్రమాణమునకును, తవుగోలకును, కోపమునకును, కత్తివరకును, పిక్కకును, వెలిగారమునకును, ఱాళ్ళుమలచెడు యులికిని పేరు.

**రంక** : పు. లోభికిని, జట్టివానికిని పేరు.

**పంక** : పు. ఇది బురదకును, పాపమునకును పేరు.

**న్యంకు**: పు. ఇది జింకపోతునకును,ముని విశేషమునకును పేరు.

నాకు ర్వామలూరా మునౌ గిరౌ।

**నాకు**: పు. ఇది పుట్టకును, మునివిశేషమునకును, పర్వతమునకును పేరు.

శంకుః కీలే శివేఽస్త్రే చ
సంఖ్యాపాదపభేదయోః॥

**శంకు**: పు. ఇదిమేకునకును, శివునకును, అస్త్రవిశేషమునకును, సంఖ్యాభేదమునకును, వృక్షవిశే

యాదౌ భేదేచ పాపేచ
స్థాణావపి చ మేహనే।

షమునకును, నీటిపందికిని, పాపముకును, కొమ్ములులేనిమొరడుకును, శిశ్నముకును పేరు.

కల్కః పాపాశయే పాపే
దంభే విట్కిట్టయోరపి॥

**కల్క** : పు. ఇది దురాలోచనకును, పాపముకును, కపటముకును, పురీషమునకును, చీమిడిమొదలగు పండ్రెండు విధములగు శారీర మలములకును పేరు.

వల్కంతు వల్కలె ఖండె
శల్కం శకలవల్కయోః।

**వల్క** : పు. ఇది నారపట్టకును, తునుకకును పేరు.
**శల్క** : పు. ఇది తునుకకును, నారపట్టకును పేరు.

శుల్కం ఘట్టాది దెయెస్యా
జ్జామాతుర్బంధకేఽపి చ ॥ (24)

**శుల్క** : పు. ఇది మార్గస్థులు ఘాటీల వద్దనిచ్చు ద్రవ్యమునకును, అల్లునివద్ద పుచ్చుకొను ద్రవ్యముకును పేరు.

నిష్కమష్టాధిక స్వర్ణ
శతెదీ నారకర్షయోః।
వక్షాలంకరణె హైమ
మాత్రె హైమపలేఽపిచ॥(25)

**నిష్క** : పు. ఇది 108 స్వర్ణముల యెత్తు బంగారు నాణెమునకును, 70 గురుగింజలయెత్తు ముద్రికకును, కర్షమునకును, వక్షమున ధరించు పతకమునకును, బంగారమునకును, పలముయెత్తు బంగారమునకును పేరు.

ముష్కోఽండ కోశె సంఘాతె
ముష్క మోక్షేచ పాదపే।
కిష్కుర్వితస్తౌ హస్తేచ
ప్రకోష్ఠె కుత్సితె ఽపి చ॥ (26)

**ముష్క** : పు. ఇది వృషణముకును, సమూహమునకును, మోక్షముకును, వృక్ష విశేషముకును పేరు.
**కిష్కు** : పు. ఇది జానకును, మూరకును, ముంజేయికిని, నిందితునకును పేరు.

త్రికాకూపస్య నెమౌస్యా
త్రికం పృష్ఠాధరె త్రయే।

**త్రికా** : స్త్రీ. ఇది నూతిమీది గిరుకకును న. ముడ్డిపూసకును, మూడు వస్తువుల సమూహముకును పేరు.

లంకా రక్షఃపురీశాఖా.
శాకినీ కులటాసుచ॥ (27)

**లంకా** : స్త్రీ. ఇది రావణుని పట్టణమునకును, కొమ్మకును, శాకినీ భూతమునకును, వ్యభిచారిణికిని పేరు.

శంకా త్రాసె వితర్కేచ

**శంకా** : స్త్రీ. ఇది భయమునకును, సందేహించుటకును పేరు.

రాకాతు సరిదంతరె।

**రాకా** : స్త్రీ. ఇది నదీ విశేషముకును, గజ్జికిని,

కచ్ఛూనవరజఃకన్యా
పూర్ణేందుపూర్ణి మాసుచ॥(28)

(క్రొత్తగా రజస్వలయ్యైన పడుచుకును, నిండుపున్నమకును పేరు.

★ అథకాంత త్రివర్ణః ★

కనకం చంపకే స్వర్ణే
కింశుకే నాగకేసరే।
దుత్తూరే కాంచనారేచ
కాలెయేऽపి క్వచిన్మతం॥ (29)

**కనక** : న. ఇది సంపెంగ పువ్వుకును, బంగారుకును, మోదుగచెట్టుకును, నాగకేసర వృక్షముకును, ఉమ్మెత్త చెట్టుకును, దేవకాంచన వృక్షమునకును, కృష్ణాగరుకును పేరు.

కరకస్తు కరంకేస్యా ద్దాడి
మేచ కమండలౌ పక్షిభేదే
కరేచాపి కరకాచ ఘనోపలే॥

**కరక** : పు. ఇది పుర్రెకును, దానిమ్మ చెట్టుకును, కమండలమునకును, కరక పక్షికిని, హస్తమునకును, స్త్రీ. వడగలికిని పేరు.

నరకౌ నిరయే దైత్యే

**నరక**:పు. ఇది నరకముకును, నరకాసురునకును పేరు.

సరకస్సీధుభాజనే।
అభిన్నాధ్వగపంక్తౌచ
సీథుపానేచ సీధుని॥(31)

**సరక** : పు. ఇది కల్లుకుండకును, ఎడతెగని మార్గస్థుల వరుసకును, కల్లుత్రాగుటకును, కల్లుకును పేరు.

ఖనక శ్చిత్తతత్వజ్ఞే సంధి
(పథి) చౌరేచ మూషకే।

**ఖనక** : పు. ఇది చిత్తతత్వముందెలిసిన వానికిని, కన్నపు దొంగకును, పందికొక్కుకును పేరు.

జనకః పితృ రాజర్ష్యో

**జనక**: పు. ఇది తండ్రికిని, జనకమహారాజుకును పేరు.

ర్యుతకం సంశయే యుగే॥
యౌతకే చలనాగ్రేచ స్త్రీ
వస్త్రాంచలయుక్తయోః।

**యుతక**: న. ఇది సంశయమునకును, జంటకును, పెండ్లికూతునకిచ్చు బాలతొడవుకును, చాటకొనకును, స్త్రీలపైటచంగుయొక్క అగ్రముకును, కూడుకొన్న దానికిని పేరు.

కృషకః కర్షకేఫాలే (ఫాలె)

**కృషక** : పు. ఇది దున్నుకొని జీవించు వానికిని, నాగటి కర్రుకును పేరు.

రజకౌ ధావకే శుకే॥(33)

**రజక**: పు. ఇది చాకలివానికిని, చిలుకకును పేరు.

మధుకౌ వందిభేదేస్యా
ద్యష్ట్యాహ్వే విహగాంతరే।
మధుకౌ మధుపర్ణ్యాంస్యా

**మధుక** : పు. ఇది స్తుతి పాఠకునకును, యష్టిమధుకముకును, పక్షివిశేషముకును, తిప్పతీగెకును పేరు.

దణుకౌ నిపుణాల్పయోః(34)

**అణుక** : పు. ఇది నేర్పరికిని, అల్పునకును పేరు.

| | |
|---|---|
| వసుకశ్శివమల్యాం స్యా<br>దర్కపర్ణే చ రొమకే। | **వసుక** : పు. ఒక పుష్పపు చెట్టుకును, జిల్లేడు చెట్టుకును, రుమాకరపాంసులవణముకును పేరు. |
| శిశుకశ్శింశుమారెస్యా<br>ద్బాలకొలూపినారపి॥(35) | **శిశుక** : పు. ఇది పిడక మొసలికిని, శిశువుకును, ఉలుచమీనుకును పేరు. |
| క్రముకః పట్టికా లొధ్రె<br>భద్రముస్తక పూగయోః।<br>ఫలెకార్పాసికాయాంచ<br>క్రముకొ బ్రహ్మదారుణి॥(36) | **క్రముక** : పు. ఇది యెర్రలొద్దుగ చెట్టుకును, భద్రతుంగముస్తకును, పోకచెట్టుకును, ప్రేంకణపు చెట్టుకును, ప్రత్తిచెట్టుకును, గంగరావిచెట్టుకును పేరు. |
| బహుకః కర్కటెఽర్కెచ<br>దాత్యూహె జలఖాతకె। | **బహుక** : పు. ఇది పీతకును, జిల్లేడు చెట్టుకును, కూకురు గడ్డంగి పిట్టకును, సంగడికిని పేరు. |
| ధనిక స్సాధుధన్యాక<br>ధవెషు ధనికాస్త్రియాం॥ (37) | **ధనిక** : పు. ఇది సజ్జనునకును, ధనియముకును, పెనిమిటికిని, స్త్రీ. ఆడుదానికిని పేరు. |
| ప్రియకః పీతసారెస్యా<br>న్నీపె చిత్రమృగెఽళిని।<br>కుంకుమెచ ప్రియంగౌచ | **ప్రియక**: పు. ఇదివేగిమ్రానునకును, కడిమిచెట్టుకును, పలురంగుల వెంట్రుకలు గల ఇర్రికిని, తుమ్మెదకును, కుంకుమకును, ప్రేంకణపు చెట్టు కునుపేరు. |
| పృథుకశ్చిపిటె శిశౌ॥ (38) | **పృథుక**: పు. ఇది అటుగులుకును, పిల్లవానికిని పేరు. |
| యమకం యమజె శబ్దా<br>లంకారె సంయమెఽపి చ। | **యమక** : న. ఇది కవల బిడ్డలకును, యమకాలంకారముకును, తపస్సుకును పేరు. |
| మశకః కథ్యతె క్షుద్ర<br>రొగజంతువిశెషయోః॥(39) | **మశక**: పు. ఇది అల్పరొగముకును, దోమకును పేరు. |
| కులకంతు పటొలెస్యా<br>చ్ఛ్లోకసంబంధగుచ్ఛకె।<br>కులకస్యాత్కుల శ్రేష్ఠె<br>వల్మీకె కాకతిందుకె॥ (40) | **కులక** : న. ఇది పొట్లచెట్టుకును, నాలుగుకంటె నధికమయిన ఏకాన్వయము గలశ్లోకములకును, పు. కులశ్రేష్ఠునకును, పుట్టకును, చిట్టతుమికి చెట్టుకును పేరు. |
| తిలకం చిత్రకె ప్రాహు<br>ర్లలామె తిలకాలకె।<br>రొగాశ్వ ద్రుమ భెదెషు<br>క్లొమ్నిసౌవర్చ లెఽపి చ॥ (41) | **తిలక** : న. ఇది బొట్టుకును, ముఖ్యవస్తువుకును, పుట్టుమచ్చకును, రొగవిశెషముకును, గుఱ్ఱముకును, తిలకవృక్షముకును, గర్భమందు కుడిప్రక్కనుండెడి మాంస పిండముకును, సౌవర్చలవణముకును పేరు. |

కుళికొ నాగభెదె స్యా
ద్వృక్షభెదె కులసత్తమె।

**కులిక :** పు. ఇది సర్పవిశేషముకును, వృక్షభేదముకును, కులశ్రేష్ఠునకును పేరు.

కుశిక స్స్యాన్మునౌ తైల
శేషసర్జ్జక వృక్షయోః॥ (42)

**కుశిక :** పు. ఇది కుశిక మహామునికిని, నూని మడ్డికిని, ఏపిచెట్లుకును, తాడిచెట్టుకును పేరు.

చషకంతు సురాపాత్రె
మెఘమద్య ప్రభెదయోః।

**చషక:** న. ఇది కల్లుకుండకును, మేఘమునకును, మద్య విశేషమునకును పేరు.

చటకః కలవింకె చ
చటకా స్త్రీ స్త్ర్యపత్యయోః॥ (43)

**చటక :** పు. ఇది వూరపిచ్చుగకును, స్త్రీ. ఆడు పిచ్చుగకును, ఆడుపిచ్చుగ పిల్లకును పేరు.

కటకం వలయె సానౌ
రాజధానీ నితంబయోః।
సాముద్రలవణెదంత
మండనె దంతి నామపి॥ (44)

**కటక:** న. ఇది కంకణముకును కొండచరియకును, రాజు నివశించు పట్టణమునకును, పిరుదుకును, సముద్రపు వుప్పుకును, ఏనుగ దంతములయొక్క యలంకారముకును పేరు.

కటుకం కటు రోహిణ్యాం
త్ర్యూషెపి కటుకం స్మృతం।

**కటుక:** న. ఇది కటుక రోహిణికిని, త్రికటుకలకును (అనగా శొంఠి, పిప్పలి, మిరియాలు) పేరు.

చులుకః ప్రసృతౌ భాండ
భెదెచ చులుకం మతం॥ (45)

**చులుక :** పు. ఇది చారెడుకును, న. చిన్న కుండకును పేరు.

పులకః క్రిమి భెదె స్యా
ద్గుత్సార్క మణిదొషయోః।
గజానా పిండె రొమాంచె
హరితాళె శిలాంతరె॥ (46)

**పులక :** పు. ఇది చెట్టువల్లపుట్టెడు ఒక విధమగు పురుగుకును, పూలగుత్తికిని, సూర్యకాంతమణిలోనిదోషముకును (అనగా పటలము) ఏనుగుకు ఇచ్చెడు అన్నకబళముకును, గగురుపాటుకును, హరిదళముకును, వజ్రమునకును పేరు.

రుచకం మంగళ ద్రవ్యె
గ్రీవాభరణదంతయోః।
వర్ణకె బీజపూరెచ
సౌవర్చలవిడంగయోః॥ (47)
గొరొచనాయాంచ రుచక
మశ్వాభరణ మాల్యయోః।

**రుచక :** న. ఇది మంగళద్రవ్యమునకును, హార విశేషముకును, దంతమునకును, పేడుకకును, మాదీఫలపుచెట్టుకును, సౌవర్చలవణమునకును, వాయువిడంగమునకును, గోరోచనమునకును, అశ్వాభరణమునకును, పుష్పమాలకును పేరు.

| | |
|---|---|
| క్షురకః కొకిలాక్షె స్యా | **క్షురక :** పు. ఇది గొలిమిడి చెట్టుకును, ఏనుగ |
| ద్గొక్షురె తిలకద్రుమె॥ (48) | పల్లేరుకును, తిలక వృక్షముకును పేరు. |
| కాముకః కమనెశొక | **కాముక :** పు. ఇది స్త్రీలయందాసక్తిగల వానికిని, |
| పాదపె చాతిముక్తకె। | అశోకవృక్షమునకును, పూలగురివెందచెట్టుకును పేరు. |
| పాతుకః పతయాళౌస్యా | **పాతుక:** పు. ఇది పడునట్టిస్వభావము గల వానికిని, |
| త్ప్రపాతజలహస్తినొః॥ (49) | కొండ చరియకును, నీటి యేనుగకును పేరు. |
| ఆనకః పటహె భెర్యాం | **ఆనక:** పు. ఇది తప్పెటకును, భేరికిని, మద్దెలకును, |
| మృదంగె స్వనదంబుదె। | గర్జించు మేఘమునకును పేరు. |
| ఆఢకం మానభెదె స్యా | **అఢక:** న. కొలభేదమునకును, ఈ. స్త్రీ. సురాష్ట్ర |
| త్తువర్యామాఢకీమతా॥ (50) | దేశమందు పుట్టిన తొవరిమన్నుకును పేరు. |
| కారకః కర్తరి (నటె) ప్రొక్తః | **కారక:** పు. ఇది పనిచేయువానికిని, న. పనులకును |
| కర్మాదావపి కారకం। | పేరు. |
| చారకః పాలకెऽశ్వాదె | **చారక :** పు. ఇది గజాశ్వాదులను పాలించు వాని |
| స్యాత్సంచారకబంధయొః॥ | కిని, సంచరించుటకును, మొండెముకును పేరు. |
| తారకః కర్ణధారెచ దైత్యెచ | **తారక :** పు. ఓడ నడుపువానికిని, తారకాసురున |
| దృశితారకం కనీనికాయాం | కు ను, న. నేత్రముకును, కంటి నల్లగ్రుడ్డుకును, |
| నక్షత్రె తారకం తారకెతిచ॥ (52) | నక్షత్రముకును పేరు. |
| వారకొశ్వగతా వశ్వ | **వారక :** పు. ఇది గుర్రపు నడకకును, అశ్వ విశేష |
| విశెషెऽపి నిషెధకె। | మునకును, నివారించు వానికిని పేరు. |
| పావకొగ్నౌ సదాచారె | **పావక :** పు. ఇది అగ్నికిని, ఆచారవంతునకును, |
| వహ్నిమంథెచ చిత్రకే॥ (53) | నెల్లికూరకును, చిత్రమూలమునకును, జీడిచెట్టు |
| భల్లాతకే విడంగేచ | కును, వాయువిడంగమునకును పేరు. |
| సాయకశ్శరఖడ్గయొః। | **సాయక :** పు. ఇది బాణముకును, కత్తికిని పేరు. |
| రల్లకః కంబళమృగె | **రల్లక :** పు. ఇది మృగవిశేషముకును, గొంగళికిని |
| కంబళెచ నిగద్యతె॥ (54) | పేరు. |
| నాయకొ నెతరిశ్రేష్ఠె | **నాయక :** పు. ఇది రక్షకునకును, శ్రేష్ఠునకును, |
| హారమధ్యమణావపి। | నాయక మణికిని పేరు. |
| ప్రాణకస్సత్వజాతియ్యొ | **ప్రాణక :** పు. ఇది ప్రాణవాయువుకును, పేగిస |

| | |
|---|---|
| జీవకద్రుమబాలయోః॥ (55) | చెట్టుకును, బాలింత బోలుకును పేరు. |
| జాలకం కోరకే ప్రోక్తం<br>కులాయే జాలినీఫలే।<br>ఆనాయేదంభభేదే చ | **జాలక:** న. ఇది లేత మొగ్గకును, పిట్టగూడుకును, హొట్లకాయకును, వలకును, గర్వముకును పేరు. |
| వస్త్ర భేదేవజాలికా॥ (56) | **జాలికా :** స్త్రీ. ఇది వలవలె వెలితిగానేసిన బట్టకు పేరు. |
| బాలకోऽజ్ఞశిశౌ కేశే<br>వాజివారణవాలధౌ।<br>అంగుళీయకహ్రీబెర<br>పారిహార్యేషుబాలకం॥(57) | **బాలక :** పు. ఇది మూఢునకును, పిల్లవానికిని, వెంట్రుకలకును, గుఱ్ఱముయొక్క, యేనుగు యొక్క తోకకుంచెకును, న. ఉంగరమునకును, కురువేరునకును, బంగారు సూడిగాజుకును పేరు. |
| వార్ధకం వృద్ధ సంఘాతె<br>వృద్ధత్వే వృద్ధకర్మణి। | **వార్ధక :** న. ఇది వృద్ధుల సమూహముకును, ముసలితనముకును, వారుచేయు కర్మకును పేరు. |
| మామకం మమతాయుక్తె<br>మాతులె మామకస్మృతః॥ | **మామక :** త్రి. ఇది నాదియనుటకును, పు. మేన మామకును పేరు. |
| యాజకో యాజివిఖ్యాతో<br>యాజకో రాజకుంజరె। | **యాజక :** పు. ఇది యజ్ఞము చేయించువానికిని, రాజెక్కెడి యేనుగకును పేరు. |
| గ్రాహకో ఘాతవిహగె<br>వ్యాళానాంచ గృహీతరి॥ (59) | **గ్రాహక:** పు. ఇది కిరాతునిచేత చంపబడిన పక్షికిని, పాములవానికిని పేరు. |
| దారకోऽభేదకె పత్యే | **దారక :** పు. ఇది భేదించువానికి, సంతానము నకును పేరు. |
| రాత్రకం పంచరాత్రకె।<br>యెనవేశ్యాగృహె నీతో<br>వత్సరస్సతు రాత్రకః॥(60) | **రాత్రక :** న. ఇది అయిదురాత్రుల సమూహము కును, పు. వేశ్యాగృహమందు సంవత్సరము నివసించినవానికిని పేరు. |
| లాసకోऽలస కెలాస్య<br>కారిణ్యపి మయూరకె। | **లాసక :** పు. ఇది బద్ధకునకును, నృత్యము చేయువానికిని, నెమలికిని పేరు. |
| శార్కరః శర్కరా పిండె<br>దుగ్ధఫెనేऽపిశార్కరః॥(61) | **శార్కక:** పు. ఇది ముద్దచక్కెరకును, పాలనురగకును పేరు. |
| హేరకః కితవె చోరె<br>గద్యేపిజ్ఞాన భెదయోః। | **హేరక :** పు. ఇది జూదరికిని, దొంగకును, గద్యకును, జ్ఞానవిశేషముకును పేరు. |

స్థాసకాఖ్యాతు చార్చి క్యే
జలాదెరపి బుద్బుదె॥ (62)

**స్థాసక :** పు. ఇది చందనాదుల యొక్క మైపూతకును, నీరు మొదలయిన వాట్ల బుడగకును పేరు.

ద్రావకస్తు శిలాభెదె
విదగ్ధెఘోషకెऽపి చ।

**ద్రావక :** పు. ఇది అయస్కాంతములోని భేదముకును, నేర్పరికిని, చేతి బీరచెట్టుకును పేరు.

భ్రామకొ జంబుకె ధూర్తె
సూర్యావర్తాశ్మ భెదయోః।

**భ్రామక:** పు. ఇది నక్కకును, విటునకును, సూర్యమండలముకును, సూదిగంటురాతికిని పేరు.

పిణ్యాక స్తిల్తకె (స్తిల్హకె) హింగౌ
తిలచూర్ణె (కల్కె) పి కుంకుమె।

**పిణ్యాక :** పు. ఇది మైనముకును, ఇంగువకును, తెలక పిండికిని, కుంకుమకును పేరు.

పినాకొ హరకొదండె
పాంసువర్ష త్రిశూలయోః॥

**పినాక :** పు. ఇది శివధనస్సుకును, పరాగవర్షముకును, త్రిశూలముకును పేరు.

కావృకః కృకవాకౌ స్యా
త్పీతముస్తకకోకయోః।

**కావృక:** పు. ఇది కోడికిని, పచ్చతుంగముస్తకును, చక్రవాక పక్షికిని పేరు.

క్షారకః పక్షిమత్స్యాది
పిటకె జాలకెऽపి చ॥(65)

**క్షారక :** పు. ఇది పక్షులు, మత్స్యములు చేయు బుట్టకును, లేత మొగ్గకును పేరు.

పాటక స్యాన్మహాకిష్కు
కటకాంతర వాద్యయోః।
అక్షాదిదొలనె మూల
ద్రవ్యపచయ (వెధసోః) రోధసోః॥

**పాటక:** పు. ఇది నలుబదిరెండంగుళముల ప్రమాణమునకును, రాజు నివశించు పట్టణ మధ్యమునకును, వాద్యవిశేషముకును పాచికలు మొదలైన వాటిని దొర్లించుటకును, మూల ద్రవ్యమునకును, హీనమునకును ఒడ్డుకును పేరు.

వరాకస్సంగరె శౌచ్యె (ప)
వరాకొ వ్రతఖడ్గయోః।

**వరాక:** పు. ఇది యుద్ధమునకును, అనామధేయునకును, వ్రతమునకును, ఖడ్గముకును పేరు.

పులాకస్తుచ్ఛధాన్యె స్యా
త్సంక్షెపె భక్తసిక్థకె॥ (67)

**పులాక :** పు. ఇది పొల్లుకును, సంక్షేపముకును, అన్నపు కణమునకును పేరు.

విపాకః కద్యతె స్వాదౌ
పరిణామె చ దుర్గతౌ।
విపాకః పచనె స్వెదె
వ్యసత్కర్మఫలెऽపి చ॥(68)

**విపాక :** పు. ఇది రుచికిని, పరిపాకముకును, దురవస్థకును, వండుటకును, చెమటకును, దుష్కర్మ ఫలమునకును పేరు.

లంపాకొ లంపటె దెశె

**లంపాక :** పు. ఇది ఆసక్తిగల వానికిని, లంపట

దేశముకును పేరు.

శింఫాక శ్శఫమూర్ఖయోః।
శం (సం) పాకస్తర్కకేధృష్టే
(సం) శంపాక శ్చతురంగుళే॥(69)

**శింఫాక:** పు. ఇది అశ్వాదులడెక్కకును, మూర్ఖునకును పేరు.

**శంపాక** : పు. ఇది ఊహించువానికిని, ధైర్యవంతునకును, రేలచెట్టుకును పేరు.

మోచకః కదళీ శిగ్రు
నిర్మోచక విరాగిషు।

**మోచక:** పు. ఇది అరటిచెట్టుకును, మునుగచెట్టుకును, మడమలు కప్పియుండు పాదరక్షకును సన్యాసికిని పేరు.

పెచకో గజలాంగూల
మూలపర్యంతఘూకయోః(70)

**పేచక** : పు. ఇది యేనుగతోక మొదటి ప్రదేశముకును, గుడ్లగూబకును పేరు.

మెచకో బర్హిచంద్రే స్యా
న్మేచకః శ్యామలే౽పి చ।
తిమిరే కృష్ణవర్ణే తు
మెచకం వాచ్యవద్భవేత్॥(71)

**మెచక:** పు. ఇదినెమలి కన్నుకును, నలుపునకును, న. చీకటికిని, వి. నల్లని వస్తువుకును పేరు.

సూచక స్సీవద్రవ్యే
బోధకే పృషదంశకే।
పిశునే శుని కాకే చ

**సూచక:** పు.ఇదిసూదికిని, బోధించువానికిని, పిల్లికిని, కొండెగానికిని, కుక్కకును, కాకికిని పేరు.

పెచక స్సేక్తృ మేఘయోః॥

**పేచక:** పు.ఇది తడిపెడువానికిని, మేఘముకును పేరు.

లోచకో మాంసపిండేస్యా
దక్షితారేచ కజ్జలే (కంగులే)।
లలాటాభరణే స్త్రీణాం
కదళీ నీలవస్త్రయోః॥ (73)
నిర్బుద్ధౌ కర్ణపూరేచ
మౌర్వ్యాం భ్రూస్కధచర్మ(ణి)ణోః॥

**లోచక** : పు. ఇది మాంస పిండముకును, కనుగ్రుడ్డుకును, కాటుకకును, పాపట బొట్టుకును, అరటిచెట్టుకును, నల్లగుడ్డకును, బుద్ధిహీనునకును, చెవికమ్మకును, వింటినారికిని, కనుబొమ్మకును, ముడతలు పడు చర్మమునకును పేరు.

మోదకో హర్షకే జ్ఞేయః
ఖాద్యభేదేఽపి మోదకం॥

**మోదక:** పు. ఇది సంతోషము చేయువానికిని, న. ఉండ్రముకును పేరు.

ఖెలకః పాక వల్మీక
పూగకోశ శిరస్త్రకే।

**ఖేలక:** పు. ఇది శిశువునకును, పుట్టకును, పోకగెలకును, కుళ్ళాయికిని పేరు.

గౌళకో విధవాపుత్రె
జారాచ్ఛ మణికె గుడె॥ (75)

**గోళక** : పు. ఇది మగడు చచ్చిన వెనుక జారత్వము వలనబుట్టినవానికిని, పెద్దబానకును, ఉండకును పేరు.

కూపకో గుణవృక్షెస్యా
తైలపాత్రే కుకుందరె।
ఉదపానె (చ్ఛ్య) చితాయాం చ
కూపికాంభొగతో పలె॥ (76)

**కూపక** : పు. ఇది ఓడకొయ్యకును, నూనె పాత్రకును, స్త్రీ పిరుదుల మీదిగుంటలకును, బావికిని, చితికిని పేరు.

**కూపికా** : స్త్రీ. ఇది నూతి నీళ్ళయందు మునిగిన రాతికి (అనగా ధర్మరాయి) పేరు.

కూలకః కృమిశైలె చ
ప్రతీర స్తూపయోరపి।
రూపకం నాటకె ధూర్తె
కావ్యాలంకరణె విదుః॥ (77)
చూతకః కూపకెప్యామ్రె

**కూలక** : పు. ఇది లక్కపుట్టు పర్వతమునకును, ఒడ్డునకును, దిబ్బకును పేరు.

**రూపక**: న. ఇది నాటకమునకును, త్రి. మోసగానికిని, న. రూపకాలంకారముకును పేరు.

**చూతక** : పు. ఇది వాడకొయ్యకును, తియ్యమామిడికిని పేరు.

సూతకం రస జన్మనోః।
లూనక స్యాత్పశౌ భిన్నె

**సూతక**: న. ఇది పాదరసముకును, పుట్టుగకును పేరు.

**లూనక**: పు. ఇది పశువునకును, త్రి. భేదింపబడిన దానికిని పేరు.

శూకకః ప్రావటె రసె॥ (78)

**శూకక** : పు. ఇది పెద్ద గొయ్యికిని, పాదరసముకును పేరు.

కీచకో దైత్య భెదె చ
శుష్కవంశె ద్రుమాంతరె।
కీటకః కృమిభెదె స్యా
న్నిష్ఠురె కీటకో౽న్యవత్॥ (79)
జీవకః పీత (సా.రె) శాలె
స్యాత్ క్షపణె వృద్ధిజీవిని।
సెవిని ప్రాణకె౽ప్యాహి
తుండికె పాదపాంతరె॥ (80)
ఆజీవె జీవికామాహుర్జ్జీ
వంత్యామపి కుత్రచిత్।

**కీచక**: పు. ఇది కీచకుడను రాక్షసునకును, బొంగు వెదురుకును, వృక్షవిశేషముకును పేరు.

**కీటక** : పు. ఇది పురుగుకును, త్రి. నిష్ఠురమైన దానికిని పేరు.

**జీవక**: పు. ఇదివేగిమ్రానుకును, క్షపణ మతస్థునకును, వడ్డీచేత జీవించువానికిని, సేవించువానికిని, పాములవానికిని, వృక్షవిశేషమునకును పేరు.

**జీవికా** : స్త్రీ. ఇది జీవనోపాయమునకును పాలకూరకును పేరు.

దీపకం వాగలంకారె
దీపకొ దీప్తికారకె॥(81)
చీరకొ౽ధిక్రియా లెఖె
పతంగ్యాం చీరకా మతా
సెవకస్తు ప్రసెవె స్యా
దనుజీవిని వాచ్యవత్॥ (82)
అశోకొ వంజుళె మానె
ద్రుమని శోకయోర్మతః।
అశోకా కటురోహిణ్యా
మశోకం పారదె స్మృతం॥ (83)
ఆలోకొ దర్శనె ద్యోతె
చాలోకొ వందిభాషణె।
పెటకం పుస్తకాదీనాం
మంజూషాయాం కదంబకె॥
హెరుకొ బుద్ధభెదె స్యా
న్మహాకాలగణె౽పిచ।
ధెనుకం కరణె స్త్రీణాం
ధెనూనామపి సంహతౌ॥ (85)
వివెకః స్యాజ్జల ద్రోణ్యాం
విచారె౽పి రహస్యపి।
గైరికం కనకె ధాతౌ
ప్రసెక స్స్రవనె చ్యుతౌ॥
వైజికం శిగ్రుతైలె చ
హెతౌ సద్యో౽ంకురె౽పిచ।
కోరకం కుట్మలె విద్యాత్త
క్కోలక మృణాళయోః॥
కౌతుకం చాభిలాషె స్యా

**దీపక**: న. ఇది అలంకార భేదముకును, పు. శమును చేయువానికిని పేరు.

**చీరక** : పు. ఇది అధికార పత్రముకును, మి కును పేరు.

**సేవక** : పు. ఇది వీణయొక్క కరిదెకును, వి. వలన జీవించు వానికిని పేరు.

**అశోక**: పు. ఇది అశోక వృక్షముకును, గర్వవి ముకును, కంకేళి వృక్షముకును, దుఃఖము లేకుం టకును, స్త్రీ. కటక రోహిణికిని, న. పాదరస కును పేరు.

**ఆలోక** : పు. ఇది చూచుటకును, ప్రకాశకున చిత్తగింపులకును పేరు.

**పెటక** : న. ఇది పుస్తకములు మొదలయిన వా పెట్టెకును, సమూహమునకును పేరు.

**హేరుక** : పు. ఇది బుద్ధ విశేషునకును, ఈశ్వరుని ప్రమధ గణమునకును పేరు.

**ధేనుక** : న. ఇది స్త్రీల రతిబంధ విశేషమునకును, గోవుల సమూహమునకును పేరు.

**వివేక**: పు. ఇది నీళ్ళు తోడెడు చాద మొదలైన వాటికిని, బ్రహ్మవిచారణకును, రహస్యమునకును పేరు.

**గైరిక** : న. ఇది బంగారునకును, ధాతువిశేష ముకును పేరు.

**ప్రసేక** : పు. ఇది తడుపుటకును, జారుటకును పేరు.

**వైజక** : న. ఇది మునుగ నూనెకును, హేతువున కును, పు. అప్పుడుపుట్టిన మొలకకును పేరు.

**కోరక** : న. ఇది మొగ్గకును, తక్కోల ఫలమున కును, తామరతూడుకును పేరు.

**కౌతుక**: న. ఇది అపూర్వ వస్తువును కోరుటకును,

దుత్సవె నర్మహర్షయోః।
పరంపరా సమాయాతం
మంగళెచ కుహూహలె॥ (88)
వివాహ సూత్రగీతాది
భోగకాలెషు చ స్మృతం।

ఉత్సవమునకును, ప్రేమకును సంతోషమునకును, పారంపర్యముగా వచ్చెడు మంగళములకును, వేడుకకును, వివాహాదు లయందు హస్తమున ధరించు సూత్రముకును, గానాదులకును, భోగ సమయమునకును పేరు.

కౌశికొ నకులె వ్యాళ
గ్రాహె గుగ్గులు శక్రయోః॥
విశ్వామిత్రె చ కౌశజ్ఞో
లూకయోరపి కౌశికః।
కౌశికీచండికాయాం చ
నదీభేదెచ కౌశికీ॥ (90)

**కౌశిక:** పు. ఇది ముంగిసకును, పాముల వానికిని, గుగ్గులు వృక్షముకును, దేవేంద్రునకును, విశ్వామిత్ర మహామునికిని, శబ్ద శాస్త్రము తెలిసిన వానికిని, గుడ్లగూబకును, ఈ.స్త్రీ. పార్వతికిని, కౌశిక యను నదికిని పేరు.

ప్రతీకొ ఽవ యవె ఖ్యాతః
ప్రతికూల విలోమయోః।
భూ(తి)తీక మపి భూవింబె
దీవ్య కర్పూర కత్తృణె॥ (91)

**ప్రతీక :** పు. ఇది అవయవమునకును, విరోధముకును, తలక్రిందగుటకును పేరు .

**భూతీక :** న. ఇది నేలవేముకును, ఓమముకును, కర్పూరముకును, కామంచి గడ్డికిని పేరు.

అభీకః కాముకెక్రూరె
(శంభౌ)కవౌ చ భయవర్జితె
వల్మీకొ వామలూరౌ స్యా
న్మని రొగ విశేషయోః॥

**అభీక :** పు. ఇది విటునకును, దుష్టునకును, కవికిని, భయములేనివానికిని పేరు.

**వల్మీక:** పు. ఇది పుట్టకును, వాల్మీకమహామునికిని, రోగ విశేషమునకును పేరు.

అనీకం తు రణె సైన్యె
వ్యళీకొ నాగరె స్మృతః।
వ్యళీక మప్రియాకార్య
వైల క్ష్యేష్వపి పీడనె॥ (93)
నాళీకం (శరఖండె) పద్మ
షండెఽబ్జె నాళీక శ్శరశల్యయోః।

**అనీక :** న. ఇది యుద్ధమునకును, సైన్య విశేషముకును పేరు.

**వ్యళీక:** పు. ఇది శొంఠికిని, న. ఇష్టములేనిపనికిని, దుష్కార్యముకును, సిగ్గుకును, పీడకును పేరు.

**నాళీక :** న. ఇది పద్మముల సమూహముకును, పద్మముకును, పు. బాణముకును, బాణపు అలుగుకును పేరు.

అళీకమప్రియె(ప్రోక్తమ)ఫాలె
వ్యళీక మనృతె (దివి)ఽపిచ॥(94)

**అళీక :** న. ఇది అయిష్టముకును, నుదుటికిని, అబద్ధముకును, ఆకాశముకును పేరు.

అనూకం తు కులె శీలే
వ్యనూకొ గతజన్మని।

**అనూక** : న. ఇది కులమునకును, సత్త్వ భావమునకును, పు. పూర్వజన్మకును పేరు.

ఉలూకః (కురవిందె) కురుయోధె
స్యాత్పేచకె జంభ భేదిని (95)

**ఉలూక**: పు. ఇది భారత యోధునకును, గుడ్లగూబకును, దేవేంద్రునకును పేరు.

శంబూకొ గజకుంభాంతె
దైత్యభేదెచ ఘోంగకె।
జలశుక్తౌ తు శంబోక
శ్శంబూకాపి నిగద్యతె॥ (96)

**శంబూక** : పు. ఇది యేనుగకుంభస్థలాగ్రమునకును, శంబూకుడను రాక్షసునకును, జలజంతువిశేషముకును, కప్పచిప్పకును పేరు.

బంధూకొ బంధుజీవె స్యా
ద్బృందూకః పీతసా (ర) లకె।

**బంధూక**: పు. ఇది మంకెనచెట్టుకును, పేగిమ్రానుకును పేరు.

మండూకొ బంధభేదెऽపి
దర్దురె శౌణకె విదుః॥ (97)
మండూక పర్ణ్యాం మండూకీ,

**మండూక** : పు. ఇది బంధవిశేషముకును, కప్పకును, దుండిగపు చెట్టుకును, ఈ.స్త్రీ. మంజిష్ఠ యనెడి గ్రంధ్యద్రవ్యముకును పేరు.

వర్ణ కశ్చారణె స్మృతః।
విలేపనె చందనేచ
వర్ణకంస్యాధార్భకః॥ (98)

**వర్ణక**: పు. ఇది నాట్యగానికిని, న. మైపూతకును, మంచిగంధముకును పేరు.

డింభేమూర్ఖెకృశె భ్రూణె

**అర్భక** : పు. ఇది పిల్లవానికిని, మూర్ఖునకును, కృశించిన వానికిని, గర్భమునకును పేరు.

వర్తకొऽశ్వఖురె ఖగె।

**వర్తక** : పు. ఇది గుఱ్ఱపు డెక్కకును, మీనవల్లంకి పక్షికిని పేరు.

పుష్పకం రీతికా నేత్ర
రోగయో రత్నకంకణె॥ (99)
కుబెరస్య విమానె చ
కాశీశె చ రసాంజనె లో (హె)
హకాంస్యే మృదంగారశక
ట్యామపి పుష్పకం॥ (100)

**పుష్పక** : న.ఇది కుసుమాంజనము, నేత్రరోగ విశేషముకును, రత్నకంకణముకును, కుబేరపుష్పకమునకును, అన్న భేదికిని, రసాంజనమునకును, లోహముతో గూడిన కంచుకును, మట్టికుంపటికిని పేరు.

పూర్ణకః స్వర్ణచూడె స్యాన్నాసా
(ఘోణ్యాం) ఛిన్నాంతు పూర్ణికా।

**పూర్ణక**: పు. ఇది పాలపిట్టకును, స్త్రీ. ముక్కు వద్ద నరుకువలెనుండు పక్షి విశేషముకును పేరు.

దర్శక స్స్యాత్ప్రతీహారె

**దర్శక**: పు. ఇది ద్వారపాలకునకును, చూపించు

| | |
|---|---|
| దర్శయిత్ర ప్రవీణయోః ॥(101) | వానికిని, సేర్పరికిని పేరు. |
| పద్మకం పద్మకాష్ఠే (ऽబ్జ) భ బిందుజాలక యోరపి। | **పద్మక**: న. ఇది తామరకాడకును, యేనుగయొడలి యందలి తెల్లపొడమచ్చలకును పేరు. |
| దీప్యకంచాజమోదాయాం యవానీ బర్హి చూడయోః॥ | **దీప్యక** : న. ఇది ఓమముకును, ఓమములోని భేదము కును, మయూరశిఖియను గ్రంథ్యముకును పేరు. |
| సస్యకస్స్యాన్మణౌ ఖడ్గే నారికెళస్య చాంతరే। | **సస్యక**: పు. ఇది మాణిక్య విశేషముకును, కత్తికిని, టెంకాయలోని భాగముకును పేరు. |
| రక్తకోऽమ్లా (త) నబంధూక రక్తవస్త్రాను రాగిషు ॥ (103) | **రక్తక** : పు. ఇది తెల్ల పెద్ద గోరింటకును, మంకెన చెట్టుకును, యెఱ్ఱబట్టకును, అనురాగము గలవాని కిని పేరు. |
| చిత్రకస్స్యాత్తరువ్యాఘ్ర భేదయోర్భెషజాంతరే। | **చిత్రక** : పు. ఇది ఆముదపు చెట్టుకును, చిరుత పులికిని, చిత్రమూలముకును పేరు. |
| వృశ్చికస్తు ద్రుణె రాశౌ శూకకీటే తథౌషధే ॥ (104) | **వృశ్చిక** : పు. ఇది తేలుకును, వృశ్చిక రాశికిని, కందిరీగకును, తెల్లగలిజేరుకును పేరు. |
| అంశుకం వస్త్రమాత్రేస్యా త్సూక్ష్మ వస్త్రోత్తరీయయోః। | **అంశుక** : న. ఇది వస్త్ర సామాన్యమునకును, సన్నబట్టకును, పైట చెంగుకును పేరు. |
| అంతికం నికటె చుల్యా మంతికా శీతలౌషధే ॥ (105) తథాజ్యేష్ఠ భగిన్యాంచ నాట్యోక్తౌ కీర్త్యతేऽంతికా | **అంతిక**: న. ఇదిసమీపమునకును, స్త్రీ. పొయికిని, చలవచేయు ఔషధమునకును, నాట్య పరిభాష యందు జ్యేష్ఠభగినికిని పేరు. |
| స్వస్తికో మంగళద్రవ్యే చతుష్క గృహభేదయోః॥(106) పిష్టకస్య వికారె చ స్వస్తికో రతతాళికె। | **స్వస్తిక**: పు. ఇది మంగళద్రవ్యముకును, నలుపైపుల చావడులు గల యింటికిని, ద్వార భేదముచేత కట్టబడిన రాజగృహ విశేషముకును, పిండివంటలోని భేదముకును, విటునకును పేరు. |
| కంచుకో వారవాణె స్యా న్నిర్మోకెకవచేऽపిచ ॥ (107) వర్ధాపక గృహీతాంగ స్థితవస్త్రేచ చోలకె। | **కంచుక**: పు. ఇది యుద్ధభటులు తొడుగు చొక్కా కును, కుబుసముకును, కవచమునకును, చొక్కా లోని భేదము (దూది బొంత చొక్కా అని కొందరు) చొక్కాకును (లేక రవికెకును.) ఈ. స్త్రీ. ఓషధి |

ఔషధౌ కంచుకీ చాథ

విశేషముకును పేరు.

వంచకః ఖలధూర్తయోః॥
జంబుకె గృహబభ్రౌచ

**వంచక:** పు. దుర్జనునకును, ధూర్తునకును, నక్కకును, ఊరముంగిసకును పేరు.

గృహ్యాకశ్చైకనిఘ్నయోః।

**గృహ్యక:** పు. ఇది పెంపుడు మృగపక్ష్యాదులకును, పరాధీనునకును పేరు.

బంధకస్యాద్వినిమయె
పుంశ్చల్యామపిబంధకీ॥ (109)

**బంధక :** పు. ఇది ఒక దానినిచ్చి ఇంకొక దానిని పుచ్చుకొనుటకును (అనగా తాకట్టు మొదలగునవి) ఈ. స్త్రీ. లంజకును పేరు.

గాంధికో లేఖకె ప్రాహు
స్సుగంధివ్యవహారిణి।

**గాంధిక :** పు. ఇది వ్రాయువానికిని, పరిమళ వస్తువుల నమ్మువానికిని పేరు.

గ్రంధికం పిప్పలీమూలె
గ్రంధికో గుగ్గులుద్రుమె॥ (110)
మాద్రేయేచ కరీరెచ
దైవజ్ఞేచ ప్రకీర్తితః।

**గ్రంథిక:** న. ఇది పిప్పలి దుంపకును, పు. గుగ్గులు వృక్షముకును, సహదేవునకును, వెదురు గుంపునకును, జ్యోతిష్కునకును పేరు.

బాహ్లికో దేశభేదెఽశ్వె
బాహ్లికం ధీరహింగునోః॥
అనయోరపి బాహ్లీకో

**బాహ్లిక :** పు. ఇది దేశ విశేషముకును, **బాహ్లీక :** బాహ్లికదేశమున పుట్టినగుర్రముకును, న. కుంకుమకును, ఇంగువకును పేరు.

యాజ్ఞికో యాజకె శుకె।

**యాజ్ఞిక:** పు. ఇది ఋత్విజునకును, చిలుకకును పేరు.

వార్షికంత్రాయమాణాస్యా
ద్వర్షాకాలభవె ఽన్యవత్॥

**వార్షిక :** న. ఇది కలుద్రానుగు చెట్టుకును, వి. వర్షాకాలమందైన దానికిని పేరు.

ఖడ్గికో మహిషీక్షీర
ఫేనస్సైనికయోరపి।

**ఖడ్గిక :** పు. ఇది గేదెపాలమీది నురగకును, దండుకొలిచే వానికిని పేరు.

ఆహ్నికం దిననిర్వర్త్యె
భోజనె నిత్య (దిన) కర్మణి॥(113)

**ఆహ్నిక :** న. ఇది ప్రతిదినమున్నూ చేయ తగ్గపనులకున్ను, భోజనముకును, నిత్యకర్మలకును పేరు.

గుండకో మలినె ధూళౌ
కలోక్తి స్నెహపాత్రయోః।

**గుండక :** పు. ఇది మలినముకును, పరాగము కును, మధురభాషణముకును, నూనె పాత్రకును పేరు.

గండకః ఖడ్గిని ఖ్యాత
స్సంఖ్యావిద్యాప్రభేదయోః॥(114)

**గండక :** పు. ఇది ఖడ్గమృగమునకును, సంఖ్యా విశేషమునకును, విద్యావిశేషమునకును, విచ్ఛేద

అవచ్ఛేదేऽంత రాయే చ
గండకీ సరిదంతరే।

మునకును, విఘ్నమునకును, ఈ.స్త్రీ. గండకీ నదికిని పేరు.

తండకః ఖంజనే ఫేనే
సమాసప్రాయవాచిని॥ (115)
గృహదారౌ తరుస్కంధ
మాయాబహుళయోరపి।

**తండక:** పు. ఇది కాటుక పిట్టకును, నురుగకును, సమాసముతో గూడిన వాక్యముకును, యింటి దూలముకును, చెట్టు మొదలుకును, మాయల మారి వానికిని పేరు.

కంటకః క్షుద్రశత్రౌ చ
కర్మస్థానక దోషయోః। (116)
(రోమాంచె చద్రుమాంగెచ)
వేణౌ ద్రుమాంగెరోమాంచె
కంటకోమకరేऽపి చ।

**కంటక:** పు. ఇది అల్పశత్రువుకును, కార్యస్థానమునకును, దోషవిశేషముకును, వెదురుకును, తుమ్మ మొదలైన వాటి ముల్లుకును, గగుర్పాటుకును, మొసలికిని పేరు.

తక్షకః ఫణభేదే స్యా
ద్వర్ధకిద్రుమభేదయోః॥ (117)

**తక్షక :** పు. ఇది తక్షకుడను సర్పరాజుకును, వడ్లవానికిని, వృక్షవిశేషముకును పేరు.

పక్షకః పార్శ్వ మాత్రెచ
(పార్శ్వద్వారసహాయయోః)
పక్షద్వారె చ పక్షకః।

**పక్షక :** పు. ఇది పార్శ్వసామాన్యమునకును, దిడ్డివాకిలికిని పేరు.

శంఖకం వలయె కంబౌ
శిరోరోగె చ శంఖకః॥ (118)

**శంఖక :** న. ఇది కడియమునకును, శంఖమునకును, శిరమునపుట్టిన రోగవిశేషమునకును పేరు.

నందకో హరిఖడ్గె చ
హర్షకె కులపాలకె।

**నందక:** పు. విష్ణుని ఖడ్గమునకును, సంతోషమును చేయువానికిని, కులమును రక్షించువానికిని పేరు.

శీతక శ్శీతకాలే చ
సుస్థితె దీర్ఘ సూత్రిణి॥ (119)

**శీతక :** పు. ఇది శీతకాలముకును, సుఖవంతునకును, మందునకును పేరు.

ఉష్ణకస్తు నిదాఘె స్యా
దాతురె క్షిప్రకారిణి।

**ఉష్ణక :** పు. ఇది గ్రీష్మకాలముకును, రోగపీడితునకును, శీఘ్రముగా పనిచేయువానికిని పేరు.

దు(ఃకు)చ్చకో గంధకుట్యాంస్యా
ద్విహారాభ్యవకాశయోః॥ (120)

**దుచ్చక:** పు. ఇది మురయను ఓషధికిని, విహరించుటకును, వ్యవధానమునకును పేరు.

డుండు (దుండు) కః
శోణకె క్రూరె

**డుండుక :** పు. ఇది దుండిగపు చెట్టుకును, కుటిల హృదయమునకును పేరు.

క్షుల్లకః స్వల్పనీచయోః।
పిష్టకో నేత్రరోగే చ
ధాన్యాదిచమసేऽపి చ॥ (121)
భస్మకం రోగభేదే స్యా
ద్విడంగకలధౌతయోః।
చుంబకస్స్యాద్బహుగురు
ధూర్తాయస్కాంతకాముకే॥

**క్షుల్లక**: పు. ఇది స్వల్పముకును, నీచునకును పేరు.

**పిష్టక** : పు. ఇది నేత్రరోగ విశేషముకును, ధాన్యముల పిండితో చేసిన వాటికిని పేరు.

**భస్మక** : న. ఇది రోగ విశేషముకును, వాయువిడంగముకును, వెండికిని పేరు.

**చుంబక**: పు. ఇది అనేకమంది గురువులు గలవానికిని, వంచకునకును, అయస్కాంత రాతికిని, విటునకును పేరు.

జంబుకః (శ్వాపదే) ఫేరవే నీచే
ప్రతీచీదిక్పతావపి।
కార్ముకం వంశధనుషోః
కర్మశక్తే తు వాచ్యవత్॥ (123)
నిర్మోకో మోక్షకే వ్యోమ్ని
సన్నాహే సర్పకంచుకే।

**జంబుక** : పు. ఇది నక్కకును, నీచునకును, వరుణ దేవునికిని పేరు.

**కార్ముక**: న. ఇది వెదురునకును, ధనుస్సునకును, వి. కర్మయందు సమర్థునకును పేరు.

**నిర్మోక** : పు. ఇది మోక్షమునకును, ఆకాశమునకును, కవచమునకును, పాము కుబుసమునకును పేరు.

హుడుక్కో వాద్యభేదే చ
దాత్యూహే మదమత్తకే॥
తురుష్కః సిల్హకే మ్లేచ్ఛ
జాతౌ శ్రీవాసకే క్వచిత్।

**హుడుక్క** : పు. ఇది డక్కికిని, కూకురు గడ్డంగి పిట్టకును, గంజాయి చెట్టుకును పేరు.

**తురుష్క** : పు. ఇది అందుగ బంకతో చేసిన ధూపద్రవ్యముకును, తురకవానికిని, దేవదారు బంకతో చేసిన ధూపద్రవ్యముకును పేరు.

ఇక్ష్వాకుః కటుతుంబ్యాంచ
సూర్యవంశ్యనృపేऽపి చ॥
కుతాకు (కుంతాకు) శ్శ్వదు
రాధర్షే దుశ్శీలే చ బిలేశయే।
కు(ధా)షాకుర్మర్కటే భానౌ
పరోత్తాపిని పావకే॥ (126)
పృదాకు ర్వృశ్చికే వ్యాఘ్రే
చిత్రకే చ సరీసృపే।

**ఇక్ష్వాకు**: పు. ఇది చేతి ఆనపకాయకును ఇక్ష్వాకు మహారాజుకును పేరు.

**కుతాకు** : పు. ఇది పొందశక్యము కాని వానికిని, దురాచారునకును, సర్పముకును పేరు.

**కుషాకు** : పు. ఇది కోతికిని, సూర్యునకును, పరులను బాధించువానికిని, అగ్నికిని పేరు.

**పృదాకు** : పు. ఇది తేలుకును, పెద్ద పులికిని, చిరుతపులికిని, సర్పమునకును పేరు.

సృదాకురనిలె వజ్రె
దావాగ్నౌ ప్రతిసూర్యకె॥ (127)
గోరంకుః పక్షిజాతౌ స్యా
ద్భవే న్నగ్నక వందినోః।
త్రిశంకుః శలభె రాజ
విశేషే పృషదంశకె ॥ (128)
పల్యంకో మంచ పర్యంక
బృషీ పర్యస్తికాసు చ।
కరంకో మస్త (కెశస్య) కాష్ఠి స్యా
న్నా రికెళఫలా స్థిని ॥ (129)
కలంకోऽ కేऽపవాదెచ
కాలాయసమలెऽ పిచ।
భాలాం (జ్వాలా) కః కరపత్రె
స్యాచ్ఛాకభెదె చరోహితె॥ (130)
మహాలక్షణ సంపన్న
పురుషెకచ్ఛపెహరౌ।
వృషాంక శ్శంకరె సాధౌ
భల్లాతక మ(హో క్ష)హల్లయోః॥ (131)
మృగాంకోమారు తె చంద్రె
స్తబకః శుభ్రగుచ్ఛయోః।
ఆతంకో రోగ సంతాప
శంకాసు మురజధ్వనౌ॥ (132)
పాలంకః శల్లకీ శాకభెద
యోఃప్రాజి (వాజి) పక్షిణి.।
అలర్కో ధవళార్కె స్యా
ద్రోగోన్మాదిత(ని)కుర్కు(క్కు)రె (133)

**సృదాకు:** పు. ఇది వాయువునకును, వజ్రాయుధముకును, దావానలమునకును, సూర్యపరివేషమునకును పేరు.

**గోరంకు** : పు. ఇది పక్షి విశేషమునకును, నగ్నక పక్షికిని, స్తుతిపాఠకునకును పేరు.

**త్రిశంకు** : పు. ఇది మిడతకును, త్రిశంకు మహారాజునకును, పిల్లికిని పేరు.

**పల్యంక:** పు. ఇది మంచముకును, పరుపుకును, తివాసీకిని, యోగపట్టుకును పేరు.

**కరంక:** పు. ఇది తలపుర్రెకును, టెంకాయ బోరియకును పేరు.

**కలంక:** ఇది గురుతుకును, అపవాదుకును, ఇనుప చిట్టముకును పేరు.

**భాలాంక:** పు. ఇది రంపమునకును, శాక విశేషముకును, (తోటకూరని కొందరు) యెరుపు వర్ణమునకును, గొప్ప సాముద్రిక లక్షణములు గలవానికిని, **తాబేటి**కిని, విష్ణువునకును పేరు.

**వృషాంక** : పు. ఇది శివునకును, సజ్జనునకును, జీడిచెట్టుకును, అంతఃపురము కావలి వానికిని పేరు.

**మృగాంక:** పు. ఇది వాయువుకును, చంద్రునికిని పేరు.

**స్తబక** : పు. ఇది నిర్మలమైన దానికిని, గుత్తికిని పేరు.

**ఆతంక:** పు. ఇది రోగ విశేషముకును, పరితాపముకును, శంకకును, మద్దెలవాద్యముకును పేరు.

**పాలంక** : పు. ఇది అందుగు చెట్టుకును, శాక విశేషముకును, పాలంకి పిట్టకును పేరు.

**అలర్క** : పు. ఇది తెల్లజిల్లేడుకును, రోగముచేత వెర్రిపట్టిన కుక్కకును పేరు.

ఉదర్క ఏష్యత్కాలీయ
ఫలే మదనకంటకే।
సంపర్క స్సురతే పృక్తౌ
వితర్క స్సంశయోహయోః॥(134)

**ఉదర్క** : పు. ఇది ఉత్తరకాల ఫలమునకును, వృక్ష విశేషముకును పేరు.

**సంపర్క** : పు. ఇది రతికిని, తాకుటకును పేరు.

**వితర్క** : పు. ఇది సందేహముకును, ఊహకును పేరు.

అంబికా పార్వతీ పాండు
జనన్యోరపి మాతరి।

**అంబికా** : స్త్రీ. ఇది పార్వతికిని, పాండురాజు తల్లికిని, తల్లికిని పేరు.

అంధికా కైతవే మిశ్రే (శర్వర్యా)
సర్షప్యామపి కీర్త్యతే ॥ (135)

**అంధికా** : స్త్రీ. ఇది జూదముకును, కూడిన దానికిని, కాటుగ పిట్టకును పేరు.

అంబకో జనకే బాణనేత్ర
మందేషు చాంబకం।

**అంబక** : పు. ఇది తండ్రికిని, న. బాణముకును, నేత్రముకును, మీగడకును పేరు.

పిండే రత్నే మహారత్నే
ఘుటికా బద్ధపారదే ॥ (136)

**ఘుటికా** : స్త్రీ. ఇది ఉండకును, రత్నమునకు, నాయకమణికిని, రసగుళికకును పేరు.

అమ్లికా తింత్రిణీ (తిడీ) కా
మ్లోద్గారచాం గేరికాసు చ।

**అమ్లికా** : స్త్రీ. ఇదిచింతచెట్టుకును, పులుసుకును, పులిచింతయను వృక్షవిశేషముకును పేరు.

యూథికా మ్లానకే పుష్ప
భేదే (పీతపిచ యూథికా)
శంబష్ఠ యోరపి ॥ (137)

**యూథికా** : స్త్రీ. ఇది తెల్ల పెద్ద గోరింటకును, పుష్పవిశేషముకును, అడవిమొల్లచెట్టుకును పేరు.

రాజికాపి చ కేదారే
రాజసర్షప రేఖయోః।

**రాజికా** : స్త్రీ. ఇది వరిమడికిని, నల్లావాలకును, రేఖకును పేరు.

రసికాపి రసాలాయాం
కాంచీరసనయోరపి॥ (138)

**రసికా** : స్త్రీ. ఇది తియ్యమామిడి చెట్టుకును, మొలనూలుకును, నాలుకకును పేరు.

రుండికా ద్వార పీఠ్యాం చ
దూతికాయాం రణక్షితౌ।

**రుండికా**: స్త్రీ. ఇది ద్వారపంక్తికిని, దూతికకును, యుద్ధభూమికిని పేరు.

భూమికా రచనాయాంస్యా
న్మూర్త్యంతరపరిగ్రహే॥

**భూమికా**: స్త్రీ. ఇదిచేయుటకును, వేషమునకును పేరు.

కర్ణికా కరిహస్తాగ్రే
కరమధ్యాంగులావపి।

**కర్ణికా** : స్త్రీ. ఇది యేనుగుతుండముకొనకును, చేతినడిమి వ్రేలికిని, పోకగెల మొదలయిన వాటి

క్రముకాదిఫలాంశే చ
కర్ణికా కర్ణభూషణే ॥ (140)
బీజకోశే సరోజస్య
కుట్టన్యామపి కుత్రచిత్।

గోలకకును, చెవి యాభరణమునకును, తామర దుద్దుకును, కుంటెనకత్తెకును పేరు.

కణికా కథ్యతే ఽత్యంత
సూక్ష్మవస్త్రాగ్ని మంథయోః॥
గోధూమచూర్ణె సూచ్యాం చ
తూలికాయాం చ కీర్తితా।

**కణికా** : స్త్రీ. ఇది మిక్కిలి సన్నని బట్టకును, నెల్లికూరకును, గోధుమరవ్వకును, సూదికిని, చిత్తరువులు మొదలగునవి వ్రాయుకుంచెకును పేరు.

గణికా యూథికా వేశ్యా
తర్కారీ కరిణీషు చ॥ (142)
గణికోఽపి చ దైవజ్ఞె

**గణికా** : స్త్రీ. ఇది అడవిమొల్లచెట్టుకును, బోగము దానికిని, తక్కెడు చెట్టుకును ఆడయేనుగకును పేరు. **గణక** : పు. ఇది జ్యోతిష్కునకు పేరు.

కారికా నటయోషితి।
కృతౌ వివరణశ్లోకె
యాతనాయాంచ కారికా॥(143)
నాపితాదికశిల్పేఽపి

**కారికా** : స్త్రీ. ఇది నాట్యస్త్రీకిని, వాగ్రూపకార్యమునకును, సూత్రార్థమును తెలుపు శ్లోకముకును, తీవ్రవేదనకును, మంగలి మొదలయిన వాళ్ళ పనితనమునకును పేరు.

జాలికా జాలినీఫలె।
భటానామశ్మరచితాం
గరత్షిణ్యాం చ జాలికా॥(144)
గిరిసారె జలూకాయాం
నాదేయ్యాం విధవ స్త్రీయాం
జాలికః పునరుద్దిష్టో
గ్రామకూటే చ ధీవరె॥ (145)

**జాలికా** : స్త్రీ. ఇది పొట్లకాయకును, శిలా విశేషము చేరచియించిన యుద్ధభటుల డాలు మొదలైన వాటికిని, ఇనుమునకును, జలగకును, నేలనేరేడు చెట్టుకును, మగడు చచ్చిన దానికిని పు. గ్రామ సమూహముకును, పల్లెవానికిని పేరు.

నీలికానీలినీ క్షుద్ర
రోగశేఫాలికాసు చ॥ (146)
మక్షికాయాం

**నీలికా** : స్త్రీ. ఇది నీలిచెట్టుకును, క్షుద్రరోగవిశేషముకును, నల్లపువ్వుల వావిలి చెట్టుకును, ఈగకును పేరు.

కాళికా తు స్వర్ణదోష పరస్పతోః।
కాళికా యోగినీభేదే
కార్ష్ణ్యేగౌర్యాం ఘనావళౌ॥

**కాళికా** : స్త్రీ. ఇది బంగారములోని దోషముకును, కల్లుకును, యోగినీ విశేషముకును, నలుపుకును, పార్వతికిని, మేఘపంక్తికిని, ప్రతినెలకూ నిచ్చువడ్డీ

క్రమదెయవస్తుమూల్యె
ధూసరీ నవమెఘయోః।
పటోల శాఖారోమాళీ
మాంసీ కాకీషు కథ్యతె॥ (148)

మొదలగు వానికిని, కిన్నరస్త్రీకిని, కరిమబ్బుకును, పొట్లతీగకును, రోమరాజికిని, జటామాంసికిని కాకికిని, నాగదంతి చెట్టుకును పేరు.

తథావృశ్చిక పత్రెऽపి
మాలికా సరిదంతరె(గ్రైవె
యె పుష్పమాలాయాం
పక్షిమల్లేऽపి మాలికా॥ (149)

**మాలికా :** స్త్రీ. ఇది నదీ విశేషముకును, కంఠహార విశేషముకును, పూదండకును, పక్షివిశేషముకును పేరు.

బా(వా)లికా వాలుకాబాలా
(పిచ్ఛో)పింజోలా కర్ణభూషణె।

**బాలికా : వాలికా :** స్త్రీ. ఇది యిసుకకును, కన్య కును, మీనవల్లంకి పిట్టకును, చెవి యాభరణ విశేష ముకును పేరు.

తూలికా కథితా లేఖ్యే
కూర్చి కాతూలశయ్యయోః

**తూలికా:** స్త్రీ. ఇది కలముకును, చిత్రవులు వ్రాయు కుంచకును, దూదిపురుపుకును పేరు.

చూళికా నాటకస్యాంగే
కర్ణమూలే చ దంతినాం।

**చూళికా:** స్త్రీ. ఇది నాటకమందలియొకభాగవిశేషముకును, ఏనుగ చెవియొక్క మొదటి భాగము కును పేరు.

మల్లికా తృణశూల్యేऽపి
మీనమృత్పాత్రభేదయోః॥
మల్లికో హంసభేదే ऽథ

**మల్లికా:** స్త్రీ. ఇది మల్లిచెట్టుకును, మత్స్య విశేషము కును, మండిగ(లేకమూకుడు) కును, పు. హంస విశేషముకును పేరు.

ఝల్లికా ఝిల్లికేత్యుభే।
విలేపనమలే ఝిల్యా
మాతపస్య రుచిస్స్మృతా॥ (152)

**ఝల్లికా : ఝిల్లికా :** స్త్రీ. ఇది నలుగు పెట్టిన పిండికిని చిమ్మెటకును, యెండయొక్క కాంతికిని పేరు.

వాలుకా సికతాసు స్యా
ద్వాలుకం త్వైలవాలుకె।

**వాలుకా :** స్త్రీ. ఇది యిసుకకును, న. కూతురు బుడమ చెట్టుకును పేరు.

నగ్నికా తు కుమార్యాంస్యా
దథ క్షపణ వందినోః॥

**నగ్నికా :** స్త్రీ. ఇది పెండ్లికాని పది సంవత్సరముల లోపు వయసు కల పడుచుకును పేరు.

నగ్నకో ధేనుకా ధేనౌ
స్త్రీకరే(ణు)ణ్వోః ప్రసూతయోః

**నగ్నక :** పు. ఇది క్షపణ మతస్థునకును, స్తుతిపాఠకునకును పేరు. **ధేనుకా :** స్త్రీ. ఇది గోవుకును, ప్రసవించిన స్త్రీకిని, అట్టి యేనుగకును పేరు.

రేణుకా పి హరేణౌ స్యా

**రేణుకా :** స్త్రీ. ఇది రేణుకమను గ్రంధ్యద్రవ్యము

జ్ఞమదగ్నిస్త్రియ్యామపి॥ (154) కును, పరశురాముని తల్లికిని పేరు.

| | |
|---|---|
| జతుకా జినపత్రాయాం<br>జతుకం హింగులాక్షయోః | **జతుకా**: స్త్రీ. ఇది చీకురు వాయిపురుగుకును, న. ఇంగువకును, లక్కకును పేరు. |
| కూర్చికా సూచికాయాం చ<br>తూలికాయాం చ కుట్మలే<br>కవాటకీలకే క్షీరవికృతావపికూర్చికా | **కూర్చికా**: స్త్రీ. ఇది సూదికిని, చిత్తరువులు వ్రాయు కుంచెకును, మొగ్గకును, కుంచెకోలమొదలయిన వాటికిని, జున్నుకును పేరు. |
| మాతృకాధా (తృ) త్రికామాత్రో<br>ర్మాతృకం కరణే స్వరే॥ (156) | **మాతృకా** : స్త్రీ. ఇది పెంపుడు తల్లికిని, న. నాట్య విశేషముకును, స్వరముకును పేరు. |
| పతాకా వైజయంత్యాంచ<br>సౌభాగ్యేఽంక ధ్వజేఽపిచ | **పతాకా** : స్త్రీ. ఇది టెక్కెము (లేక జండా) కును సింధూరముకును, గురుతు జండాకును పేరు. |
| స్యాత్పుత్రికా పుత్తళికా<br>దుహిత్రో ర్వ్యావతూలకే॥ (157) | **పుత్రికా** : స్త్రీ. ఇది వస్త్రదంతాదులచేత చేయబడిన బొమ్మకును, కుమార్తెకును, లత్తుక దూదికిని పేరు. |
| పుత్రక శ్శలభే ధూర్తే<br>శైలవృక్షప్రభేదయోః। | **పుత్రక** : పు. ఇది మిడతకును, మోసకానికిని, పర్వత విశేషముకును, వృక్షవిశేషముకును పేరు. |
| ఉష్ట్రికా మృత్తికాభాండ<br>భేదేఽపి కరభస్త్రియాం॥ | **ఉష్ట్రికా** : స్త్రీ. ఇది మట్టికుండలోని భేదముకును, ఆడ ఒంటెకును పేరు. |
| డింబికా జలబింబే స్యా<br>త్స్యోనాకే కాముక స్త్రియాం | **డింబికా**: స్త్రీ. ఇది నీటి దొండ చెట్టుకును, దుండిగపు చెట్టుకును, కులటకును పేరు. |
| స్యమీకా నీలికాయాం చ<br>స్యమీకో నాకు వృక్షయోః॥ | **స్యమీకా** : స్త్రీ. ఇది నీలిచెట్టుకును, పుట్టకును, వృక్షవిశేషముకును పేరు. |
| దూషికా తూలికాయాంచ<br>దూషికా నేత్రయోర్మలే। | **దూషికా** : స్త్రీ. ఇది రంగులు వేయుకుంచకును, కండ్లపుసికిని పేరు. |
| ఊర్మికా త్వంగుళీయే స్యా<br>ద్వస్త్రభంగ తరంగయోః॥<br>తథోత్కంఠో ద్వాహంలక<br>భృంగస్యానేషు చోర్మికాఽసూచ్యాం | **ఊర్మికా** : స్త్రీ. ఇది వ్రేలియుంగరమునకును, బట్టకుచ్చెళ్ళకును, అలకును, వేడుకకును, సంగీత ధ్వని విశేషముకును, తుమ్మెద ఝుంకారముకును పేరు. |
| శలాకా మదనశాలికా<br>శల్యయోశ్శలే॥ (161) | **శలాకా** : స్త్రీ. ఇది సూదికిని, మ్రంగ చెట్టుకును, గసిగకును, ఎదు పందిముల్లుకును, గొడుగు |

ఛత్రపంజర కాష్ఠ్యాం చ
శ(స) ల్లకీ పశు వృక్షయోః।

మొదలయిన వాటి కామకును పేరు.
**శల్లకీ** : స్త్రీ. ఇది ఏదుపందికిని, **సల్లకీ** : అందుగు చెట్టుకును పేరు.

నర్తకీ లాసికాయాంచ
కరిణ్యామపి నర్తకీ ॥ (162)
నర్తకః కేలకె పోటగళ
చారణయో ర్నటే।

**నర్తకీ** : స్త్రీ. ఇది నాట్య స్త్రీకిని, ఆడ యేనుగకును, పు. కత్తివాయి మొదలయిన వాటిపైన నృత్యము చేయువానికిని, కిక్కిస గడ్డికిని, నాట్యగానికిని (అనగా కుశీలవుడు) దుండిగపు చెట్టుకును పేరు.

చుల్లకీ శింశుమారే చ
కుండీ భేదే కులాంతరే॥ (163)

**చుల్లకీ** : స్త్రీ. ఇది పిడకమొసలికిని, పాత్ర విశేషముకును, కులవిశేషముకును పేరు.

చతుష్కీ మశక హర్మ్యాం
చ తుష్కీ యష్టికాంతరే।

**చతుష్కీ** : స్త్రీ. ఇది కప్పుకొను వస్త్ర విశేషముకును, నాలుగు పేటల ముక్తాహారముకును పేరు.

జాహకో ఘోంఘ మార్జాల
ఖట్వా కారుండి కాసు చ॥

**జాహక** : పు. ఇది జంతువిశేషముకును, పిల్లికిని, మంచముకును, నీటి కోడికిని పేరు.

## ★ అథ కాంతశ్చతుర్వర్ణః ★

అళిమకః పికే భేకే
మధూకే పద్మకేసరే।

**అళిమక** : పు. కోకిలకును, కప్పుకును, ఇప్ప చెట్టుకును, పద్మకింజల్కముకును పేరు.

భవేదళిపకో భృంగే
కోకిలే రతహిండకే॥ (165)

**అళిపక** : పు. ఇది తుమ్మెదకును, కోకిలకును, విటునకును పేరు.

స్మృతః కురవక శ్శోణా
మ్లాన ఝింటీ ప్రభేదయోః।

**కురవక** : పు. ఇది యెర్ర పెద్ద గోరింటకును, ములుగోరింటకును పేరు.

భవేన్మరువకః పుష్ప
విశేషేమదనద్రుమే॥ (166)

**మరువక** : పు. ఇది పుష్ప విశేషముకును, (అనగా మరువక పుష్పము) మ్రంగచెట్టుకును పేరు.

బలాహకో గిరౌమేఘే
దైత్యానాగవిశేషయోః।

**బలాహక** : పు. ఇది బలాహకపర్వతముకును, బలాహక మను మేఘముకును, బలాహకుడను రక్కసునకును, దేవయోని సర్పవిశేషముకును పేరు.

భ్రమరకో జలే భృంగే
గిరికే చూర్ణకుంతలే॥ (167)

**భ్రమరక** : పు. ఇది జలమునకును, తుమ్మెదకును, చిట్టెలుకకును, ముంగురులకును పేరు.

వరాటకః స్త్రూలరజ్జా

**వరాటక** : పు. ఇది మోకు త్రాటికిని, తామరపూస

| | |
|---|---|
| పద్మబీజే కపర్దకే। | ఘను, గవ్వకును పేరు. |
| శృంగాటకో భవేద్వారి | **శృంగాటక** : పు. ఇది జలచర విశేషముకును, |
| కంటకే చ చతుష్పథే॥ (168) | నాలుగు త్రోవలు కలిసిన దారికిని పేరు. |
| గోకంటకో గోక్షురకే | **గోకంటక** : పు. ఇది ఏనుగ పల్లేరు చెట్టుకును, |
| స్థపుటే చ గవాం ఖురే। | నిమ్నోన్నతమయిన దానికిని, గోవుల డెక్కకును పేరు. |
| ఆకల్పక స్తమో మోహ | **ఆకల్పక** : పు. ఇది చీకటికిని మోహముకును, |
| గ్రంథీషూత్కలికా ముదోః॥ | ముడికిని, వేడుకకును, సంతోషముకును పేరు. |
| ఆక్షేపకోऽనిలవ్యాధౌ | **ఆక్షేపక** : పు. ఇది వాతరోగ విశేషముకును, |
| వ్యాధేనిందాకరేऽపి చ। | బోయవానికిని, నిందించువానికిని పేరు. |
| ప్రచలాక శ్శరాఘాతే | **ప్రచలాక**: పు. బాణముచేత కొట్టబడిన గాయము |
| దందశూకే భుజంగమే॥(170) | కును, దండసూకుడను రాక్షసునకును, సర్పమున కును పేరు. |
| బృందారకస్సురే శ్రేష్ఠే | **బృందారక** : పు. ఇది దేవతకును, త్రి. శ్రేష్ఠమైన |
| మనోజ్ఞే పున రన్యవత్। | దానికిని, మనోహరమైన దానికిని పేరు. |
| నియామకః కర్ణధారే | **నియామక** : పు. ఇది ఓడనడుపు వానికిని, ఓడ |
| పోతవాహే నియంతరి॥ (171) | కంబము మీదనుండి మార్గము చూపువానికిని, (అనగా తండేలు) నియమించువానికిని పేరు. |
| వినాయకస్తు హేరంబే | **వినాయక** : పు. ఇది పిళ్ళారికిని, గరుడునకును, |
| తార్క్ష్యే విఘ్నే జినే గురౌ। | విఘ్నముకును, బుద్ధదేవునకును, గురువుకును పేరు. |
| నిశ్చారకః పురీషస్య | **నిశ్చారక** : పు. ఇది మలబద్ధముకును, యథేచ్ఛ |
| క్షయేస్వైరే సమీరణే॥ (172) | కును, వాయువకును పేరు. |
| భట్టారకస్సురే రాజ్ఞి | **భట్టారక** : పు. ఇది దేవునకును, రాజుకును, |
| కథితశ్చ తపోధనే। | మునీశ్వరునకును పేరు. |
| దాసేరక స్స్యాత్కర భే | **దాసేరక**: పు. ఇది ఒంటెకును, లంజకొడుకుకును, |
| దాసీపుత్రే చ ధీవరే॥ (173) | పల్లివానికిని పేరు. |
| అంగారకం కుజె విద్యా | **అంగారక** : పు. ఇది అగారకునకును, నిప్పు |
| దుల్మకాంశే కురంటకే। | బొగ్గుకును, పచ్చపువ్వుల గోరింటకును పేరు. |
| అంగారికే క్షుకాండే స్యా | **అంగారికా** : స్త్రీ. ఇది చెరుకు కఱ్ఱకును, మోదుగ |

త్కోరకే కింశుకస్యచ॥
దలాఢకస్తు కుందే స్యా
త్కరిక్ణర్ణ శిరీషయోః।
స్వయంజాతతిలే ఫేనే
ఖాతకే నాగకేసరే ॥ (175)
వాత్యాయాం పృశ్నికాయాం చ
గైరికే చ మహత్తరే।
పూర్ణానకం వస్తుపూర్ణ
పాత్రెపటహ పాత్రయోః॥
ప్రకీర్ణకం గ్రంధభెదె
చామరె విస్తరె హయె।
స్మృతః పుష్కలకో గంధ
మృగె క్షపణకీలయోః॥ (177)
కోశాతకః క.(ర) చెజ్యో
త్స్నిపటోలీ ఘోషికాసు చకోశాతకీ
వాణిజకో బడబాగ్నౌ
వణిజ్యపి॥ (178)
నిర్గంధక స్స్యాత్ క్షపణె
నిష్ఫలేఽప్యపరిచ్ఛదె।
స్యాదశ్మంతకముద్దానె
మల్లికాచ్ఛదనెఽపి చ॥ (179)
కటిల్లకస్తు పర్ణాసె
వర్షాభూ కారవెల్లయోః।
కపర్దకో వరాటె స్యా
జ్జటాజూటే చ ధూర్జటేః॥
గోమే(ధి)దకం పీతమణౌ
కాకోలే పత్రకేఽపి చ।
మండోదకశ్చిత్రరాగే

మొగ్గకును పేరు.

**దలాఢక :** పు. ఇది మొల్ల మొగ్గకును, ఏనుగ చెవి కిని, దిరిశెన చెట్టుకును, సాగుచెయ్యక మొలచిన నువ్వు చెట్టుకును, నురుగకును, అగడ్తకును, నాగకేసరపు చెట్టుకును, సుడిగాలికిని, తూటికూర కును, ధాతు విశేషముకును, మిగుల గొప్ప వస్తువు కును పేరు.

**పూర్ణానక :** న. ఇది వస్తువులచేత నిండింపబడిన పాత్రకును, ఢక్కా వాద్యముకును, పాత్రకును పేరు.

**ప్రకీర్ణక:** పు. ఇది గ్రంధవిశేషముకును, సురటీకిని, విస్తారముకును, గుర్రముకును పేరు.

**పుష్కలక:** పు. ఇది కస్తూరి మృగముకును, క్షపణ మతస్థునకును, మేకుకును పేరు.

**కోశాతక :** పు. ఇది కేశపాశముకును, ఈ.స్త్రీ. పొట్లచెట్టుకును, చేతిపొట్లకును చేతిబీరచెట్టుకును పేరు.

**వాణిజక :** పు. ఇది బడబానలముకును, వర్తకము చేత జీవించువానికిని పేరు.

**నిర్గంధక:** పు. ఇది క్షపణ మతస్థునకును, ఫలము లేనిదానికిని, పరివారము లేకపోవుటకును పేరు.

**అశ్మంతక :** న. ఇది ప్రోయికిని, దీపపు ప్రమిదె యొక్క ఆవరణముకును పేరు.

**కటిల్లక :** పు. ఇది నల్లగగ్గెర చెట్టుకును, గల్జేరు చెట్టుకును, కాకర చెట్టుకును పేరు.

**కపర్దక:** పు. ఇది గవ్వకును, శివుని జటాజూటము కును పేరు.

**గోమేదక :** న. ఇది గోమేదక మణికిని, విషము కును, ఆకుపత్రికముకును పేరు.

**మండోదక:** పు. ఇది విచిత్ర వర్ణముకును, మంగళా

భవేదాతరణే ऽ పి చ ॥ (181)
శతానీకో మునేర్భేదే
వృద్ధే చాథ
ఖ(క)రాళికః।
గ్రామణీభండినారాచో
పధానేషు ప్రయుజ్యతే॥(182)
లేఖనికో లేఖహారే
యస్స్వహస్తం విలేఖయేత్।
లేఖేషు పరహస్తేన
తత్రాప్యే ష ప్రదర్శితః॥ (183)
భవేన్మండలకం బింబే
కుష్ఠభేదే చ దర్పణే।
పిప్పలకం స్తనవృంతే
మతం సీవనసూత్రకే॥ (184)
పిండీతక స్స్యాత్తగరే
మదనే చ ఫణిజ్జకే।
త్రివర్ణకం గోక్షురకే
త్రిఫలాయాం కటుత్రికే॥(185)
సాలావృక స్సృగాలే ऽ పి
సారమేయె వలీముఖే।
కాలేయక స్సారమేయే
మహాకాముకశక్రయోః॥ (186)
కాలేయకః కులశ్రేష్ఠే
వాచ్యలింగః ప్రకీర్తితః।
సుప్రతీకశ్శోభనాంగే
భవేదీశానదిగ్గజే॥ (187)

జైవాతృకః కృశేచంద్రే

ర్థమైన చందనాదుల పూతకును పేరు.

**శతానీక** : పు. ఇది ముని విశేషముకును, పెద్ద వయసు వానికిని పేరు.

**ఖరాళిక** : పు. ఇది గ్రామనాయకునకును, వృక్ష విశేషముకును, (మంజిష్ఠయని కొందరు) బాణము కును, తలగడాకును పేరు.

**లేఖనిక**: పు. ఇది జాబులు తెచ్చువానికిని, యవడు జాబులు మొదలగు వాటియందు పరుని చేతను తాను వ్రాసినట్లు వ్రాయించు చున్నాడో వానికిని పేరు.

**మండలక** : న. ఇది సూర్యాది బింబములకును, గుండ్రముగా నుండెడి కుష్ఠుకును, అద్దముకును పేరు.

**పిప్పలక** : ఇది కుచాగ్రముకును, కుట్టుదారము నకును పేరు.

**పిండీతక** : పు. ఇది గ్రంధి తగరముకును, మంగ చెట్టుకును, మరువముకును పేరు.

**త్రివర్ణక** : న. ఇది ఏనుగ పల్లేరుకును, కరకతాడి ఉసిరికలకును, శొంఠిపిప్పలి మిరియాలకును పేరు.

**సాలావృక** : పు. ఇది నక్కకును, కుక్కకును, కోతికిని పేరు.

**కాలేయక** : పు. ఇది కుక్కకును, అతికాముకున కును, ఇంద్రునకును, త్రి. మంచికులమందు పుట్టిన దానికిని పేరు.

**సుప్రతీక** : పు. ఇది సుందరమగు అవయవములు కలవానికిని , ఈశాన్య దిక్కుననుండు దిగ్గజము కును పేరు.

**జైవాతృక** : పు. ఇది కృశించిన దానికిని, చంద్రున

భైషజ్యాయుష్మతోరపి।

కును, ఔషధ విశేషముకును, దీర్ఘాయుష్మంతున కును పేరు.

రతర్థిక స్స్యాద్దివసె
సుఖస్నానేఽష్టమంగళె॥ (188)

**రతర్థిక :** పు. ఇది దివసమునకు, సుఖస్నానమున కును, తెల్లని ముఖము, వక్షము కేశములు డెక్కలు తోకగల గుఱ్ఱముకును పేరు.

వైనాసిక స్స్యాత్ క్షణికె
పరతంత్రోర్ణనాభయోః।

**వైనాసిక :** పు. ఇది బౌద్ధ విశేషునకును, పరాధీను నకును, సాలెపురుగు కును పేరు.

వైదేహకో వాణిజకె
శూద్రాద్వైశ్యాసుతేఽపి॥

**వైదేహక :** పు. ఇది వర్తకునకును, శూద్రునివలన వైశ్య స్త్రీకి పుట్టినవానికిని, విదేహరాజుకును పేరు.

వితున్నకం తు ధాన్యాకె
తథా ఝూటామలౌషధౌ।

**వితున్నక :** న. ఇది కొత్తిమిరికిని, నేల వుశిరగచెట్టు కును పేరు.

గో(కూణి)కులికః కేకరే
స్యాత్పంకస్థగవ్యుపేక్షకె॥

**గోకులిక :** పు. ఇది మెల్లకంటివానికిని, బురదయందు పడి లేవశక్తిలేని గోవును ఉపేక్షించినవానికిని పేరు.

భార్యాటికో భవేద్భార్యా
నిర్జితే హరిణాంతరే।

**భార్యాటిక :** పు. ఇది భార్యచేత జయించబడిన వానికిని, ఒకవిధమైన లేడికిని పేరు.

కాపటికోఽన్యమర్మజ్ఞె
ఛాత్రేస్యా (కాదాశాసిని)
త్కటదేశిని॥ (191)

**కాపటిక :** పు. ఇది అన్యుల మర్మమును గుర్తెరిగిన వానికిని, శిష్యునకును, కట దేశస్థునకును పేరు.

కౌక్కుటికో దాంభికేస్యా
దదోర ప్రేరి తేక్షణె।

**కౌక్కుటిక :** పు. ఇది దంభము కలవానికిని, అడుగు పెట్టెడుచోటు చూచుకొనుచుండు భిక్షుకునకును పేరు.

లాలాటికః ప్రభోర్భావ
దర్శిన్యాశ్లేషణాంతరె॥ (192)
కార్యాక్షమె ప్యాక (లి) థితః

**లాలాటిక :** పు. ఇది అభిప్రాయమును కనుగొను టకై ప్రభువులయొక్క లలాటమును చూచువాని కిని, ఆలింగనవిశేషముకును, పనులయందు సమర్థము కాని వానికిని పేరు.

శిలాటక శ్శిలా ట్టయోః।

**శిలాటక :** పు. ఇది రాతికిని, ప్రాకారము మీది యింటికిని పేరు.

కర్కోటకస్స్యాన్మాలూర
కాద్రవేయప్రభేదయోః॥

**కర్కోటక :** పు. ఇది మారేడు చెట్టుకును, కర్కోటకు డను సర్పవిశేషముకును పేరు.

వరండకస్తు మాతంగ
వేద్యాం యౌవనకంటకే।

**వరండక**: పు. ఇది ఏనుగను కట్టెడు అరుగుకును, యౌవనమందు గండస్థలమందు పుట్టెడు వ్రణవిశేషముకును, వర్తులాకారముకును పేరు.

సంవర్తులేప్యాఖనిక
శ్చోరెక్రోడే పి మూషకె॥ (194)

**ఆఖనిక** : పు. ఇది కన్నపు దొంగకును, పందికిని, ఎలుకకును పేరు.

వైతాళికా బోధకరె
ఖేటితాళేప్యుదీరితః।

**వైతాళిక**: పు. ఇదిమేలుకొలుపు వానికిని, స్తుతిపాఠకునకును పేరు.

తిక్తశాకస్తు ఖదిరె
వరుణే పత్రసుందరె॥ (195)

**తిక్తశాక** : ఇది చంద్రచెట్టుకును, ఉలిమిడిచెట్టుకును, వృక్షవిశేషముకును పేరు.

మయూరకోప్యపా మార్గె
తుత్థకె పి మయూరకం।

**మయూరక** : పు. ఇది ఉత్తరేణిచెట్టుకును, న. మైలతుత్థముకును పేరు.

విశేషకస్త్వ్య త్తిలకే
విశేషోవాహకేపి చ॥ (196)

**విశేషక** : పు. ఇది బొట్టుకును, అతిశయమును హొందినవానికిని పేరు.

విదూషకశ్చాటు (ప) వటౌ
పరనిందాక రేపిచ।

**విదూషక**: పు. ఇది వాక్చాతుర్యము చేతనూ ఆకారవిశేషము చేతనూ నవ్వుపుట్టించు వానికిని, పరులను నిందించు వానికిని పేరు.

భవేత్సై కతికం మాత్ర
యాత్రామంగళసూత్రయోః॥
తధా సన్యస్తసందేహ
జీవ క్షపణకేప్యపి।

**సైకతిక** : న. ఇది తల్లితో ప్రయాణము చేయుటకును, మంగళసూత్రముకును, పు. సంన్యాసికిని, సందేహింపబడిన జీవనము కలవానికిని, క్షపణమతస్థునకును పేరు.

ఏడమూకస్తుతో ధీరై
శ్శఠే వాక్ శ్రుతివర్జితె॥

**ఏడమూక** : పు. ఇది మోసగానికిని, చముడు మూకపట్టిన వానికిని పేరు.

వర్తరూకో నదీభేదే
కాకనీడే జలావటే।

**వర్తరూక**: పు. ఇది నదీ విశేషముకును, కాకిగూడుకును, నీళ్ళగోతికిని పేరు.

కాకరూ(కోప్యు) క ఉలూ
కేప్యాన్ని స్పెస్త్రీ
జిత దంభయోః॥ (199)
దిగంబరె భీరుకె చ

**కాకరూక** : పు. ఇది గుడ్లగూబకును, నిర్ధనునకును, ఆడుదానిచేత జయింపబడిన వానికిని, కపటమునకును, వస్త్ర విహీనునకును, పిరికివానికిని పేరు.

దందశూకో హిరక్షసోః।

**దందశూక:** పు. ఇది పాముకును, రాక్షసునకును పేరు.

మృష్టేరుకో వదాన్యేపి
మృష్టాశివ్యతిధిద్విషి ॥ (200)

**మృష్టేరుక :** పు. ఇది దాతకును, తిండిపోతునకును, అతిథులను ద్వేషించు వానికిని పేరు.

కృకవాకుర్మయూరెపి
సరటే చరణాయుధే।

**కృకవాకు :** పు. ఇది నెమలికిని, తొండకును, కోడికిని పేరు.

రాధరం (క) కుస్తు నాసీరే
శీకరే చ ఘనోపలె ॥ (201)

**రాధరంకు :** పు. ఇది సేనాముఖమునకును, ఉదకకణమునకును, వడగలికిని పేరు.

కలవింకస్మృతో గ్రామ
చటకే చ కళింగకే ।

**కలవింక :** పు. ఇది ఊరపిచ్చుగకును, కూకటి మూగపిట్టకును పేరు.

సౌగంధికం తు కల్హారే
పద్మరాగే చ కత్త్రుణె ॥ (202)
గంథోపలే గాంధికేతు
సౌగంధిక ఇతిర్ధ్వనిః ।

**సౌగంధిక:** న. ఇది ఎఱ్ఱకలువకును, పద్మరాగమణికిని, కామంచి గడ్డికిని, పు. గంధకమునకును, సుగంధ ద్రవ్యములమ్ము వానికిని పేరు.

సోమవల్కాస్తు ధవళ
ఖదిరేకట్ఫలేపి చ ॥ (203)

**సోమవల్క :** పు. ఇది తెల్లచంద్ర చెట్టుకును, తేకు మ్రానుకును పేరు.

భయానక స్మృతో వ్యాఘ్రే
సైంహి కేయేపి భీషణె।

**భయానక:** పు. ఇది పెద్ద పులికిని, రాహువకును, త్రి. భయంకరమైన దానికిని పేరు.

పుండరీకం సితాం భోజే
సితఛత్రే చ భేషజే ॥ (204)
కోశకారాంతరే వ్యాఘ్రే
పుండరీకోగ్నిదిగ్గజే।

**పుండరీక :** న. ఇది తెల్లతామర పువ్వుకును, శ్వేతఛత్రముకును, ఓషధి విశేషముకును పు. తెల్ల చెరుకుకును, పెద్ద పులికిని, ఆగ్నేయ దిగ్గజమునకును పేరు.

జర్ఝరీకం బహుచ్ఛిద్రే
జర్ఝరీకో జరాతురె ॥ (205)

**జర్ఝరీక :** న. ఇది జల్లెడకును, పు. ముదిమిచేత తొట్రుపడు వానికిని పేరు.

చర్చరీకో మహాకాళే
కేశవిన్యాస శాకయోః।

**చర్చరీక:** పు. ఇది ముషిణి చెట్టుకును, కేశపాశముకును, శాక విశేషముకును పేరు.

తర్తరీకం వహిత్రే స్యా
త్తర్తరీకశ్చ పారగె ॥ (206)

**తర్తరీక :** న. ఇది కలమయను ఓడకును, పు. పారమును పొందిన వానికిని పేరు.

ఫర్పరీకశ్చ పెటే స్యా
త్ఫర్పరీకం తు మార్దవే।

**ఫర్పరీక**: పు. ఇదిచెంపకాయకును, న. మృదుత్వముకును పేరు.

భవేదుత్కలికో త్కంఠా
హెలాసలిలవీచిషు ॥ (207)

**ఉత్కలికా** : స్త్రీ. ఇది వేడుకకును; విలాసకును, తరంగముకును పేరు.

సృగాలికా శివాయాం స్యా
త్త్రా సాదపి పలాయనే।

**సృగాలికా** : స్త్రీ. ఇది ఆడునక్కకును, భయము వలన పరుగెత్తుటకును పేరు.

చండాలికా కిన్నరాయా
ముమాయామోషధీభిది॥

**చండాలికా** : స్త్రీ. ఇది చండాలాదులు వాయించు వీణకును, పార్వతికిని, ఓషధీ విశేషముకును పేరు.

పాంచాలికా తు వస్త్రాది
పుత్రికా రీతిభేదయోః।

**పాంచాలికా** : స్త్రీ. ఇది వస్త్రాదులచేత చేయబడిన బొమ్మకును, పాంచాలీ రీతికిని పేరు.

కనీనికా తారకేఽక్ష్ణస్స్యా
త్కనిష్ఠాంగుళావపి॥ (209)

**కనీనికా** : స్త్రీ. ఇది కంటినల్లగ్రుడ్డుకును, చిటికెన వ్రేలికిని పేరు.

భవేద్గుణనికా నృత్యే
శూన్యాంకే పాఠనిశ్చతౌ।

**గుణనికా** : స్త్రీ. ఇది నాట్యముకును, శూన్యపు గురుతుకును, పాఠమును ధృవపర్చుటకొరకు వెనుక చెప్పిన దానిని తిరిగీ చెప్పుటకును పేరు.

సంతానికాపి క్షీరాది
సారెమర్కటజాలకె ॥ (210)

**సంతానికా** : స్త్రీ. ఇదిపాలుమొదలైనవాటిమీగడకును, సాలెపురుగు మగ్గముకును పేరు.

సందంశకా తు ముచుటీ
లోహయంత్రవిశేషయోః।

**సందంశకా** : స్త్రీ. ఇది పట్టుకారుకును, పట్టు పట్టెడి యంత్రసాధన విశేషముకును పేరు.

సంఘాటికా తు యుగ్మేస్యా
త్కుట్టనీఘ్రాణయోరపి॥

**సంఘాటికా** : స్త్రీ. ఇది జంటకును, కుంటెన కత్తెకును, నాసికకును పేరు.

జీవంతికా తు జీవాఖ్య
శాఖవందా గుళూచిషు।

**జీవంతికా** : స్త్రీ. ఇది నీటిచిర్రి చెట్టుకును, బదనికెకును, తిప్పతీగెకును పేరు.

విద్యాద్బృహతికాభిఖ్యా
మురువస్త్ర ప్రభేదయోః॥(212)

**బృహతికా**: స్త్రీ. ఇది తొడకును, ఉత్తరీయముకును పేరు.

బకేరుకో బలాకాభి
ద్వా(తావర్జి)తవేల్లిత శాఖయోః।
స్మృతా ఘర్ఘరికా క్షుద్ర

**బకేరుక** : పు. ఇది బెగ్గురు పక్షి విశేషముకును, వాయువుచేత వంచబడిన కొమ్మలుగల చెట్టుకును పేరు.

| | |
|---|---|
| ఘంటికా భ్రష్ట ధాన్యయోః॥<br>వాద్యప్రభేదవాదిత్ర<br>దండయోరాహఘాంతరే। | **ఘర్ఘరికా :** స్త్రీ. చిరుఘంటులకును, పేలాలకును, వాద్య విశేషముకును, వాయించు కర్రకును, నదీ విశేషముకును పేరు. |
| ★ అథకాంతః పంచవర్గః ★ | |
| స్యాదాచ్ఛురితకం హాస<br>నఖాఘాత విశేషయోః॥ (214) | **అచ్ఛురితక :** న. ఇది యెత్తిపొడుపుతోగూడిన నవ్వుకును, నఖక్షత విశేషముకును పేరు. |
| ప్రతీసూర్యాకమిచ్ఛంతి<br>కృకలాసోపసూర్యయోః। | **ప్రతిసూర్యక:** న. ఇది తొండకును, సూర్యునిసమీప మందుండు తేజోమయమైన ప్రతిమండలముకును పేరు (పరివేషమని కొందరు) |
| అనేడమూకమిచ్ఛంతి<br>వాక్శ్రుతివివర్జితే॥ (215) | **అనేడమూక:** త్రి. ఇది చెవుడు మూగపట్టిన వానికిని పేరు. |
| రాజపట్టస్య కాచస్య<br>గుడకే కాచవర్తికః। | **కాచవర్తిక:** పు. ఇది కృత్రిమమణి విశేషముకును, గాజుకాయకును పేరు. |
| గోజాకరిక మిత్యాహు<br>ర్మంగలే కంటకారకే॥ (216) | **గోజాకరిక:** న. ఇది శుభమునకును, పు. వాకుడు చెట్టుకును పేరు. |
| స్యాత్కృ(కి) మికంటకం<br>చిత్రావిడంగోదుంబ రేషుచ। | **కృమికంటక:** న. ఇది ఎలికచెవిచెట్టుకును, వాయు విడంగమునకును, మేడి చెట్టునకును పేరు. |
| సువసంతక ఇత్యేష వాసం<br>త్యాం మదనోత్సవే॥ (217) | **సువసంతక:** పు. ఇది బండిగురువిందకును, వసంత కాలమందలి ఉత్సవ విశేషముకును పేరు. |
| కక్షావేక్షక మిచ్ఛంతి<br>శుద్ధాంతో ద్యానపాలయోః।<br>ద్వారపాలె కవౌషిద్గెరంగా<br>జీవివ్యపి క్వచిత్ ॥ (218) | **కక్షావేక్షక :** పు. ఇది అంతఃపురమును కాచువాని కిని, ఉద్యానమును కాచువానికిని, ద్వారపాలకున కును, కవికిని, విటునకును, నాట్యగానికిని పేరు. |
| నాగవారిక ఉద్దిష్టో హస్తి<br>పే రాజకుంజరే॥గ(ణాధి)<br>ణ్ణరాజే గరుడే చిత్ర<br>మేఖలకే క్వచిత్ ॥ (219) | **నాగవారిక :** పు. ఇది మావటి వానికిని, రాజు లెక్కెడి ఏనుగకును, గణపతికిని, గరుత్మంతున కును, నెమలికిని పేరు. |
| స్యాద్వ్రీ హిరాజకం కామ | **వ్రీహిరాజక:** న. ఇది రోగ విశేషముకును, కొర్రల |

| | |
|---|---|
| లికాయాం చీనధాన్యకే। | లోని భేదముకును పేరు. |
| శీతచంపకశబ్దోఽయం స్యా | **శీతచంపక**: పు. ఇది మంగళార్థమైన చందనాదుల |
| దాతర్పణ దీపయోః॥ (220) | మైపూతకును, దీపముకును పేరు. |
| అథోజలకరంకః స్యాన్నా | **జలకరంక** : పు. ఇది టెంకాయకును, మేగము |
| రికేళఫలేఽంబుదే। శంఖే | నకును, శంఖమునకును, తరంగముకును పేరు. |
| జల లతాయాం చ కథ్యతే | |
| జలతాపికః॥ (221) కాకోచీ | **జలతాపిక** : పు. ఇది కాకోచియను చేపకును, |
| రాజశఫరమత్స్యయోః | ఇల్లీసమను చేపకును పేరు. |
| కటఖాదకః॥ఖాదకే కాచక | **కటఖాదక**: పు. ఇది భక్షించువానికిని, గాజుపాత్ర |
| లశే బలిపుష్టే చ జంబుకే॥ | కును, కాకికిని, నక్కకును పేరు. |
| స్యాచ్చిలమీలికా కంఠీ | **చిలమీలికా** : స్త్రీ. ఇది కంటె లేక నాను మొదలగు |
| భేదే ఖద్యోత విద్యుతోః। | కంఠభూషణ విశేషముకును, మిణుగురు పురుగు |
| | కును, మెరుపుకును పేరు. |
| స్యాన్న వఫలికా నవ్యే నవ | **నవఫలికా** : స్త్రీ. ఇది నూతనమైన దానికిని, |
| జాత రజస్స్త్రియాం॥ (223) | క్రొత్తగా సమర్తాడిన పడుచుకును పేరు. |
| స్యాచ్ఛతపర్వికాదూర్వావ | **శతపర్వికా** : స్త్రీ. ఇది గరికె గడ్డికిని, వసకును పేరు. |
| చయో రుపకారికా।పిష్ట | **ఉపకారికా** : స్త్రీ. ఇది నీరు పోసి తడిపిన పిండికిని, |
| భేదే గృహే రాజ్ఞాముపక | గుడారముకును, ఉపకారము చేయుదానికిని పేరు. |
| ర్త్ర్యామపీష్యతే॥ (224) | |
| స్యాద్వ్యవ హారికా లోక | **వ్యవహారికా** : స్త్రీ. ఇది లౌకిక వ్యవహారముకును, |
| యాత్రా సంమార్జ నీంగుదే। | చీపురు కట్టకును, గారచెట్టుకును పేరు. |
| స్యాద్ధేమపుష్పికాయూ | **హేమపుష్పికా** : స్త్రీ. ఇది పచ్చపువ్వుల అడవి మొల్ల |
| | చెట్టుకు పేరు. |
| థ్యాం చంపకే హేమపుష్పకః॥ | **హేమపుష్పక** : పు. ఇది సంపెంగ చెట్టుకు పేరు. |
| ★ అథకాంతష్షడ్వర్ణః ★ | |
| లూతామర్కటకః పుస్త్ర్యాం | **లూతామర్కటక** : పు. ఇది వృక్షవిశేషముకును, |
| నవమాల్యాం ప్లవంగమే। | విరజాజి చెట్టుకును, కోతికిని పేరు. |
| సిందూరతిలకో నాగే సిం | **సిందూరతిలక** : పు. ఇది ఏనుగకును, స్త్రీ. |

దూరతిలకా స్త్రియాం॥
వర్ణవిలోడక శ్లోకచ్ఛాయా
హారిణి కుంభిలే।
మాతులపుత్రకో ధూర్తఫలే
స్యాన్మాతులాత్మజే ॥ (224)
గ్రామమద్గురికా శృంగ్యాం
గ్రామయుద్ధే చ కీర్త్యతే।
స్యాన్మదన శలాకా తు (శా)
సార్యం కామోదయౌషధే॥

సువాసినీ స్త్రీకిని పేరు.
**వర్ణవిలోడక** : పు. ఇది శ్లోకములందలి పదార్థము లను దొంగిలించు వానికిని, కన్నపు దొంగకును పేరు.
**మాతులపుత్రక** : పు. ఇది ఉమ్మెత్తకాయకును, మేనమామ కొడుకుకును పేరు.
**గ్రామమద్గురికా**: స్త్రీ. ఇది ఆడుబొమ్మిడాయికిని, గ్రామయుద్ధముకును పేరు.
**మదనశలాకా**: స్త్రీ. ఇది గోరింకకును, మన్మథోద్దీపకమైన ఔషధముకును పేరు.

★ అథ ఖాంతవర్గః ★

ఖమింద్రియే సుఖే స్వర్గే
శూన్యే బిందౌ విహాయసి।
పురే సంవేదనే క్షేత్రే కులాహ
లఫలే క్వచిత్ ॥ (1)

**ఖ**: న. ఇది నేత్రాదీంద్రియములకును, సుఖమునకును, స్వర్గమునకును, లేకపోవుటకును, అనుస్వారకును, ఆకాశముకును, పట్టణముకును, తెలివికిని (లేక జ్ఞానము) వరిమడికిని, ఆలంబుషమను వృక్షము యొక్క పండుకును పేరు.

★ అథఖాంతో ద్వివర్ణః ★

నఖః కరరుహే షండే
గంధద్రవ్యే సఖం నఖీ।
ముఖం నిస్సరణే వక్త్రే
ప్రారంభోపాయయోరపి॥

**నఖ**: పు. ఇది గోటిచిప్పకును, నపుంసకునకును, స్న. శంఖమనెడు గంధద్రవ్యముకును పేరు.
**ముఖ**: న. ఇది ఇంటిముంగిలి వాకిలి ప్రదేశమునకును, ముఖమునకును, ఆరంభముకును, ఉపాయముకును పేరు.

సుఖం శర్మణి నాకే చ
సుఖా పుర్యాం ప్రచేతసః।
శంఖో నిధ్యంతరే కంబు
లలాటాస్థినఖీషుచ॥ (3)

**సుఖ**: న. ఇది సుఖమునకును, స్వర్గమునకును, స్త్రీ. వరుణదేవుని పట్టణమునకును పేరు.
**శంఖ**: పు. ఇది కుబేరుని శంఖ నిధికిని, శంఖమునకును, ఫాలదేశమందలి యెముకకును, శంఖమనెడి గంధద్రవ్యముకును పేరు.

రేఖా స్యాదల్పకే ఛద్మ
న్యాభోగోల్లేఖయోరపి।

**రేఖా**: స్త్రీ. ఇది తీట కసిందచెట్టుకును, మిషకును, రచనాదుల పరిపూర్ణతకును, గీతకును పేరు.

| | |
|---|---|
| లేఖో లేఖ్యే సురే లేఖా<br>లిపిరాజికయోరపి॥ (4) | **లేఖ** : త్రి. ఇది వ్రాయబడిన దానికిని, పు. దేవత కును, స్త్రీ. వ్రాతకును, పంక్తికిని పేరు. |
| న్యంఖ స్స్వమ్యజ్మనో జ్ఞేపి<br>సామ్నష్టత్ప్రణ వేషు చ। | **న్యంఖ** : పు. ఇది లెస్సకును, మనోహరముకును, సామవేదమందు నియతమైన ప్రణవషట్కముకును పేరు. |
| శిఖా శిఫాయాంచూడాయాం<br>జ్వాలాయామగ్రమాత్రకే ॥ (5)<br>లాంగ లిక్యాం చ శాఖాయాం<br>చూడా యాంచ శిఖండినః। | **శిఖా** : స్త్రీ. ఇది ఊడకును, కేశపాశముకును, అగ్నిజ్వాలకును, కొనకును, తరిగొట్టు చెట్టుకు ను, కొమ్మకును, నెమలి జుట్టుకును పేరు. |
| సఖామిత్రే సహాయే చ | **సఖా** : స్త్రీ. చెలికానికిని, సహాయునకును పేరు. |
| శాఖా పక్షాంతరే భుజే॥ (6)<br>శాఖా వేదవిభాగే చ<br>పాదపాంగేऽంతికే ऽ పి చ। | **శాఖా** : స్త్రీ. ఇది మరియొకపక్షముకును, బుజము కును, వేదవిభాగముకును, కొమ్మకును, సమీప ముకును పేరు . |
| ప్రేంఖా పర్యటనే నృత్యే<br>భవేదశ్వగతావపి॥ (7) | **ప్రేంఖా** : స్త్రీ. ఇది తిరుగులాడుటకును, నాట్యము కును, గుర్రపు నడకకును పేరు. |
| రింఖా గతివిశేషే ऽ పి<br>శూకశింబ్యాం చ నర్తనే। | **రింఖా** : స్త్రీ. ఇది అశ్వగతి విశేషముకును, దూల గొండి చెట్టుకును, నాట్యముకును పేరు. |

**★ అథ ఖాంత త్రివర్ణః ★**

| | |
|---|---|
| త్రిశిఖం శేఖరే విద్యా<br>త్రిశూలే రాక్షసాంతరే॥ (8) | **త్రిశిఖ** : న. ఇది కిరీటముకును, త్రిశూలాయుధ ముకును, పు. త్రిశిఖుడనురావణపుత్రునకును పేరు. |
| సుముఖ స్తార్క్ష్య తనయే<br>ఫణిభేదే చ పండితే। | **సుముఖ** : పు. ఇది గరుడుని పుత్రునకును, సర్ప విశేషముకును, పండితునకును పేరు. |
| దుర్ముఖో నాగరాజేऽ పి<br>ముఖరే వానరాశ్వయోః॥ | **దుర్ముఖ** : పు. ఇది సర్పవిశేషముకును, దుర్భాష లాడువానికిని, కోతికిని, అశ్వముకును పేరు. |
| గోముఖం కుటిలాగారే<br>వాద్యభాండే (చ) విలేపనే। | **గోముఖ** : న. ఇది వంకరగానుండెడు యింటికిని, వాయించుకుండకును, పూతకును పేరు. |
| ప్రముఖః ప్రథమే శ్రేష్ఠే | **ప్రముఖ** : త్రి. ఇది ముఖ్యమైన దానికిని, శ్రేష్ఠమ యిన దానికిని పేరు. |

విశిఖ స్త్రీమరే శరే ॥ (10)
రథ్యాం ఖనిత్ర్యాం విశిఖా
నాళికాయామపి క్వచిత్ ।

**విశిఖ :** పు. ఇది నేజాయను ఆయుధముకును, బాణముకును, స్త్రీ. రాజవీధికిని, తవ్వుగోలకును, గువ్వగుత్తిగకును పేరు.

మయూఖ స్త్విట్కరజ్వాలే

**మయూఖ :** పు. ఇది కాంతికిని, కిరణముకును, అగ్నిజ్వాలకును పేరు.

వైశాఖో రాధమంథయోః ॥

**వైశాఖ :** పు. ఇది వైశాఖమాసముకును, కవ్వముకును పేరు.

★ అథఖాంతశ్చతుర్వర్ణః ★

అగ్నిముఖో ద్విజేదేవే
భల్లాతే చిత్రకే క్వచిత్ ।

**అగ్నిముఖ :** పు. ఇది బ్రాహ్మణునకును, దేవతకును, జీడిచెట్టుకును, చిత్రమూలముకును పేరు.

పంచనఖో గజే కూర్మే

**పంచనఖ :** పు. ఇది యేనుగకును, తాబేటికిని పేరు.

శిలీముఖోఽళిబాణయోః ॥

**శిలీముఖ :** పు. ఇది తుమ్మెదకును, బాణముకును పేరు.

భవే ద్వ్యాఘ్రనఖః కంద
గంధద్రవ్య విశేషయోః ।

**వ్యాఘ్రనఖ :** పు. ఇది దుంపవిశేషముకును, నఖమనెడి గంధద్రవ్యముకును పేరు.

మహాశంఖో నరాస్థ్ని స్యా
న్నిధిసంఖ్యా ప్రభేదయోః ॥

**మహాశంఖ :** పు. ఇది మనుష్యుని యెముకకును, కుబేరుని నిధి విశేషముకును, పది నిఖర్వముల ప్రమాణముకును పేరు.

ఇందులే (రే) ఖాఽమృతా
సోమలతా శశికళా సుచ ।
శశిలేఖా కళాభాగే
వాకుచీ వృత్తభేదయోః ॥ (14)

**ఇందులేఖా :** స్త్రీ. తిప్పతీగకును, సోమలతకును, చంద్రరేఖకును పేరు.

**శశిలేఖా :** స్త్రీ. ఇది చంద్రకళకును, తిప్పతీగెకును, యీ పేరుగల పద్యవృత్తముకును పేరు.

లాంగ లిక్యామగ్నిశిఖా
కుంకుమేఽగ్నిశిఖం మతం ।

**అగ్నిశిఖా :** స్త్రీ. ఇది తరిగొట్టు చెట్టుకును, న. కుంకుమ పువ్వుకును పేరు.

స్యాజ్జటాయాం బద్ధశిఖా
బాలే బద్ధశిఖో మతః ॥ (15)

**బద్ధశిఖా :** స్త్రీ. ఇది జడకును, పు. బాలునకును పేరు.

★ అథ ఖాంతః పంచవర్ణః ★

స్యాన్మలినముఖః ప్రేతే
గోలాంగూలేఽనలే ఖలే ।

**మలినముఖ :** పు. ఇది పీనుగకును, కొండ ముచ్చుకును, అగ్నికిని, దుర్జనునకును పేరు.

అథ శీతమయూఖోఽపి
శశాంక ఘనసారయోః॥ (16)

**శీతమయూఖ:** పు. ఇది చంద్రునకును, కర్పూరమునకును పేరు.

సర్వతోముఖమాఖ్యాత
మంతరిక్షే చ పాథసి।విధి
క్షేత్రజ్ఞరుద్రేషు కథిత స్సర్వ
తోముఖః॥(17)

**సర్వతోముఖ:** న. ఆకాశముకును, ఉదకముకును, పు. బ్రహ్మకును, జీవునకును, శివునకును పేరు.

## ★ అథ గాంతవర్గః ★

గౌః స్వర్గేవృషభే రశ్మౌ
వజ్రే చంద్రమసిస్మృతః।
అర్జునీ నేత్ర దిగ్బాణ భూ
వాగ్వారిషు గౌర్మతా ॥ (1)

**గౌః:** పు. ఇది స్వర్గమునకును, వృషభమను గంధద్రవ్యముకును, కిరణముకును, వజ్రాయుధముకును, చంద్రునకును, స్త్రీ. గోవుకును, నేత్రముకును, దిక్కునకును బాణముకును, భూమికిని, వాక్కుకును, జలమునకును పేరు.

## ★ అథ గాంతో ద్వివర్గః ★

అగఃశైలే ద్రుమే భానౌ
నగవత్పవనాశనే।
ఖగస్సూర్యే గ్రహే దేవే
మార్గణే చ విహంగమే॥ (2)

**అగ :** పు. ఇది పర్వతమునకును, వృక్షముకును
**నగ :** సూర్యునకును, సర్పమునకును పేరు.
**ఖగ :** పు. ఇది సూర్యునకును, శుక్రాది గ్రహమునకును, దేవతకును, బాణముకును, పక్షికిని పేరు.

భగమైశ్వర్యమాహాత్మ్య
జ్ఞానవైరాగ్యయోనిషు।
యశోవీర్యప్రయత్నేచ్ఛా
శ్రీధర్మరవిముక్తిషు॥ (3)

**భగ:** న. ఇది ఐశ్వర్యముకును, ప్రభావముకును, జ్ఞానముకును, విరక్తికిని, ఉపస్థకును, కీర్తికిని, పరాక్రమముకును, ప్రయత్నముకును, కోరికకును, సంపదకును, ధర్మముకును, ద్వాదశాదిత్యులలో నొకనికిని, మోక్షముకును పేరు.

యుగం కృతాదౌ యుగళే
వృద్ధినామౌషధేఽపి చ।
యుగం హస్త చతుష్కేఽపి
రథ సీ రాంగ యోర్యుగః॥ (4)

**యుగ:** న. ఇది కృతాది నాలుగు యుగములకును, జంటకును, బుద్ధివృద్ధియను ఓషధికిని, నాలుగు చేతుల ప్రమాణముకును, పు. రథముయొక్క నాగలియొక్క కాడికిని పేరు.

మృగః పశౌ కురంగే చ
కరినక్షత్రభేదయోః।యాచ్ఞా

**మృగ :** పు. ఇది పశుమాత్రమునకును, పేడికిని, గజ విశేషముకును, మృగశిరా నక్షత్రముకును;

యాం మృగయాయాం చ
మృగీ స్యాద్వనితాంతరే॥ (5)

యాచనకును, వేటకును, ఈ. స్త్రీ. పుళహుడను మునీశ్వరుని భార్యకును పేరు.

భృగుః శుక్రే ప్రపాతే చ
జమదగ్నౌ పినాకిని।

**భృగు:** పు. ఇది శుక్రాచార్యులకును, కొండచరియకును, జమదగ్నిమునికిని, ఈశ్వరునకును పేరు.

భాగో రూపార్ధకే ప్రోక్తో
భాగధేయైకదేశయోః॥ (6)

**భాగ:** పు. ఇది నాటకాదుల భాగముకును, భాగ్యముకును, ఏక దేశముకును పేరు.

నాగం తు సీసకే రంగే
స్త్రీబంధే కరుణాంతరే।
నాగః పన్నగ మాతంగ-
క్రూరాచారిషు తోయదే॥ (7)
నాగకేసర పున్నాగ
నాగదంతకముస్తకే।
దేహానిలప్రభేదే చ
శ్రేష్ఠే స్యాదుత్తరస్థితః॥ (8)

**నాగ:** న. ఇది సీసముకును, తగరముకును, స్త్రీల రతిబంధ విశేషముకును, నాగకరణమునకు పేరు. పు. సర్పముకును, యేనుగకును, క్రూరమయిన ఆచారముగలవానికిని, మబ్బుకును, నాగకేసర వృక్షముకును, పొన్నచెట్టుకును, గజదంతముకును, తుంగముస్తకును, నల్లని శరీర వాయు విశేషముకును, సమాసోత్తరపదమయినపుడు శ్రేష్ఠ వాచకమునకును పేరు.

రాగో ను రక్తౌ మాత్సర్యే
క్లేశాదౌ రోహితాదిషు।
గాంధారాదౌ నృపే రాగ
స్త్యాగో వర్జన దానయోః॥ (9)

**రాగ:** పు. ఇది అనురాగముకును, పరాభివృద్ధిని సహించకుండుటకును, క్లేశాదులకును, యెరుపు మొదలయిన వాటికిని, సింధూరము, **బాలింత** పాలు మొదలైన ధాతువులకును, రాగరాజుకును పేరు. **త్యాగ:** పు. ఇది విడుచుటకును, యీవికిని పేరు.

భోగస్సుఖేధనే చాహే
శ్శరీరఫణయోస్మృతః।
పాలనేఽభ్యవహారే చ
నిర్వేశేపణ్య యోషితాం॥ (10)

**భోగ :** పు. ఇది సుఖముకును, ధనముకును, సర్పముయొక్క శరీరముకును, పడగకును, పరిపాలించుటకును, భుజించుటకును, జీతములనిచ్చి వెలయాండ్రనుంచుటకును పేరు.

యోగోఽపూర్వార్థ సంప్రాప్తౌ
సంగతి ధ్యానయుక్తిషు।
వపుస్థైర్యే ప్రయోగే చ
విష్కంభాదిషు భేషజే॥ (11)

**యోగ :** పు. ఇది పూర్వమందులేని ద్రవ్యాదులు తనకు సంభవించుటకును, కూటమికిని, ధ్యానించుటకును, కూర్చుటకును, శరీర స్థైర్యముకును, ప్రయోగించుటకును, విష్కంభాది పంచాంగ

విస్రబ్ధఘాతి నిర్ద్రవ్యో
పాయసంనహనేష్వపి।
కార్మణేऽపి చ యోగస్స్యా

యోగములకును, ఔషధయోగముకును, విశ్వాస ఘాతకునకును, ధనముకును, ఉపాయముకును, కవచాదిసన్నాహముకును, మూలికల వలన స్తంభనమోహనాదులను జేయుటకును పేరు.

ద్రోగః కుష్ఠౌషధే గదే॥

**రోగ :** పు. ఇది కుష్ఠరోగమును నివారించు ఔషధముకును, రోగముకును పేరు.

వేగో జవే ప్రవాహే చ
మహాకాలఫలేऽపిచ।
పూగస్తు క్రముకే బృందే
చంగశ్శోభనదక్షయోః॥ (13)

**వేగ:** పు. ఇదివేగముకును, నదీ ప్రవాహముకును, ముషిణి పండుకును పేరు.
**పూగ:** పు. ఇది పోకచెట్టుకును, సమూహముకును పేరు. **చంగ :** పు. ఇది శుభమునకును, సమర్థునకును పేరు.

అంగం గాత్రాంతికోపాయ
ప్రతీకేష్వ ప్రధానకే।

**అంగ :** న. ఇది శరీరమునకును, సమీపముకును, ఉపాయమునకును, అవయవమునకును, అప్రధానమైన దానికిని పేరు.

అఙ్గా (అంగో) దేశవిశేషే
స్యురంగసంబోధనేऽవ్యయం॥
ఇంగస్స్యాదద్భుతే జ్ఞానే
జంగమేంగితయోరపి।

**అంగాః:** పు. ఇది నిత్యబహువచనం, అంగదేశముకును, అవ్య. సంబోధనకును పేరు.
**ఇంగ :** పు. ఇది ఆశ్చర్యముకును, జ్ఞానముకును, న. మనుష్య, పశు, పక్ష్యాదులకును, మనోభావమునకును పేరు.

టంగః కృపాణభేదేస్యా
జ్జంఘాయాం చ ఖనిత్రకే॥
తుంగః పున్నాగ నగయో
స్తుంగస్స్యాదున్న తేऽన్యవత్।
బర్బ రానిశయోస్తుంగీ
వంగం సీసకరంగయోః॥
వంగః కార్పాసవార్తాక
దేశ భేదేషు కీర్తితః।
లంగస్సంగే చ షిడ్గేచ

**టంగ :** పు. ఇది ఖడ్గవిశేషముకును, పిక్కకును, తవ్వగోలకును పేరు.
**తుంగ :** పు. ఇది పొన్నచెట్టుకును, పర్వతముకును, వి. ఉన్నతమైన దానికిని, ఈ. స్త్రీ. వాయింటు చెట్టుకును పసపునకును పేరు.
**వంగ :** న. ఇది సీసమునకును, తగరమునకును, పు. ప్రత్తిచెట్టుకును, వంగచెట్టుకును, వంగదేశముకును పేరు.
**లంగ :** పు. ఇది కలయుటకును, విటునకును పేరు.

| | |
|---|---|
| వ్యంగో హీనాంగభేకయోః॥ | **వ్యంగ :** పు. ఇది అంగహీనునకును కప్పకును పేరు. |
| భంగస్తరంగే రుగ్భేదే<br>భేదే జయవిపర్యయే।<br>భంగాశణాఖ్యసస్యేఽపి | **భంగ:** పు. ఇది తరంగముకును, వాతరోగవిశేషముకును, భేదముకును, పరాజయమునకును. స్త్రీ. జనుముకును పేరు. |
| భృంగో ధూమ్యాట షిద్గయోః॥ (18)<br>మధువ్రతేఽపి భృంగంతు<br>కేశరాజగుడత్వచోః। | **భృంగ:** పు. ఇది కూకటి మూకపిట్టకును, విటునకును, తుమ్మెదకును, న. గుంటగలగర చెట్టుకును, లవంగ చెట్టుకును పేరు. |
| రంగోర (ణేఖలే) ణస్థలే<br>రాగే నాట్యేరంగం త్రపుణ్యపి॥ (19) | **రంగ:** పు. ఇది యుద్ధస్థలముకును, రక్తిమకును, నాట్యముకును, న. తగరముకును పేరు. |
| లింగం చిహ్నేఽను మానేపి<br>సాంఖ్యోక్త ప్రకృతావపి।<br>శివమూర్తి విశేషే చ<br>మేహనే చ ప్రచక్షతే॥ (20) | **లింగ :** పు. ఇది గురుతుకును, అనుమాన ఖండమందలి సాధ్యసాధకమగు హేతువుకును, సాంఖ్యశాస్త్రమందు చెప్పబడిన ప్రకృతికిని, శివలింగముకును, శిశ్నముకును పేరు. |
| శృంగం ప్రభుత్వే శిఖరే<br>చిహ్నే క్రీడాంబుయంత్రకే।<br>విషాణోత్కర్షయో స్సానౌ<br>శృంగస్స్యాత్కూర్చశీర్షకే॥<br>శృంగీవిషాయా వృషభే<br>స్వర్ణమీనవిశేషయోః। | **శృంగ:** న. ఇది ప్రభుత్వముకును, పర్వత శిఖరముకును, గురుతుకును, చిమ్మన క్రోవికిని, కొమ్ముకును, ఉత్కర్షకును, కొండచరియకును, పు. జీవకమను గ్రంథద్రవ్యముకును, స్త్రీ. అతివసకును, ఋషభమను గ్రంధ్యద్రవ్యముకును, అలంకార రూపమయిన బంగారుకును, మద్గురియను ఆడుచేపకును పేరు. |
| గాంగస్తు గంగాసంభూతె<br>భీష్మే శక్తిధరేఽపిచ॥(22) | **గాంగ :** త్రి. ఇది గంగయందు పుట్టిన దానికిని, పు. భీష్మునకును, కుమారస్వామికిని పేరు. |
| పింగః పిశంగే పింగీ తు<br>శమ్యాం పింగం తు బాలకే।<br>రామతే నాళికాయాంచ<br>పింగా గోరోచనోమయోః॥ | **పింగ :** పు. ఇది పింగళ వర్ణముకును, షం. స్త్రీ. జమ్మిచెట్టుకును, న. బాలునకును, స్త్రీ. ఇంగువకును, గొట్టముకును, గోరోచనమునకును, పార్వతికిని పేరు. |
| ఖడ్గో గండక శృంగాని<br>బుద్ధభేదేషు గండకే। | **ఖడ్గ:** పు. ఇది ఖడ్గమృగము కొమ్ముకును, కత్తికిని, బుద్ధ విశేషునకును, ఖడ్గమృగముకును పేరు. |

దుర్గస్స్యాద్దుర్గమే దుర్గా
గౌరీ నీలికయోరపి ॥ (24)

**దుర్గ :** త్రి. ఇది పొందశక్యముగాని దానికిని, స్త్రీ. పార్వతికిని, నీలి చెట్టుకును పేరు.

సర్గస్స్యాన్నిశ్చయాధ్యాయ
మనోత్సాహాత్మసృష్టిషు ।

**సర్గ :** పు. ఇది నిశ్చయముకును, పురాణాదుల యందలి అధ్యాయముకును, మోహముకును, ఉత్సాహముకును, జీవసృష్టికిని పేరు.

మార్గోమృగమదే మాస
ప్రభేదేన్వేషణా ధ్వనోః ॥ (25)
(వాచ్యవన్మృగసంబంధే
మార్గోऽపి మృగశీర్షభే)

**మార్గ:** పు. ఇది కస్తూరికిని, మార్గశిరమాసముకును, వెతకుటకును, మార్గము కును, త్రి. మృగ సంబంధమయిన దానికిని, పు. మృగశిరా నక్షత్రము కును పేరు) ఇది అధిక పాఠము.

శార్ఙ్గం కార్ముకమాత్రేపి
విష్ణోరపి శరాసనే ।

**శార్ఙ్గం :** న. ఇది సామాన్య ధనస్సుకును, విష్ణు ధనస్సుకును పేరు.

వల్గుశ్ఛాగే మనోజ్ఞే తు
వల్గుభాషితమన్యవత్ ॥ (26)

**వల్గు:** పు. ఇదిమేకపోతుకును, త్రి. మనోహరమైన దానికిని పేరు.

ఫల్గుః ప్రొక్తామలప్యాంచ
నిస్సారే ఫల్గు వాచ్యవత్ ।

**ఫల్గు :** స్త్రీ. ఇది కుక్క మేడి చెట్టుకును, త్రి. సారములేని దానికిని పేరు.

శృంగీ వటామ్రాతకయోః
పర్కట్యామపి విశ్రుతా ॥ (27)

**శృంగీ :** స్త్రీ. ఇది మర్రిచెట్టుకును, అంబాళపు చెట్టుకును, జువ్విచెట్టుకును పేరు.

★ అథ గాంతో త్రివర్ణః ★

పన్నగః పద్మకాష్ఠే స్యా
త్పన్నగోऽపి భుజంగమే ।

**పన్నగ:** పు. ఇది తామరకాడకును, సర్పముకును పేరు.

ప్లవగో వానరే భేకే
సారథౌ చోష్ణదీధితేః ॥ (28)

**ప్లవగ :** పు. ఇది కోతికిని, కప్పకును, అనూరున కును పేరు.

జిహ్మగో మందగే సర్పే

**జింహగ :** పు. ఇది మెల్లగాపోవువానికిని, పాము కును పేరు.

విహగశ్శాశుగే ఖగే ।

**విహగ :** పు. ఇది బాణముకును, పక్షికిని పేరు.

సర్వగం సలిలే ఖ్యాతం స
ర్వగశ్శంకరే వి (ధౌ) భౌ ॥

**సర్వగ :** న. ఇది జలముకును, పు. శివునకును, ప్రభువుకును పేరు.

ఆభోగో వరుణచ్ఛత్రే

**ఆభోగ :** పు. ఇది వరుణదేవుని గొడుగుకును,

| | |
|---|---|
| పూర్ణ తాయత్నయోరపి। | పరిపూర్ణత్వముకును, ప్రయత్నముకును పేరు. |
| ఆయోగో వ్యాపృతౌ గంధ<br>మాల్యోపహారరోధయోః॥ | **ఆయోగ** : పు. ఇది వ్యాపారముకును, గంధ మాల్యాదుల కానుకకును, తీరమునకును పేరు. |
| అయోగో విధురే కూటే<br>విశ్లేషే కఠినోద్యమె। | **అయోగ** : పు. ఇది పెండ్లాము చచ్చిన వానికిని, కపటమునకును, వియోగముకును, కఠిన ప్రయత్నముకును పేరు. |
| ఆశుగో మారుతేబాణే<br>ప్యుద్వేగం క్రముకీఫలే॥ (31) | **ఆశుగ** : పు. ఇది వాయువకును, బాణమునకును పేరు. |
| ఉద్వేగస్తిమితే క్లేశే<br>భయేమందరగామిని।<br>ఉద్వేగోప్యుద్బాహులకో<br>ద్వే జనోద్గమనే షుచ॥ (32) | **ఉద్వేగ**: న. ఇది పోకకాయకును, పు. నిశ్చలత్వముకును, దుఃఖముకును, భయముకును, మెల్లగాపోవు వానికిని, ఉన్నతమైన భుజములుగలవానికిని, ఊర్ధ్వ భాగముగ దలించుటకును, పైకి లేచుటకును పేరు. |
| సంభోగ స్సురతే భోగే<br>స్యాత్తుండే జినశాసనే। | **సంభోగ** : పు. ఇది రతికిని, చందనతాంబూలాదిని భోగముకును, గజతుండముకును, బుద్ధుని శాసనమునకును పేరు. |
| పరాగః పుష్పరజసి<br>ధూళిస్నానీయయోరపి॥ (33)<br>గిరిప్రభేదే విఖ్యాతా<br>వుపరాగేచ చందనే। | **పరాగ**: పు. ఇది పుష్పాదికిని, ధూళికిని, స్నానార్థ మయిన నలుగుపిండి మొదలయిన వాటికిని, పర్వత విశేషముకును, ఖ్యాతికిని, సూర్యాదిగ్రహణముకును, మంచి గంధముకును పేరు. |
| ప్రయాగస్తీర్థ భేదేస్యా<br>ద్యజ్ఞేశతమఖాశ్వయోః॥ (34) | **ప్రయాగ** : పు. ఇది ప్రయాగ క్షేత్రముకును, యజ్ఞముకును, ఇంద్రునకును, గుర్రముకును పేరు. |
| ప్రయోగః కార్మణే ప్రోక్తః<br>ప్రయుక్తౌ చ నిదర్శనే। | **ప్రయోగ**: పు. ఇది మూలికలచేత స్తంభనమోహనోచ్చాటనాదులను జేయుకర్మకును, ప్రయోజనముకును, దృష్టాంతముకును పేరు. |
| వాతిగః కథితో భంట్యాం<br>ధాతువాదిని వాచ్యవత్॥ (35) | **వాతిగ** : పు. ఇది నేలములగ చెట్టుకును, ధాతు వాదము నేర్చిన వానికిని పేరు. |
| తడాగస్తు జలాధార విశేషే<br>(కటకేపిచ) యంత్రకూటకే। | **తడాగ** : పు. ఇది చెరువుకును, వ్యాఘ్రాదులను పట్టు బోనుకును పేరు. |

పున్నాగః పురుషశ్రేష్ఠే
పాండునాగే సితోత్పలే॥
జాతీఫలేపి పున్నాగం
నిసర్గశ్శీలసర్గయోః।
విసర్గ స్త్యాగవద్దానే
విసర్గోమలనిర్గమే ॥ (38)
విసర్జ నీయేప్యయన
ప్రభేధే చ విభావసోః।
ఉత్సర్గో వర్జనే త్యాగే
సామాన్యన్యాయదానయోః॥
త్రివర్గో ధర్మకామార్థే
త్రిఫలాయాం కటుత్రికే।
వృద్ధిస్థానక్షయే సత్వరజ
స్తమసి కథ్యతే ॥(39)
తాతగుః క్షుద్రతా తే స్యా
జ్జనకస్య హితేపి చ।
అనంగో మదనే నంగ
మాకాశమనసోర్మతం॥ (40)
మృదంగః పటహే ఘోషే
భుజంగ ష్షిద్గసర్పయోః।
పంతగ శ్శలభేశాలి
ప్రభదేవిహగే రవౌ॥(41)పతంగం
పారదే (ప్రోక్తం) క్యాపి
నరంగం తు వరండకే।
శేఫే నరంగ మప్యాహు
ర్నిషంగస్సంగతూణయోః॥
విడంగం కృమిహె ఖ్యాతం
విడంగో నాగరేన్యవత్।

**పున్నాగ :** పు. ఇది పురుష శ్రేష్ఠునకును, తెల్లతాచు పాముకును, తెల్లకలువకును న. జాజికాయకును పేరు.

**నిసర్గ :** పు. ఇది స్వభావముకును, సృష్టికిని పేరు.

**విసర్గ:** పు. ఇది త్యాగశబ్దమువలెను, దానముకును, మలము విడుచుటకును, విసర్జనీయకును, సూర్యుని ఆయన విశేషముకును పేరు.

**ఉత్సర్గ :** పు. ఇది హింసకును, విడుచుటకును, సామాన్య విధికిని, దానముకును పేరు.

**త్రివర్గ :** పు. ఇది ధర్మార్థకామములకును, కరక, పుశిరిగ, తాణికాయలకును, శొంఠి, పిప్పలి, మిరియాలకును, వృద్ధి, స్థానక్షయములకును, సత్వ, రజ, స్తమోగుణములకును పేరు.

**తాతగు :** పు. ఇది పినతండ్రికిని, తండ్రియొక్క స్నేహితునకును పేరు..

**అనంగ :** పు. ఇది మన్మథునకును, న. ఆకాశముకును, మనస్సునకును పేరు.

**మృదంగ :** పు. ఇది మద్దెలకును, ధ్వనికిని పేరు.

**భుజంగ:** పు. ఇది విటునకును, పాముకును పేరు.

**పతంగ :** పు. ఇది మిడుతకును, సస్యవిశేషముకును, పక్షికిని, సూర్యునకును, న. పాదరసమునకును పేరు.

**నరంగ:** న. ఇది ముఖరోగ విశేషముకును, శిశ్నముకును పేరు.

**నిషంగ:** పు. ఇది కలయికకును, అమ్ముల పొదికిని, పేరు.

**విడంగ :** న. ఇది వాయువిడంగముకును, త్రి.

| | |
|---|---|
| | నేర్పరికిని పేరు. |
| కళింగః పూతికరజే<br>ధూమ్యాటే నీవృదంతరే॥ (43)<br>కళింగం కౌటజఫలే<br>కళింగా యోషితి స్మృతా। | **కళింగ :** పు. ఇది నెమలడుగు చెట్టుకును, కూకటి మూగపిట్టకును, కళింగ దేశముకును, న. కొడిశ పండుకును, స్త్రీ. మగువకును పేరు. |
| కాళింగో భూమికర్కారౌ<br>దంతావళభుజంగయోః॥ (44)<br>కాళింగీ రాజకర్కట్యాం | **కాళింగ:** పు. ఇది నేల గుమ్మడి చెట్టుకును, యేనుగకును, సర్పముకును, ఈ. స్త్రీ. నక్కదోస పాదుకును పేరు. |
| ధారాంగః ఖడ్గతీర్థయోః। | **ధారాంగ :** పు. ఇది కత్తికిని, క్షేత్రముకును పేరు. |
| అపాంగ మంగహీనే స్యా<br>న్నేత్రాంతే తిలకేపిచ॥ (45) | **అపాంగ :** త్రి. ఇది అవయవహీనమ్మైన దానికిని, పు. నేత్రాంతముకును, నుదుటి బొట్టుకును పేరు. |
| వరాంగం యోనిమాతంగ<br>మస్తకేషు గుడత్వచి। | **వరాంగ :** న. ఇది భగముకును, యేనుగకును, శిరస్సునకును, లవంగపు చెట్టుకును పేరు. |
| పత్రాంగం పద్మకే భూర్జే<br>పత్రాంగం రక్తచందనే॥ (46) | **పత్రాంగ :** పు. ఇది ఏనుగ శరీమందలి పొడమచ్చలకును, భజపత్రి చెట్టుకును, యెర్రచందనముకును పేరు. |
| రథాంగ శ్చక్రవాకేఽపి<br>రథాంగం చక్ర ఇష్యతే। | **రథాంగ :** పు. ఇది చక్రవాక పక్షికిని, న. చక్రముకును పేరు. |
| రక్తాంగం విద్రుమే భౌమే<br>విద్యాత్కాం పిల్లధీరయోః॥(47)<br>రక్తాంగమపిజీవంత్యాం | **రక్తాంగ:** న. ఇది పగడముకును, పు. అంగారకునకును, న. కాంపిల్యమను ఓషధికిని, కుంకుమకును, న. పాలకూరకును పేరు. |
| మాతంగ శ్శ్వపచే గజే। | **మాతంగ:** పు. ఇది మాదిగవానికిని, యేనుగకును పేరు. |
| హేమాంగో ద్రుహిణే తార్క్ష్యే | **హేమాంగ:** పు. ఇది బ్రహ్మకును, గరుడునకును పేరు. |
| నారంగం పిప్పలీరసే॥(48)<br>నాగరంగే విటేజంతౌ<br>యమజేపి ప్రకీర్తితః। | **నారంగ :** న. ఇది పిప్పలి రసముకును, పు. నారింజచెట్టుకును, విటునకును, ప్రాణికిని, కవలపిల్లలకును పేరు. |
| సారంగ శ్చాతకే భృంగే<br>కురంగే చ మతంగజే॥ (49) | **సారంగ :** పు. ఇది వానకోయిలకును, తుమ్మెదకును, లేడికిని, ఏనుగకును, సారంగ పక్షికిని, |

పక్షిభేదే చ సారంగ
స్సారంగశ్శబలే (త్రిషు)ऽన్యవత్।
ప్రియంగుః ఫలినీ కంగు
పిప్పలీ రాజికాసు చ॥ (50)
నీలంగుః క్రిమిజాతౌ స్యా
ద్భృంభరాళీ మసారయోః।
తురంగీ చాశ్వగంధాయాం
తురంగశ్చిత్తవాజినోః॥(51)
చక్రాంగీ కటురోహిణ్యాం
చక్రాంగో మానసౌకసి।

★ అథ గాంతశ్చతుర్వర్ణః ★

ఈహామృగో వృకే జంతౌ
పక్షిభేదే రూపకస్య చ॥(52)
మల్లనాగోऽభ్రమాతంగే
వాత్స్యాయనమునావపి।
ఉపరాగః పరీవాదే రాహు
గ్రస్తార్క చంద్రయోః॥(53)
దుర్నయే గ్రహకల్లోలేऽ
పవర్గస్త్యాగ మోక్షయోః।
క్రియావసానసాఫల్యే
ష్వపవర్గః ప్రయుజ్యతే॥ (54)
ఉపసర్గః స్మృతో రోగ
భేదోప ప్లవయోరపి।
సమాయోగస్తు సంయోగే
సమవాయే ప్రయోజనే॥(55)
సంప్రయోగం రతే విద్యా
దన్వితౌ కార్మణేऽపి చ।

త్రి. శబలవర్ణముకును పేరు.

**ప్రియంగు** : పు. ఇది ప్రేంకణపు చెట్టుకును, కొఱ్ఱ ధాన్యముకును, పిప్పలిచెట్టుకును, నల్లావాలకును పేరు.
**నీలంగు** : పు. కీటకమునకును, తుమ్మెదచాలు కును, ఇంద్రనీలమణికిని పేరు.
**తురంగీ:** స్త్రీ. ఇది పెన్నేరు గడ్డకును, పు. మనస్సున కును, గుఱ్ఱముకును పేరు.
**చక్రాంగీ:** స్త్రీ. ఇది కటుకరోహిణికిని, పు. హంసకు ను పేరు.

**ఈహామృగ:** పు. ఇది తోడేలుకును, జంతువకును, నాటక విశేషముకును పేరు.
**మల్లనాగ:** పు. ఇది ఐరావతముకును, వాత్స్యాయ నుడను మునికిని పేరు.
**ఉపరాగ:** పు. ఇది నిందించుటకును, చంద్రసూర్య గ్రహణములకును, దుర్నీతికిని, రాహుగ్రహము కును పేరు.
**అపవర్గ** : పు. ఇది విడుచుటకును, ముక్తికిని, కార్యావసానమందు పొందబడిన ఫలముకును పేరు.
**ఉపసర్గ:** పు. ఇది రోగవిశేషముకును, ఉపద్రవము కును పేరు.
**సమాయోగ :** పు. ఇది కలయుటకును, సమూహ ముకును, ప్రయోజనమునకును పేరు.
**సంప్రయోగ :** పు. ఇది సురతముకును, సంబంధ ముకును, మూలికలచేత స్తంభన, మోహనాదులను జేయుటకును పేరు.

దీర్ఘాధ్వగ శ్శృంఖలకే
లేఖహారె తు భెద్యవత్॥(56)

**దీర్ఘాధ్వగ** : పు. ఇది ఒంటెకును, త్రి. జాబులు, మోయువానికిని పేరు.

అభిషంగస్తు శపథే
స్యాదాక్రోశే పరాభవే।

**అభిషంగ** : పు. ఇది ప్రతిజ్ఞచేయుటకును, తిట్టుట కును, తిరస్కారముకును పేరు.

ఛత్రభంగస్తు వైధవ్యే
స్వాతంత్ర్య నృపనాశయోః॥

**ఛత్రభంగ** : పు. ఇది ముండమోయుటకును, స్వాతంత్ర్యముకును, ప్రభునాశముకును పేరు.

కటభంగస్తు సస్యానాం
హస్తభేదే నృపాత్యయే।

**కటభంగ** : పు. ఇది హస్తప్రమాణముగా సస్యము లను గోయుటకును, ప్రభునాశముకును పేరు.

★ అథ గాంతః పంచవర్ణః ★

కథాప్రసంగో వాతూలే
విషవైద్యేఽపి వాచ్యవత్॥ (58)

**కథాప్రసంగ** : పు. వాయుసమూహముకును, విషవైద్యునికిని పేరు.

నాడీతరంగ ఇత్యాఖ్యా
హిండకే రతహిండకే।

**నాడీతరంగ** : పు. ఇది సంచారముచేయు వానికిని విటగానికిని పేరు.

★ అథ ఘాంతవర్గ ః ★

ఘోఘుర్ఘరే చ ఘంటాయాం
కాంచికాఘాతయోరపి।

**ఘః** : పు. ఇది గుడ్లగూబకును, ఘంటకును, మొలనూలుకును, ప్రహారముకును పేరు.

★ అథఘాంతో ద్వివర్ణః ★

ఆఘం తు వ్యసనే ప్రోక్త
మఘం పాతక దుఃఖయోః॥
అర్ఘః పూజా విధౌ మూల్యే
ష్వం (ఘ్రి) ఘిః పాదద్రుమూలయోః।
ఓఘో బృందే పయోవేగే
దృతనృత్యోపదేశయోః॥
ఓఘః పరంపరాయాంచ
మేఘుస్స్యాన్ముస్తకే ఘనే।
లఘుర్మనోజ్ఞనిస్సారా
గురుషు ప్రథితో లఘు॥(3)
కృష్ణాగురుణిశీఘ్రేచ

**ఆఘ** : న. ఇది దూత్యము మొదలయిన కష్టము కును, పాపముకును, దుఃఖముకును పేరు.

**అర్ఘ** : పు. ఇది పూజా విధికిని, ఖరీదుకును పేరు.

**అంఘ్రి** : పు. ఇది పాదమునకును, వేరుకును పేరు.

**ఓఘ** : పు. ఇది సమూహముకును, జలప్రవాహ ముకును, దురితముగా నృత్యము చేయుటకును, మంత్రాదులను జెప్పుటకును, వరుసకును పేరు.

**మేఘ** : పు. ఇది తుంగముస్తకును, మబ్బుకును పేరు.

**లఘు** : త్రి. ఇది మనోహరమైన దానికిని, సారము లేనిదానికిని, నీచమైన దానికిని, న. కృష్ణాగురు కును, శీఘ్రముకును, స్త్రీ. స్పృక్కయనెడు గంధ్య

| | |
|---|---|
| స్ఫుక్యా-యాం చ స్మృతాలఘుః। | ద్రవ్యముకును పేరు. |
| ఉద్ఘస్స్యాత్పావకే హస్త | **ఉద్ఘ:** పు. ఇది అగ్నికిని, అరచేతికిని, శరీరవాయువ |
| పుటకే దేహజానిలే॥ (4) | కును పేరు. |
| మోఘాపి పాటలాయాం | **మోఘా :** స్త్రీ. ఇది పాటల వృక్షముకును, త్రి. |
| స్యాన్మోఘో నిష్ఫలదీనయోః। | నిష్ఫలమైన దానికిని, దీనమైన దానికిని పేరు. |
| మఘామఘీ చ నక్షత్రే | **మఘా, మఘీ :** స్త్రీ. ఇది మఘా నక్షత్రము పేరు. |
| భేషజే చ యథాక్రమం॥ (5) | స్త్రీ. ఇది ఓషధి విశేషము పేరు. |
| శ్లాఘా మతా ప్రశంసాయాం | **శ్లాఘా :** స్త్రీ. ఇది స్తుతికిని, పరిచారము (ఊడిగ |
| పరిచర్యాభిలాషయోః। | ము) ఇచ్ఛకును పేరు. |

**★ అథఘాంతో త్రివర్ణః ★**

| | |
|---|---|
| అనఘో నిర్మలాపాప | **అనఘ:** త్రి. ఇది స్వచ్ఛమైన దానికిని, నిర్దుష్టమైన |
| మనోజ్ఞేష్వభిధేయవత్॥(6) | దానికిని, మనోహరమైన దానికిని పేరు. |
| పలిఘః కాచకలశ | **పలిఘ :** పు. ఇది గాజు పాత్రకును, కుండకును, |
| ఘటప్రాకారగోపురే। | ప్రాకారముకును, బహిర్ద్వారముకును పేరు. |
| పరిఘో యోగభేదే స్యా | **పరిఘ :** పు. ఇది 19వ పంచాంగయోగముకును |
| న్ముద్గరే ర్గళఘాతయోః॥ (7) | ఆయుధ విశేషముకును, అడ్డుకర్రకును, హింస |
| | కును పేరు. |
| ప్రతిఘః ప్రతిఘాతే చ | **ప్రతిఘ :** పు. ఇది మారణమునకును, క్రోధము |
| రోషే చ ప్రతిఘో మతః। | కును పేరు. |
| కాచిఘః కాంచనే ప్రోక్త | **కాచిఘ :** పు. ఇది బంగారుకును, తండ్రిలేని |
| శ్చేమండే మోషకేపి చ॥ | వానికిని, ఎలుకకును పేరు. |
| మహార్ఘస్తు మహామూల్యే | **మహార్ఘ :** పు. ఇది గొప్ప విలువకును, లావుకపిట్ట |
| (మణౌ) తథా లావకపక్షిణి। | కును పేరు. |
| నిదాఘో గ్రీష్మకాలేస్యా | **నిదాఘ :** పు. ఇది గ్రీష్మ ఋతువుకును, వేడిమికిని, |
| దుష్ణస్వేదాంబునోరపి॥(9) | చెమటకును పేరు. |
| ఉల్లాఘస్తు శుచౌ హృష్టే | **ఉల్లాఘ :** త్రి. ఇది శుచియయిన దానికిని, సంతో |
| దక్షనిరోగయోరపి। | షించిన దానికిని, రోగములేని దానికిని పేరు. |
| సర్వౌఘో గురువేగార్థ | **సర్వౌఘ :** పు. ఇది గొప్ప వేగముకును, సర్వసేవ |

సర్వసన్న హనార్థయోః॥ (10) లున్నూ యుద్ధసన్నాహమగుటకును పేరు.

ఆమోఘ స్సఫలే ऽ మోఘా
విడంగా భయయోరపి।

**అమోఘ :** త్రి. సఫలమైన దానికిని, స్త్రీ. వాయువిడంగముకును, కరకచెట్టుకును పేరు.

**★ అథ చాంతవర్గః ★**

కచః కేశే గురోః పుత్రే
బంధే శుష్క వ్రణే కచః।
కచా కరిణ్యాం

**కచ:** పు. ఇది జుట్టుకును, బృహస్పతి కుమారునకును, బంధముకును, ఎండిన కురుపునకును, స్త్రీ. ఆడయేనుగుకును పేరు.

కాచస్తు మణౌ శిక్యే మృదంతరే। (1) నేత్ర రోగే ऽ పి

**కాచ :** పు. ఇది గాజురాతికిని, ఉట్టికిని, మట్టిలోని భేదముకును, నేత్రరోగవిశేషముకును పేరు.

నీచస్తు వామనే పామరేస్మృతః।

**నీచ :** పు. ఇది పొట్టి వానికిని, తుచ్ఛునకును పేరు.

మోచ శ్శోభాంజనేప్రోక్తా
మోచా శాల్మలిరంభయోః॥ (2)

**మోచ :** పు. ఇది మునుగచెట్టుకును, స్త్రీ. బూరుగచెట్టుకును, అరటి చెట్టుకును పేరు.

పిచుస్తూలే చ కర్షే చ
కుష్ఠరోగే ऽ సురాంతరే।
భైరవస్య ప్రభేదే చ
పిచుః క్వాపినిగద్యతే॥ (3)

**పిచు :** పు. ఇది దూదికిని, తాండ్రచెట్టుకును, కుష్ఠరోగముకును, పిచుడను రక్కసునకును, భైరవునకును పేరు.

కూర్చోవికత్థనే మధ్యే
భ్రువోశ్మశ్రుణి కైతవే।

**కూర్చ :** పు. ఇది కపటముకును, కనుబొమలనడుమకును, మీసము మొదలైన ముఖరోమములకును, మిషకును పేరు.

క్రౌంచః ఖగనగద్వీప
ప్రభేదేషు ప్రయుజ్యతే॥ (4)

**క్రౌంచ:** పు. ఇది క్రౌంచపక్షికిని, క్రౌంచ పర్వతముకును, క్రౌంచ ద్వీపముకును పేరు.

చంచోసలాదినిర్మాణే
చంచాతు తృణపూరుషే।

**చంచ:** పు. ఇది రంధ్రము మొదలయినవి నిర్మించుటకును, స్త్రీ. వెరబొమ్మకును పేరు.

చంచుః పంచాంగుళే
త్రోట్యాం గోనాడీచేऽపి పఠ్యతే।

**చంచు :** పు. ఇది ఆముదపు చెట్టుకును, పక్షిముట్టికిని, శాకవిశేషముకును పేరు.

శుచి శ్శుద్ధే ऽ ను పహతే
శృంగారాషాఢయో స్సితే।
గ్రీష్మే హుతవహే ऽ పిస్యా

**శుచి:** త్రి. ఇది పరిశుద్ధమైన దానికిని, కొట్టబడినదానికిని, పు. శృంగార రసముకును, ఆషాఢమాసముకును, తెలుపుకును, గ్రీష్మ ఋతువుకును,

| | |
|---|---|
| దుపధాశుద్ధమంత్రిణి॥ (6) | అగ్నికిని, ధర్మాదులచేతను పరీక్షించి మోసపోని మంత్రికిని పేరు. |
| రుచిర్మయూఖేశోభాయా<br>మభిష్వంగాభిలాషయోః। | **రుచి:** స్త్రీ. ఇది కిరణముకును, కాంతికిని, అత్యాసక్తికిని, ఇచ్ఛకును పేరు. |
| వీచి స్స్వల్పే తరంగే స్యా<br>దవకాశే సుఖేऽపిచ ॥(7) | **వీచి:** స్త్రీ. ఇది స్వల్పముకును, అలకును, అవకాశముకును, సుఖముకును పేరు. |
| సూచిః కరాద్యభినయే<br>నారీణాం కరణాంతరే।<br>సూచీ తుసీవనద్రవ్యే | **సూచి :** స్త్రీ. ఇది అభినయ హస్తవిశేషముకును, స్త్రీలయొక్క అంగవిక్షేప విశేషముకును, (మొగలి మొగ్గకును) ఈ. సూది కిని పేరు. |
| శచీంద్రాణ్యాంశతావరౌ॥(8) | **శచీ :** స్త్రీ. ఇది ఇంద్రుని భార్యకును, పిల్లి పిచ్చరకును పేరు. (పిల్లితేగలని వాడుదురు) |
| కాంచీ స్యాన్మేఖలాదావ్ని<br>గుంజాయాం నీవృదంతరే। | **కాంచీ :** స్త్రీ. ఇది మొలనూలుకును, గురివెంద లతకును, కాంచీ పట్టణముకును పేరు. |
| వచా స్యాదుగ్రగంధాయాం<br>సారికాయాం శుకే వచః॥ (9) | **వచా :** స్త్రీ. ఇది నల్లవసకును, గోరింక పిట్టకును, పు. చిలుకకును పేరు. |
| అర్చాపూజా ప్రతిమయో | **అర్చా :** స్త్రీ. ఇది పూజకును, విష్ణువినాయకాది ప్రతిమకును పేరు. |
| శ్చర్చా స్థాసకచింతయోః।<br>చర్చి కాయాం చ | **చర్చా :** స్త్రీ. ఇది చందనాదుల మైపూతకును, విచారణకును, పార్వతికిని పేరు. |
| రుక్శోభా కిరణే<br>చ్ఛాసు చే ష్యతే॥ (10) | **రుక్ :** స్త్రీ. ఇది కాంతికిని, కిరణముకును, ఇచ్ఛకును పేరు. |
| త్వక్చర్మవల్కయోశ్చోచే | **త్వక్ :** స్త్రీ. ఇది చర్మముకును, నారపట్టకును, లవంగపు చెట్టుకును పేరు. |
| న్యఙ్నీచే నిమ్నకా ర్శ్యయోః। | **న్యఙ్:** త్రి. ఇది నీచమైనదానికిని, పల్లమైనదానికిని, కృశించిన దానికిని పేరు. |
| వాగ్వచనే సరస్వత్యాం<br>భాషాగీర్భారతీ యథా॥ | **వాక్:** స్త్రీ. ఇది భాషా, గీః భారతి యీ శబ్దములవలెను, మాటకును స్వరస్వతికిని పేరు. |

★ అథ చాంతత్రివర్ణః ★

కవచో గర్దభాండే స్యా
త్సన్నాహే పటహేఽపిచ।

**కవచ** : పు. ఇది కలజువ్వి చెట్టుకును, కవచముకును, రణభేరికిని పేరు.

వికచః క్షపణేకేతు
గ్రహే చ స్ఫుటి తే న్యవత్॥

**వికచ**: పు. ఇది క్షపణ మతస్థునకును కేతు గ్రహముకును, త్రి. వికసించిన దానికిని పేరు.

క్రకచః కరపత్రే స్యా
ద్గ్రంథిలాఖ్యద్రుమేఽపిచ।

**క్రకచ**: పు. ఇది రంపముకును, వెణుతురు చెట్టుకును పేరు.

సంకోచమపి కాశ్మీరే
సంకోచో మీనబంధయోః॥ (13)

**సంకోచ**: న. ఇది కుంకుమకును, పు. చేపకును కట్టుటకును పేరు.

నారాచో లోహబాణే స్యా
న్నారాచో జలహస్తిని।
నారాచ్యేషణికాయాం చ

**నారాచ**: పు. ఇది అనేక లోహములు కూడి చేసిన బాణముకును, నీటియేనుగకును, ఈ. స్త్రీ. శానముకును పేరు.

సమ్యక్సంగతహృద్యయోః॥

**సమ్యక్**: త్రి. ఇది కూడుకొన్న దానికిని, మనోజ్ఞమైన దానికిని పేరు.

ప్రపంచ స్సంచయే ప్రోక్తో
విస్తారే చ ప్రతారణే।

**ప్రపంచ**: పు. ఇది సమూహముకును, విస్తారముకును, వంచనకును పేరు.

మరీచిః కృపణే దీప్తౌ
వృషిభే (దే పి దృశ్యతే) దమ
యూఖయోః॥ (15)

**మరీచి** : పు. ఇది లోభికిని, ప్రకాశముకును, మరీచి మునికిని (అనగా కశ్యపుని తండ్రి) కిరణముకును పేరు.

మారీచో రక్షసో భేదే
కక్కోలే యాజకద్విజే।

**మారీచ** : పు. ఇది మారీచుడను రాక్షసునకును, మిరియముకును, యజ్ఞముచేయించు బ్రాహ్మణునకును పేరు.

మారీచీ దేవతాభేదే

**మారీచీ** : స్త్రీ. ఇది వజ్ర కాళికయను దేవత పేరు.

నముచి స్స్మర దత్యయోః॥

**నముచి**: పు. ఇది మన్మథునకును, రాక్షసునకును పేరు.

కణీచిః పుష్పితలతా
గుంజయో శ్శకటేఽపి చ।

**కణీచి** : స్త్రీ. ఇది పుష్పించిన లతకును, గురివెంద తీగకును, బండికిని పేరు.

అవీచి ర్నరకానూర్మ్యో

**అవీచి** : పు. నరక విశేషముకును, తరంగములు

లేని జలముకును పేరు.

ర్విపంచీ కేళివీణయోః ॥

**విపంచీ :** స్త్రీ. ఇది క్రీడకును, వీణకును పేరు.

★ అథ చాంతశ్చతుర్వర్ణః ★

మల్లిమ్లుచోऽనిలే చోరే
జలసూచిర్జ లౌకసి।
శృంగాటే శింశుమారే చ
కంకత్రోటి ఝషేऽపి చ॥ (18)

**మలిమ్లుచ :** పు. ఇది వాయువకును, దొంగకును పేరు.

**జలసూచి :** స్త్రీ. ఇది జలగకును, పు. నాలుగు వీధులమొగకును, పిడకమొసలికిని, కంకత్రోటియను చేపకును పేరు.

★ అథ చాంతః పంచవర్ణః ★

రతనారీచ ఇత్యేష
కధితోऽరతివల్లభే।
కుక్కురే రతనా రీ చ
స్సీత్కారే వరయోషితాం॥ (19)

**రతనారీచ :** పు. ఇది మన్మథునకును, కుక్కకును, ఉత్తమ స్త్రీలయొక్క సీత్కారముకును పేరు.

★ అథ ఛాంతవర్గః ★

అచ్ఛ స్ఫటికభల్లూక
నిర్మలేష్వచ్ఛ మవ్యయం।
అభిముఖ్యేऽథ

**అచ్ఛ :** పు. ఇది స్ఫటికమణికిని, ఎలుగుగొడ్డుకును, నిర్మలముకును, అ. అభిముఖమగుటకును పేరు.

కచ్ఛస్స్యాదనూపే తున్నక
ద్రుమే॥(1) నౌకాంగే పరి
ధానస్య పశ్చాదంచలపల్లవే।
కచ్ఛాతు చీరికాయాంచ
వారాహ్యాంచ నిగద్యతే॥

**కచ్ఛ :** పు. ఇది జలప్రాయ ప్రదేశముకును, నందిచెట్టుకును, చుక్కానికిని, కట్టుబట్ట యొక్క గోచి చెంగుకును, స్త్రీ. మిడుతకును, బ్రాహ్మ్యాది సప్త మాతృకాంతర్గత దేవతావిశేషముకును పేరు.

స్యాద్గుచ్ఛస్స్తబకే స్తంభే
హారభేదకలాపయోః।

**గుచ్ఛ :** పు. ఇది పూలగుత్తికిని, తృణాదుల దుబ్బకును, 32 పేటలముత్యాలహారముకును, పింఛముకును పేరు.

పుచ్ఛః పాశ్చాత్యభాగేస్యా
ల్లాంగూలే పుచ్ఛమిష్యతే।

**పుచ్ఛ :** పు. ఇది వెనుక ప్రక్కకును, న. తోకకును పేరు.

మ్లేచ్ఛః పాపరతే జాతి
భేదేస్యాదపభాషణే ॥

**మ్లేచ్ఛ :** పు. ఇది పాపాసక్తునకును, శబరపుళిందాది జాతికిని, దుర్భాషకును పేరు.

పిచ్ఛా తు శాల్మలీ వేష్టే
మండే చాశ్వపదామయే॥
పంక్తౌ పూగచ్ఛటా కోశ
మోచా విజయినేషు చ।
పిచ్ఛః పుచ్ఛే
మహాకచ్ఛ స్సముద్రే చ
ప్రచేతసి॥ (5)

**పిచ్ఛా :** స్త్రీ. ఇది బూరుగ బంకకును, గంజి తో రకకును, అశ్వముయొక్క కాలియందు పుట్టు రోగముకును, వరుసకును, పోకచెట్టుకును, సమూహముకును, మొగ్గకును, అరటి చెట్టుకును, జిడ్డుకల వస్తువుకును, పు. తోకకును పేరు.

**మహాకచ్ఛ :** పు. ఇది సముద్రునకును, వరుణ దేవునకును పేరు.

★ అథజాంతవర్గః ★

జూరాకాశే సరస్వత్యాం
పిశాచ్యాం జవనేऽపిచ।
జో జన్యాం జాతమాత్రేచ
మృత్యుంజయే జనార్ద నే॥(1)
కంజః కేశే విరించౌ చ
కంజం పియ్యూషపద్మయోః।
అజో హరౌ హరే కామే
విధౌ ఛాగే రఘో స్సుతే॥

**జూః :** స్త్రీ. ఇది ఆకాశముకును, సరస్వతికిని, పిశాచ స్త్రీకిని, వేగముకును పేరు.

**జః :** పు. ఇది పుట్టుగకును, పుట్టిన దానికిని, శివునకును, విష్ణువునకును పేరు.

**కంజ :** పు. వెంట్రుకలకును, బ్రహ్మకును, న. అమృతముకును, పద్మముకును పేరు.

**అజ:** పు. ఇది విష్ణువుకును, శివునకును, మన్మధునకును, బ్రహ్మకును, మేకకును, అజమహారాజుకును పేరు.

వ్రజో గోష్ఠాధ్వబృందేషు

**వ్రజ:** పు. ఇది గోవులసాలకును, మార్గముకును, సమూహముకును పేరు.

నిజమాత్మీయనిత్యయోః।

**నిజ:** త్రి. ఇది తన సంబంధమయిన దానికిని, స్థిరమయిన దానికిని పేరు.

ధ్వజం చిహ్నేపతాకాయాం
ధ్వజ శ్శౌండికశేఫ
సోః॥(3) ఖట్వాంగేచ
స్వజంరక్తే స్వజ ప్రస్వేద
పుత్రయోః।
ద్విజో విప్రేऽండజే దంతే
భార్గీరేణుకయో ర్ద్విజా॥

**ధ్వజ :** న. ఇది గురుతుకును, జండాకును, పు. కల్లమ్ముకొని జీవించు వానికిని, శిశ్నముకును, ఆయుధ విశేషముకును పేరు.

**స్వజ :** న. ఇది రక్తముకును, పు. చెమటకును, పుత్రునకును పేరు.

**ద్విజ :** పు. ఇది ఉపనయనాది సంస్కారములను పొందిన బ్రాహ్మణునకును, పక్షిసర్పాదులకును,

బీజం రేతసి తత్త్వే చ
హేతావంకురకారణే।
ఆదానే పిచ
సజ్జస్స్యాత్సంనద్ధే సంభృ
తేऽపి చ॥ (5)
వాజంఘృతేऽప్సుయజ్ఞేऽ
న్నే వాజో నిస్వనపక్షయోః।
వాజో జవే మునౌ వాజో
వాజ్య శ్శాఠ్యాపదేశయోః॥
భుజః పాణౌ చ బాహౌచ
కుజ స్స్యాన్న రకారయోః।

అబ్జో ధన్వంతరౌ చంద్రే
నిచు ళే శంఖపద్మయోః॥ (7)
అబ్జం స్యాధథ
కుబ్జోऽపి న్యుబ్జే స్యాత్పా
దపాంతరే।
న్యుబ్జం తు కర్మరంగే స్యా
న్న్యుబ్జం ప్రోక్తః కుశస్రుచి॥
అధోముఖే చ కుబ్జే చ
న్యుబ్జో వాచ్యవదిష్యతే।
అజిస్సమావనౌ యుద్ధే

రాజిస్స్యాత్పంక్తి రేఖయోః॥
లాజాః స్యు ర్భ్రష్టధాన్యేషు
లాజస్స్యాదార్ద్ర తండులే।

దంతముకును, స్త్రీ. గంటుబారంగికిని, రేణుకమను గ్రంధ్యద్రవ్యముకును పేరు.

**బీజ :** న. ఇది శుక్లముకును, యథార్థముకును, కారణముకును, విత్తనముకును, గర్భాదానముకును పేరు.

**సజ్జ:** త్రి. ఇది సిద్ధమైన దానికిని, సంపాదింపబడిన దానికిని పేరు.

**వాజ :** న. ఇది నేతికిని, జలముకును, యజ్ఞమునకును, అన్నముకును, పు. ధ్వనికిని, రెక్కకును, వేగముకును, ఒక మునికిని పేరు.

**వ్యాజ :** పు. ఇది కపటముకును, మిషకును పేరు.

**భుజ :** పు. ఇది హస్తముకును, బాహువుకును పేరు.

**కుజ :** పు. ఇది నరకాసురునకును, అంగారకునకును పేరు.

**అబ్జ :** పు. ఇది ధన్వంతరికిని, చంద్రునకును, నీటిప్రబ్బచెట్టుకును, న. శంఖముకును, పద్మముకును పేరు.

**కుబ్జ:** త్రి. ఇది గూనువానికిని, పుష్పవృక్షవిశేషముకును పేరు.

**న్యుబ్జ :** న. ఇది కర్మరంగ ఫలముకును, పు. కుశవికారమయిన స్రుక్కుకును, త్రి. తలవంచిన దానికిని, గూనుదానికిని పేరు.

**అజి:** స్త్రీ. ఇది సమానమైన భూమికిని, యుద్ధముకును పేరు.

**రాజి :** స్త్రీ. ఇది వరుసకును, గీతకును పేరు.

**లాజాః :** పు. నిత్యబహువచనం. ఇది పేలాలకును పేరు.

**లాజ :** పు. ఇది తడి బియ్యముకును, న. వట్టి

ఉశీరే లాజముద్దిష్టం

వేరుకును పేరు.

ప్రజా సంతానలోకయోః॥

**ప్రజా :** స్త్రీ. ఇది స్త్రీ పుంరూప సంతానముకును, జనముకును పేరు.

గుంజాపి పటహే ప్రోక్తా
కాకచించ్యాం కలధ్వనౌ।

**గుంజా :** స్త్రీ. ఇది తప్పెటకును, పూసల గురివెంద లతకును, అవ్యక్త మధురధ్వనికిని పేరు.

గంజా ఖనౌ సురాగేహే
స్యాద్భాండాగారరీఢయోః॥

**గంజా :** స్త్రీ. ఇది గనికిని, కల్లమ్మెడి గృహముకును, పు. బొక్కసపు టింటికిని, నిరసించుటకును పేరు.

గంజః కుంజో నికుంజేఽపి
హనౌ దంతే చ దంతినాం।

**కుంజ :** పు. ఇది పొదరింటికిని, దవడకును, గజదంతముకును పేరు.

సంజః ప్రజాపతౌ రుద్రే

**సంజ :** పు. ఇది బ్రహ్మకును, శివునకును పేరు.

లంజస్స్యాత్ప (ట్ట)
దకచ్ఛయోః॥ (12)

**లంజ :** పు. ఇది పాదముకును, కచ్ఛ చెంగుకును పేరు.

ఊర్జో బలే మహూత్సాహే

**ఊర్జ :** పు. ఇది బలముకును, అధికోత్సాహముకును పేరు.

ఖజామంథ ప్రహస్తయోః।

**ఖజా :** స్త్రీ. ఇది కవ్వముకును, చాచబడినహస్తముకును పేరు.

పింజా తూలే హరిద్రాయాం
పింజస్తు వ్యాకులేఽన్యవత్॥(13)
పింజో బలే చ

**పింజా :** స్త్రీ. ఇది దూదికిని, పసపునకును, త్రి. వ్యాకులమైన దానికిని పు. బలముకును, న. సమూహముకును పేరు.

యే పింజం రజ్జు ర్వేణ్యాం
గుణేఽపిచ।

**రజ్జు :** స్త్రీ. ఇది జడకును, త్రాటికిని పేరు.

ఖర్జూః కడ్వ్యాంచ కీటేచ
ఖర్జూరీ పాదపేఽపిచ॥

**ఖర్జూ :** స్త్రీ. ఇది దురదకును, పురుగుకును, ఖర్జూర వృక్షముకును పేరు.

మర్జూ స్స్యాద్రజకేశుద్ధౌ

**మర్జూ :** పు. ఇది చాకలి వానికిని, స్త్రీ. శుద్ధికిని పేరు.

సర్జూ ర్వణిజవిద్యుతి।

**సర్జూ :** పు. ఇది వర్తకునకును, స్త్రీ. మెరుపునకును పేరు.

**★ అథ జాంతత్రివర్ణః ★**

కరజస్తు కరంజే స్యా
న్నఖేవ్యాఘ్రనఖేఽపిచ॥ (15)

**కరజ :** పు. ఇది క్రానుగ చెట్టుకును, గోళ్ళకును, వ్యాఘ్రనఖమను గంధద్రవ్యముకును పేరు.

కుటజో వృక్షభేదే స్యా
దగస్త్యద్రోణయోరపి।
సహజస్తు నిసర్గే స్యా
త్సహూత్థే పునరన్యవత్॥
నీరజం కమలే కుష్ఠే
జలజం శంఖ పద్మయోః।
(బ) వలజం గోపురే క్షేత్రే
సస్యసంగర యోరపి॥ (17)
వలజా వరయోషాయాం
వసుమత్యామపి స్మృతా।
కారుజ శ్శిల్పినాం చిత్రే
క(ల) లభే నాగకేసరే॥
స్వయంజాతతిలే ఫేనే
వల్మీకస్తైరికేఽపిచ।
బాహుజః క్షత్రియే కీరే
స్వయంజాతతిలేఽపిచ॥ (19)
వనజో ముస్తకే పద్మే
వనజం వనజో గజే।
వనజాముద్గపర్ణ్యాం చ
వణిగ్వాణిజ్యజీవిని॥ (20)
వణిక్కరణభేదే చ
వాణిజ్యాయా మపీష్యతే।
సామజస్తు గజే ప్రోక్త
స్సామోత్థే పునరన్యవత్॥ (21)
భూమిజో నరకేఽంగారే
సీతాయామపి భూమిజా।
గిరిజం చాభ్రకే ఖ్యాతం
శిలాజితుసుగంధయోః॥ (22)

**కుటజ :** పు. ఇది గిరిమల్లికా వృక్షముకును, అగిసి చెట్టుకును, తుమ్మి చెట్టుకును పేరు.

**సహజ :** పు. ఇది స్వభావముకును, త్రి. తోడబుట్టిన దానికిని పేరు.

**నీరజ :** న. ఇది పద్మముకును, కుష్ఠరోగముకును పేరు.

**జలజ :** న. ఇది శంఖముకును, కమలముకును పేరు.

**వలజ :** న. ఇది పురద్వారముకును, వరిమడికిని, సస్యముకును, యుద్ధముకును, స్త్రీ. ఉత్తమస్త్రీకిని, భూమికిని పేరు.

**కారుజ :** పు. ఇది వడ్రంగి మొదలయిన వాండ్ల పనితనముకును, ఒంటె పిల్లకును, నాగకేసర వృక్షముకును, కారు నువ్వుకును, నురుగకును, పుట్టకును, ధాతువిశేషముకును పేరు.

**బాహుజ :** పు. ఇది క్షత్రియునకును, చిలుకకును, కారునువ్వుకును పేరు.

**వనజ :** పు. ఇది తుంగముస్తకును, న. పద్మముకును, పు. ఏనుగకును, స్త్రీ. పిల్లిపెసరకును పేరు.

**వణిక్ :** పు. ఇది వర్తకమువలన జీవించు వానికిని పంచాంగ కరణముకును, వర్తకమునకును పేరు.

**సామజ :** పు. ఇది ఏనుగకును, త్రి. సామమువలన పుట్టిన దానికిని పేరు.

**భూమిజ :** పు. ఇది నరకాసురునకును, అంగారకునకును, స్త్రీ. సీతాదేవికిని పేరు.

**గిరిజ :** న. ఇది అభ్రకమునకును, శిలాజిత్తుకును, రాతిపువ్వుకును, లోహముకును, స్త్రీ. పార్వతికి

లోహే ऽపి గిరిజాగౌరీ
మాతులుంగ్యో రుదీరితా
కంభోజో హస్తిభేదే స్యా
చ్ఛంఖదేశవిశేషయోః॥ (23)
అంగజం రుధిరే ऽనంగే
రోమ్ణిపుత్రే మతో ऽంగజః।
కాంభోజ స్తురగే సోమ
వల్క్యే పున్నాగపాదపే॥ (24)
కాంభోజీ మాషపర్ణ్యాంచ
హింగుపర్ణ్యామపి క్వచిత్।
అండజః కృకలాసే స్వా
త్ఖగే మీనభుజంగయోః॥ (25)
కస్తూర్యామండజా ప్రోక్తా
పరంజస్తైలయంత్రకే।
ఫేనే చ కరవాలే చ
పరంజం క్షు రికాఫలే॥(26)
హిమజాపి నదీగౌర్యో
ర్మైనాకే హిమజః స్మృతః।

ని, మాధీఫలపు చెట్టుకును పేరు.

**కంభోజ:** పు. ఇది కాంభోజదేశపు యేనుగకును, శంఖముకును, దేశ విశేషముకును పేరు.

**అంగజ :** న. ఇది నెత్తురుకును, పు. మన్మథున కును, రోమములకును, కుమారునకును పేరు.

**కాంభోజ :** పు. ఇది కాంభోజ దేశమున పుట్టిన గుఱ్ఱముకును, చంద్రచెట్టుకును, పొన్నచెట్టుకును పేరు.

**కాంభోజీ:** స్త్రీ. కారుమినుముకును, వృక్షవిశేషము కును పేరు.

**అండజ:** పు. ఇది తొండకును, పక్షికిని, చేపకును, సర్పముకును, స్త్రీ. కస్తూరికిని పేరు.

**పరంజ :** పు. ఇది నూనెగానుగకును, నురుగ కును, పెద్దకత్తికిని, న. బ్రరింక పండుకును పేరు.

**హిమజా :** స్త్రీ. ఇది గంగానదికిని, పార్వతికిని, పు. మైనాకునకును పేరు.

★ అథ జాంత శ్చతుర్వర్ణః ★

జఘన్యజో ऽనుజే శూద్రే

**జఘన్యజ:** పు. ఇది తమ్మునకును, శూద్రునకును పేరు.

భారద్వాజః స్మృతో మునౌ॥ (27)
ద్రోణే చ వనకార్పాస్యాం
భారద్వాజీతి కథ్యతే।
భారద్వాజో గురోఃపుత్రే
వ్యాఘ్రాటాఖ్యవిహంగమే॥ (28)

**భారద్వాజ :** పు. ఇది భారద్వాజమునికిని, ద్రోణా చార్యునకును, ఈ. స్త్రీ. అడవి ప్రత్తి చెట్టుకును, పు. బృహస్పతి పుత్రునకును, ఏట్రింత పక్షికిని పేరు.

కాశ్మీరజా ఖ్యాతివిషా
కుష్ఠకుంకుమపౌష్కరే।

**కాశ్మీరజా :** స్త్రీ. అతివసకును, న. కుష్ఠరోగము కును, కుంకుమ పువ్వుకును, పుష్కరమూలమను

గ్రంధ్యద్రవ్యముకును పేరు.

క్షీరాబ్ధిజం తు సాముద్ర
లవణే మౌక్తికేऽమృతే ॥ (29)
క్షీరాబ్ధిజా శ్రియాం ప్రోక్తా
చంద్రే క్షీరాబ్ధిజో భవేత్।

**క్షీరాబ్ధిజ:** న. ఇది సముద్రపు ఉప్పుకును, ముత్యముకును, అమృతముకును, స్త్రీ. లక్ష్మికిని, పు. చంద్రునకును పేరు.

ద్విజరాజ శ్శశధరే
సుపర్ణేऽనంతభోగిని॥ (30)

**ద్విజరాజ:** పు. ఇది చంద్రునకును, గరుడునకును, శేషునకును పేరు.

ధర్మరాజో యమే బుద్ధే
ధర్మరాజో యుధిష్ఠిరే।

**ధర్మరాజ:** పు. ఇది యమునకును, బుద్ధదేవునికిని, ధర్మరాజుకును పేరు.

రాజరాజః కుబేరేऽపి
సార్వభౌమే సుధాకరే ॥ (31)

**రాజరాజ:** పు. ఇది కుబేరునకును, సమస్త భూమిని పాలించువానికిని, చంద్రునకును పేరు.

భృంగరాజస్తు మధుపే
మార్కవే విహగాంతరే।

**భృంగరాజ:** పు. ఇది తుమ్మెదకును, గుంట గలగర చెట్టుకును, కూకటి మూగపిట్టకును పేరు.

గ్రహరాజో రవౌ చంద్రేऽ

**గ్రహరాజ:** పు. సూర్యునకును, చంద్రునకును పేరు.

ప్యహిభుక్కేకికార్క్ష్యయోః॥(32)

**అహిభుక్** : పు. ఇది నెమలికిని, గరుడునకును పేరు.

యక్షరాట్త్ర్యంబకసఖే
మల్లానాం రంగచత్వరే।

**యక్షరాట్:** పు. ఇది కుబేరునకును, జట్టీలు సాములు చేయు భూమికిని పేరు.

★ అథజాంతః పంచవర్గః ★

మునిభేషజమాగస్త్యే
హరీతక్యాం చ లంఘనే ॥

**మునిభేషజ :** న. ఇది అగిసెనూనికిని, కరక చెట్టుకును, దాటుటకును పేరు.

వృషభధ్వజశబ్దోసౌ
శంకరే చార్హదంతరే ॥ (33)

**వృషభధ్వజ :** స్త్రీ. ఇది శివునకును, బుద్ధ విశేషనకును పేరు.

★ అథఝాంతవర్గః ★

ఝంఝా ధ్వనివిశేషేऽపి
ఝంఝా ల్పజలవర్షణే।
ఝంఝా వాతే తారవాయౌ
నష్టేऽపి పరికీర్తితా ॥

**ఝంఝా :** స్త్రీ. ఇది ధ్వని విశేషముకును, తుషార వర్షముకును, వాయువకును, మిగుల గొప్పవాయువుకును, నష్టముకును పేరు.

## ★ అథ జ్ఞాంతవర్గః ★

| | |
|---|---|
| జ్ఞో విరించే బుధే సౌమ్యే | **జ్ఞ :** పు. ఇది బ్రహ్మకును, విద్వాంసునకును, బుధ గ్రహముకును పేరు. |
| చాజ్ఞస్తు జడమూర్ఖయోః। | **అజ్ఞ :** పు. ఇది జడునకును, బుద్ధిహీనునకును పేరు. |
| ప్రజ్ఞా బుద్ధౌ పండితేఽపి<br>ప్రజ్ఞో వాచ్యవదిష్యతే॥ | **ప్రజ్ఞా :** స్త్రీ. ఇది బుద్ధికిని, త్రి. పండితునకును పేరు. |
| సంజ్ఞా నామని గాయత్ర్యాం<br>చేత నాయాం రవిస్త్రియాం।<br>అర్థసూచనికాయాం చ<br>హస్తాద్యైరపి కథ్యతే॥ (2) | **సంజ్ఞా :** స్త్రీ. ఇది పేరుకును, గాయత్రికిని, జ్ఞానముకును, సూర్యుని భార్యకును, హస్తాదులచేతను మనోభావమును సూచించుటకును పేరు. |
| ప్రాజ్ఞా విదుష్యాం యువత్యాం<br>ప్రాజ్ఞీ ప్రజ్ఞాయుత స్త్రియాం। | **ప్రాజ్ఞా :** స్త్రీ. ఇది విద్వాంసురాలికి పేరు. **ప్రాజ్ఞీ :** స్త్రీ. ఇది లౌకిక వైదిక వ్యవహార జ్ఞానముగల స్త్రీకిని పేరు. |
| సర్వజ్ఞ శ్శంకరే బుద్ధే | **సర్వజ్ఞ :** పు. ఇది శివునకును, బుద్ధ దేవునకును పేరు. |
| కృతజ్ఞః కుక్కురే ఽపి చ। | **కృతజ్ఞ :** పు. ఇది కుక్క పేరు. |
| దైవజ్ఞో గణకేఽపి స్యాత్ | **దైవజ్ఞ :** పు. ఇది జ్యోతిష్కుని పేరు. |
| క్షేత్రజ్ఞ శ్ఛేక ఆత్మని॥ (3) | **క్షేత్రజ్ఞ :** పు. ఇది పెంపుడు మృగపక్ష్యాదులకును ఆత్మకును పేరు. |

## ★ అథ టాంతవర్గః ★

| | |
|---|---|
| కటః శ్రోణౌ క్రియాకారే<br>కిలింజే తిశయే శవే।<br>సమయే గజగండే చ<br>పిప్పల్యాం చ కటీమతా॥ (1) | **కట :** పు. ఇది పిరుదులకును, క్రియను జేయువానికిని, చాపకును, అతిశయము కును, శవముకును, సమయముకును, ఏనుగ గండ స్థలముకును, ఈ. స్త్రీ. పిప్పళ్ళకును పేరు. |
| ఖటోఽంధకూపకఫయోః<br>ప్రహారాంతరటంకయోః। | **ఖట :** పు. ఇది మిగులలోతుగల బావికిని, శ్లేష్మముకును, ఆయుధ విశేషముకును, రాళ్ళు మలిచెడి వులికిని పేరు. |
| భటః పామరభేదే చ<br>వీరే చ ప్ర(గమే)గుణే భటః॥(2) | **భట :** పు. ఇది తుచ్ఛునకును, యుద్ధ భటునకును, తిన్నని వానికిని పేరు. |
| ఘట స్సమాధి భే దేభ | **ఘట :** పు. ఇది కుంభకమను సమాధికిని, ఏనుగ |

శిరఃకూటకుటేషు చ।
ఘటా ఘటన గోష్ఠి భ
ఘటనాసు చ దృశ్యతే॥ (3)
కుటః కోటే ఘటే గేహే
శిలాకుట్టకపూరుషే।
స్యాత్కుటీ కుంభదాస్యాం చ
మురాయాం చిత్రగుచ్ఛకే॥ (4)
పటః ప్రియాలవృక్షే చ
సుచేలే చ పురస్కృతౌ।
లటః ప్రమాదవచన
దోషయోరప్యుదాహృతః॥ (5)
వటో గోళే గుళే భక్ష్యే
వట స్సామ్యవరాటయోః।
(వటః కపర్దే న్యగ్రోధే
శుల్బ(వర్తి) రక్తికయోర్వటీ॥ (6)
విటోఽద్రౌ లవణే షిద్గే
మూషకే ఖదిరేఽపి చ।
స్ఫుటో వ్యక్తే ప్రఫుల్లే చ
వ్యాప్తే చ కలితేఽన్యవత్॥ (7)

నిర్భిన్న కర్కటీ సస్యే
పాద స్ఫోటే స్ఫుటిర్మతా।
కూటం యంత్రేఽనృతేరాశౌ
నిశ్చలే లోహముద్గరే॥ (8)
మాయాద్రిశృంగయోస్తుచ్ఛే
సీరావయవదంభయోః।
పురద్వారే చ శంసంతి
లాటో దేశాంతరే శుకే॥ (9)

శిరముయొక్క అగ్రముకును, కడవకును, స్త్రీ. కూర్చుటకును, సభకును, యుద్ధాదులయందు అనేక యేనుగుల నొకచోట కూర్చుటకును పేరు.

**కుటః :** పు. ఇది కోటకును, కడవకును, గృహాముకును, రాళ్ళు మలచు వానికిని పేరు.

**కుటీ :** స్త్రీ. ఇది నీళ్ళు మోసెడి దానికిని, మురయను గ్రంథ్యద్రవ్యముకును, పలురంగులు గల గుత్తికిని పేరు.

**పట :** పు. ఇధి మొరళి చెట్టుకును, మంచి వలువకును, ముందుగా జేయుటకును పేరు.

**లట :** పు. ఇది పొరబాటు మాటకును, దోషముకును పేరు.

**వట :** పు. ఇది ఉండకును, బెల్లముకును, భక్ష్య విశేషముకును, సామ్యముకును, గవ్వకును, శివ జటాజూటముకును, మర్రి చెట్టుకును, ఈ. స్త్రీ. దారముకును, గురి వెంద పూసకును పేరు.

**విట :** పు. ఇది పర్వతమునకును, ఉప్పుకును, విటునకును, ఎలుకకును, చంద్ర చెట్టుకును పేరు.

**స్ఫుట :** త్రి. స్ఫుటమయిన దానికిని, వికసించిన దానికిని, విస్తరించిన దానికిని, కూడుకొన్న దానికిని పేరు.

**స్ఫుటి :** స్త్రీ. ఇది కోయబడిన దోసపైరుకును, కాలి బొబ్బరోగముకును పేరు.

**కూట :** న. ఇది యంత్ర విశేషముకును, అసత్యముకును, ధాన్యాదుల రాశికిని, కదలమికిని, ఇనుప గుదియకును, మాయకును, పర్వత శృంగముకును, నీచమయిన దానికిని, నాగంటి కర్రుకును, దంభముకును, పట్టణ ద్వారముకును పేరు.

**లాట :** పు. ఇది లాటదేశముకును, చిలుకకును పేరు.

| | |
|---|---|
| ఝాటో నికుంజే కాంతా రే<br>వ్రణసంమార్జనే ऽపి చ। | **ఝాట** : పు. ఇది పొదరింటికిని, అడవికిని, గాయములను తుడుచు కుంచకును పేరు. |
| వాటో వృతౌ చ మార్గే చ<br>వాటీ తు గృహనిష్కు టే॥ (10) | **వాట** : పు. ఇది కంచె కోటకును, మార్గముకును, ఈ. స్త్రీ. గృహూద్యానముకును పేరు. |
| చటు శ్చాటౌ పిచండే చ<br>వ్రతినా మాసనాంతరే। | **చటు** : పు. ఇది ప్రియవాక్యముకును, ఉదయముకును, యోగాసన విశేషముకును పేరు. |
| కటుస్సుగంధౌ తీక్ష్ణే స్యా<br>దకార్యే మత్సరేऽప్రియే॥ (11)<br>కటుః ప్రియంగు కటుకా<br>రాజికాస్వథ దూషణే।<br>కటు ప్రోక్తం | **కటు** : త్రి. ఇదిమంచి వాసన గల దానికిని, తీవ్రమయిన దానికిని, దుష్కార్యముకును, దీర్ఘ క్రోధముకును, అయిష్టముకును, స్త్రీ. ప్రేంకణపు చెట్టుకును, కటుక రోహిణికిని, నల్లావాలకును, న. దూషించుటకును పేరు. |
| పటు స్తీక్ష్ణే నీరోగే<br>చతురేऽన్యవత్ పటుః॥ (12)<br>పటో లపత్రేऽపి ఛత్రా<br>లవణయోః పటుః। | **పటు** : త్రి. ఇది వాడియయిన దానికిని, ఆరోగ్యము కలదానికిని, నేర్పరికిని, పు. చేతి పొట్లచెట్టుకును, సదాప చెట్టుకును, ఉప్పుకును పేరు. |
| ఖేటః కఫే గ్రామభేదే<br>నిందితే చ సునందకే॥ (13) | **ఖేట** : పు. ఇది శ్లేష్మముకును, పల్లె గ్రామముకును, త్రి. తుచ్ఛమయినదానికిని, పు. బలరాముని గదాయుధముకును పేరు. |
| అట్టం భక్తే చ శుష్కే చ<br>క్షౌమేత్యర్థే గృహాంతరే। | **అట్ట** : న. ఇది అన్నముకును, త్రి. ఎండినదానికిని, పు. పట్టుబట్టకును, అతిశయము కును, కోటమీది చావిడికిని పేరు. |
| పట్టః పేషణపాషాణే<br>వ్రణాదీనాం చ బంధనే॥ (14)<br>చతుష్పథే చ రాజాది<br>శాసనాంతరపీఠయోః॥ | **పట్ట** : పు. ఇది సన్నికంటి రాతికిని, గాయములకు వేయు పట్టీకిని, నాల్గుత్రోవల మొగకును, దాన పట్టామొదలైన వాటికిని, పీఠముకును పేరు. |
| పట్టీ లలాట భూషాయాం<br>పట్టీ లాక్షాప్రసా(ధ) దనే॥ (15) | **పట్టీ** : స్త్రీ. ఇది నొసటియలంకారముకును, పు. నాతః యెర్రలొద్దుగకును పేరు |
| క్రుష్టం చ రోదనే రావే | **క్రుష్ట** : న. ఇది ఏడ్చుటకును, ధ్వనికిని పేరు. |

కష్టం గహనకృచ్ఛ్రయోః।
ఇష్టమాశంసితే పూజ్య (16)
తమే ప్రియతమేఽన్యవత్।
ఇష్టం సంస్కారయోగే చ
యాగే చ క్రతుకర్మణి।
రిష్టం క్షేమాశుభాభావ
కృపాణేషు ప్రయుజ్యతే॥ (17)
మ్లిష్టమవ్యక్తవాచి స్యా
న్మ్లిష్టం మ్లానేఽన్యవన్మతం।
దిష్టం దైవే చ కాలేస్యా
ద్దిష్ట స్సృష్టం తు నిర్మితే॥ (18)
యుక్తనిశ్చితయోః ప్రాజ్యే

హృష్టో హృషితవన్మతః।
రోమాంచితే ప్రహసితే
జాతహర్షే చ విస్మితే॥ (19)

వ్యుష్టం దినే ప్రభాతే చ
ఫలేపర్యుషితేఽపి చ।
త్వష్టా శిల్పిని దేవానాం
తథా వర్ధకి సూర్యయోః॥ (20)
ఇష్టి స్స్యాదభిలాషేఽపి
సంగ్రహ శ్లోకయాగయోః।
విష్టి కర్మకరే భద్రే
ప్రేషణే వేతనేఽపి చ॥ (21)
దిష్టిః పరిమాణముదోః
దృష్టిర్ధీ దర్శనాక్షిషు।

**కష్ట**: న. ఇది అడవికిని, కష్టముకును పేరు.

**ఇష్ట**: త్రి. ఇది చెప్పబడిన దానికిని, పూజించదగిన దానికిని, ఇష్టమయినదానికిని, న. యజ్ఞముల యందు సంస్కరించుటకును, యజ్ఞముకును, హోమాదికర్మకును పేరు.

**రిష్ట**: న. ఇది క్షేమముకును, అమంగళముకును, లేకపోవుటకును, పెద్ద కత్తికిని పేరు.

**మ్లిష్ట**: న. ఇది స్పష్టము కానిమాటకును, త్రి. వాడిన దానికిని పేరు.

**దిష్ట**: న. ఇది దైవముకును, పు. కాలముకును పేరు.

**సృష్ట**: త్రి. ఇది సృజించబడిన దానికిని, కూడుకొన్న దానికిని, నిశ్చయింపబడిన దానికిని, విస్తారమయిన దానికిని పేరు.

**హృష్ట**: త్రి. ఇది హృషితశబ్దమువలెనే, గగుర్పాటును బొందిన వానికిని, నవ్విన వానికిని, సంతోషమును బొందినవానికిని, ఆశ్చర్యమును బొందిన వానికిని పేరు.

**వ్యుష్ట**: న. ఇది దివముకును, ప్రాతఃకాలముకును, ఫలముకును, తొలిరోజు పదార్థముకును పేరు.

**త్వష్టా**: పు. ఇది దేవతల శిల్పికిని, వడ్రంగికిని, సూర్యునకును పేరు.

**ఇష్టి**: స్త్రీ. ఇది ఇచ్ఛకును, సంక్షేపముగా చేయబడిన శ్లోకముకును, యజ్ఞముకును పేరు.

**విష్టి**: త్రి. ఇది పనిచేయువానికిని, స్త్రీ. భద్రవాకరణముకును, పంపుటకును, కూలికిని పేరు.

**దిష్టి**: స్త్రీ. ఇది కొలతకును సంతోషముకును పేరు.

**దృష్టి**: స్త్రీ. ఇది బుద్ధికిని, చూపుకును, నేత్రముకును పేరు.

| | |
|---|---|
| రిష్టిః ఖడ్గే సమృద్ధౌ చ | **రిష్టి** : పు. ఇది కత్తికిని, స్త్రీ. సంపదకును పేరు. |
| కృష్టిస్స్యాత్కర్షణే బుధే ॥ (22) | **కృష్టి** : స్త్రీ. ఇది దున్నుటకును, పు. విద్వాంసుకును పేరు. |
| సృష్టి స్స్వభావే నిర్మాణే | **సృష్టి**: స్త్రీ. ఇది స్వభావముకును, నిర్మించుటకున పేరు. |
| పుష్టి ర్వృద్ధౌ చ పోషణే। | **పుష్టి** : స్త్రీ. ఇది వృద్ధిబొందుటకును, పోషించుటకును పేరు. |
| యష్టిర్హారలతా శస్త్ర<br>భేదయోర్ధ్వజదండకే॥ (23)<br>భా(ఙ్గ్యాం)ర్గ్యం చ<br>మధుయష్ట్యాం చ | **యష్టి** : స్త్రీ. ఇది హారములయొక్క పేటకును ఆయుధ విశేషముకును, జండా కర్రకును, గంటు బారంగికిని, యష్టిమధుకముకును పేరు. |
| ముష్టి ర్బద్ధకరే పలే | **ముష్టి** : స్త్రీ. ఇది పిడికిలిని, 4 తులముల పరిమాణముకును పేరు. |
| వ్యుష్టిరుక్తా సమృద్ధౌ స్యా<br>న్నియమాదిఫలేఽపి చ॥ (24) | **వ్యుష్టి** : స్త్రీ. ఇది సమృద్ధికిని, తపస్సు వ్రతముల మొదలయిన వాటి ఫలముకును పేరు. |
| భృష్టిస్స్యాద్భర్జనే శూన్య<br>వాటికాయాం చ కథ్యతే | **భృష్టి** : స్త్రీ. వేచుటకును, శూన్యప్రదేశముకును పేరు. |
| గృష్టి స్సకృత్ప్రసూతాగో<br>వరాహక్రాంతయోరపి॥ (25) | **గృష్టి**: స్త్రీ. ఇది తొలిచూలు యీనిన గోవుకును, వృక్షవిశేషముకును పేరు. |
| ఘృష్టి స్స్యా ద్ఘర్షణే విష్ణు<br>క్రాంతాస్పర్ధాకిరిష్వపి। | **ఘృష్టి** : స్త్రీ. ఇది ఒరియుటకును, విష్ణుక్రాంత వృక్షముకును, వైరముకును, పందికిని పేరు. |
| జటా లగ్నకచే మూలే<br>ప్లక్షమాంసికయో ర్జటీ॥ (26) | **జటా** : స్త్రీ. ఇది జడకట్టిన వెంట్రుకలకును, వేరు కును, ఈ. స్త్రీ. జువ్విచెట్టుకును, జటామాంసికిని పేరు. |
| సటాజటా కేసరయోః | **సటా** : స్త్రీ. ఇది జటకును, సింహము మెడమీది వెంట్రుకలకును పేరు. |
| స్ఫటా తు ఫణదంభయోః। | **స్ఫటా** : స్త్రీ. ఇది పడగకును, డాంబికముకును పేరు. |
| ఘోంటా స్యాద్బదరే పూగే | **ఘోంటా**: స్త్రీ. ఇది రేగుచెట్టుకును, పోకచెట్టుకును పేరు. |

ధటీ ఖండే చ వాసనః॥ — **ధటీ :** స్త్రీ. ఇది బట్టతునక పేరు.
పరీక్షార్థతులాయాం చ
ధటస్స్యారిభి రిష్యతే। — **ధట :** పు. ఇది త్రాసు (లేక తక్కెడ) పేరు.
పటిః పటవిశేషే స్యా — **పటి:** స్త్రీ. ఇది దుప్పటికిని, కాలుగచ్చ చెట్టుకును,
ద్వాగు(శా) జౌకుంభికాద్రుమే॥ (28) — జేకు చెట్టుకును పేరు.
స్యాత్కోటి రశ్రౌ చాపాగ్రే — **కోటి :** స్త్రీ. ఇది ఆయుధధారకును, వింటికొనకును, కోటిసంఖ్యను, ఉత్కర్షార్థముకును పేరు.
సంఖ్యాభేద ప్రకర్షయోః।
స్యాత్త్రుటిస్సంశయే లేశే — **త్రుటి:** స్త్రీ. ఇది సందేహముకును, అల్ప పరిమాణముకును, నన్నయేలకులకును, త్రుటికాలముకును పేరు.
సూక్ష్మైలాకాలమానయోః॥

త్రోటి స్స్యాత్కట్ఫలే చం — **త్రోటి :** స్త్రీ. ఇది జేకు చెట్టుకును, పక్షిముట్టికిని, పక్షివిశేషముకును, మీన విశేషముకును పేరు.
చ్వ్యాం ఖగమీనవిశేషయోః।
ఖాటిః కిణే శవరథే — **ఖాటి:** స్త్రీ. ఇది గాయపుకాయకును, కటుకకును, బాలులకు సోకు గ్రహవిశేష ముకును పేరు.
ఖాటి రేకగ్రహేఽపి చ॥ (30)
నటీహట్టవిలాసిన్యాం — **నటీ :** స్త్రీ. ఇది నఖమనెడు గంధద్రవ్యము కును, దుండిగపు చెట్టుకును, నాట్యగాని కిని పేరు.
శోణకే నర్తకే నటః।

★ అథటాంత త్రివర్ణః ★

అవట స్స్యా (ద్వి)త్థిలే గర్తే — **అవట :** పు. ఇది దున్నని భూమికిని, గోతి కిని, నూతికిని, మోసము చేసి జీవించు వానికిని పేరు.
కూపే కుహకజీవిని॥ (31)
వికట స్సుందరే ప్రోక్తో — **వికట :** త్రి. సుందరమైన దానికిని, విస్తార మైన దానికిని, మిక్కిలి భయంకరమైన దానికిని పేరు.
విశాల వికరాళయోః।
కరటో గజగండే స్యా — **కరట :** పు. ఇది ఏనుగ గండస్థలముకును, కుసుంభ వృక్షముకును, నిందింపదగిన జీవనముగల వానికిని, పదకొండవరోజు శ్రాద్ధముకును, నాస్తికునకును, కాకికిని, వాద్యవిశేషముకును పేరు.
త్కుసుంభే నింద్యజీవిని॥ (32)
ఏకాదశాహశ్రాద్ధేచ దుర్దు
రూటే చ వాయసే।
కరటో వాద్యభేదే పి
నిర్ఘటో నిర్దయే స్మృతః॥ — **నిర్ఘట :** త్రి. ఇది దయలేని వానికిని, పరా పవాద యందాసక్తి గల వానికిని, ప్రయోజనములేని దాని
పరాప వాదసంరక్తే

నిర్ఘటో నిష్ప్రయోజనే।

కిని పేరు.

చిపిటః ఖాద్యభేదేఽపి
చిపిటో విస్తృతేఽన్యవత్॥ (34)

**చిపిట** : పు. ఇది అటుగులుకును, త్రి. విస్తరింప చేయబడిన దానికిని పేరు.

జకుటో (మలయే) యమ లే
ఖ్యా తో వార్తాకకుసు మేశుని।

**జకుట** : పు. ఇది కవల బిడ్డలకును, వంగ పువ్వుకును, కుక్కకును పేరు.

నిష్కుటస్తు గృహోద్యానే
కేదారక కవాటయోః॥

**నిష్కుట** : పు. ఇది ఇంటి సమీపమందుండెడి పూల తోటకును, పంటభూమికిని, తలుపు కును పేరు.

హర్ముటః కచ్ఛపే సూర్యే

**హర్ముట**: పు. ఇది తాబేటికిని, సూర్యునకును పేరు.

హ్యుత్కట స్త్రీవ్రమత్తయోః।

**ఉత్కట**: త్రి. ఇది వాడియయిన దానికిని మదించిన దానికిని పేరు.

చర్పటః స్ఫారవిపుల
చపేటే పర్పటేఽపి చ॥ (36)

**చర్పట** : పు. చాచిన వ్రేళ్ళుగల హస్తము కును, అప్పడముకును పేరు.

పర్పటః పిష్టవికృతౌ
పర్పటో భేషజాంతరే।

**పర్పట**: పు. ఇది అప్పడముకును, పర్పాటకమును ఓషధికిని పేరు.

పిచ్చటో నేత్రరోగే స్యా
త్పిచ్చటం త్రపుసీసయోః॥

**పిచ్చట**: పు. ఇది నేత్రరోగ విశేషముకును, న. తగరముకును, సీసముకును పేరు.

త్ర్యంకటం శిక్యభేదేఽపి
థౌతాంజన్యామపి స్మృతం।

**త్ర్యంకట** : న. ఇది ఉట్టికును, వృక్షవిశేషముకును పేరు.

కర్దటః కరహాటే స్యా
త్పంక పంకార యోరపి॥ (38)

**కర్దట** : పు. ఇది తామరదుంపకును, బురదకును, పాచితీగకును పేరు.

కృపీట ముదరే నీరే

**కృపీట** : న. ఇది బొజ్జకును, జలముకును పేరు.

కార్పటో జతుకాయి ణోః।

**కార్పట**: పు. ఇది లక్కకును, పనిబూనిన వానికిని పేరు.

కుక్కుట స్తామ్రచూడే స్యా
త్కుక్కుభేఽగ్నికణేఽపి చ॥
నిషాదసూద్రయోః పుత్రే
తాళమధ్యే తు కుక్కుటం।
కుక్కుట్యనృత చర్యాయా

**కుక్కుట**: పు. ఇది కోడికిని, బెళగువ్వకును, అగ్నికణముకును, కిరాత పుత్రునకును, శూద్రపుత్రునకును, న. వాద్యతాళముయొక్క మధ్యకాలముకును, ఈ.స్త్రీ. అబద్ధపు చర్యకును పేరు.

| | |
|---|---|
| ఉచ్చటాదంభచర్యయోః। | **ఉచ్చటా** : స్త్రీ. ఇది కపటముకును, చేష్టకును పేరు. |
| కేశట శ్శోణకే విష్ణౌ | **కేశట**:పు. ఇది దుండిగపుచెట్టుకును, విష్ణువుకును పేరు. |
| వ (ర్క) ర్గటో ంతర్గళే గళే। | **అర్గట** : పు. ఇది కంఠములోని భాగముకును, కంఠముకును పేరు. |
| కర్కటః కరణే స్త్రీణాం<br>రాశిభేదకుళీరయోః ॥ (41)<br>శాల్మలీ ఫలవాలుక్యోః<br>కర్కటీ కర్కటః ఖగే। | **కర్కట** : పు. ఇది స్త్రీలరతిబంధ విశేషముకును, కర్కటకరాశికిని, పీతకును, బూరుగకాయకును, ఈ. స్త్రీ. నక్క దోస చెట్టుకును, పు. రాబులుగుకును పేరు. |
| కీకట స్తురగే నిస్వే<br>దేశభేదే మితం పచే ॥ (42) | **కీకట** : పు. ఇది గుఱ్ఱముకును, దరిద్రునకు ను, కీకట దేశముకును, లోభికిని పేరు. |
| మోచాటః కృష్ణజీరే స్యా<br>ద్రంభాస్థి మలయోద్భవే। | **మోచాట**: పు. ఇది నల్లజీలకర్రకును, అరటి దూటకును, మంచి గంధముకును పేరు. |
| చక్రాటో విషవైద్యేఽపి<br>ధూర్తదీనారయోర పి॥ (43) | **చక్రాట** : పు. ఇది పాములవానికిని, వంచకునకును, ముప్పది రెండు గురిగిం జల యెత్తు బంగారు నాణెముకును పేరు. |
| వర్ణాటో గాయనే చిత్ర<br>కారే స్త్రీకృతజీవిని। | **వర్ణాట** : పు. ఇది గానము చేయువానికిని, చిత్తరువులు వ్రాయువానికిని, ఆడదాని వలన జీవనము చేయువానికిని పేరు. |
| భావాటో భావకే సాధు<br>ని వేశే కాముకేఽపి చ॥ (44) | **భావాట**: పు. ఇది అభిప్రాయముకును, సాధువుల యింటికిని, విటునకును పేరు. |
| శైలాటో దేవలే సింహే<br>శుక్లకాచ కిరాతయోః। | **శైలాట** : పు. ఇది పూజారికిని, సింహముకును, తెల్లగాజుకును, బోయవానికిని పేరు. |
| ద్రోహాటః కథితో గాథా<br>ప్రభేదే మృగలుబ్ధకే॥ (45)<br>బైడాలవృత్తికే చాపి | **ద్రోహాట** : పు. ఇది కథా విశేషముకును, మృగములను పేటాడు వానికిని, కపటపు తపస్సుచేయు వానికిని పేరు. |
| ధారాట శ్చాతకాశ్వయోః। | **ధారాట**: పు. ఇది చాతక పక్షికిని, అశ్వముకును పేరు. |
| మోరటస్తు భవేదిక్షు<br>మూలాంకోటప్రభేదయోః॥(46) | **మోరట** : పు. ఇది చెరుకు పేరుకును, ఊడుగ చెట్టుకును, స్త్రీ. యీనియేడు రాత్రులయిన పిమ్మట |

| | |
|---|---|
| సప్తరాత్రాత్పరే క్షీరే | పితికిన ఆవుపాల కును, చాగచెట్టుకును పేరు. |
| మూర్వికాయాంతు మోరటా। | |
| వేకట స్స్యాద్వికటికే | **వేకట** : పు. ఇది రత్నములు సానపట్టువానికిని, |
| తథా సంజాతయౌవనే॥ (47) | యౌవనవంతునకును పేరు. |
| వేరటో మిశ్రితే నీచే | **వేరట** : త్రి. ఇది కలపబడిన దానికిని, తుచ్ఛమైన |
| వేరటం బదరీఫలే। | దానికిని, న. రేగుపండుకును పేరు. |
| త్రికూటం సింధులవణే | **త్రికూట** : న. ఇది సముద్రపు ఉప్పుకును, పు. |
| త్రికూటశ్చ సువేలకే॥ (48) | సువేల పర్వతముకును పేరు. |
| భాకూటః కధ్యతే మీన | **భాకూట** : పు. ఇది మత్స్య విశేషముకును, పర్వత |
| భేదే శైలాంతరేఽపి చ। | విశేషముకును పేరు. |
| అరిష్టః ఫేనిలే నింబే | **అరిష్ట** : పు. ఇది కుంకుడు చెట్టుకును, వేప |
| లశునే కాకకంకయోః॥ (49) | చెట్టుకును, వెల్లుల్లికిని, కాకికిని, రాబులుగుకును, |
| అరిష్టం సూతికాగారే | న. పురిటింటికిని, మజ్జిగకును, మరణచిహ్నాకును, |
| తక్రే చిహ్నే శుభేఽశుభే। | శుభముకును, అశుభముకును పేరు. |
| సంసృష్టం సంగతే విద్యా | **సంసృష్ట** : త్రి. ఇది కూడుకొన్న దానికిని, వస్త్రా |
| ద్విశుద్ధే వ(మ) సనాదినా॥ | దుల చేత పరిశుద్ధమైన దానికిని పేరు. |
| అవటుః కథితో ఘాటా | **అవటు** : ఇది ముచ్చిలగుంటకును, నూతికిని, |
| కూపగర్తేషు సూరిభిః। | గోతికిని పేరు. |
| పరీష్టిః పరిచర్యాయాం | **పరీష్టి** : స్త్రీ. ఇది పరిచారముకును, శివుని యష్టైశ్వ |
| ప్రాకామ్యేఽపి గవేషణే ॥ (51) | ర్యములలో నొకదానికిని, వెతకుటకును పేరు. |
| వరటాహంసయోషాయాం | **వరటా** : స్త్రీ. ఇది ఆడుహంసకును, కందిరీగకును |
| గంధోళ్యాం వరటాపి చ। | పేరు. |
| త్రిపుటా మల్లికాయాం చ | **త్రిపుటా** : స్త్రీ. ఇది వర్షాకాలపు మల్లికిని, సన్నయేల |
| సూక్ష్మైలా త్రివృతోరపి॥ (52) | కులకును, తెల్లతెగడకును, పు. లంకలనెడు ధాన్య |
| సతీనకే చ తీరే చ | ముకును, ఒడ్డుకును పేరు. |
| త్రిపుటః సముదాహృతః। | |
| వర్వటీ వ్రీహిభేదే స్యా | **వర్వటీ** : స్త్రీ. ఇది ధాన్యవిశేషముకును, వెలయాలి |
| ద్వర్వటీ పణ్యయోషితి॥ (53) | కిని పేరు. |

పర్కటీ నూతనఫలే
పూగాదేః ప్లక్షపాదపే।
మర్కటీ వానరీ శూక
శింబ్యోస్స్యాత్స్త్ర రజాంతరే॥(54)
మర్కటస్తూర్ణనాభేఽపి
కపౌ స్త్రీకరణేఽపి చ।
కురటీ దారుపుత్ర్యాయం చ
కురంటో ఝిటికాంతరే॥
చిరంటీ తు సువాసిన్యాం
స్యాద్ద్వితీయ వయస్స్త్రియాం।

**పర్కటీ** : స్త్రీ. ఇది పోకచెట్టు మొదలయిన వాటి పుచ్చెకును, జువ్వి చెట్టుకును పేరు.

**మర్కటీ** : స్త్రీ. ఇది ఆడుకోతికిని, దూల గొండి చెట్టుకును, తీగగ్రానుగచెట్టుకును, పు. సాలెపురుగుకును, కోతికిని, స్త్రీలరతి బంధ విశేషముకును పేరు.

**కురటీ** : స్త్రీ. ఇది కొయ్యబొమ్మకును, పు. పుచ్చపువ్వుల ములుగోరింటుకును పేరు.

**చిరంటీ** : స్త్రీ. ఇది ముత్తైదువకును, యౌవన స్త్రీకిని పేరు.

★ అథటాంత శ్చతుర్వర్ణః ★

శ్లీకటః ప్రాంచలో హే
ప్రాయశ్చిత్తభుజంగయోః॥

ఉచ్చింగటో మీనభేదే
తథా కోపనపూరుషే।
కుటంనటస్తు శోణాకే
కైవర్తీముస్తకేఽపి చ॥ (57)
ఖ (ంజ) డ్గారీటస్తుఫల
కాసిధారావ్రతచారిణోః॥
కుండకీటస్తు చార్వాక
వచనాభిజ్ఞపూరుషే॥ (58)
జారజబ్రాహ్మణీ పుత్ర
దాసీకాముకయోరపి।
నారకీటో శ్మ (కూ) కీటే
స్యాత్స్వదత్తాశావిహంతరి॥
కార్య (పు) కూటస్తు కృపణో
న్మత్తానవర్ధ కరేష్వపి।

**శ్లీకట** : పు. ఇది పాతలోహముకును, పాపనివృత్తి కొరకుచేయు ప్రాయశ్చిత్తముకును, సర్పముకును పేరు.

**ఉచ్చిగంట** : పు. ఇది తృణగండమను చేపకును, కోపస్వభావము గలవానికిని పేరు.

**కుటంనట** : పు. ఇది దుండిగపు చెట్టుకును, తుంగ ముస్తకును పేరు.

**ఖడ్గారీట**: పు. ఇది డాలుకును, ఆసిధారా వ్రతము చేత సంచరించువానికిని పేరు.

**కుండకీట** : పు. ఇది చార్వాకవాక్యములను గుర్తెరిగిన వానికిని, బ్రాహ్మణ స్త్రీయందు జారత్వము వలన పుట్టిన వానికిని, దాసిని సంగమించువానికిని పేరు.

**నారకీట** : పు. ఇది క్రిమి విశేషముకును, ఆశపెట్టి భంగించు వానికిని పేరు.

**కార్యకూట** : పు. ఇది లోభికిని, పిచ్చివానికిని, ఘాతకునకును పేరు.

కామకూటస్తు వేశ్యాయాః
ప్రియవిభ్రమయోర్మతః।
చక్రవాటః క్రియారోహే
పర్యంతే చ శిఖాతరౌ।
వర్కరాటః కటాక్షే స్యా
త్తరుణాదిత్యరోచిషి॥ (61)
స్త్రీణాం పయోధరోత్సంగ
కాం త దత్తనఖేపి చ।
కరహాటోఽబ్జకందే స్యా
త్పుష్పవృక్షప్రభేదయోః॥
పరపుష్టః పరభృతే
పరపుష్టాఽఽపణస్త్రియాం।
ప్రతికృష్టం మతం గుహ్యే
ద్విరావృత్యా చ కర్షితే॥
ప్రతిసృష్టః ప్రేషితే స్యా
త్ప్రత్యాఖ్యాతే చ వాచ్యవత్।
శిపివిష్టస్తు ఖలతౌ
శివే దుశ్చర్మణి స్మృతః॥ (64)
చతుష్షష్టి ర్బహ్వృచే
చతుష్షష్టిక ళాస్వపి।
స్యాద్గాఢముష్టిః కృపణే
కృపాణాదిషు చేష్యతే। (65)
అథ స్యాద్ద శనోచ్ఛిష్టో
నిశ్వాసాధర చుంబయోః।

**కామకూట** : పు. ఇది వేశ్యావిటునకును, దాని విలాసములకును పేరు.

**చక్రవాట** : పు. ఇది పనిబూనిన వానికిని, సమీపముకును, దీపపుకుందెకును పేరు.

**వర్కరాట**: పు. ఇది క్రేగంటి ప్రసారముకును, లేత యెండకును, స్త్రీకుచాగ్రమందు ప్రియునిచేతచేయబడిన నఖక్షతముకును పేరు.

**కరహాట**: పు. ఇది తామరదుంపకును, పుష్పవిశేషముకును, మంగ చెట్టుకును పేరు.

**పరపుష్ట** : పు. ఇది కోకిలకును, వెలయాలికిని పేరు.

**ప్రతికృష్ట**: త్రి. ఇది మర్మాంగముకును, రెండుసార్లు దున్నిన భూమికిని పేరు.

**ప్రతిసృష్ట**: త్రి. ఇది పంపబడిన దానికిని, నిరసించబడిన దానికిని పేరు.

**శిపివిష్ట** : పు. ఇది బట్టతల వానికిని, శివునకును, కుష్ఠరోగికిని పేరు.

**చతుష్షష్టి** : స్త్రీ. ఇది ఋగ్వేదముకును, అరువది నాలుగు విద్యలకును పేరు.

**గాఢముష్టి**: పు. ఇది లోభివానికిని, గండ్రగొడ్డలి, ఖడ్గము మొదలయిన వాటికిని పేరు.

**దశనోచ్ఛిష్ట**: పు. ఇది నిట్టూర్పుగాలికిని అధరోష్ఠ చుంబనముకును పేరు.

## ★ అథ ఠాంతవర్గః ★

కఠ స్స్వరఋచాంభేదే
స్యాత్తదధ్యేతృ వేదినోః॥

**కఠ** : పు. ఇది స్వరవిశేషముకును, కఠఋక్కులకును, ఆ ఋక్కులనధ్యయనము జేసినవానికిని, కఠశాఖీయునకును కఠ మునికిని పేరు.

మునావపి హఠో వారి
పర్ణ్యాం స్యాత్ప్రసభేఽపి చ॥ (1)

**హఠ** : పు. ఇది తూటికూరకును, బలాత్కారము కును పేరు.

శఠో మధ్యస్థపురుషే
శఠో ధుత్తూరధూర్తయోః।
శఠో లసే చ మూర్ఖే చ

**శఠ** : పు. ఇది వివాదాదులయందు మధ్యస్థమైన వానికిని, ఉమ్మెత్త చెట్టుకును, శృంగారనాయక విశేషముకును, మందునకును, మూర్ఖునకును పేరు.

కుంఠోఽకర్మణ్యమూర్ఖయోః॥

**కుంఠ**: పు. ఇది కార్యములయందు మందునకును, మూర్ఖునకును పేరు.

పాఠస్స్యాత్పఠనే విద్ధ
పర్ణ్యాం పాఠాపి పఠ్యతే।

**పాఠ** : పు. ఇది పఠించుటకును, స్త్రీ. పాటు చెట్టు కును పేరు.

కంఠో గళే సంనిధానే
ధ్వనౌ మదన పాదపే॥(3)

**కంఠ**: పు. ఇది మెడకును, సమీపముకును, ధ్వని కిని, ఉమ్మెత్త చెట్టుకును పేరు.

వంఠ స్స్యాదకృతో ద్వాహే
ఖర్వేకుంఠాయుధేఽపి చ।

**వంఠ**: పు. ఇది పెండ్లిలేనివానికిని, పొట్టివానికిని, బల్లెముకును పేరు.

పృష్ఠం చరమమాత్రే
స్యాద్దేహస్యావయవాంతరే॥(4)

**పృష్ఠ** : న. ఇది పశ్చాద్భాగసామాన్యము కును, శరీరముయొక్క వెనుక ప్రక్కకును పేరు.

కోష్ఠః కుసూలే చాత్మీయే
కుక్షే రంతర్గృహస్య చ।

**కోష్ఠ** : పు. ఇది పొణక (లేక గాదె) కును త్రి. తన సంబంధమైన దానికిని, పు. ఉదరము యొక్క మధ్య భాగముకును, గృహ మధ్యకును పేరు.

కుష్ఠో రోగే సుగంధే చ

**కుష్ఠ** : పు. ఇది కుష్ఠరోగముకును, సుగంధి పాల చెట్టుకును పేరు.

గోష్ఠం గోస్థానకేఽపి చ॥
గోష్ఠీ సభాయాం సంలాపే

**గోష్ఠ**: న. ఇది పశువుల దొడ్డికిని, ఈ. స్త్రీ. ఓలగము కును, ప్రీతిచేతనయిన పరస్పర సంభాషణము నకును, దుర్వినీతునకును పేరు.

దుష్ఠ స్స్యాద్దుర్బలేఽధమే।

**దుష్ఠ**: త్రి. బలహీనునకును, దుర్వినీతునకును పేరు.

ప్రష్ఠ శ్శ్రేష్ఠాగ్రయోరుక్తః
ప్రష్ఠౌ చండాలికౌషధౌ॥ (6)

**ప్రష్ఠ**: త్రి. ఇది శ్రేష్ఠమైన దానికిని, ముందుగానైన దానికిని, స్త్రీ. ఓషధ విశేషముకును పేరు.

జ్యేష్ఠ శ్శ్రేష్ఠేఽతివృద్ధే చ
జ్యేష్ఠ మాసాంతరేఽపి చ।

**జ్యేష్ఠ** : త్రి. ఇది శ్రేష్ఠమయిన దానికిని, మిగుల వయసు కలదానికిని, పు. జ్యేష్ఠ మాసముకును,

గృహగోధక్షయో ర్జ్యేష్ఠా
శ్రేష్ఠో వైశ్రవణే వరే ॥

స్త్రీ. బల్లికిని, జ్యేష్ఠానక్షత్రమునకును పేరు.
**శ్రేష్ఠ :** పు. ఇది కుబేరునకును, త్రి. శ్రేష్ఠమైన దానికిని పేరు.

కాష్ఠా దారుహరిద్రాయాం
కాలమాన ప్రకర్షయోః।
స్యాద్దిశి స్థానమాత్రే చ
కాష్ఠమాఖ్యాతమింధనే॥(8)

**కాష్ఠా :** స్త్రీ. ఇది మానిపసపునకును, 18 నిముషముల కాలముకును, దిక్కుకును, ప్రదేశముకును, న. కట్టెపుల్లకును పేరు.

నిష్ఠా నిష్పత్తి నాశాంత
యాచ్ఞా నిర్వహణేషు చ।

**నిష్ఠా :** స్త్రీ. ఇది కార్యసిద్ధికిని, నాశనముకును, అవసానముకును, యాచనకును, నిర్వహించుటకును పేరు.

షష్ఠీ షణ్ణాం చ పూరణ్యాం
కాత్యాయన్యా మపీష్యతే॥

**షష్ఠీ:** త్రి. షట్సంఖ్యను పూరించుదానికిని (అనగా నారవదియనుట), పార్వతికిని పేరు.

★ అథఠాంత త్రివర్ణః ★

కమఠః కచ్ఛపే భాండ
భేదే చ కమఠం మతం।

**కమఠ :** పు. ఇది తాబేటికిని, న. యోగులు బిచ్చమెత్తు పాత్రకును పేరు.

జరఠః కర్కశే పాండౌ
జరటః కఠినేఽన్యవత్ ॥ (10)

**జరఠ:** త్రి. కరుకయినదానికిని, తెల్పువర్ణము గల దానికిని, కఠినమయిన దానికిని పేరు.

నర్మఠ శ్చూచుకే షిద్గే

**నర్మఠ :** పు. ఇది చనుమొనకును, విటునకును పేరు.

వైకుంఠః కృష్ణశక్రయోః।

**వైకుంఠ :** పు. ఇది కృష్ణునకును, ఇంద్రునకును పేరు.

శ్రీకంఠః ఖండపరశౌ
శ్రీకంఠః కురుజాంగలే॥ (11)

**శ్రీకంఠ :** పు. ఇది శివునకును, కురుదేశపు మరుభూమికిని పేరు.

వరిష్ఠ స్స్యాదురుతరే
ప్రవరే తిత్తిరావపి।
వరిష్ఠం మరిచే తామ్రే
సాధిష్ఠ తిదృఢార్యయోః॥

**వరిష్ఠ :** త్రి. ఇది మిక్కిలి విస్తారమయిన దానికిని, మిగుల శ్రేష్ఠమైన దానికిని, తిత్తిరిపక్షికిని, న. మిర్యాలకును, రాగికిని పేరు.
**సాధిష్ఠ :** పు. ఇది మిగుల దృఢమైన దాని కిని, మిగుల పూజ్యునకును పేరు.

అంబష్ఠో దేశభేదే పి
విప్రాద్వైశ్యాసు తే పి చ।

**అంబష్ఠ :** పు. ఇదిదేశవిశేషముకును, బ్రాహ్మణుని వలనవైశ్య స్త్రీయందు పుట్టినవానికిని, స్త్రీ. పులిచింత

అంబష్ఠో చామ్లలోణ్యాంస్యా
త్పాఠాయూథికయోరపి॥(13)
కనిష్ఠోऽల్పేऽను జేయూని
కనిష్ఠా దుర్బలాంగుళౌ।

కునుు, పాట చెట్టుకును, అడవి మొల్ల చెట్టుకును పేరు.

**కనిష్ఠ**: త్రి. ఇది స్వల్పమైన దానికిని, వెనుక పుట్టిన దానికిని, పిన్నవయసు దానికిని, స్త్రీ. చిటికెన వ్రేలికిని పేరు.

లఘిష్ఠోऽత్యల్పకే భేలే

**లఘిష్ఠ**: త్రి. ఇది మిగుల చుల్కనయైన దానికిని, పు. తెప్పకును పేరు.

పృపష్ఠః కాల వామయోః॥

**అపష్ఠ**: పు. ఇది కాలముకును, త్రి. ఎడమవైపు దానికిని పేరు.

ప్రకోష్ఠో విస్తృతకరే
భూప కక్షాంతరేऽపి చ।
కూర్పరాదధరే చాపి
ప్రతిష్ఠాస్థానమాత్రకే॥(15)
గౌరవే యాగనిష్పత్తి
చతు రక్షరపద్యయోః।
మకుష్ఠో వ్రీహిభేదే స్యా
న్మకుష్ఠో మంథరేऽన్యవత్ ॥

**ప్రకోష్ఠ**: పు. చాచిన హస్తముకును, రాజ గృహ మందలి తొట్టి కట్టుకును, మణిబంధము మొదలు హస్తము క్రింది భాగముకును పేరు.

**ప్రతిష్ఠా**: స్త్రీ. ఇది ప్రదేశముకును, గౌరవముకును, యాగసిద్ధికిని, నాలుగు వర్ణముల ఛందస్సుగల పద్యముకును పేరు.

**మకుష్ఠ**: పు. ఇది అడవి పెసలకును, త్రి. మెల్లగా నడచు వానికిని పేరు.

★ అథ ఠాంత శ్చతుర్వర్ణః ★

దంతశఠ స్స్యాజ్జం బీరే
కపిత్థే కర్మరంగకే।
నాగరంగే పి చాంగేర్యాం
స్మృతా దందశఠా బుధైః॥ (17)

**దంతశఠ**: పు. ఇది నిమ్మచెట్టుకును, వెలగ చెట్టుకును, ఫలవృక్షవిశేషముకున, నారింజచెట్టుకును, స్త్రీ. పులి చింత చెట్టుకును పేరు.

సూత్రకంఠో ద్విజే ప్రోక్తః
ఖంజరీటకపోతయోః।
హారికంఠః పరభృతే
హారాన్వితగళేऽపి చ ॥ (18)
కాలకంఠస్తు దాత్యూహే
కలవింకే చ ఖంజనే।

**సూత్రకంఠ**: పు. ఇది బ్రాహ్మణునకును, కాటుగ పిట్టకును, పావురముకును పేరు.

**హారికంఠ**: పు. ఇది కోకిలకును, హారము లు గల మెడకును పేరు.

**కాలకంఠ**: పు. ఇది కూకురు గిడ్డంగి

**నీలకంఠ**: పిట్టకును, ఊరపిచుగకును, కాటుగ

సితా పాంగే హరే పీత
సారకే నీలకంఠవత్॥ (19)

పిట్టకును, నెమలికిని, శివునకును, మలయ పర్వత మున బుట్టిన పీతచందన ముకును పేరు.

కలకంఠః కలధ్వానే
హంసే పారావతే పికే।

**కలకంఠ**: పు. ఇది అవ్యక్తమధుర ధ్వనికిని, హంసకును, పావురముకును, కోకిలకు ను పేరు.

(పూతి) దేవకాష్ఠం తు సరళ
దెవదారు మహీరుహోః॥

**దేవకాష్ఠ**: న. ఇది సరళదేవదారు వృక్షము కును, దేవదారు వృక్షముకును పేరు.

కాలపృష్ఠం భవేత్కర్ణ
చాపే కోదండమాత్రకే।
కాల పృష్ఠస్తు సారంగ
విశేషే కం కపక్షిణి॥ (21)

**కాలపృష్ఠ** : న. ఇది కర్ణుని ధనస్సుకును, ధను సామాన్యముకును, పు. జింకలలోని భేదముకును, రాబందు పక్షికిని పేరు.

**★ అథ డాంతవర్గః ★**

గుడ స్త్వ్యద్గోళకే హస్తి
సన్నాహే క్షువికారయోః।
గుడా స్నుహీ గుళికయో
ర్గడో మీనాంతరాయయోః॥

**గుడ** : పు. ఇది వర్తులాకారముకును, ఏనుగకు పేయు కవచాదులకును, బెల్లముకును, స్త్రీ. చెముడు చెట్టుకును, ఉండకును పేరు.

**గడ**: పు. ఇది మత్స్యవిశేషముకును, విఘ్నముకును పేరు.

జడో మూర్ఖే హిమగ్రస్తే
శూకశింబ్యాం జడా మతా।
గడుః పృష్ఠగుడే కుబ్జే
షడః పేయాంతరే భిది॥
వ్యాడో హింస్రపశౌ సర్పే

**జడ** : పు. ఇది మూఢునకును, చలిచేత కొరడు బారినవానికిని, స్త్రీ. దూలగొండిచెట్టుకును పేరు.

**గడు**: పు. ఇది వీపుకంతికిని, గూనుకును, పేరు.

**షడ**: పు. ఇది పానీయ విశేషముకును, భేదముకును పేరు. **వ్యాడ** : పు. ఇది ఘాతుక మృగముకును, పాము కును పేరు.

తాడస్తాడన ఘోషయోః।
ముష్టిమేయతృణాదౌ చ
తాడీ తాళదళద్రుమే॥ (3)
నీడం స్థానే కులాయే చ
సకారపూర్వకోఽంతికే।

**తాడ** : పు. ఇది కొట్టుటకును, శబ్దముకు ను, పిడికెడు గడ్డి మొదలయినవాటికిని, ఈ. స్త్రీ. తాడిచెట్టు కును పేరు.

**నీడ** : ఇది ప్రదేశముకును, పక్షిగూటికిని, సకారము పూర్వమందుగల నీడశబ్దము, సమీపము నకును పేరు.

క్రోడ స్సూకర పాతంగ్యోః
క్రోడం క్రోడా చ వక్షసి॥
చోడః కూర్పాసకే దేశభే
దే ప్రావరణాంతరే।
క్ష్వేడః కర్ణా మయే ధ్వానే
గరళే కుటిలేఽపి చ ॥ (5)
లోహితార్క ఫలే క్ష్వేడం
ఘోషపుష్పే దురాసదే।
యోధానాం సింహనాదేతు
క్ష్వేడాస్యాద్వంశశల్యకే ॥ (6)
అండం ఖగాది కోశే స్యా
న్ముష్కే వీర్యేఽపిచ క్వచిత్।
స్యాత్ఖండ శ్శకలే చేక్షు
వికార మణిదోషయోః॥ (7)
గండః కపోలే పిటకే
యోగభేదే చ గండకే।
గండః ప్రవీరే చిహ్నేస్యా
దశ్వభూషణబుద్బుదే॥ (8)
చండో దైత్యాంతరే తీవ్రే
చండో దాసే యమస్య చ।
ధనహారీ శంఖపుష్ప్యో
శ్చండా చండోఽతి కోపనే॥ (9)
చండీ కాత్యాయనీ హింస్రా
కోపనస్త్రీషు సమ్మతా।
షండం పద్మాది సంఘాతే
షండ స్స్యాద్గోపతావపి॥ (10)
షండః క్లీబే వంశసరే
భార్గవే వంధ్యపూరుషే।

**క్రోడ** : పు. ఇది పందికిని, శనిగ్రహము కును, స్త్రీ. బాహు మధ్యముకును పేరు.

**చోడ** : పు. ఇది రవికకును, చోళదేశము కును, ఉత్తరీయ వస్త్రముకును పేరు.

**క్ష్వేడ** : పు. ఇది కర్ణరోగ విశేషముకును, ధ్వనికిని, కాలకూటవిషముకును, త్రి. వక్రమయినదానికిని, న. యెర్రజిల్లేడు కాయకును, ఆవడపుష్పముకును, త్రి. పొందశక్యముగానిదానికిని, స్త్రీ. భటులసింహ నాదముకును, వెదురు గళిగకును పేరు.

**అండ** : న. ఇది పక్ష్యాదుల గ్రుడ్డుకును, వృషణము కును, రేతస్సుకును పేరు.

**ఖండ** : పు. తునకకును, ఖండ చక్కెరకును, రత్న దోషముకును పేరు.

**గండ** : పు. ఇది గండస్థలముకును, కురుపు బొబ్బ కును, గండనామయోగముకును, వీరునకును, గురుతుకును, అశ్వాభరణ విశేషముకును, నీటి బుగ్గకును పేరు.

**చండ** : పు. ఇది చండాసురుకునకును, త్రి. తీవ్ర మయిన దానికిని, పు. చండుడను యమదూతకు ను, స్త్రీ. నల్లకచోరముకును, శంఖమాలినీవృక్షము కును, త్రి. మిగులకోపముగలదానికిని పేరు.

**చండీ** : స్త్రీ. ఇది పార్వతికిని, హింసించు స్వభావ ము గల దానికిని, కోపముగల స్త్రీకిని పేరు.

**షండ** : న. ఇది కమలములు మొదలయిన వాటి సమూహముకును, పు. ఆబోతుకును, నపుంసకు నకును, అంతఃపురము కాచుకొజ్జావానికిని, శుక్రా చార్యునకును, వ్యర్థమైనరేతస్సుగల వానికిని పేరు.

కుండం దేవజలాధారే
పిఠరేఽథ కమండలౌ॥(11)
కుండీ కుండ స్మృతో జారా
త్పతివత్నీసుతే పి చ।
దండో యమే మానభేదే
లగుడే దమసైన్యయోః॥(12)
వ్యూహభేదే ప్రకాండేఽశ్వే
కోణ మంథానయోరపి।
అభిమానే గ్రహే దండ
శ్చండాంశోః పారిపార్శ్వకే॥

**కుండ** : న. ఇది స్వర్గమందలి తటాకముకును, పాత్ర కును, ఈ. స్త్రీ. కమండలముకును, పు. భర్తజీవించి యుండగా జారుని వలన పుట్టిన వానికిని పేరు.

**దండ** : పు. ఇది యమధర్మరాజుకును, తక్కెడ దండికిని, దుడ్డుకును, దండోపాయముకును, సేనకును, దండవ్యూహముకును, చెట్టుయొక్క కొమ్మల క్రిందిభాగముకును, గుర్రముకును, వాయించుకర్రకును, కవ్వముకును, అభిమానము కును, గ్రహవిశేషముకును, సూర్యునిప్రక్క నుండు విష్ణుదేవతకును పేరు.

(గా) గోండః పామరజా తౌ చ
వృద్ధనాభౌ చ వాచ్యవత్।
పిండం సాంద్రే బలె బో లే
గృహాం శేజీవనా యసోః॥(14)
పిండో దేహే జపాపుష్పే
నివాపే సిహ్లకేఽపి చ।
పిండే స్యాత్తగరే లాబు
ఖర్జూరీ భేదయోరపి॥(15)
పండ షండే ధియాం పండా
పాండుః కుంతీపతౌ సితే।

**గోండ** : పు. ఇది పామరజాతి విశేషముకును, త్రి. పెద్ద బొడ్డుగల వానికిని పేరు.

**పిండ** : న. ఇది దట్టవకును, బలముకును, బాలింత బోలుకును, గృహమందలి యొక భాగముకును, జీవనాధారముకును, ఇనుముకును, పు. శరీరము కును మంకెన పువ్వుకును, పార్వణ పిండముకు ను, అందుగబంకకును, ఈ. స్త్రీ. గ్రంధి తగరముకు ను, అనుగచెట్టుకును, ఖర్జూరవృక్షముకును పేరు.

**పండ** : పు. ఇది నపుంసకునకును, స్త్రీ. బుద్ధికిని పేరు. **పాండు** : పు. ఇది పాండురాజుకును, త్రి. తెలుపు వర్ణముగల దానికిని పేరు.

మండం మస్తుని శాకే చ
మండ స్త్వేత్సార పిచ్చయోః॥(16)
ఏరండే భూషణే చాథ
మండా ధాత్ర్యా ముదీరితా।
ముండో దైత్యాంతరే రాహౌ
మూర్ధముండితయోరపి॥(17)

**మండ** : న. ఇది పెరుగు మీగడకును, కూరకును, పు. చేవకును, జిగటకును, ఆముదపుచెట్టుకును, అలంకారముకును స్త్రీ. భూమికిని పేరు.

**ముండ** : పు. ఇది ముండాసురునకును, రాహున కును, శిరస్సుకును, బోడితలవానికిని పేరు.

శాండో మత్తే పి విఖ్యాతః
శాండీ పిప్పలి చవ్యయోః।

**శాండ**: త్రి. ఇది సురాదులచేత మదించినవానికిని, ఈ. స్త్రీ. పిప్పలిచెట్టుకును చవ్యమను గంధద్రవ్య ముకును పేరు.

కాండం నాళే తరుస్కంధే
బాణేऽవసర నీరయోః॥
కుత్సితే రహసి స్తంబే
కాండం గర్వేऽశ్వవర్గయోః।
భాండం భూషణమాత్రేऽపి
భాడం మూలవణిగ్ధనే॥ (19)
నదీపాత్రే తురంగాణాం
భూషణే భాజనేऽపి చ।
ఇడా వాచి గవిక్షోణ్యా
మిడా చ బుధయోషితి॥
క్రీడా కేళిప్రకారే స్యా
త్ఖేలా వజ్ఞానయోరపి।
చూడా శిఖాయాం వలభౌ
చూడా బాహువిభూషణే॥
పీడా కృపా శిరోమాలా
వమర్ద సరళద్రుమః।

**కాండ**: న. ఇది కాడకును, చెట్టుమానుకును, బాణముకును, సమయముకును, జలముకును, కౌటిల్యముకును, రహస్యముకును, స్తంభముకును; గర్వముకును, గుర్రముకును, సమూహముకును పేరు.

**భాండ**: న. ఇది అలంకార సామాన్యము కును, వర్తకమందలి పెట్టుబడి సొమ్ముకు ను, నదియొక్క గట్లనడిమి భాగముకును, అశ్వభూషణముకును, కుండకును పేరు.

**ఇడా**: స్త్రీ. ఇది మాటకును, గోవుకును, భూమికిని, బుధుని భార్యకును పేరు.

**క్రీడా**: స్త్రీ. ఇది స్త్రీపురుషుల వన విహారాదు లకును, కందుకాది క్రీడకును, పరిహాసముకును పేరు.

**చూడా**: స్త్రీ. ఇది మగవాని శిరోమధ్యస్థమైన జుట్టుకును, ముంజూరుకును, దండ కడియముకును పేరు.

**పీడా**: స్త్రీ. ఇది దయకును, శిరస్సున చుట్టిన పూలదండకును, పీడపెట్టుటకును, సరళదేవదారు వృక్షముకును పేరు.

నాడీ నాళే శిరా గండదూర్వయో
స్త్ర్యే ద్వణాం తరేనాడీ షట్ క్షణ
కాలేऽపి చర్యాయాం కుహకస్య చ।
రండా మూషికపర్ణ్యాం చ
రండా విధవయోషితి॥
వండాపి పాంసులాయాం
స్యాద్వండో హస్తాదివజి తే।
శుండాపి జలహస్తిన్యాం

**నాడీ**: స్త్రీ. ఇది గొట్టముకును, బోలునరముకును, గరికెలోని భేదముకును, గాయముకును, ఆరు క్షణముల కాలముకును, కుత్సితునిచేష్టకును పేరు.

**రండా**: స్త్రీ. ఇది ఎలుక చెవిచెట్టుకును, మగడు చచ్చిన దానికిని పేరు.

**వండా**: స్త్రీ. ఇది రంకులాడికిని, పు. చేతులు మొదలగు నవయములు లేని వానికిని పేరు.

**శుండా**: స్త్రీ. ఇది నీటియేనుగకును, కల్లుకును,

మదిరా కరిహస్తయోః॥ నళిన్యాం వారయోషాయాం శుండస్తు మదనిర్ఝరే। — ఏనుగతుండముకును, తామర లతకును, వేశ్యకును, పు. మదప్రవాహముకును పేరు.

★ అథ డాంత త్రివర్ణః ★

గారుడం స్యాన్మరక తే విషశాస్త్రేऽపి గారుడం॥ — **గారుడ** : న. ఇది మరకతమణికిని, విషమును దింపివేయు మంత్రశాస్త్రముకును పేరు.

ద్రావిడ స్స్యాజ్జనపదే వే (ధ) దముఖ్యక శంఖయో। — **ద్రావిడ**: పు. ఇది ద్రావిడదేశముకును, కచ్చోరముకును, శఖముకును పేరు.

ప్రచండో దుర్వహే శ్వేత కరవీరే ప్రతాపిని॥ — **ప్రచండ** : త్రి. అసాధ్యమైన దానికిని, పు.తెల్ల గన్నేరుకును, త్రి. ప్రతాపముగల వానికిని పేరు.

పిచండ ముదరే విద్యా త్పశో రవయవే ऽ పి చ। — **పిచండ** : న. ఇది కడుపునకును, పశువుల యవయవముకును పేరు.

తరండో బడిశీసూత్ర. బద్ధవ స్తుని బేలకే॥ — **తరండ** : పు. ఇది గేలపు త్రాటికి కట్టిన బెండు, కర్రమొదలయిన వాటికిని, తెప్పకును పేరు.

వరండోऽప్యంతరావేద్యాం సందోహ ముఖరోగయోః। — **వరండ** : పు. ఇదిపేడియొక్క మధ్యభాగముకును, సమూహముకును, ముఖరోగ విశేషముకును పేరు.

పూత్యండో గంధకీటేऽపి తథా గంధమృగేऽపి చ॥ — **పూత్యండ** : పు. ఇది పక్షివిశేషముకును, జవ్వాది పిల్లికిని పేరు.

మార్తండ స్తపనే క్రోడే — **మార్తాండ** : పు. ఇది సూర్యునకును, పందికిని పేరు.

శిఖండో బర్హ చూడయోః। — **శిఖండ** : పు. ఇది నెమలి పురికిని, జుట్టుకును పేరు.

ప్రకాండో విటపే శస్తే మూలస్కంధాంతరేతరోః॥ — **ప్రకాండ**: పు. ఇది కొమ్మకును, త్రి. శ్రేష్ఠమైనదానికిని, చెట్టుయొక్క కొమ్మల క్రింది భాగము కును పేరు.

కోదండో భ్రూలతాయాం స్యాద్దేశ భదే చ కార్ముకే। — **కోదండ** : పు. ఇది కనుబొమ్మకును, కోదండ దేశముకును, న. ధనస్సుకును పేరు.

సరండ స్సరటే ధూర్తే సరండో భూషణాంతరే॥ (30) — **సరండ**: పు. ఇది తొండకును, ధూర్తునకును, భూషణ విశేషణముకును పేరు.

మారుండో ండో భుజంగానాం మార్గే గోమయమండలే। — **మారుండ**: పు. ఇది పాము గ్రుడ్డుకును, త్రోవకును, గోమయముచేత నలికిన భూమికిని పేరు.

కరండో౽మధుకోశే ౽పి
కారండేషు దలాడకే ॥ (31)

**కరండ :** పు. ఇది తేనెపట్టుకును, ఖడ్గము కును, కన్నెలేడుపిట్టకును, తనంతట పుట్టిన నువ్వు చెట్టు కును పేరు.

కూష్మాండో గణభేదేస్యా
ద్రూ్బణే కర్కారుకే౽పి చ।
భేరుండా దేవతా భేదే
పక్షి భేదే చ భీషణే ॥ (32)
వారుండ స్సేకపాత్రేస్యా
న్మలే దృక్కర్ణయోరపి।
ఫణిస్థ రాజే వారుండీ
ద్వారపిండ్యాముదీరితా॥ (33)

**కూష్మాండ :** పు. ఇది ఈ పేరుగల దేవతా గణముకును, గర్భముకును, గుమ్మడి చెట్టు కును పేరు.
**భేరుండా :** స్త్రీ. ఇది దేవతావిశేషముకును, పు. భేరుండపక్షికిని, త్రి. భయంకరమైనదానికిని పేరు.
**వారుండ :** పు. ఇది ఓడలోని నీళ్ళు చిమ్మెడు పాత్రకును, కంటి పుసికిని, గులిమికిని, శేషున కును, ఈ. స్త్రీ. గడపకు పేరు.

తిత్తిడో భూరుహే కాల
దాసే దైత్యాంతరే౽పి చ।
తింతిడ స్తింతిడీ తు స్యా
చ్చించా వృక్షామ్లయోరపి॥
వరండా శారికా వర్తి
ఖడ్గ ధేనుషు వర్తతే।
వితండా వాద భేదే స్యా
త్కాచ్చీశాకే శిలాహ్వయే॥
వితండా కరవీర్యాం చ
నిర్గుండీ సింధువారకే।
నీలశేఫాలికాయాం చ
కరహాటే౽పి కుత్రచిత్ ॥ (36)

**తిత్తిడ :** పు. ఇది చింతచెట్టుకును, యమదూత కును, రాక్షసవిశేషముకును పేరు.
**తింతిడ :** పు. ఇవి చింతచెట్టుకును, **తింతిడీ :** స్త్రీ. చింత పండుకును పేర్లు.
**వరండా :** స్త్రీ. ఇది గోరింకకును, వత్తిడికిని, కత్తికిని, గోవుకును పేరు.
**వితండా :** స్త్రీ. ఇది తనపక్షమునుసమర్థించు కొనక పరపక్షమును దూషించుటకును, శాక విశేషము కును, శిలాజిత్తుకును, గన్నేరుచెట్టుకును పేరు.
**నిర్గుండీ :** స్త్రీ. ఇది వావిలిచెట్టుకును, నల్లపువ్వుల వావిలిచెట్టుకును, తామర దుంపకు ను పేరు.

★ అథ డాంతశ్చతుర్వర్ణః ★

భవేద్వాత(ఖు)ధుడో వాత్యా
వామయో ర్వాతశోణితే।
పిచ్ఛిలస్ఫోటికాయాంచ
దేవతాడస్తు ఘోషకే ॥ (37)

**వాతధుడ :** స్త్రీ. ఇది వాయు సంఘము కును, స్త్రీకిని, రోగవిశేషముకును, జిడ్డువస్తువుల బుడగ కును పేరు.
**దేవతాడ :** పు. ఇది ఆవడచెట్టుకును, రాహు

సైంహికేయగ్రహే చాపి
దేవతాడో హుతాశనే।
చక్రవాడో ద్రిభేద్యే స్యా
చ్చక్రవాడం తు మండలే
జలరుండో జలావర్తే
పయోరేణౌ భుజంగమే
అపోగండస్తు శిశుకే
వికలాంగేతిభీరుకే॥ (39)

గ్రహముకును, అగ్నికిని పేరు.

**చక్రవాడ** : పు. ఇది లోకాలోకపర్వతముకును, న. వర్తులాకారముకును పేరు.
**జలరుండ** : పు. ఇది నీటిసుడికిని, నీటి తుంపరకును, సర్పముకును పేరు.
**అపోగండ**: త్రి. ఇది పిల్లవానికిని, హెచ్చు తగ్గులైన యువయువములుగల వానికిని, మిగుల భయ స్వభావము గలవానికిని పేరు. .

★ అథడాంతవర్గః ★

దృఢః స్థూలే భృశే శక్తే
ప్రగాఢేऽపి దృఢో మతః।
బాఢం దృఢే ప్రతిజ్ఞాయాం

**దృఢ**: త్రి. ఇది లావైనదానికిని, విస్తారమైనదానికిని, బలమైనదానికిని, మిక్కిలియను టకును పేరు.
**బాఢ** : న. ఇది మిక్కిలియనుటకును, అంగీకారముకును పేరు (అవ్యయమని కొందరు.)

మూఢస్తంద్రిత బాలయోః॥
గూఢం రహసి గుహ్యే చ
సంవృతే పునరన్యవత్।
వ్యూఢ స్సంహతవిన్యస్త
పృథులేషు చ భేద్యవత్॥ (2)
షండో వర్షవరేక్లీబే
గోపతౌ పంధ్యపూరుషే।
వోఢా స్యాద్భారితే సూతే

**మూఢ** : పు. ఇది అవివేకికిని, బాలునకును పేరు.
**గూఢ** : న. ఇది రహస్యముకును, మర్మాంగముకును, త్రి. దాగియున్న దాని కిని పేరు.
**వ్యూఢ**: త్రి. ఇది దట్టమైనదానికిని, రచనాదులచేత నుంచబడిన సేనకును, విస్తారమైన దానికిని పేరు.
**షండ**: పు. ఇది కొజ్జావానికిని, నపుంసకునకును, ఆబోతుకును, వ్యర్థమైనరేతస్సుగలవానికిని పేరు.
**వోఢా** : పు. ఇది భారమును వహించినవానికిని, సారథికిని పేరు.

సోఢామర్షణశక్తయో॥ (3)

**సోఢా** : త్రి. ఇది ఓరిమిగలవానికిని, సమర్థమైన వానికిని పేరు.

రాఢాసూక్ష్మే చ శోభాయాం
దాఢా దంష్ట్రాభిలాషయోః।
మాఢిః పత్రాదిభం(గా)గేస్యా

**రాఢా**: స్త్రీ. ఇది సూక్ష్మముకును, కాంతికిని పేరు.
**దాఢా** : స్త్రీ. ఇది కోరకును, కోరికకునకు పేరు.
**మాఢి** : స్త్రీ. ఇది మకరికాపత్రాదులకును, దీనత్వ

న్మాఢి ర్దైన్యప్రకాశనే॥ — మును ప్రకాశింపజేయుటకును పేరు.

★ అథడాంత త్రివర్గః★

ఆషాఢో వ్రతినాం దండే
మాసే మలయపర్వతే।
**ఆషాఢ** : పు. ఇది బ్రహ్మచారులు ధరించు పలాశ దండముకును, ఆషాఢమాసముకును, మలయ పర్వతముకును పేరు.

వారూఢా శ్శంబలేఽపి స్యా
ద్వస్త్రాంచలకపాటయోః॥ (5)
పంజరే పావకే చాథ
**వారూఢ** : పు. ఇది దారి బత్యముకును, పైటి చంగుకును, తలుపుకును, శుకాదుల పంజరముకును, అగ్నికిని పేరు.

ప్రరూఢో జఠరే స్మృతః।
బద్ధమూలే
**ప్రరూఢ**: పు. ఇది ఉదరముకును, త్రి. దృఢముగా నాటుకొన్నదానికిని పేరు.

విరూఢస్తు సంజాతేఽకురి
తేఽన్యవత్॥ (6)
**విరూఢ** : త్రి. పుట్టిన దానికిని, అపుడు మొలచిన దానికిని పేరు.

సమూఢః పుంజితే భుగ్నే
సద్యోజాతేఽనుపప్లుతే।
**సమూఢ** : త్రి. ఇది రాశిగా చేయబడిన దానికిని, విరిగిన దానికిని, అపుడు పుట్టినదానికిని, ఉపద్రవ శూన్యమైనదానికిని పేరు.

ఉదూఢ ఊఢే స్థూలే స్యా
**ఉదూఢ** : త్రి. ఇది వివాహమైనదానికిని, లావైన దానికిని పేరు.

దుపోఢో నికటోఢయోః॥ (7)
**ఉపోఢ** : త్రి. ఇది సమీపమైనదానికిని, వివాహమైనదానికిని పేరు.

నిగూఢో గర్హితే గుప్తే
**నిగూఢ**: త్రి. ఇది నింద్యమైనదానికిని, దాచబడిన దానికిని పేరు.

ప్రమీఢో మూత్రితే ఘనే।
**ప్రమీఢ**: త్రి. ఇది అతిమూత్రరోగికిని, అధికమైన దానికిని పేరు.

సంరూఢోఽకురితే ప్రౌఢే
**సంరూఢ**: త్రి. ఇది అంకురించినదానికిని, గంభీరమైనదానికిన పేరు.

ప్రగాఢో దృఢకృచ్ఛ్రయోః॥
**ప్రగాఢ**: త్రి. ఇది దృఢమైనదానికిని, కష్టముకును పేరు.

ఆధ్యూఢా కృతసాపత్న్యాం
నార్యామధ్యూఢ ఈశ్వరే।
**అధ్యూఢా**: స్త్రీ. ఇది పెద్ద భార్యకును, పు. ప్రభువుకును పేరు.

అద్యారూఢం సమూరూఢే
ఽత్యధికే చాపి భేద్యవత్ ॥ (9)

**అధ్యారూఢ:** త్రి. ఇది అధిష్ఠించినదానికిని, విస్తారమైనదానికిని పేరు.

★ అథ ణాంత వర్గః ★

కణోఽతి సూక్ష్మే ధాన్యాంశే
కృష్ణా జీరకయోః కణా।
పణో వరాకమానే స్యా
న్మూల్యే కార్షపణే గ్లహే॥
క్రయ్యశాకాదికే ద్యూతే
వ్యవహారే భృతౌ ధనే।

**కణ:** పు. ఇది మిక్కిలి సూక్ష్మమైనదానికిని , నూకకును, స్త్రీ. పిప్పళ్ళకును, జీలకఱ్ఱకు ను పేరు.
**పణ :** పు. ఇది గవ్వప్రమాణముకును, వెలకును, గురిగింజల యెత్తు రాగిముద్రకును, పందెముకును, కొనదగినశాకాదులకును, జూదముకును, వ్యవహారముకును , జీతముకును, ధనమునకును పేరు.

గణ స్సమూహే ప్రమథే
సంఖ్యా సైన్యప్రభేదయోః॥
ఘ్రాణం ఘ్రాతే చ నాసాయాం

**గణ :** పు. ఇది సమూహముకును, శివాను చరులయ్యి ప్రమథ గణములకును, సంఖ్యావిశేషముకును, సైన్యవిశేషముకును,
**ఘ్రాణ :** త్రి. ఇది వాసన చూడబడినదానికిని, న. ముక్కుకును పేరు.

కాణః కాకై కచక్షుషోః।
బాణస్స్యా త్కేవలే కాండే
కాండావయవ దైత్యయోః॥
బాణా ఝింట్యాం మతాధీరై
శ్శణో మాషచతుష్టయే।
కషణో కరపత్రే చ
శాణేప్రావరణాంతరే॥ (4)

**కాణ:** పు. ఇది కాకికిని, ఒక కన్నుగలవానికిని పేరు.
**బాణ:** పు. ఇది ఒక్కటైనదానికిని, బాణముకును, అలుగుకును, బాణాసురునకును, స్త్రీ. నల్లపువ్వులపెద్ద గోరింటకును పేరు.
**శణ:** పు. ఇది నాలుగు మాషముల యెత్తు పరిమాణముకును, ఒరుపుడు రాతికిని, రంపము కును, ఈ. స్త్రీ. వస్త్రవిశేషముకును పేరు.

త్రాణాతు త్రాయమాణాయాం
రక్షితే రక్షణే ఽపిచ।
ప్రాణో హృన్మారుతే బోలే
కావ్యజీవేఽనిలే బలే॥
వాచ్యవత్పూరితే ప్రాణం
ప్రాణాశ్చాసుషుకీర్తితాః।
ద్రుణంచాపే చ ఖడ్గేచ

**త్రాణా :** స్త్రీ. ఇది కలుక్రానుగ చెట్టుకును, త్రి. రక్షించబడినదానికిని, న. రక్షించుటకును పేరు.
**ప్రాణ :** పు. ఇది ప్రాణవాయువకును, బాలింతబోలుకును, కావ్యప్రాణముకును, వాయువకును, బలముకును, త్రి. పూరించబడిన దానికిని, బ. పంచప్రాణములకును పేరు.
**ద్రుణ :** న. ఇది ధనుస్సుకును, కత్తికిని, పు. తేలు

ద్రుణో వృశ్చికభృంగయోః॥(6)
ద్రుయా కచ్ఛపికాయాం చ
జలద్రోణ్యాముదాహృతః।
ద్రోణః కృపీపతౌ కృష్ణ
కాకే వృశ్చిక ఆఢకే॥ (7)
ఆఢకానాం చ తుష్కేఽపి
ద్రోణే స్యాన్నీవృదంతరే।
ద్రోణీకాష్ఠాంబువాహిన్యాం
గవాం ఘాసభువి స్మృతా॥
మోణశ్శుష్కఫలే నక్ర
మక్షికో హికరండయోః।
కోణో వాద్యప్రభేదే స్యా
త్కోణోఽశ్రౌలగుడేఽర్కజే॥ (9)
వీణాదివాదనోపాయేఽ
ప్యేకదేశే గృహస్యచ।
శోణ స్స్యోనాక నదయో
శ్శోణః కోకనదచ్ఛవౌ॥(10)
లోహితాశ్వే కృశానౌ చ
భ్రూణః స్త్రీగర్భ
డింభయోః।
తీక్ష్ణం సాముద్రలవణే
విషలోహాగ్ని ముష్కకే॥ (11)
తీక్ష్ణ (సారే) క్షారే చ తిగ్మాత్మ
త్యాగినో ర్వాచ్యవద్భవేత్।
కర్ణః పృథాజ్యేష్ఠసుతే
సువర్ణాళౌ శ్రుతావపి॥ (12)
జర్ణశ్చంద్రే చ వృక్షే చ
వర్ణః కాంచన యజ్ఞయోః।

కును, తుమ్మెదకును, ఈ. స్త్రీ. క్షుద్రరోగ విశేషముకును, నూతియొద్ద నీళ్ళు పోవుటకు కట్టిన గాడికిని పేరు.

**ద్రోణ:** పు. ఇది ద్రోణాచార్యునకును, బొంత కాకికిని, తేలుకును, తూముపరిమాణముకును, నాలుగు తూములపరిమాణముకును, ఈ. స్త్రీ. దేశవిశేషముకును, దోనెకును, గోవులు మేతమేయు భూమికిని పేరు.

**మోణ** : పు. ఇది ఎండు కాయకును, నీటి పట్టు యీగకును, పాముల పెట్టెకును పేరు.

**కోణ**: పు. ఇది వాద్యవిశేషముకును, ఆయుధధారకును, దుడ్డుకును, శనిగ్రహముకును, వీణాదులను వాయించు కొడుపు మొదలైన వాటికిని, యింటి మూలకును పేరు.

**శోణ**: పు. ఇది చుండిగపు చెట్టుకును, శోణనదముకును, యెఱ్ఱకలువ వర్ణము వంటి వర్ణమునకును, యెరుపు వర్ణముకగల గుఱ్ఱముకును, అగ్నికిని పేరు.

**భ్రూణ** : పు. ఇది స్త్రీలు దాల్చు గర్భముకును, బాలునకును పేరు.

**తీక్ష్ణ** : న. ఇది సముద్రపు వుప్పుకును, విషముకును, ఇనుముకును, పు. అగ్నికిని , ముష్కపు చెట్టుకును, యవక్షారముకును, త్రి. తీవ్రమైన దానికిని, జీవమును విడుచువానికిని పేరు.

**కర్ణ** : పు. ఇది కర్ణునకును, సువర్ణాళివృక్షముకును, చెవికిని పేరు.

**జర్ణ** : పు. ఇది చంద్రునకును, వృక్షముకును పేరు.

**వర్ణ** : పు. ఇది బంగారుకును, యజ్ఞముకును,

| | |
|---|---|
| వర్ణో ద్విజాదౌ శుక్లాదౌ<br>స్తుతౌ రూపయశోఽక్షరే ॥(13)<br>విలేపనే కుదాయాం చ<br>వర్ణ స్స్యాద్గుణ (శోభ)<br>భేదయోః। | బ్రాహ్మణాది వర్ణములకును, శ్వేతాదివర్ణములకును, స్తుతికిని, ఆకారముకును, కీర్తికిని, కకారాద్యక్షరములకును, పూతకును, పు. ఏనుగ వీపున వేయు చిత్ర కంబళికిని, గుణముకును, భేదముకును పేరు. |
| పర్ణం స్యాత్కింసుకే పత్రే | **పర్ణ**: పు. ఇదిమోదుగచెట్టుకును, న. ఆకుకును పేరు. |
| శీర్ణం తను విశీర్ణయోః॥ | **శీర్ణ** : త్రి. ఇది సూక్ష్మమైనదానికిని, శిథిలమైనదానికిని పేరు. |
| పూర్ణ శ్శక్తే సమగ్రేచ<br>పూరితే చాపి వాచ్యవత్। | **పూర్ణ** : త్రి. ఇది సమర్థమయినదానికిని, అంతయుననుటకును; జలాదులచేత నింపబడిన కలశకును పేరు. |
| చూర్ణః క్షోదెక్షారభేదే<br>చూర్ణాని వాసయుక్తిషు॥ | **చూర్ణ**: పు. ఇది గుండకును, సున్నముకును, న. పరిమళించు గంధపు పొడి మొదలైన, వాటికిని పేరు. |
| కీర్ణం ఛన్నే పరిక్షిప్తే<br>హింసితే చాపి వాచ్యవత్। | **కీర్ణ** : త్రి. ఇది కప్పబడినదానికిని, చిమ్మబడినదానికిని, హింసింపబడిన దానికిని పేరు. |
| జీర్ణం పక్వే పురాణే చ | **జీర్ణ**: త్రి. ఇది పండినదానికిని, పురాతనమైనదానికిని పేరు. |
| దీర్ణం దారిత భీతయోః॥ | **దీర్ణ** : త్రి. ఇది ఛేదింపబడినదానికిని, భయమును పొందిన దానికిని పేరు. |
| ఉష్ణ స్స్యాదాతపే<br>గ్రీష్మేదక్షే | **ఉష్ణ** : పు. ఇది ఎండకును, గ్రీష్మఋతువుకును, త్రి. నేర్పరికిని పేరు. |
| కృష్ణస్తు కేశవే।వ్యాసే<br>ఽర్జునే కోకిలే చ కృష్ణం<br>మరిచ లోహయోః॥ (17)<br>కృష్ణా తు ద్రౌపదీ నీలీహార<br>హూరాసు కథ్యతే।<br>వాచ్యవన్మేచకే కృష్ణం | **కృష్ణ** : పు. ఇది కృష్ణునకును, వ్యాసమునికిని, అర్జునునకును, కోకిలకును, న. మిరియాలకును, ఇనుముకును, స్త్రీ. ద్రౌపదికిని, నీలిచెట్టుకును, ద్రాక్షలతకును, త్రి. నల్లనిదానికిని పేరు. |
| జిష్ణు శ్శక్రే ధనంజయే॥<br>జిత్వరే చాథ | **జిష్ణు** : పు. ఇది ఇంద్రునకును, అర్జునునకును, త్రి. జయశీలునకును పేరు. |

| | |
|---|---|
| విష్ణు స్స్యాత్కృష్ణే ర్కే- వసుదైవతే। | **విష్ణు** : పు. ఇది విష్ణువుకును, ద్వాదశాదిత్యులలో నొకనికిని, ధనిష్ఠానక్షత్రముకు ను పేరు. |
| గేష్ణు ర్నటే గాయనే చ | **గేష్ణు** : పు. ఇది నట్టువవానికిని, గానము చేయు వానికిని పేరు. |
| దేష్ణు ర్దాతరి దుర్లభే॥ | **దేష్ణు** : పు. దాతకును, త్రి. పొందశక్యముగానిదాని కిని పేరు. |
| వృష్ణిస్తు యాదవే మేషే వృష్ణిః పాషండ చండయోః। | **వృష్ణి** : పు. ఇది యాదవునకును, పొట్టేలుకును, త్రి. పాషండమతస్థునకును, తీవ్రమైనదానికిని పేరు. |
| పార్ష్ణిః పాశ్చాత్యభాగేస్యా త్పాదమూలోన్మద స్త్రియోః॥ (20) సేనాపృష్ఠే చ కుం (భ్యాం) త్యాంచ | **పార్ష్ణి**: పు. ఇది వెనుకభాగముకును, చీలమండకు క్రిందిభాగముకును, (మడిమె) స్త్రీ. పిచ్చిపట్టిన స్త్రీ కిని, సైన్యముయొక్క వెనుక భాగముకును, కుంతీ దేవికిని పేరు. |
| తృష్ణాలిప్సా పిపాసయోః। | **తృష్ణా** : స్త్రీ. ఇది ఆశకును, దప్పికకును పేరు. |
| ఊర్ణా మేషాదిలోమ్నిస్యా దంతరావర్తకే భ్రువోః॥ | **ఊర్ణా** : స్త్రీ. ఇది మేకబొచ్చుకును, కనుబొమల నడుమనుండు సుడికిని పేరు. |
| మణిర్గోళే మేహనాగ్రే రత్నే చాజాగళస్తనే। | **మణి**: . ఇది ఉండకును, శిశ్నాగ్రముకును, రత్న జాతికిని, మేక మెడక్రింది స్తనముకును పేరు. |
| అణి రాణివదక్షా గ్ర కీలేస్యాదసి సీమయోః॥ (22) | **అణి ( ఆణి )** : . ఇవి బండిచక్రము కొననుండు చీలకును, ఖడ్గదారకును, పొలిమేరకును పేర్లు. |
| కుణి స్తున్నకవృక్షే చ కుణిస్స్యాత్కు కరేన్యవత్। | **కుణి**: పు. ఇది నందివృక్షముకును, త్రి. ఈచపోయి న చేతులు గలవానికిని పేరు. |
| ఘూణిః క్రముకభేదేపి దుష్టదైవశ్రుతావపి॥ (23) | **ఘూణి** : స్త్రీ. ఇది పోకచెట్టుకును, కఠినునకును పేరు. |
| శ్రేణిః పంక్తౌ సేకపాత్రే శ్రేణి స్స్యాత్కారుసంహతౌ। | **శ్రేణి** : . ఇది వృక్షాదుల వరుసకును, ఓడలోని నీళ్ళుతోడెడి పాత్రకును, వడ్రంగి, చాకలి, మంగలి మొదలగు శిల్పుల యొక్క సజాతీయసమూహము కును పేరు. |
| వాణి స్స్యాద్వ్యూతి భారత్యో | **వాణి** : స్త్రీ. ఇది నేతకును, సరస్వతికిని, పు. వెల |

| | |
|---|---|
| ర్వాణి ర్మ్నాల్యే వలాహకే ॥ (24) | కును, మేఘముకును పేరు. |
| వేణీ కచస్య బంధేస్యా<br>న్నదీనాం మేళకేపి చ।<br>దేవతాడేచ | **వేణీ :** స్త్రీ. ఇది సర్పాకారముగా నల్లినజడకును, నదీప్రవాహముల యొక్క సమ్మేళనమునకును, దేవతాడి చెట్టుకును పేరు. |
| తూణీతు నీల్యాం<br>తూణీనిషంగకే॥ (25) | **తూణీ:** పు. ఇది నీలిచెట్టుకును, స్త్రీ. అమ్ములపొది కిని పేరు. |
| ఘృణా జుగుప్సాకృపయోః | **ఘృణా :** స్త్రీ. ఇది నిందకును, దయకును పేరు. |
| ఫాణి ర్గుడ కరంభయోః। | **ఫాణి :** స్త్రీ. ఇది బెల్లముకును, పెరుగుతో కలిపిన పేపుడు పిండికిని పేరు. |
| శ్రాణా యవాగ్వాం<br>పక్వేతు శ్రాణాం। | **శ్రాణా :** స్త్రీ. ఇది గంజికిని, త్రి. పచనము చేయబడిన దానికిని పేరు. |
| స్థూణా యసస్కృతా<br>ప్రతిమాయాం గృసస్తంబే | **స్థూణా :** స్త్రీ. ఇది లోహపుబొమ్మకును, ఇంటి స్తంభముకును పేరు. |
| వీణా వల్లకి విద్యుతోః। | **వీణా :** స్త్రీ. ఇది వీణకును, మెరుపునకును పేరు. |
| వేణు ర్నృపాంతరే వంశే | **వేణు:** పు. ఇదివేణురాజుకును, వెదురుకును పేరు. |
| స్థాణుః కీలే స్థిరే హరే ॥ | **స్థాణు:** . ఇదిమొరడుకును, త్రి. స్థిరమైనదానికిని, పు. శివునకును పేరు. |
| రేణుః పర్పటకే<br>ధూళ్యామ (ల్పే) | **రేణు :** పు. ఇది పర్పాటకమను గంధద్రవ్యము కును, పరాగముకును పేరు. |
| థాణు వ్రీహి సూక్ష్మయోః। | **అణు:** పు. ఇదిసన్నధాన్యముకును, త్రి. సూక్ష్మమై నదానికిని పేరు. |

**★ అథ ణాంత త్రివర్ణః ★**

| | |
|---|---|
| అరుణో వ్యక్తరాగే ర్కే<br>సంధ్యారాగే ర్కసారథౌ<br>నిశ్శబ్దే కపిలే కుష్ఠే<br>ద్రవ్యేవాచ్యవదిష్యతే।<br>అరుణాతివిషా శ్యామా<br>మంజిష్ఠా త్రివృతాసుచ॥ (29) | **అరుణ:** పు. ఇది ఇంచుక రక్తవర్ణముకును, సూర్యునకును, సంధ్యాకాలరక్తిమకును, అనూరునకును, ధ్వనిలేకుండుటకును, కపిలవర్ణముకును, కుష్ఠురోగముకును, త్రి. యెరుపు వర్ణము గల ద్రవ్యముకును, స్త్రీ. అతివకును, నల్లతెగడకును, మంజిష్ఠలతకును, తెల్లతెగడకును పేరు. |

కరుణస్తు రసే వృక్షే
కృపాయాం కరుణామతా।
వరుణ స్సమ్మతో నీరే
స్వర్లోకే పరమేష్ఠిని ॥ (30)
వరుణస్తరుభేదేపి
ప్రతీచీపతి సూర్యయోః।

**కరుణ:** పు. ఇది కరుణరసముకును, వృక్షవిశేషము కును, స్త్రీ. దయకును పేరు.

**వరుణ:** పు. ఇది జలముకును, స్వర్గలోకముకును, బ్రహ్మకును, ఉలిమిరి చెట్టుకును, వరుణ దేవున కును, సూర్యునకును పేరు.

వరణ స్సక్తశాకేపి
ప్రాకారే వరణంవృతా ॥ (31)

**వరణ:** పు. ఇది ఉలిమిరిచెట్టుకును, కోటకును, న. ఊరుచుట్టువేసిన కంచెకోటకును పేరు.

తరుణః స్యాన్నవే యూని
కుబ్జపుష్పే రుబూకయోః।

**తరుణ :** త్రి. ఇది నూతనమైనదానికిని, పిన్న వయసు వానికిని, న. కుబ్జక పుష్పముకు, పు. ఆముదపు చెట్టుకును పేరు.

చరణం బహ్వృచాదౌచ
మూలే గోత్రే పదేపి చ॥ (32)
చరణం భ్రమణేత్తౌ చ

**చరణ:** ఇది ఋక్శాకయజుశ్శాఖమొదలైనవాటికిని, వేరుకును, కులముకును పాదముకును, న. తిరుగుటకును, భక్షించుటకును పేరు.

రవణం రాసభధ్వనౌ।
రవణః కరభే భృంగే

**రవణ:** న. ఇది గాడిద కూతకును, పు. ఒంటెకును, తుమ్మెదకును పేరు.

రావణో రాక్షసాధిపే ॥ (33)
ప్రధానకుంజరే ఘోరే
రావణో నాదకే ऽ న్యవత్ ।

**రావణ :** ఇది రావణాసురునకును, గుంపులో ముందునడచు ఏనుగకును, త్రి. భయంకరు నకును ధ్వనిచేయు వానికిని పేరు.

లవణో రస రక్షోऽబ్ధి
భేదేషు లవణాన్వితే ॥ (34)

**లవణ :** పు. ఇది ఉప్పునకును, లవణాసురునకును, లవణసముద్రముకును, త్రి. ఉప్పునివస్తువకును పేరు.

కరణం సాధన క్షేత్ర
కాయకాయస్థకర్మసు।
గీతాంగహార సంవేశే
క్రియాభేదేంద్రియే ష్వచ ॥ (35)
బాలవాదౌ చకరణః
స్మృత శ్శూద్రా విశోస్సుతే।

**కరణ:** న. ఇది సాధనముకును, పంటభూమికిని, శరీరముకును, గ్రామాదాయ వ్యయములు వ్రాయు కరణముకును, కర్మ కును, గానవిశేషముకును, శరీరమును విదల్చుటకును, ఆసనముకును, కార్య ముకును, నేత్రాదీంద్రియముకు, బవాది పంచాంగ కరణముకును, పు. శూద్రస్త్రీయందు వైశ్యునివలన పుట్టిన వానికిని పేరు.

జరణం జీరకాऽ జాజి
హింగు సౌవర్చ లేష్వపి ॥ (36)

**జరణ** : న. ఇది జీలకఱ్ఱకును, తెల్ల జీలకఱ్ఱకును, ఇంగువకును, పు. సౌవర్చల వణమకును పేరు.

ధరణం మానభేదేऽపి
ధారణే ధరణీ భువి।

**ధరణ** : న. ఇది **24** గురిగింజల ప్రమాణముకును, ధరించుటకును, ఈ. స్త్రీ. భూమికిని పేరు.

రమణం స్యాత్పటోలస్య
మూలేఽపి రమణః ప్రియే॥

**రమణ** : న. ఇది పొట్లపేరుకును, పు. భర్తకును పేరు.

శరణం వధ రక్షిత్రో
శ్శరణం రక్షణే గృహే।

**శరణ** : న. ఇది చంపుటకును, రక్షించువానికిని, రక్షించుటకును, గృహముకును పేరు.

కత్తృణం తృణభేదేఽపి
వారిపర్ణ్యాం చ కత్తృణం॥ (38)

**కత్తృణ**: న. ఇది కామంచి గడ్డికిని, తూటికూరకును పేరు.

యంత్రణం స్యాన్నియమనే
బంధనే రక్షణేఽపి చ।

**యంత్రణ** : న. ఇది నియమించుటకును, కట్టుట కును, రక్షించుటకును పేరు.

ప్రఘణస్తామ్రకుంభే స్యా
దళిందె లోహముద్గరే ॥ (39)

**ప్రఘణ** : పు. ఇది రాగిబిందెకును, ఇంటిముందర వాకిలికిని, ఇనుప గుదియకును పేరు.

ద్రుఘణో ముద్గరేఽపి స్యా
ద్ద్రుఘణా చ పరశ్వధే।

**ద్రుఘణ** : పు. ఇది ఇనుప గుదియకును, గండ్ర గొడ్డలి వంటి యాకృతిగల యస్త్రవిశేషము కును పేరు.

ప్రవణః క్రమనిమ్నోర్వ్యా
మాయ(త్తే)తే చ చతుష్పథే॥
ప్రగుణే చ క్షణేఽపి స్యా
దీరిణం శూన్య ఊషరే।

**ప్రవణ**: త్రి. క్రమముగా పల్లమైన భూమికిని, విస్తార మైనదానికిని, పు. నాలుగు త్రోవలు కలసిన రచ్చకు ను, త్రి. తిన్నని దానికిని, క్షయముకును పేరు.

**ఈరిణ**: త్రి. శూన్యమయినదానికిని, చవిటి నేల కును పేరు.

గ్రహణం తూపలబ్దౌ స్యా
దాదరే గ్రహణం కరే ॥ (41)
గ్రహూపరాగ స్వీకార (బం)
వందిషు గ్రహణం మతం।

**గ్రహణ** : న. ఇది హొందబడుటకును, ఆదరముకు ను, హస్తముకును, సూర్యాది గ్రహణ ముకును, చేకొనుటకును, ఖైదు కును పేరు.

ఈక్షణం దర్శనే దృష్టౌ
ప్రోక్షణం సేచనే వధే ॥ (42)
లక్షణం నామ్ని చిహ్నేచ

**ఈక్షణ** : న. ఇది చూచుటకును, నేత్రముకును పేరు.

**ప్రోక్షణ** : న. ఇది తడుపుటకును, చంపుట కును పేరు.

**లక్షణ** : న. ఇది పేరుకును, గురుతుకును, పు.

సౌమిత్రే చాపి లక్షణః।

లక్షణస్వామికిని పేరు.

లక్ష్మణం లాంఛనే నామ్ని
రామభ్రాతరి లక్ష్మణః॥ (43)
లక్ష్మణౌషధి సారస్యో
స్సశ్రీకే చాభి ధేయవత్।

**లక్ష్మణ** : న. ఇది గురుతుకును, పేరుకును, పు. లక్ష్మణస్వామికిని, స్త్రీ. ఓషధివిశేషముకును, (నాగ పత్రిచెట్టు అని చెప్పుదురు) ఆడసారస పక్షికిని, త్రి. లక్ష్మీవంతునకును పేరు.

దక్షిణ స్సరళాఽవామ
పరచ్ఛందానువర్తిషు॥ (44)
వాచ్యవద్దక్షిణాఽవాచీ
యజ్ఞదాన ప్రతిష్ఠయోః।

**దక్షిణ**: త్రి. ఇది యోగ్యమయినదానికిని, కుడిప్రక్కదానికిని, పరులచిత్తము గుర్తెరిగి ప్రవర్తించువానికిని, స్త్రీ. దక్షిణ దిక్కుకును, యాగ దక్షిణకును, ఖ్యాతికిని పేరు.

ద్రవిణం కాంచనే విత్తే
ద్రవిణం చ పరాక్రమే ॥ (45)

**ద్రవిణ** : చ. ఇది బంగారుకును, ధనముకును, పోటరితనముకును పేరు.

మసృ(ణః క)ణోఽకర్కశే స్నిగ్ధే
క్షుమాయాం మసృణా మతా।

**మసృణ** : త్రి. ఇది మెత్తని దానికిని, నున్నని దానికిని, స్త్రీ. నల్లగిసె చెట్టుకును పేరు.

ఊషణం మరి చే ఖ్యాతం
కణాయా మూషణా మతా॥

**ఊషణ**: న. ఇది మిరియాలకును, స్త్రీ. పిప్పళ్ళకును పేరు.

ధిషణ స్త్రిదశాచార్యే
ధిషణా ధియి సమ్మతా।

**ధిషణ** : పు. ఇది బృహస్పతికిని, స్త్రీ. బుద్ధికిని పేరు.

ధర్షణం స్యాత్పరిభవే
రతేసత్యాం తు ధర్షణీ॥ (47)

**ధర్షణ** : న. ఇది తిరస్కరించుటకును, సురతముకును, ఈ. స్త్రీ. రంకులాడికిని పేరు.

భీషయో దారుణే (రుద్రే)
గాఢే భీషణో శల్లకీ రసే।

**భీషణ**: త్రి. ఇది భయంకరమయిన దానికిని, గాఢమయిన దానికిని, పు. అందుగచెట్టుకును, భయానకరసము కును పేరు.

హరణం యౌ(తు)తకద్రవ్యే
భుజేఽపి హరణం హృతౌ॥ (48)

**హరణ** : న. ఇది వివాహకాలమందు వధూవరుల కిచ్చుద్రవ్యముకును, భుజముకును, హరించుటకును పేరు.

హరిణ స్స్యాత్కురంగేఽపి
హరిణః పాండురేఽన్యవత్।
హరిణీ హరితాయాం చ

**హరిణ** : పు. ఇది జింకకును, త్రి. తెల్లనిదానికిని పేరు.

**హరిణీ** : స్త్రీ. ఇది పచ్చ వన్నెగలదానికిని, సుందర

చారు స్త్రీ వృత్తభేదయోః ॥
సువర్ణ ప్రతిమాయాంచ
హార్షణో క్షిరుగంతరే ।
హార్షకే యోగభేదేచ
శ్రాద్ధదేవే పిచ క్వచిత్ ॥ (50)
శ్రవణం స్యాదృక్షభేదే
శ్రవణం శృతి కర్ణయోః ।
శ్రావణో మాసి పాషండే
దద్యాళ్యాం శ్రావణామాతా ॥
శ్రమణో యతి భేదేఽపి
శ్రమణో నింధ్యజీవిని ।
సుదర్శనా ముండితికా
మాంసీషు శ్రమణాం విదుః (52)
కళ్యాణ మక్షయే స్వర్ణే
కళ్యాణం మంగళేఽపి చ ।
కృపాణోఽసౌ కృపాణీతు
ఛురికాయాం చ కర్త రౌ ॥ (53)
సింహాణం కాచపాత్రే చ
లోహ నాసిక యోర్మలే ।
పురాణం వాచ్యవ త్ప్రత్నే
పురాణం పంచలక్షణే ॥ (54)
ప్రమాణం నిత్యమర్యాదా
సత్యవాది ప్రమాతృషు ।
ఏకతాయా మియత్తాయాం
హే(తు)తౌ శాస్త్రేషు చ స్మృతః ॥ (55)
నిర్యాణం వారణాపాంగ
దేశే మోక్షే చ నిర్గమే ।
నిర్మాణం నిర్మితౌ సారే

మయిన స్త్రీకిని, హరిణీవృత్త ముకును, బంగారు బొమ్మకును పేరు.

**హార్షణ** : పు. ఇది నేత్రరోగవిశేషముకును, త్రి. సంతోషమును జేయువానికిని, 14వ పంచాంగ యోగముకును, యమునికి పేరు.

**శ్రవణ**: శ్రవణానక్షత్రముకును, న. వినుటకును, చెవికిని పేరు.

**శ్రావణ**: పు. ఇది శ్రావణ మాసముకును, పాషండ మతస్థునికిని, స్త్రీ. వృక్షవిశేషముకును పేరు.

**శ్రమణ** : పు. ఇది బుద్ధసన్యాసికిని, త్రి. నింద్యమయిన జీవనము గలవానికిని, స్త్రీ. ఓషధివిశేషముకును, అలంబుషమను వృక్ష విశేషముకును, జటామాంసికిని పేరు.

**కల్యాణ** : న. ఇది నాశనము లేకపోవుటకును, బంగారుకును, వివాహాది శుభముల కును పేరు.

**కృపాణ** : పు. ఇది పెద్దకత్తికిని, ఈ. స్త్రీ. చూరకత్తికిని, కత్తెరకును పేరు.

**సింహాణ**: న. ఇది గాజుపాత్రకును, ఇనుపచిట్టముకును, చీమిడికిని పేరు.

**పురాణ**: త్రి. ఇది పురాతనమైనదానికిని, మత్స్యాది పురాణములకును పేరు.

**ప్రమాణ**: న. ఇది నిత్యమయిన దానికిని, హద్దుకును, నిజమును చెప్పువానికిని, కొలిచే వానికిని, ఏకత్వముకును, ఇంతమాత్రమ నుటకును, కారణముకును, శాస్త్రములకును పేరు.

**నిర్యాణ**: న. ఇది యేనుగ క్రేగంటి ప్రదేశముకును, మోక్షముకును, బయలు దేరుటకును పేరు.

**నిర్మాణ**: న. ఇది నిర్మించుటకును, బలముకును,

| | |
|---|---|
| నిర్మాణం చ సమంజసే ॥ (56) | సరియగుటకును పేరు. |
| నిర్వాణమస్తంగమనే | **నిర్వాణ:** న. ఇది నశించుటకును, సుఖముకును, |
| నిర్వృతౌ గజమజ్జనే। | యేనుగ నీటమునుగులాడుటకును, మోక్షముకు |
| అపవర్గే చ | ను పేరు. |
| కుర్వాణో భృత్య | **కుర్వాణ :** త్రి. ఇది సేవించువానికిని, చేయించు |
| కారక యోరపి ॥ (57) | వానికిని పేరు. |
| దౌర్వాణం మృష్టపర్ణే స్యా | **దౌర్వాణ :** న. ఇది మిరియపు చెట్టుకును, గరిక |
| ద్దూర్వాయాం స్వరసేపిచ। | కును, దూర్వారసముకును పేరు. |
| వారణం ప్రతి షే ధే స్యా | **వారణ :** న. ఇది నివారించుటకును, పు. ఏనుగ |
| ద్వారణశ్చ మతంగజే ॥ (58) | కును పేరు. |
| కారణం కరణే హేతు | **కారణ :** న. ప్రధానసాధనముకును, హేతువు |
| వధయోరపి కారణం। | కును, చంపుటకును, స్త్రీ. తీవ్రవేదనకును పేరు. |
| కారణా యాతనాయాం చ | |
| కృపణః కుత్సితే కృమే ॥ (59) | **కృపణ:** త్రి. కుటిలమైనదానికిని, పు. పురుగుకును పేరు. |
| కార్మణం మంత్ర తంత్రాది | **కార్మణ :** న. ఇది మంత్రములు మొదలగువాటిచే |
| యోజనే కర్మకారకే । | తను స్తంభనమోహనాదులను చేయుటకును, త్రి. |
| | కర్మను చేయించుటకును పేరు. |
| మార్గణం యాచనేऽన్వేష్యే | **మార్గణ :** న. ఇది యాచించుటకును, వెతకుట |
| మార్గణో యాచకే శరే ॥ (60) | కును, పు. యాచకునకును, బాణముకును పేరు. |
| మత్కుణో నిర్విషాణేభే | **మత్కుణ :** పు. ఇది దంతములు లేని యేనుగ |
| నిశ్శ్మశ్రుపురుషేऽపి చ। | కును, పేడి మూతికిని, నల్లికిని, కొబ్బరిచెట్టుకును |
| ఉద్దంశే నారికేళే చ | పేరు. |
| ధర్మణోऽహి ద్రుభేదయోః ॥ | **ధర్మణ :** పు. ఇది సర్పవిశేషముకును, వృక్షవిశేష |
| | ముకును పేరు. |
| కోంకణో దేశభే దేస్యా | **కోంకణ :** పు. ఇది కొంకణ దేశముకును, న. శస్త్ర |
| చ్ఛస్త్రభేదేతు కోంకణం। | విశేషముకును పేరు. |
| కంకణం శేఖరే హస్త | **కంకణ:** న. ఇది శిరోభూషణముకును, దీక్షాదుల యందు |
| సూత్ర మండనయోరపి ॥ (62) | కట్టిన హస్తసూత్రమునకును, కడియమునకును పేరు. |

పూరణః పూరకే పిష్ట
భేదే పూరణమిష్యతే।
పటారంభకసూత్రే చ
శాల్మలౌ పూరణీ మతా॥(63)

**పూరణ:** త్రి. ఇది పూరించువానికిని, న. పిండివంతులలోని భేదముకును, ఈ. స్త్రీ. బట్టపుంజమునకును, బూరుగు చెట్టుకును పేరు.

సుషేణః కరమర్దే పి
విష్ణుసుగ్రీవవైద్యయోః।
రోషణః పారదే హేమ
ఘర్షణోపలయోస్తథా॥ (64)

**సుషేణ:** పు. కలవిచెట్టుకును, విష్ణువుకును, సుగ్రీవుని వైద్యుడగు సుషేణునకును పేరు.

**రోషణ :** పు. ఇది పాదరసమునకును, బంగారుకును, ఒరుపుడు రాతికిని పేరు.

రోషణోऽపి విషాణం తు
క్రోడద్విరదదంతయోః।
పశోశ్శృంగే విషాణీ తు
మేషశృంగ్యాం ప్రకీర్తితా॥ (65)

**విషాణ :** న. ఇది పందికోరకును, గజ దంతముకును, పశువుల కొమ్ముకును, ఈ. స్త్రీ. కర్కాటకశృంగికిని పేరు.

కరేణుర్గజ హస్తిన్యోః
కర్ణికారే పి చ క్వచిత్।
హరేణుస్తు సతీ(నే) లే స్యా
ద్రేణుకా కులయోషితోః।

**కరేణు :** పు. ఇది ఏనుగకును, స్త్రీ. ఆడ యేనుగకును, పు. కొండగోగుచెట్టుకును పేరు.

**హరేణు :** పు. ఇది లంక లనెడు ధాన్యముకును, స్త్రీ. రేణుకయనెడి గంధద్రవ్యము కును, కులస్త్రీకిని పేరు.

సువర్ణం స్వర్ణమాత్రే స్యా
త్సువర్ణం కర్షవిత్తయోః।
సువర్ణశ్చ సువర్ణాలు
కృష్ణాగురు మఖాంతరే॥ (67)

**సువర్ణ:** న. ఇది బంగారుకును, కర్షమెత్తు బంగారు నాణెముకును, ధనముకును, పు. వృక్ష విషముకును, కృష్ణాగరుకును, యజ్ఞవిశేషముకును పేరు.

సుపర్ణ స్స్వర్ణచూడే స్యా
ద్గరుడే కృతమాలకే।
సుపర్ణా కమలిన్యాం చ
సుప (ర్ణా) ర్ణీ తార్క్ష్య మాతరి॥(68)

**సుపర్ణ :** పు. ఇది పాలపిట్టకును, గరుడున కును, రేలచెట్టుకును, స్త్రీ. పద్మలతకును, ఈ. గరుడుని తల్లికిని పేరు.

శ్రీపర్ణ మగ్నిమంథే బ్జే
శ్రీపర్ణీ శాల్మలౌ హఠే।
దుర్వర్ణం చ కువర్ణే స్యా
ద్వాస్తుకే రజతేऽపి చ॥ (69)

**శ్రీపర్ణ :** న. ఇది కూర నెల్లి చెట్టుకును, పద్మ ముకును, ఈ. స్త్రీ. బూరుగచెట్టుకును, తూడి కూరకును పేరు.

**దుర్వర్ణ :** త్రి. ఇది దుష్టవర్ణము గలదానికిని, న. చక్రవర్తి కూరకును, వెండికిని పేరు.

పత్త్రోర్ణం ధౌత కౌశేయే
పత్త్రోర్ణ శ్శ్యోణకేఽపి చ।
సంకీర్ణం నిచితే ప్రోక్త
మశుద్ధేచాపి భేద్యవత్ ॥ (70)
గోకర్ణో శ్వతరే సర్పే
సారంగే ప్రమథాంతరే।
అంగుష్ఠానామికోన్మానే
గోకర్ణీమూర్వికౌషధౌ ॥ (71)
అరణి ర్వహ్నిమంథేఽపి
స్మృతో నిర్మంథ్య దారుణి।
తరణి స్తరణౌ భానౌకుమా
ర్యోషధి నౌకయోః॥
విపణిః పణ్యవీధ్యాం చ భ
వేదాపణ పణ్యయోః।
ప్రవేణి ర్వేణి కుథయో

స్సరణిః పంక్తివర్త్మనోః॥
నిశ్శ్రేణి స్త్వధిరోహిణ్యాం
ఖర్జూరీపాదపేఽపిచ।
భరణీ శోణకే (ఘోషకే)
బుక్షే భరణం వేతనే భృతౌ॥
భ్రమణీ కారుండికాయాం
క్రీడాద్యాయామధీశితుః।
గ్రామణీ ర్భోగికే పత్యౌ
ప్రధానే నాపితేఽపి చ ॥ (75)
గ్రామణీ నీలికాయాం చ
గ్రామే(యా)యా పణ్యయోషితోః।
ధారణీ నాడికాయాం చ (76)

**పత్త్రోర్ణ :** న. ఇది తెల్ల పట్టుకును, పు. దుండిగపు చెట్టుకును పేరు.

**సంకీర్ణ :** త్రి. ఇది నిరవకాశమైన దానికిని, మలిన మైన దానికిని పేరు.

**గోకర్ణ :** పు. ఇది కంచరగాడిదకును, పాముకును, జింకలలోని భేదముకును, గోకర్ణుడను ప్రమథ దేవ తకును, లొడితెడుప్రమాణముకును, ఈ. స్త్రీ. చాగచెట్టుకును పేరు.

**అరణి :** పు. ఇది కూరనెల్లిచెట్టుకును, అగ్నిని మథించు కర్రకును పేరు.

**తరణి :** పు. ఇది తెప్పకును, సూర్యునకును, స్త్రీ. ఘృతకుమారీలతకును, నావకును పేరు. విపణి ఇది బజారుకును, అంగడికిని, అమ్మదగిన వస్తువు కును పేరు.

**ప్రవేణి :** స్త్రీ. ఇది జడకును, ఏనుగమీద పరచు చిత్రకంబళికిని పేరు.

**సరణి :** స్త్రీ. ఇది వరునకును, మార్గముకును పేరు.

**నిశ్శ్రేణి :** స్త్రీ. ఇది నిచ్చెనకును, ఖర్జూరపు చెట్టు కును పేరు.

**భరణీ :** పు. ఇది దుండిగపు చెట్టుకును, స్త్రీ. భరణీ నక్షత్రముకును, న. జీతముకును, కూలికిని పేరు.

**భ్రమణీ :** స్త్రీ. ఇది జలగకును, రాజుల యొక్క క్రీడకును పేరు.

**గ్రామణీ :** పు. ఇది గుర్రముల కాచువానికిని, ప్రభువుకును, ముఖ్యునకును, మంగలివానికిని, స్త్రీ. నీలిచెట్టుకును, గ్రామమందలి స్త్రీకిని, వెల యాలికిని పేరు.

**ధారణీ :** స్త్రీ. ఇది నరముకును, బుద్ధుని చేత

బుద్ధోక్తమంత్రభిద్యపి॥
ఇంద్రాణీ కరణే స్త్రీణాం
పౌలోమీ సింధువారయోః।
ఏషణీ వ్రణ మార్గను
సారిణ్యాం చ తులాభిది॥ (77)
క్షేపణీ జాలభేదే పి
నౌకాదండే పి కథ్యతే।
వారుణీగండదూర్వాయాం
ప్రతీచీ సురయోరపి॥ (78)
సారణీ స్వల్పసరితి
ప్రసారణ్యాం చ సారణీ।
సారణస్స్యాదతీసారే
సచివే రావణస్య చ॥ (79)
కాకిణీ పణతుర్యాం శే
మానదండేऽపి కాకిణీ।
కృష్ణవైకవరాటక్యో
స్స్యాదున్మానాంశకేऽపి చ॥ (80)
బ్రాహ్మణీ (హం) ఫంజికా
స్పృక్కా-ద్విజపత్నీషు విశ్రుతా।
విప్రే తు బ్రాహ్మణో వేదే
బ్రాహ్మణం ద్విజసంహతౌ॥
పక్షిణీ పూర్ణిమాయాం
స్యాత్పక్షిణీ శాకినీభిది।
ఆగామి వర్తమా నాహ
ర్యుక్తాయాం నిశి పక్షిణీ॥ (82)
రోహిణీ కటురోహిణ్యాం
రోహిణీ రోహిణా గవోః।
కంఠరోగాంతరే భే చ

చెప్పబడిన మంత్రవిశేషముకును పేరు.

**ఇంద్రాణీ :** స్త్రీ. ఇది స్త్రీలచేష్టకును, శచీదేవికిని, వావిలిచెట్టుకును పేరు.

**ఏషణీ :** స్త్రీ. ఇది పుండుననుసరించు క్రిమి విశేషముకును, త్రాసుకును పేరు.

**క్షేపణీ:** స్త్రీ. ఇది వలలోని భేదముకును, ఓడనడపు గెడకర్రకును పేరు.

**వారుణీ:** స్త్రీ. ఇది గరికెలోని భేదముకును పశ్చిమ దిక్కుకును, కల్లుకును పేరు.

**సారణీ:** స్త్రీ. ఇది శెలయేటికిని, గొంతెమ గోమరు చెట్టుకును, పు. అతిసార రోగము కును, రావణుని మంత్రికిని పేరు.

**కాకిణీ :** స్త్రీ. ఇది యిరువది గవ్వలు వెలకును, కొలకర్రకును, గురిగింజకును, గవ్వకును, నలుతుములోని భాగముకును పేరు

**బ్రాహ్మణీ :** స్త్రీ. ఇది గంటు భారంగికిని, స్పృక్కయనెడి గంధద్రవ్యముకును, బ్రాహ్మణుని భార్యకును, పు. బ్రాహ్మణునకును, వేదముకును, న. బ్రాహ్మణ సమూహముకును పేరు.

**పక్షిణీ :** స్త్రీ. ఇది పున్నమకును, శాకములు గల భూమికిని, రాబోవుచున్నట్టిన్ని జరుగుచున్నట్టిన్ని పగళ్ళతో గూడిన రాత్రికిని పేరు.

**రోహిణీ :** స్త్రీ. ఇది కటుకరోహిణికిని, ఎరుపు వర్ణముకును, గోవుకును, కంఠమందు పుట్టు రోగవిశేషముకును, రోహిణీ నక్షత్రమునకును,

సోమవల్ల్యాం చ రోహిణీ॥ (83) తెల్లచంద్ర చెట్టుకును పేరు.

★ అథ ణాంత శ్చతుర్వర్ణః ★

| | |
|---|---|
| ఆతర్పణం చ సౌహిత్యే<br>విద్యాదాలేపనేఽపి చ। | **ఆతర్పణ:** న. ఇది తృప్తిపొందుటకును, మంగళార్థమైనపూతకును, పేరు. |
| ఆథర్వణోఽప్యథర్వజ్ఞ<br>బ్రాహ్మణే చ పురోధసి॥ (84) | **ఆథర్వణ :** పు. ఇది అథర్వణ వేదమును జదివిన బ్రాహ్మణునకును, పురోహితునకును పేరు. |
| ఆరోహణం స్యాత్సోపానే<br>సమారోహే ప్రరోహణే। | **ఆరోహణ :** న. ఇది చీడీలకును, ఉన్నత ప్రదేశమునకెక్కుటకును, మొలచుటకును పేరు. |
| రక్తరేణుస్తు సింధూరే<br>పలాశకలికోద్గమే॥ (85) | **రక్తరేణు :** పు. ఇది సింధూరముకును, మోదుగ మొగ్గకును పేరు. |
| ఉత్క్షేపణం తు వ్యజనే<br>ధాన్యమర్దనవస్తుని। | **ఉత్క్షేపణ :** న. ఇది విసనికర్రకును, రోకలికిని పేరు. |
| ఉద్ధరణం సముద్ధార<br>వాంతాన్నేన్మూలనేష్వపి॥ (86) | **ఉద్ధరణ :** న. ఇది ఎత్తుటకును, కక్కిన యన్నముకును, పెల్లగించుటకును పేరు. |
| నిగరణం భోజనేఽపి<br>గళేనిగరణో మతః। | **నిగరణ :** న. ఇది భుజించుటకును, పు. కంఠముకును పేరు. |
| ని(శ్శ) స్సరణం స్యాన్మరణో<br>పాయ నిర్యాణముక్తిషు॥ | **నిస్సరణ:** న. ఇది మరణమునకును, ఉపాయముకును, బయలుదేరుటకును, మోక్షముకును పేరు. |
| సంసరణం రణారంభే<br>పురనిర్గమగోపురే।<br>ఘంటాపథేచ సంసారే<br>ఽప్యసంబాధ చ మూగతౌ॥(88) | **సంసరణ:** న. ఇది యుద్ధారంభముకును, బహిర్ద్వారముకును, 10 ధనస్సులవెడల్పుగల రాజవీధికిని, సంసారముకును, సమ్మర్దము లేక సేనలునడుచుటకును పేరు. |
| నిస్తరణం స్యాదుపాయే<br>నిసారే నిర్గమేఽ పి చ। | **నిస్తరణ :** న. ఇది ఉపాయముకును, దాటుటకును, బయలుదేరుటకును పేరు. |
| విదారణం రణే భేదే<br>విడంబే చ విదారణం॥ (89) | **విదారణ :** న. ఇది యుద్ధముకును, భేదించుటకును, మోసముకును పేరు. |
| నిరూపణం స్యాదాలోకే<br>విచారేఽపి నిదర్శనే। | **నిరూపణ :** న. ఇది చూచుటకును, విచారించుటకును, దృష్టాంతముకును పేరు. |

నారాయణో ప్యచ్యుతే భీరు
గౌర్యోర్నా రాయణీం విదుః॥ (90)
పరాయణ మభీష్టే స్యా
త్తత్పరాశ్రయయోరపి।
పారాయణం సమాసంగే
కార్త్స్న్యే పారగతావపి॥
కార్షాపణః కార్షికే స్యా
త్పణషోడశకేऽపి చ।
కామగుణ స్మృతో రాగే
విషయా భోగయోరపి॥ (92)
పరీరణ స్స్యాత్కమఠే
దండే స్యాత్పట్టశాటకే।
సమీరణ స్స్యాత్పవనే
పథికే చ ఫణిజ్ఝకే॥ (93)
పర్వరీణస్తు పర్ణస్య
శిరాయాం ద్యూతకంబళే।
పర్ణవృంతరసేऽపి స్యా
త్పర్వరీణం తు పర్వణి॥ (94)
తండురీణః కీటమాత్రే
వర్వరే తండులోదకే।
మీనాత్రీణో దర్దు రామే
మీనాత్రీణశ్చ ఖంజనే॥ (95)
ప్రవారణం నిషేధే స్యా
త్కామ్యదానే ప్రవారణం।
జుహురాణో ప్యనలేऽధ్వర్యా
రేరిహాణో హరేऽ oబరే॥
దేవమణి శ్శివే శ్వస్య
కంఠావర్తే చ కౌస్తుభే।

**నారాయణ** : పు. ఇది విష్ణువుకును, ఈ. స్త్రీ. పిల్లిపిచ్చరకును, పార్వతికిని పేరు.

**పరాయణ** : త్రి. ఇది ఇష్టమైన దానికిని, ఆసక్తిగల దానికిని, ఆధారమైన దానికిని పేరు.

**పారాయణ** : న. ఇది కలయికకును, సాకల్యావచన ముకును, తుదముట్టుటకును పేరు.

**కార్షాపణ** : పు. కర్షమెత్తు వెండిముద్రకును, 16 కర్షమెత్తు రాగిముద్రలకును పేరు.

**కామగుణ** : పు. ఇది అనురాగముకును, భోగసాధ నమైన వస్తువుకును, పరిపూర్ణత్వ ముకును పేరు.

**పరీరణ** : పు. ఇది తాబేటికిని, దండముకును, పట్టుశాటీకిని పేరు.

**సమీరణ** : పు. ఇది వాయువకును, మార్గస్థున కును, మరువపు చెట్టుకును పేరు.

**పర్వరీణ** : పు. ఇది ఆకులయందుండు ఈనెకును, జూదమాడుటకు పరచిన కంబళికిని ఆకుతొడిమెల రసముకును, కణుపుకును పేరు.

**వర్వరీణ** : పు. ఇది పురుగుకును, త్రి. తుచ్ఛమైన దానికిని, కడుగునకును పేరు.

**మీనాత్రీణ** : పు. ఇది అన్నోపకరణమగు వ్యంజన విశేషముకును, కాటుగపిట్టకును పేరు.

**ప్రవారణ** : న. ఇది నివారించుటకును, స్త్రీరత్నాది శ్రేష్ఠవస్తువుల దానముకును పేరు.

**జుహురాణ** : పు. ఇది అగ్నికిని, అధ్వర్యునకును పేరు.

**రేరిహాణ** : పు. ఇది శివునకును, ఆకసముకును పేరు.

**దేవమణి** : పు. ఇది శివునకును, అశ్వము యొక్క మెడ క్రిందనుండు సుడికిని, కౌస్తుభమాణిక్యముకును పేరు.

చూడామణి శ్శిరోరత్నే
కాకచించాఫలేఽపి చ॥
పరవాణిః స్మృతో ధర్మా
ధ్యక్ష వత్సరయోరపి।
శరవాణి శ్శరముఖే
సాయకే శరజీవిని॥ (98)
లంబకర్ణ స్మ్మృతోఽంకోల
పాదపే ఛగలేఽపి చ।
రాగచూర్ణ స్మ్మరే దంత
ధావనే రక్తవాలుకే॥ (99)
హస్తికర్ణోఽరుబూకే స్యా
త్పలాశ గణభేదయోః।
చీర్ణపర్ణస్తు నింబే స్యా
త్ఖర్జూరీ భూరుహేఽపి చ॥
తైలపర్ణీ మలయజే
శ్రీవాసే సిల్హకేఽపి చ।

పీలుపర్ణీ తు బింబాయాం
మూర్వాయా మోషధీభిది॥
దాక్షాయణీత్వపర్ణాయాం
రోహిణ్యాం తారకాసు చ।
పుష్కరిణీ సరోజిన్యాం
హస్తిన్యాం చ జలాశయే॥
శిఖరిణీ స్యాద్రోమాళ్యాం
రసాలా వృత్తభేదయోః।
స్త్రీరత్నే మల్లికాయాంచ
ప్రోక్తాశిఖరిణీ బుధైః॥ (103)

**చూడామణి :** పు. ఇది శిరమున ధరించు రత్నము కును, గురివెందగింజకును పేరు.

**పరవాణి :** పు. ఇది ధర్మకార్యములయందు నియోగించబడిన అధికారికిన్ని, సంవత్సరముకును పేరు.

**శరవాణి :** పు. ఇది బాణపు ములికికిని, బాణము కును, పదాతికిని పేరు.

**లంబకర్ణ :** పు. ఇది ఊడుగచెట్టుకును, మేకపోతు కును పేరు.

**రాగచూర్ణ :** పు. ఇది మన్మధునకును, చండ్ర చెట్టుకును, సింధూరముకును పేరు.

**హస్తికర్ణ :** పు. ఇది ఆముదపుచెట్టుకును, మోదుగ చెట్టుకును, దేవతాగణ విశేషముకును పేరు.

**చీర్ణపర్ణ :** పు. ఇది వేపచెట్టుకును, ఖర్జూర వృక్షము కును పేరు.

**తైలపర్ణి :** పు. ఇది మంచిగంధముకును, తురుష్క దేశమున బుట్టిన దేవదారు బంక తో చేసిన ధూప ద్రవ్యముకును, అందుగ బంకతో చేసిన ధూపద్రవ్య ముకును పేరు.

**పీలుపర్ణి :** స్త్రీ. ఇది దొండచెట్టుకును, చాగచెట్టు కును, చేకోణదిచెట్టుకును పేరు.

**దాక్షాయణి :** స్త్రీ. ఇది పార్వతికిని, రోహిణీ నక్షత్ర ముకును, 27 నక్షత్రములకును పేరు.

**పుష్కరిణి :** స్త్రీ. ఇది పద్మలతకును, ఆడ యేనుగ కును, తటాకముకును పేరు.

**శిఖరిణి :** స్త్రీ. ఇది రోమరాజికిని, పెరుగులో ననేక ద్రవ్యములు గూర్చి చేసిన పానీయద్రవ్యముకును, శిఖరిణీవృత్తము కును, నారీరత్నముకును, మల్లితీగ కును పేరు.

అంగారిణీ హసంత్యాం చ
భాస్కరత్యక్తదిశ్యపి ।
భవేద్వైతరణీనద్యాం
ప్రేతానాం యాతుమాతరి॥

**అంగారిణీ :** స్త్రీ. ఇది కుంపటికిని, సూర్యునిచేత విడువబడిన దిక్కునకును పేరు.
**వైతరణీ:** స్త్రీ. ఇది నరకమందలి నదికిని, రాక్షసుల తల్లికిని పేరు.

★ అథ ణాంతః పంచవర్ణః ★

అవగ్రహణ మిత్యాహుః
ప్రతిరోధే ప్యనాదరే।
ప్రవిదారణమాఖ్యాతం
సంగరేచ విదారణే ॥(105)

**అవగ్రహణ:** న. అభ్యంతరమునకును, తిరస్కారమునకును పేరు.
**ప్రవిదారణ :** న. ఇది యుద్ధమునకును, ఛేదించుటకును పేరు.

అవతారణం భూతాది
గ్రహే వస్త్రాంచలేऽర్చనే ।
రోమహర్షణ మిత్యేత
ద్రోమాంచేऽపి విభీతకే ॥(106)

**అవతారణ:** న. ఇది భూతపిశాచాదిగ్రహమునకును, బట్టచెంగునకును, పూజకును పేరు.
**రోమహర్షణ:** న. ఇది గగుర్పాటునకును, పు. తాండ్రచెట్టునకును పేరు.

పరిభాషణమాలాపే
నియమే పరిభాషణం।
నిందోపాలంభవచనే
పరిభాషణమిష్యతే॥ (107)

**పరిభాషణ :** న. సంభాషణమునకున్ను, నియమమునకును, నిందతోగూడిన యుపాలంభవచనమునకును పేరు (ఉపాలంభ మనగా దుర్వాదము).

మత్తవారణ మిచ్ఛంతి
దాన్తక్లిన్నకటద్విపే।
మహాప్రాసాదవీధీనాం
వరండే చావ్యపాశ్రయే॥ (108)

**మత్తవారణ :** పు. ఇది మదముచేతడసిన గండస్థలముగల ఏనుగకును, న. మేడ చోపాయొక్క కటకటాలు గట్టిన వరండాకును, ఇంటిముందటి యావరణకును పేరు.

వాతరాయణ ఉన్మత్తే
నిష్ప్రయోజన పూరుషే।
కాండేచ కరపత్రేచ
కూటేచ శరసంక్రమే॥ (109)

**వాతరాయణ :** పు. ఇది పిచ్చివానికిని, వ్యర్థునకును, బాణమునకును, రంపమునకును, సానపట్టు యంత్రమునకును, బాణసంచారమునకును పేరు.

మండూకపర్ణోऽరళ్ణక్షే
స్యోనాకేచ కపీతనే।
మండూకపర్ణీ మంజిష్ఠా

**మండూకపర్ణ :** పు. ఇది పెనుమ్రానునకును, దుండిగపుచెట్టునకును, దరిశెనచెట్టునకును, ఈ. స్త్రీ. మంజిష్టయను గంధద్రవ్య మునకును, మండూక

| | |
|---|---|
| బ్రాహ్మీ గోజిహ్వికాసు చ॥(110) | బ్రహ్మీచెట్టుకును, యెద్దునాలుకచెట్టుకును పేరు. |
| ★ అథ ణాంత షడ్వర్ణః ★ | |
| దోహద లక్షణం గర్భే<br>వయస్సంధౌ చ దృశ్యతే।<br>యౌవన లక్షణాభిఖ్యా<br>లావణ్యే చ పయోధరే॥(111) | **దోహదలక్షణ :** న. ఇది స్త్రీలగర్భముకును, బాల్యయౌవనాది వయస్సుల సంధికిని పేరు.<br>**యౌవనలక్షణ :** న. ఇది స్త్రీలయొడలి యందలి నిగనిగకును, కుచముకును పేరు. |
| ★ అథతాంత వర్గః ★ | |
| తతం వితతవద్వ్యాప్తే<br>విస్తృతే వాచ్యవన్మతం। | **తత :** త్రి. ఇది వితతశబ్దమువలెను, వ్యాప్తమైన దానికిని, విస్తారమైన దానికిని పేరు. |
| తతం వీణాదివాద్యే స్యా<br>త్పవమానే తతః పునః॥(1) | **తత :** న. ఇది వీణాదుల వాద్యముకును, పు. వాయువుకును పేరు. |
| ఇతంగతే చ విజ్ఞాతే | **ఇత :** త్రి. ఇది గడచిన దానికిని, తెలియ బడిన దానికిని పేరు. |
| రతం సురతగుహ్యయోః। | **రత :** న. ఇదిసురతముకును, మర్మాంగముకును పేరు. |
| ఋత ముంఛశిలే తోయే<br>దీప్తే సత్యేऽభిపూజితే॥(2) | **ఋత :** న. ఇది ఉంఛశిలావృత్తులకును, జలముకును, త్రి. ప్రకాశింప జేయబడిన దానికిని, న. యథార్థముకును, త్రి. పూజింపబడిన దానికిని పేరు. |
| కృతం యుగేऽపి పర్యాప్తే<br>విహితే హింసితే ఫలే। | **కృత :** న. ఇది కృతయుగముకును, సమృద్ధికిని, త్రి. చెయ్యబడిన దానికిని, హింసింపబడిన దానికిని, న. ఫలముకును పేరు. |
| ఘృతమాజ్యే ప్రదీప్తే చ<br>సలిలే చ ఘృతం మతం॥(3) | **ఘృత :** న. ఇదినేతికిని, త్రి. ప్రకాశింపచేయబడిన దానికిని, న. ఉదకముకును పేరు. |
| మృతం స్యాద్యాచితే మృత్యౌ<br>మృత్యుమత్య భి ధేయవత్। | **మృత :** న. ఇది యాచనావృత్తికిని. చావుకును, త్రి. చచ్చిన వానికిని పేరు. |
| గతం తు యాత్రా ధిగతే | **గత :** న. నడచుటకును, త్రి. పొందబడినదానికినిపేరు. |
| మతం పూజిత సమ్మతే॥ (4) | **మత :** త్రి. ఇది పూజింపబడిన దానికిని, ఇష్టమైన దానికిని పేరు. |
| ధుతం త్యక్తే విధూతే చ | **ధుత :** త్రి. ఇది విడువబడిన దానికిని, కదల్చబడిన |

దానికిని పేరు.

ధూతం కంపిత భర్త్సితే। — **ధూత :** త్రి. ఇది కదల్చబడిన దానికిని, బెదరింప బడిన దానికిని పేరు.

పూతం పవిత్రే రటితే
పూతం చ బహూళీకృతే॥ (5) — **పూత :** త్రి. ఇది పవిత్రమైన దానికిని, చెప్పబడిన దానికిని, న. యెగరబోసిన ధాన్యముకును పేరు.

శ్రుతం శాస్త్రావధృతయోః — **శ్రుత :** న. ఇది శాస్త్రముకును, త్రి. వినబడిన దానికిని పేరు.

స్యూత మూత ప్రసేవయోః। — **స్యూత :** త్రి. కుట్టబడిన దానికిని, పు. పళ్ళిక తట్టకును పేరు.

నతం స్యాద్వాచ్యవన్నమ్రే
నత స్తగరపాదపే॥ (6) — **నత :** త్రి. ఇది వంగిన దానికిని, పు. గ్రంధితగరపు చెట్టుకును పేరు.

ద్రుతం శీఘ్రే విలీనే చ
విద్రావే చాభి దేయవత్। — **ద్రుత :** త్రి. ఇది శీఘ్రముకును, కరగబడిన సువ ర్ణాదులకును, పరుగెత్తుటకును పేరు.

యుతం హస్త చతుష్కే స్యా
ద్యుతం యుక్తేఽపృథగ్యుతం॥ (7) — **యుత:** న. ఇది నాలుగు చేతుల ప్రమాణ ముకును, త్రి. సమ్మేళనమైన దానికిని పేరుగాని దానికిని పేరు.

స్థితం భవేద్గత్యభావే
సుప్రతిజ్ఞే సునిశ్చితే। — **స్థిత :** త్రి. ఇది గమన శూన్యమైన దానికిని, ప్రతిజ్ఞ చేయబడిన దానికిని, నిశ్చయింపబడిన దానికిని పేరు.

సిత స్సమాప్తె ధవళే
నిబద్ధ జ్ఞాతయోరపి॥ (8) — **సిత :** త్రి. ఇది సమాప్తిబొందిన దానికిని, తెల్లని దాని కిని, కట్టబడిన దానికిని, తెలియబడిన దానికిని పేరు.

శితం శాతం చ నిశితే
కృశే శాతం చ శర్మణి। — **శిత (శాత) :** త్రి. ఇవి తీక్షమైన దానికిని, సన్నమైన దానికిని పేర్లు. న. ఇది సుఖమునకు పేరు.

హితం ధృతే గతే పథ్యే — **హిత :** త్రి. ధరించబడిన దానికిని, పొందబడిన దానికిని, ఇష్టమైనదానికిని పేరు.

సుతః పార్థివపుత్రయోః॥ (9) — **సుత :** పు. ఇది రాజుకును, పుత్రునకును పేరు.

ప్లుతం తురంగమగతౌ
ప్లుతమాహు స్త్రిమాత్రకే। — **ప్లుత :** న. ఇది అశ్వగతి విశేషముకును, పు. త్రిమాత్రకాలముకును పేరు.

ప్రోతస్తు గుంభితే వస్త్రే — **ప్రోత :** త్రి. ఇది గుచ్చబడిన దానికిని, న. వస్త్రము కును పేరు.

ప్రేతో భూతాంతరే మృతే॥

**ప్రేత :** పు. ఇది పిశాచ విశేషముకును, త్రి. చచ్చిన వానికిని పేరు.

సూతస్తు సారధౌ త్వష్ణి
ప్రసూతే ప్రేరితేఽపి చ।
క్షత్రియా ద్బ్రాహ్మణీజేఽపి
సూతః పారద వందినోః॥

**సూత:** పు. సారధికిని, వడ్లవానికిని, త్రి. ప్రసవించ బడిన దానికిని, ప్రేరేపించబడిన దానికిని పేరు.
**క్షత్రియ :** పు. ఇది క్షత్రియునివలన బ్రాహ్మణస్త్రీ యందు పుట్టిన వానికిని, పాదరసముకును, స్తుతి పాఠకునకును పేరు.

శ్వేతం రూప్యేఽన్యవచ్ఛుక్లే
శ్వేతో ద్వీపా ద్రి భేదయోః।
శ్వేతా వరాటికా కాష్ఠ
పాటలీ శంఖినీషు చ॥(12)

**శ్వేత :** న. ఇది వెండికిని, త్రి. తెల్లని దానికిని, శ్వేత ద్వీపముకును, శ్వేత పర్వతముకును, స్త్రీ. గవ్వకును, తెల్లకలిగొట్టు చెట్టుకును, (దీనినే పాదిరి చెట్టందురు) కట్లి చెట్టుకును పేరు.

సత్ప్రశస్తే విద్యమానే
సత్యాభ్యర్హిత సాధుషు।

**సత్ :** త్రి. ఇది శ్రేష్ఠమైన దానికిని కలిగియున్న దానికిని, యథార్థమైన దానికిని, పూజింపబడిన దానికిని, సజ్జనునకును పేరు.

సతీ పతివ్రతా గౌర్యో
రేతః కర్బుర ఆగతే॥(13)

**సతీ :** స్త్రీ. ఇది పతివ్రతకును, పార్వతికిని పేరు.
**ఏత :** త్రి. ఇది కర్బురవర్ణమైన దానికిని, వచ్చిన దానికిని పేరు.

తాతోఽనుకంప్యే జనకే
జాతం జాత్యోఘ జన్మసు।

**తాత :** పు. ఇది కరుణించదగిన వానికిని, తండ్రికిని పేరు.
**జాత :** పు. ఇది జాతికిని, సమూహముకును, పుట్టుగకును పేరు.

పాత స్స్యాత్పతనే త్రాతే

**పాత :** పు. ఇది పడుటకును, త్రి. రక్షించ బడిన దానికిని పేరు.

ఘాతః కాండ ప్రహారయోః॥
పోతశ్శిశౌ వహిత్రే చ
గృహస్థానే చ వాససి।
గీతం తు శబ్దితే గానే

**ఘాత:** పు. ఇది బాణముకును, గాయము కును పేరు.
**పోత:** ఇది పిల్లవానికిని, పు. కలమనెడి యోడకును, గృహప్రదేశముకును, వస్త్రముకును పేరు.
**గీత :** త్రి. ఇది ధ్వనిచేయబడిన దానికిని, న. గానముకును పేరు.

ప్రీతం హృషిత నర్మణోః॥

**ప్రీత :** త్రి. ఇది సంతోషపెట్టబడినవానికిని, క్రీడకును పేరు.

వీతం చాసారహస్త్యశ్వే
వీతమంకుశకర్మణి।
భీతం భయే భయయుతే
వాచ్యవత్పరికీర్తితం॥ (16)

**వీత**: న. ఇది యుద్ధమందు సమర్థముగాని గజాశ్వములకును, అంకుశముచేత బొడుచుటకును పేరు.
**భీత** : న. ఇది భయముకును, త్రి. భయము గలవానికిని పేరు.

భూతం క్ష్మాదౌ పిశాచాదౌ
న్యాయ్యేస (త్వ్యేప) త్యసమా
నయోః॥భూతో దేవలకే
ప్రాప్తవృత్తయోర భి ధేయవత్॥(17)

**భూత**: న. ఇది పృథివ్యాది పంచభూతములకును, భూత ప్రేత పిశాచాదులకును, న్యాయముకును, సత్యముకును, సామ్యముకును, పు. జీవనార్థము దేవతా పూజ చేయువానికిని, త్రి. పొందబడిన దానికిని, వర్తించుదానికిని పేరు.

కేతుర్ద్యుతౌ పతాకాయాం
గ్రహా (త్పాతారిలక్ష్మసు)
పాహిత లక్ష్మసు।
సేతు రాళౌ చ వరుణే

**కేతు** : పు. ఇది కాంతికిని, జండాకును, కేతు గ్రహముకును, ఉపద్రవసూచకమగు తోకచుక్క మొదలైన వాటికిని, చిహ్నాకును పేరు.
**సేతు** : పు. ఇది పొలముచుట్టు వేసిన కోరడికిని, ఉలిమిడి చెట్టుకును పేరు.

క్రతుర్యజ్ఞే మునే ర్భిది॥ (18)

**క్రతు**: పు. ఇది యజ్ఞముకును, క్రతు మహామునికిని పేరు.

ధాతు స్స్యాదశ్మవికృతౌ
విషయేష్వింద్రియేషు చ।
భూవాది రసరక్తాది
శ్లేష్మాది వసుధాదిషు॥ (19)
వర్తతే ధాతుశబ్దోऽయం
విశేషా ద స్థ్నిగైరకే।

**ధాతు** : పు. ఇది గైరికము, మణిశిలమొదలయిన వాటికిని, శబ్దస్పర్శాది విషయములకును, త్వగాదింద్రియములకును, భూపచ, పఠాది ధాతువులకును, రసాది శారీర ధాతువులకును, శ్లేష్మవాతపిత్తములకును, పృథివ్యాది పంచ భూతములకును, ఎముకకును, గైరికమునకును పేరు.

ఋతుః స్త్రీ కుసుమే భాసి
వసంతాదిషు కీర్త్యతే॥ (20)

**ఋతు** : పు. ఇది ముట్టురక్తముకును, కాంతికిని, వసంత గ్రీష్మాది ఋతువుల కును పేరు.

గాతుః పుంస్కోకిలే భృంగే
గంధర్వే రోషణేऽపి చ।

**గాతు** : పు. ఇది మగకోయిలకును, తుమ్మెదకును, గంధర్వునకును, త్రి. కోపస్వభావముగలవానికిని పేరు.

మంతు స్స్యాదపరాధేऽపి
మనుష్యేऽపి ప్రజాపతౌ॥

**మంతు** : పు. ఇది అపరాధముకును, మనుష్యునకును, బ్రహ్మకును పేరు.

| | |
|---|---|
| దూర్తస్స్యాత్షండలవణే<br>ఖల దుత్తూర యోరపి। | **దూర్త** : పు. ఇది సముద్రతీరమున పుట్టిన ఉప్పునకును, వంచకునకును, ఉమ్మెత్తచెట్టుకును పేరు. |
| పూర్తంతు పూరితే ఛన్నే<br>పూర్తం ఖాతాది కర్మణి॥ | **పూర్త**: త్రి. ఇది పూరించబడినదానికివి, కప్పబడిన దానికిని, తటాకాదులను త్రవ్వించుటకును పేరు. |
| మూర్తం మూర్తిమతి ఖ్యాతం<br>మూర్ఛాలే కఠినే న్యవత్। | **మూర్త** : త్రి. ఇది ఆకృతిగల దానికిని, మూర్ఛ పొందినదానికిని, కఠినమైనదానికిని పేరు. |
| గర్త స్త్రీ గర్త (భేదే) దేశేస్యా<br>దవటే చ కుకుందరే॥ | **గర్త** : పు. ఇది త్రిగర్త దేశముకును, గోతికిని, స్త్రీల పిరుదులమీది చిరుగుంటలకును పేరు. |
| ఆప్త స్సత్యే హితే లబ్ధే | **ఆప్త**: త్రి. ఇదిసత్యమైనదానికిని, ఇష్టమైన దానికిని, పొందబడినదానికిని పేరు. |
| ప్రాప్తం విత్తే సమంజసే।<br>వ్యాప్తం ఖ్యాతే సమాక్రాంతే | **ప్రాప్త**: న. ఇది ధనముకును, యుక్తమైన దానికిని పేరు. **వ్యాప్త** : త్రి. ఇది ప్రసిద్ధమైనదానికిని, వ్యాపింపబడిన దానికిని పేరు. |
| గుప్తం రక్షిత గూఢయోః॥ | **గుప్త** : త్రి. ఇది రక్షించబడినదానికిని, దాచబడిన దానికిని పేరు. |
| లిప్తం విషాక్తే భుక్తే చ<br>వాచ్యవత్స్యాద్వి లేపితే। | **లిప్త** : త్రి. ఇది విషముచేత పూయబడినదానికిని, భక్షించబడిన దానికిని, పూయబడినదానికిని పేరు. |
| దీప్తం నిర్భాసితే దగ్ధే<br>వదంతి జ్వలి తేఽపి చ॥ (25) | **దీప్త** : త్రి. ఇది ప్రకాశింపచేయబడిన తగులబెట్టబడిన దానికిని, ప్రజ్వాలింపచేయ బడినదానికిని పేరు. |
| అస్తం క్షిప్తే గతే ప్రోక్త<br>మస్తః పశ్చిమ భూధరే। | **అస్త**: త్రి. ఇది చిమ్మబడినదానికిని, అవసానమును పొందినదానికిని, పు. అస్తాద్రికిని పేరు. |
| గ్రస్తం గ్రాసీకృతేఽపి స్యా<br>ల్లుప్త వర్ణ పదోదితే॥ (26) | **గ్రస్త** : త్రి. ఇది భక్షించబడినదానికిని, లోపించిన వర్ణములు పదములు గల వాక్యముకును పేరు. |
| పుస్తం తు పుస్తకే లే (ఖ్య) ప్య<br>కర్మ విజ్ఞాన యోరపి। | **పుస్త**: ఇది పుస్తకముకును, బొమ్మలు మొదలగునవి చేయుటకును, శిల్పమందును, శాస్త్రమందును ప్రవేశించు బుద్ధికిని పేరు. |
| శస్తం క్షేమే ప్రశస్తే చ | **శస్త** : న. ఇది క్షేమముకును, త్రి. ప్రసస్తమైన దానికిని పేరు. |

వ్యస్తం వ్యాప్తి చ సంకు లే ॥

**వ్యస్త** : త్రి. ఇది వ్యాప్తమైనదానికిని, వ్యాకులమైన దానికిని పేరు.

హస్తోనక్షత్ర భేదేస్యా
త్కరే భకరయోరపి।

**హస్త** : పు. ఇది హస్తానక్షత్రముకును, హస్తముకును, గజతుండముకును, కచపర్యాయములకంటే పరమైన హస్త శబ్దము శ్రేష్ఠవాచకమునకును, చాచిన వ్రేళ్ళుగల మోచేతికిని పేరు. (అనగా మూర)

విత్తం ఖ్యాతే ధనే లబ్ధే
విత్తం జ్ఞాతే విచారితే।

**విత్త** : త్రి. ఇది ప్రసిద్ధమైనదానికిని, న. ధనముకును, త్రి. పొందబడినదానికిని, తెలియబడినదానికిని, విచారించబడిన దానికిని పేరు.

కృత్తం తు చేష్టితే భిన్నే
దత్తం విశ్రాణితేఽర్చితే ॥

**కృత్త**: త్రి. ఇదిచేష్టకును, నరకబడినదానికిని పేరు.

**దత్త** : త్రి. ఇది ఇవ్వబడినదానికిని, పూజింపబడినదానికిని పేరు.

వృత్తోఽతీతే దృఢే ఖ్యాతో
వర్తులేఽపి వృతే మృతే।
వాచ్యవద్వర్తతే వృత్తం
చరిత్ర చ్ఛందసోరపి ॥ (30)

**వృత్త** : త్రి. ఇది అతిక్రమించినదానికిని, దృఢమైన దానికిని, వర్తులమైనదానికిని, ఆవరణచేయబడిన దానికిని, చచ్చిన దానికిని, న. చరిత్రముకును, పద్య వృత్తముకును, పేరు.

అంతః ప్రాంతేఽంతికే నాశే
స్వరూపేఽతిమనోహరే।

**అంత** : పు. ఇది అగ్రముకును, సమీపముకును, నాశముకును, ఆకారముకును, త్రి. మిగుల మనోహరమైన దానికిని పేరు.

వృంతం ప్రసవబంధే స్యా
ద్ఘటధారా కుచాగ్రయోః॥

**వృంత** : న. ఇది పుష్పఫలాదుల తొడిమెకును, కడవ నుంచి పడు జలధారకును, చనుమొనకును పేరు.

దంతో నికుంజే దశనే
దంత స్సానుని కథ్యతే।

**దంత** : పు. ఇది పొదరింటికిని, కోరకును, కొండ చరియకును పేరు.

దంతీ స్యాదోషధీభేదే

**దంతి** : స్త్రీ. ఇది దంతి చెట్టుకు పేరు.

స్వాంతం చేతసి గహ్వరే॥

**స్వాంత** : న. ఇది మనస్సుకును, గుహకు ను పేరు.

కుంతః ప్రాసే చండభావే
క్షుద్రజంతౌ గవేధుకే।
కుంతీ పాండుప్రియాయాం చ

**కుంత** : పు. ఇది బల్లెముకును, కోపస్వభావముకును, నల్లికిని, అడవి గోధుమలకు ను, ఈ. స్త్రీ. పాండురాజు భార్యకును, అందుగ చెట్టుకును,

శల్లక్యాం గుగ్గులుద్రుమే॥
కాంతో శ్మని గృహే చారౌ
కాంతా తు ఫలినీ స్త్రియోః।

గుగ్గిలపు చెట్టుకును పేరు.
**కాంత**: పు. ఇది అయస్కాంత శిలకును, ఇంటికిని, త్రి. సుందరమైనదానికిని, స్త్రీ. ప్రేంఖణపు చెట్టుకును, స్త్రీకిని పేరు.

శాంతో రసవిశేషే స్యా
దభియుక్తక దాంతయోః॥(34)
ఉక్తమే కాక్షరచ్ఛంద
స్యుక్తం స్యాద్భాషితేऽపి చ।
శుక్తోऽమ్లే పరుషే పూతే

**శాంత** : పు. ఇది శాంతరసముకును, పరులచేత నరికట్టబడినవారికిని, ఓరిమిగల వానికిని పేరు.
**ఉక్త** : న. ఇది పద్యవృత్తవిశేషముకును, వాక్యముకును పేరు.
**శుక్త**: త్రి. ఇది పుల్లని దానికిని, కఠినమైన దానికిని, పవిత్రమైన దానికిని పేరు.

వ్యక్తం స్ఫుటమనీషిణోః॥
తిక్తోరసే సుగంధే చ
తిక్తం పర్పటకే స్మృతం।
తిక్తాతు కటురోహిణ్యాం
రిక్తం కాననశూన్యయోః॥
రక్తం స్యాత్కుంకుమే తామ్రే
ప్రాచీనామలకేऽపి చ।
అనురాగిణి నీల్యాది
రంజితేలోహితేऽన్యవత్॥ (37)
యంతా హస్తిపకే సూతే
వప్తా పితరిపావకే।
త్రేతా యుగేऽగ్నిత్రితయే

**వ్యక్త** : త్రి. స్పష్టమైన దానికిని, ప్రాజ్ఞునకును పేరు.
**తిక్త** : పు. ఇది వగరుకును, తృణవిశేషముకును, న. పర్పాటకమను గంధద్రవ్యముకును, స్త్రీ. కటుకరోహిణికిని పేరు.
**రిక్త** : న. అడవికిని, శూన్యమైన దానికిని పేరు.
**రక్త** : న. కుంకుమకును, రాగికిని, ఉసిరిగ చెట్లలోని భేదముకును త్రి. అనురాగముగల వానికిని రంగు వేయబడిన దానికిని, యెరుపువర్ణముగల దానికిని పేరు.
**యంతా** : పు. ఇది మావటివానికిని, సారథికిని పేరు.
**వప్తా** : పు. ఇది తండ్రికిని, అగ్నికిని పేరు.
**త్రేతా**: స్త్రీ. ఇది త్రేతాయుగముకును, ఆహవనీయ, గార్హపత్య, దక్షిణాగ్నులకును పేరు.

భర్తా స్వామిని ధారకే॥ (38)
శాస్తాచ శాసకే బుద్ధే
వక్తా వాగ్మిని పండితే।

**భర్తా** : పు. ప్రభువుకును, మగనికిని పేరు.
**శాస్తా**: పు. శిక్షకునకును, బుద్ధదేవునకును పేరు.
**వక్తా** : పు. ఇది యుక్తియుక్తమైన మాటలాడు వానికిని, పండితునకును పేరు.

ముక్తాతుమౌక్తికే ముక్తః

**ముక్తా**: స్త్రీ. ఇది ముత్యముకును, త్రి. మోక్షమును

ప్రాప్తముక్తే చ మోచితే॥
క్షత్తా శూద్రాత్ క్షత్రియాజే
ప్రతీహారే చ సారథౌ
భుజిష్యాతనయే క్షత్తా
నియుక్తే చ ప్రజాసృజి॥ (40)
ధాతా హిరణ్యగర్భే స్యా
త్పాలకే త్వభిధేయవత్।
మాతా కాళీ ప్రసూగోషు
బ్రాహ్మణ్యాద్యాస్తు మాతరః॥
లతా జ్యోతిష్మతీ స్పృక్కా
శాఖావల్లీ ప్రియంగుషు।
లతాకస్తూరికాయాం చ
మాధవీ దూర్వయోరపి॥(42)
లూతా పిపీలి కాయాంస్యా
ద్యూర్ణనాభే గదాంతరే।

పీతా స్మృతా హరిద్రాయాం
పీ(తం)త స్స్యాద్గౌరపీతయోః॥(43)
సీతా రామకళత్రే స్యా
త్తథా లాంగలపద్ధతౌ।
నభోనద్యాం చ శీతస్తు
ానీర బహువారయోః॥ (44)
తం హిమగుణే ప్రోక్తం
ాచ్యవచ్ఛీతలే కలసే।
ితా ఛన్నే చుల్లికాయాం
ితా సంహతి చిత్యతోః॥
ర్తా వాతిం గణే వృత్తా
ర్తా కృష్యాద్యుదంతయోః

బొందినవానికిని, విడువబడిన వానికిని పేరు.

**క్షత్తా** : పు. ఇది శూద్రునివలన క్షత్రియునికి బుట్టిన వానికిని, ద్వారపాలకునకును, సారథికిని, దాసీ పుత్రునకును, నియోగించబడిన వానికిని, బ్రహ్మకును పేరు.

**ధాతా** : పు. ఇది బ్రహ్మకును, త్రి. పరిపాలించు వానికిని పేరు.

**మాతా** : స్త్రీ. ఇది పార్వతికిని, జననికిని, గోవుకును, బ్రాహ్మణి మొదలగు సప్త మాతృకలకును పేరు.

**లతా** : స్త్రీ. ఇది వెక్కుడు తీగెకును, స్పృక్కయనెడు గంధద్రవ్యముకును, కొమ్మకును, తీగెకును, ప్రేంకణపు చెట్టుకును, కస్తూరివంటి పరిమళముగల లతా విశేషముకును, మాధవీతీగెకును, గరికెకును పేరు.

**లూతా** : స్త్రీ. ఇది చీమకును, త్రి. సాలెపురుగుకును, మర్మస్థానమందు వ్రణమును చేయురోగ విశేషముకును పేరు.

**పీతా** : స్త్రీ. ఇది పసుపుకును, త్రి. పచ్చని వర్ణముగల దానికిని, పానము చేయబడిన దానికిని పేరు.

**సీతా** : స్త్రీ. ఇది రాముని భార్యకును, నాగటి చాలుకును, ఆకాశగంగకును పేరు.

**శీత** : పు. ఇది నీటిప్రబ్బచెట్టుకును, విరిగిన చెట్టుకును, న. చల్లదనముకును, త్రి. చల్లనిదానికిని, మందునకును పేరు.

**చితా** : త్రి. ఇది కప్పబడిన దానికిని, పొయికిని, సమూహముకును, సొదకును పేరు.

**వార్తా** : స్త్రీ. ఇది వంగచెట్టుకును, వర్తించుటకును, కృష్యాదిజీవనార్థ వ్యాపారముకును, వృత్తాంతము

వృత్తిమన్నీరుజోర్వార్తా
వార్తమారోగ్యఫల్గునోః॥(46)
గతిర్మార్గే దశాయాంచ
జ్ఞానే యాత్రా భ్యుపాయయోః।
నాడీవ్రణసరణ్యాంచ
మతి ర్ధీ ర్చ్ఛాస్మృతిష్వపి॥ (47)
చితిస్సమూహే చిత్యాయాం
దితిస్స్యాత్ ఖండనే దితౌ।
పతిః ప్రభౌ గతౌ మూలే
దృతి శ్చర్మపుటే ఝషే॥(48)
యతిర్నికారే యతిని
పాఠచ్ఛేదక్రమే యతిః।
శితిః కృష్ణే శితి ర్భూర్జే
భృతిర్భరణ మూల్యయోః॥
క్షితి ర్నివాసే మేదిన్యాం
స్థానమాత్రేఽపి చ క్షితిః।
ధృతి ర్యోగాంతరే ధైర్యే
ధారణా ధ్వర తుష్టిషు॥ (50)
శ్రుతిశ్శ్రోత్రే తథామ్నాయే
వార్తాయాం శ్రోత్రకర్మణి।
స్మృతి రిచ్ఛా ధియోర్ధర్మ
సంహితాయామపి స్మృతిః॥
రతి స్స్మరప్రియాయాం చ

కును, త్రి. వ్యాపారము గలవానికిని, ఆరోగ్యవంతునకును, న. ఆరోగ్యముకును, నిస్సారముకును పేరు.

**గతి :** స్త్రీ. ఇది త్రోవకును, అవస్థకును, జ్ఞానముకును, నడచుటకును, ఉపాయముకును, ఎల్లప్పుడున్నూ ద్రవించుచున్న సెలవేసిన వ్రణమార్గముకును పేరు.

**మతి :** స్త్రీ. ఇది బుద్ధికిని, అభిలాషకును, స్మరణకును పేరు.

**చితి :** స్త్రీ. ఇది సమూహముకును, కాడుకును పేరు.

**దితి :** స్త్రీ. ఇది ఖండించుటకును, రాక్షసులతల్లికిని పేరు.

**పతి :** పు. ఇది ప్రభువుకును, గమనముకును, మొదలుకును పేరు.

**దృతి :** పు. ఇది తోలుతిత్తికిని, చేపకును పేరు.

**యతి :** పు. ఇది ప్రతిక్రియకును, సన్యాసికిని, స్త్రీ. పద్యమందలి విశ్రమస్థానము కును పేరు.

**శితి :** త్రి. నల్లని వర్ణముగలదానికిని, పు. భుజపత్రి చెట్టుకును పేరు.

**భృతి :** స్త్రీ. జీతముకును, వెలకును పేరు.

**క్షితి :** స్త్రీ. ఇది నివాసముకును, భూమికిని, ప్రదేశముకును పేరు.

**ధృతి :** స్త్రీ. ఇది పంచాంగయోగముకును, ధైర్యముకును, ధరించుటకును, యజ్ఞముకును, సంతోషముకును పేరు.

**శ్రుతి :** స్త్రీ. ఇదిచెవికిని, వేదముకును, వార్తకును, వినుటకును పేరు.

**స్మృతి :** స్త్రీ. ఇది కోరికకును, బుద్ధికిని, మన్వాది ధర్మశాస్త్రముకును పేరు.

**రతి :** స్త్రీ. ఇది మన్మథుని భార్యకును, అనురాగము

రాగేऽపి సురతే (రతిః) ముది।
ఋతి ర్గతౌ జుగుప్సాయాం
స్పర్థా మంగళయోరపి ॥ (52)
వృతి స్స్యాద్వరణే వాటే

కును, సురతముకును, సంతోషముకును పేరు.
**ఋతి** : స్త్రీ. ఇది గమనముకును, నిందకును, జగడముకును, శుభముకును పేరు.
**వృతి** : స్త్రీ. ఇది ఆవరణకును, మంటపాదిస్థానముకును పేరు.

సృతి ర్గమన మార్గయోః।
మితి ర్మానేऽప్యవచ్ఛేదే

**సృతి** : స్త్రీ. ఇది నడచుటకును, త్రోవకును పేరు.
**మితి** : స్త్రీ. ఇది ప్రమాణముకును, ఒక భాగముకును పేరు.

కృతిః కరణహింసయోః ॥ (53)
ఈతిః ప్రవాసే డింబేస్యా
దతివృష్ట్యాది షట్సు చ।

**కృతి** : స్త్రీ. ఇది కర్మకును, హింసకును పేరు.
**ఈతి** : స్త్రీ. ఇది పరదేశవాసముకును, కొల్లమొదలగు దేశోపద్రవములకును ఆరు విధములగు సస్యోపద్రవములకును పేరు.

వీతి ర్గతౌ చ దీప్తౌ చ
ధావనే ప్రజనేऽశనే ॥ (54)

**వీతి** : స్త్రీ. ఇది గమనముకును, ప్రకాశముకును, పరుగెత్తుటకును, పశువులు వెదగొనుటకును, భక్షించుటకును పేరు.

గీతి శ్ఛందసి గానే చ
నీతిస్తు ప్రాపణే నయే।

**గీతి** : స్త్రీ. ఇది పద్యవృత్త విశేషముకును, గానముకును పేరు. **నీతి** : స్త్రీ. ఇది పొందించుటకును, న్యాయముకును పేరు.

రీతిః ప్ర(కా) చారే స్యందే చ
లోహకిట్టార కూటయోః॥
పీతిః పానే తురంగే చ
భీతి స్సాధస కంపయోః।
ప్రీతి ర్యోగాంతరే ప్రేమ్ణి
స్మరపత్నీ ప్రమోదయోః॥

**రీతి** : స్త్రీ. ఇది వ్యవహారముకును, జారుటకును, ఇనుపచిట్టముకును, ఇత్తడికిని పేరు.
**పీతి** : స్త్రీ. ఇది త్రాగుటకును, పు. అశ్వముకును పేరు.
**భీతి** : స్త్రీ. ఇది భయముకును, చలించుటకును పేరు.
**ప్రీతి** : స్త్రీ. ఇది ప్రీతినామకపంచాంగయోగముకును, ప్రేమకును, మన్మథుని భార్యకును, సంతోషముకును పేరు.

భూతి ర్మాతంగశృంగారే
జాతౌ భస్మని సంపది।
స్యూతిస్సీవన సంతత్యో

**భూతి** : స్త్రీ. ఇది ఏనుగనలంకరించుటకును, పుట్టుగకును, బుగ్గికిని, సంపదకును పేరు.
**స్యూతి** : స్త్రీ. ఇది కుట్టుటకును, పరంపరకును పేరు.

రూతి స్స్యూతౌ చ రక్షణే॥
హేతి స్స్యాదాయుధేజ్వాలే
హేతిస్తరణి తేజసీ।
వృత్తిర్వివరణే జీవ్యే
కైశిక్యాదిషు చేష్యతే॥ (58)
కృత్తి శ్చర్మత్వచే భూర్జే
కృత్తికాయాం చ కీర్తితా।

**ఊతి :** స్త్రీ. ఇది కుట్టుటకును, రక్షించుటకును పేరు.
**హేతి :** స్త్రీ. ఇది ఆయుధముకును, అగ్నిజ్వాలకును, సూర్యకాంతికిని పేరు.
**వృత్తి :** స్త్రీ. ఇది వాఖ్యానముకును, జీవనోపాయముకును, కైశిక్యాది కావ్యవృత్తు లకును పేరు.
**కృత్తి :** స్త్రీ. ఇది ఇఱ్ఱిమొదలగువాటి చర్మకును, త్వగింద్రియముకును, భుజపత్రిచెట్టుకును, కృత్తికానక్షత్రముకును పేరు.

పత్తిః పదాతౌ గమనే
వీరసైన్యప్రభేదయోః॥ (59)
విత్తిర్విచారే జ్ఞానే చ
లాభ సంభవయోరపి।
భిత్తిః కుడ్యే ప్రదేశే చ
సంవిభాగా వకాశయోః॥(60)
ఆప్తిస్సంవరణ ప్రాప్త్యోః
ప్రాప్తిర్లాభే మహూదయే

**పత్తి:** పు. ఇది కాలిబంటుకును, స్త్రీ. నడచుటకును, పు. వీరునకును, స్త్రీ. సేనా విశేషముకును పేరు.
**విత్తి :** స్త్రీ. ఇది విచారణకును, జ్ఞానముకును, లాభముకును, పుట్టుటకును పేరు.
**భిత్తి:** స్త్రీ. ఇది గోడకును, ప్రదేశముకును, విభజించుటకును, ఎడముకును పేరు.
**ఆప్తి :** స్త్రీ. ఇది ఆవరించుటుకును, పొందుటకును పేరు. **ప్రాప్తి :** స్త్రీ. ఇది లాభముకును, గొప్పయభివృద్ధికిని పేరు.

గుప్తిః కారాగృహే ప్రోక్తా
భూగర్తె రక్షణే యమే॥ (61)

**గుప్తి:** స్త్రీ. ఇదిచెరసాలకును, గోతికిని, రక్షించుటకును, శరీరమును సాధనముగా నపేక్షించు నిత్యకర్మకును పేరు.

సుప్తి స్స్పర్శాజ్ఞతాయాం చ
స్వాపే విస్రంభఘాతిని।
శాంతి శ్శమేపి కల్యాణే
కాంతి శ్శోభా భిలాషయోః॥
జాతి శ్ఛందసి సామాన్యే
మాలత్యాం గోత్రజన్మనోః।
జాతి ర్జాతీఫలే ధాత్ర్యాం
చుల్లీ కంపిల్లయోరపి॥ (63)

**సుప్తి:** స్త్రీ. స్పర్శనెరుగకపోవుటకును, నిద్రకును, విశ్వాస ఘాతకున కును పేరు.
**శాంతి :** స్త్రీ. ఇది ఓరిమికిని, మంగళమునకును పేరు.
**కాంతి :** స్త్రీ. ప్రకాశముకును, ఇచ్ఛకును పేరు.
**జాతి :** స్త్రీ. ఇది పద్యవృత్త విశేషముకును, గోత్వాది సామాన్యముకును, మాలతీలతకును, గోత్రముకును, పుట్టుకకును, జాజికాయకును, ఉసిరిగె చెట్టుకును, పొయికిని, కంపిల్లమను గంధద్రవ్యముకును పేరు.

జ్ఞాతి స్సగోత్రే పితరి
వ్యాప్తి ర్వ్యాపనలంభయోః।
సాతి ర్దానేऽవసానే చ
ప్రాప్తిః పూర్తి ప్రదేశయోః॥
వర్తి ర్దీపదశాయాం చ
దీప గాత్రాను లేపయోః।
వర్తి ర్భేషజనిర్మాణే
నయనాంజన లేఖయోః॥ (65)
ఆర్తిః పీడా ధనుష్కోట్యో
ర్మూర్తిః కాఠిన్య కాయయోః।
కీర్తిః ప్రసాద యశసో
ర్విస్తారే కర్ద మేऽపి చ॥ (66)
భ్రాంతి ర్మిధ్యామతౌ ఖ్యాతా
భ్రమణే చానవస్థితౌ।
వృతిః క్రిమౌ నర్తనే చ
స్రుతిః సరితి వర్త్మని॥(67)
భక్తిర్విభాగే సేవాయాం
పక్తి ర్గౌరవ పాకయోః।
ముక్తిస్స్యాన్మోచనే మోక్షే
యుక్తిర్న్యా యేచ యోజనే॥(68)
పంక్తి ర్దశాక్షరఛందో
దశసంఖ్యా వళీష్వపి।
శక్తిర్బలే ప్రభావాదౌ
శక్తిః ప్రహరణాంతరే॥ (69)
శుక్తిః కపాలశకలే
నఖ్యశ్వావర్తయోరపి।
ముక్తాస్ఫోటేచ దుర్నామా
శంఖ శంఖ నఖేషు చ॥ (70)

**జ్ఞాతి** : పు. ఇది తనవంశమందుపుట్టిన వానికిని,
**వ్యాప్తి** : స్త్రీ. ఇది వ్యాపించుటకును, లాభముకును పేరు.
**సాతి** : స్త్రీ. ఇది దానముకును, అంతముకును పేరు.
**ప్రాప్తి** : స్త్రీ. పూర్తికిని, ప్రదేశముకును పేరు.
**వర్తి** : స్త్రీ. ఇది దీపపు వత్తికిని, దీపముకును, మైపూత కొరకు సుగంధద్రవ్యములతోచేసిన గంధపు బిళ్ళకును, ఔషధమును జేయుటకును, కాటుగకును, జాబుకును పేరు.
**ఆర్తి** : స్త్రీ. ఇది బాధకును, వింటికొనకును పేరు.
**మూర్తి** : స్త్రీ. ఇది కఠినత్వముకును, శరీరముకును పేరు.
**కీర్తి** : స్త్రీ. ఇది అనుగ్రహముకును, దానాదుల వలన పుట్టినసుఖ్యాతికిని, విస్తారముకును, బురదకును పేరు.
**భ్రాంతి** : స్త్రీ. ఇది అసత్యమందు సత్య బుద్ధి కలుగుటకును, తిరుగుటకును, చాంచల్యముకును పేరు.
**వృతి** : స్త్రీ. ఇది పురుగుకును, నృత్యముకును పేరు.
**స్రుతి** : స్త్రీ. ఇది నదికిని, మార్గముకును పేరు.
**భక్తి** : స్త్రీ. ఇది విభాగముకును, సేవించుటకును పేరు.
**పక్తి** : స్త్రీ. ఇది గౌరవముకును, పండుటకును పేరు.
**ముక్తి** : స్త్రీ. ఇది విడచుటకును, మోక్షముకును పేరు.
**యుక్తి** : స్త్రీ. ఇది న్యాయముకును, కూర్చుటకును పేరు.
**పంక్తి** : స్త్రీ. ఇది 10 అక్షరముల ఛందస్సుకును, దశసంఖ్యకును, వరుసకును పేరు.
**శక్తి** : స్త్రీ. ఇది బలముకును, ప్రభుమంత్రోత్సాహ శక్తులకును, ఆయుధవిశేషముకును పేరు.
**శుక్తి** : స్త్రీ. ఇది ఖండమైనపుర్రెకును, నఖమనెడు గంధద్రవ్యముకును, గుర్రపు సుడికిని, ముత్యపు చిప్పకును, ఏనుగ జలగకును, శంఖముకును, నత్తగుల్లకును పేరు.

★ అథ తాన్త త్రివర్ణః ★

అమృతం యజ్ఞశేషే స్యా
త్పీయూషే సలిలే ఘృతే।
అయాచితే చ మోక్షేऽన్నే
ధన్వంతరి సుపర్వణోః॥
స్యాదమృతోऽమృతా పథ్యా
గుడూచ్యామలకీషు చ।
కృషౌ వసత్యేऽప్యనృత

**అమృత :** న. ఇది యజ్ఞశేష ద్రవ్యముకును, అమృతముకును, జలముకును, నేతికిని, అయాచితముగా సంప్రాప్తమగు వస్తువుకును, మోక్షముకును, అన్నముకును పు. ధన్వంతరికిని, దేవతకును, స్త్రీ. కరకచెట్టుకును, తిప్పతీగకును, ఉసిరిగచెట్టుకును పేరు.

**అనృత :** న. ఇది వ్యవసాయముకును, అసత్యముకును పేరు.

మజితః కమలాపతౌ॥(72)

**అజిత :** పు. ఇది విష్ణువుకును, త్రి. జయించబడని వానికిని పేరు.

అనిర్జితే చా
చ్యుతస్తుస్థిరే స్యాద్గరుడధ్వజే

**అచ్యుత :** త్రి. ఇది స్థిరమైన దానికిని, పు. విష్ణువుకును పేరు.

అర్దితం యాచితే జ్ఞేయం
వాతవ్యాధౌ చ హింసితే॥

**అర్దిత :** త్రి. ఇది యాచించబడిన దానికిని, న. వాతరోగవిశేషముకును, త్రి. హింసించబడిన దానికిని పేరు.

అక్షతం చాపి లాజేషు తృతీయ
ప్రకృతావపి।అహింసితేऽపి

**అక్షత :** న. ఇది పేలాలకును, నపుంసకత్వముకును, త్రి. హింసించబడని దానికిని పేరు.

చాపాత స్తదాత్వే పతనేऽపిచ॥(74)

**ఆపాత:** పు. ఇది తత్కాలముకును, పడుటకును పేరు.

ఆఘ్రాతం శింఘితే క్రాంతేऽ

**ఆఘ్రాత :** త్రి. ఇది వాసన చూడబడిన దానికిని, ఆక్రమించబడిన దానికిని పేరు.

ప్యాఖ్యాతం భాషితే తిఙి।

**ఆఖ్యాత :** త్రి. పలకబడిన దానికిని, న. ధాతువుకంటె పరమందు విధించబడిన తిఙ్ప్రత్యయాదులకును పేరు.

ఆధ్మాతః పవనవ్యాధౌ
దగ్ధశబ్దితయోరపి॥(75)

**ఆధ్మాత:** పు. వాతరోగ విశేషముకును, త్రి. తగుల పెట్టబడిన దానికిని, ధ్వనిచేయబడిన దానికిని పేరు.

ఆప్లుత స్స్నాతకే స్నాతేऽ

**ఆప్లుత :** పు. ఇది స్నాతక వ్రతముకును, త్రి. చేయబడిన స్నానముగల వానికిని పేరు.

ప్యాదృత స్సాదరేऽర్చితే।

**ఆదృత :** త్రి. ఇది ఆదరముతోగూడిన వానికిని,

పూజింపబడిన వానికిని పేరు.

ఆచితశ్శకటోన్మేయే
పలానా మ యుతద్వయే॥(76)
ఛన్నేఽపి సంగృహీ తే స్యా
దాహతం తు మృషార్థకే।

**ఆచిత** : పు. ఇది బండెడు బరువుకును, రెండు వేల పలములయెత్తు బరువుకును త్రి. కప్పబడిన దానికిని, సంగ్రహించబడిన దానికిని పేరు.

ఆహతం గుణితేఽపి స్యా
త్తాడితే చాణకేఽపి చ॥(77)
స్యాత్పురాతన వస్త్రే చ
నూత్నవస్త్రేఽపి చాహతం।

**ఆహత**: న. ఇది అబద్ధపుమాటకును, త్రి. గుణించబడిన దానికిని, వాయించబడిన దానికిని, పు. తప్పెటకును, న. ప్రాతగుడ్డకును, క్రొత్తబట్టకును పేరు.

ఆనర్తో దేశభేదే స్యా
న్నృత్యస్థానే జనే రణే॥(78)

**ఆనర్త** : పు. ఇది ఆనర్తదేశముకును, నాట్యస్థలముకును, ఆనర్తదేశ వాసికిని, యుద్ధముకును పేరు.

ఆవర్త ఆవర్తనే స్యా
చ్చింతనే చాంభసాం భ్రమే।

**ఆవర్త**: పు. ఇది తిప్పుటకును, చింతనజేయుటకును, నీటిసుడికిని పేరు.

సంవర్తః ప్రళయే ప్రోక్త
విభీతకత రౌ ఘనే॥

**సంవర్త** : పు. ఇది ప్రలయముకును, తాండ్రచెట్టుకును, సంవర్తమను మేఘముకును పేరు.

త్రిగర్త స్స్యాజ్జనపదే
త్రిగర్తో గణితాంతరే।
భవేద్ఘుర్ఘురికాయాంతు
త్రిగర్తాకాముక స్త్రీయాం॥ (80)

**త్రిగర్త**: పు. ఇది త్రిగర్తదేశముకును, గణిత విశేషముకును, స్త్రీ. జల జంతువిశేషముకును, రంకులాడికిని పేరు.

వివర్త స్సముదాయే స్యా
దపవర్తన నృత్యయోః।

**వివర్త**: పు. ఇది సమూహముకును, ప్రతికూలముకును, నాట్యముకును పేరు.

ఉత్తప్తం శుష్కమాంసేపి
సంతప్తే చ పరిప్లుతే॥ (81)

**ఉత్తప్త**: న. ఇది ఎండిన మాంసముకును, త్రి. తపింపచేయబడిన దానికిని, తడపబడిన దానికిని పేరు.

ఉచితం ప్రోక్త మభ్యస్తే
మితే జ్ఞాతే సమంజసే।

**ఉచిత**: త్రి. ఇది అభ్యసింపబడినదానికిని, మితమైన దానికిని, తెలియబడిన దానికిని, యుక్తమైన దానికిని పేరు.

ఉద్ధృతం స్యాదుత్తులితే
పరిభుక్తోజ్ఝితేఽపి చ॥(82)

**ఉద్ధృత** : త్రి. ఇది ఎత్తబడిన దానికిని, అనుభవించి విడిచిన దానికిని పేరు.

ఉత్థితం వృద్ధియుక్తే స్యా
త్ప్రోద్యతోత్పన్నయోరపి।
ఉషితం వ్యుష్య తే దగ్ధే
ముషితం ఖండితే హృతే॥

**ఉత్థిత :** త్రి. ఇది వృద్ధితో గూడిన దానికిని, ఉద్యమించిన దానికిని, పుట్టిన దానికిని పేరు.
**ఉషిత :** త్రి. ఇది ఉన్నదానికిని, దగ్ధమైనదానికిని పేరు.
**ముషిత :** త్రి. ఇది ఖండించబడినదానికిని, హరించబడిన దానికిని పేరు.

ఉద్ఘాతః కథ్యతే పాద
స్ఖలనే సముపక్రమే।
పవనాభ్యాసయోగస్య
కుంభకాది త్రయేऽపి చ॥ (84)

**ఉద్ఘాత :** పు. ఇది కాలుజారుటకును, ప్రారంభించుటకును, యోగాభ్యాసమందలి, కుంభక, రేచక, పూరకములకును, త్రి. ఉన్నతమైన దానికిని, ఇనుప గుదియకును పేరు.

ఉత్తుంగే ముద్గరేऽపి స్యా
దుదితం ప్రోక్త ఉద్గతే।
స్యాదుచ్ఛ్రితంతు సంజాతే
సమున్నద్ధ ప్రవృద్ధయోః॥
రజతం విశదే దంతి
దంతయోస్తారహారయోః।
సురతం స్యాన్నిధువనే
దేవత్వే సురతా మతా॥ (86)
ప్రహతం విజితే క్షుణ్ణే

**ఉదిత :** త్రి. ఇది బయలుదేరిన దానికిని పేరు.
**ఉచ్ఛ్రిత :** త్రి. ఇది పుట్టిన దానికిని, పొడవైన దానికిని, వృద్ధిబొందిన దానికిని పేరు.
**రజత :** న. ఇది తెలుపు వర్ణమునకును, గజదంతముకును, వెండికిని, ముత్యాలహారముకును పేరు.
**సురత :** న. ఇది స్త్రీ పురుషుల సంయోగముకును, స్త్రీ. దేవత్వముకును పేరు.
**ప్రహత :** త్రి. ఇది జయింపబడిన దానికిని, నలగగొట్టబడిన దానికిని పేరు.

సంహతం సంహతే దృఢే।

**సంహత :** త్రి. కొట్టబడిన దానికిని, దృఢమైన దానికిని పేరు.

రసితం తు సువర్ణాది
ఖచితే స్తనితే రు తే॥(87)

**రసిత :** త్రి. ఇది బంగారు మొదలైన వాటియందు కూర్చబడిన దానికిని, న. మేఘగర్జితముకును, ధ్వనికిని పేరు.

పలితం శైలజే తాపే
పాండుకేశే చ కర్దమే।

**పలిత :** న. ఇది రాతిపువ్వుకును, పరితాపముకును, వార్ధక్యమువలన వెంట్రుకలు తెల్లబడుటకును, బురదకును పేరు.

లలితం హారభేదే స్యా

**లలిత :** న. ఇది హారవిశేషముకును, త్రి. ఇష్టమైన

| | |
|---|---|
| దీప్సితే లలితేऽపి చ॥ | దానికిని, సుందరమైన దానికిని పేరు. |
| స్ఖలితం చలితే భ్రంశే | **స్ఖలిత :** త్రి. ఇది చరిపచేయబడిన దానికిని, తొట్రుపడిన దానికిని పేరు. |
| కలితం విదితా ప్తయోః। | **కలిత :** త్రి. ఇది తెలియబడిన దానికిని, పొందబడిన దానికిని పేరు. |
| జ్వలితం భాస్వరే దగ్ధే | **జ్వలిత :** త్రి. ఇది ప్రకాశింపచేయబడిన దానికిని, తగులపెట్టబడిన దానికిని పేరు. |
| త్వరితం ప్రజవే ద్రుతే॥ (89) | **త్వరిత :** న. ఇది వేగముకును, శీఘ్రముకును పేరు. |
| స్తిమితోऽచంచలే క్లిన్నే | **స్తిమిత :** త్రి. నిశ్చలమైన దానికిని, తడపబడిన దానికిని పేరు. |
| హర్మితం క్షిప్తదగ్ధయోః। | **హర్మిత :** త్రి. ఇది చిమ్మబడిన దానికిని, తగులపెట్టబడిన దానికిని పేరు. |
| సుహితోऽతిహితే తృప్తే | **సుహిత :** త్రి. ఇది మిక్కిలి ఇష్టమైన దానికిని, తృప్తి బొందించబడిన దానికిని పేరు. |
| మూర్ఛితం సోచ్ఛ్రయే దృఢే॥ | **మూర్ఛిత :** త్రి. ఇది ఔన్నత్యముతోగూడిన దానికిని, దృఢమైన దానికిని పేరు. |
| హృషితం విస్మితే ప్రీతే ప్రణతే హృష్టరోమణి। | **హృషిత :** త్రి. ఆశ్చర్యమును బొందించబడిన దానికిని, సంతోషపెట్టబడిన దానికిని, నమస్కరించబడిన దానికిని, గగుర్పాటుకును పేరు. |
| గర్జితో మత్తమాతంగే గర్జితం జలదధ్వనౌ॥(91) | **గర్జిత :** పు. మదపుటేనుగకును, న. మేఘగర్జనముకును పేరు. |
| వర్ధితం ప్రసృతే ఛిన్నే పూరితే చాపి వర్ధితం। | **వర్ధిత :** త్రి. ఇది విస్తరింపచేయబడిన దానికిని, ఛేదించబడిన దానికిని, పూరించబడిన దానికిని పేరు. |
| స్థాపితం నిశ్చితే న్యస్తే | **స్థాపిత :** త్రి. నిశ్చయింపబడిన దానికిని, ఉంచబడిన దానికిని పేరు. |
| చేంగితం గతి చేష్టయోః॥ | **ఇంగిత :** న. గమనముకును, భావాను రూపమైన కర్మేంద్రియ వ్యాపారముకును పేరు. |
| వేష్టితం లాసకే రుద్ధే | **వేష్టిత :** త్రి. నృత్యముచేయుదానికిని, అరికట్టబడిన |

స్త్రీణాం చ కరణాంతరే।
భావితం వాసితే ప్రాప్తే

దానికిని, స్త్రీల రతిబంధ విశేషముకును పేరు.
**భావిత :** త్రి. ఇది పరిమళింపచేయబడిన దానికిని, పొందబడిన దానికిని పేరు.

విదితం విదితార్థయోః॥

**విదిత :** త్రి. ఇది తెలియబడిన దానికిని, న. ప్రార్థనకును పేరు.

వేల్లితం కుటిలే ప్రోక్తం
వాచ్యవద్విధృతే ప్లుతే।
గ్రథితం గుంభితా క్రాంత
హింసితేషు సమీరితం॥(94)
మథితం నిర్జలోదశ్వి
త్యాలోడిత నిష్పష్టయోః।

**వేల్లిత :** త్రి. ఇది వక్రమైన దానికిని, ధరించబడిన దానికిని, తడపబడిన దానికిని పేరు.
**గ్రథిత :** త్రి. ఇది కూర్చబడిన దానికిని, ఆక్రమించబడిన దానికిని, హింసింపబడిన దానికిని పేరు.
**మథిత :** న. ఇది నీళ్ళు కలియని మజ్జిగకును, త్రి. కలియపెట్టబడిన దానికిని, రాపుడు పెట్టబడిన దానికిని పేరు.

ప్రార్థితం యాచితే శత్రు
సంరుద్ధేఽభిహతేఽపి చ॥
జృంభితం కరణే స్త్రీణా
మీహా స్ఫుటితయోరపి।
క్రందితం ఖ్యాత మాహ్వానే
క్రందితం రుదితేఽపి చ॥ (96)
ప్రోక్షితం నిహతే సిక్తే

**ప్రార్థిత :** త్రి. యాచించబడిన వానికిని, శత్రువుచేత నరికట్టబడిన వానికిని, పలకబడిన వానికిని పేరు.
**జృంభిత :** న. స్త్రీల రతిబంధ విశేషముకును, ఇచ్ఛకును, త్రి. వికసించిన దానికిని పేరు.
**క్రందిత :** న. ఇది పిలుచుటకును, ఏడ్చుటకును పేరు.
**ప్రోక్షిత :** త్రి. ఇది చంపబడిన దానికిని, తడపబడిన దానికిని పేరు.

వాసితం ముండితే మతం।
బీజాకృతే
దంశితస్తు దష్ట
వర్మితయో రపి॥ (97)
క్షారిత స్రావితే క్షారే
చాభిశస్తే చ శంసితః।

**వాసిత :** త్రి. గొరగబడిన దానికిని, విత్తనములు చల్లిదున్నిన భూమికిని పేరు.
**దంశిత :** త్రి. ఇది కొరకబడిన దానికిని, కవచము వేయబడిన దానికిని పేరు.
**క్షారిత :** త్రి. ఇది స్రవింపజేయబడిన దానికిని, ఉప్పునకును, పరస్త్రీగమన బ్రహ్మహత్యాదులచేత దూషింపబడిన వానికిని పేరు.

సుకృతం చ శుభే పుణ్యే

**సుకృత :** న. ఇది శుభముకును, పుణ్యముకును,

| | |
|---|---|
| సువిధానే చ వాచ్యవత్ ॥ | త్రి. లెస్సగాజేయబడినదానికిని పేరు. |
| నికృతం విప్రలబ్ధే స్యా<br>న్నీచే విప్రకృతేఽపి చ। | **నికృత :** త్రి. ఇది వంచించబడిన దానికిని, నీచునకును, తిరస్కరించబడిన వానికిని పేరు. |
| వికృతోఽసంస్కృతేఽపి<br>స్యాద్భీభత్సే రోగితేఽపి చ॥ | **వికృత :** త్రి. ఇది సంస్కరింపబడని దానికిని, వికలమైన దానికిని, రోగముగల వానికిని పేరు. |
| సంస్కృతః కృత్రిమే శస్తే<br>భూషితే భేద్యవన్మతః।<br>సంస్కృతం లక్షణోపేతే | **సంస్కృత :** చేయబడిన దానికిని, (ఘటాదులు) స్తుతిచేయబడిన దానికిని, అలంకరించబడిన దానికిని, న. వ్యాకరణాదులచేత సంస్కరించబడిన సుశబ్దముకును పేరు. |
| ప్రభూతం ప్రాజ్య ఉద్గతే॥ | **ప్రభూత :** త్రి. ఇది విస్తారమైన దానికిని, బయలుదేరిన దానికిని పేరు. |
| ప్రసృత స్సంప్రసారే స్యా<br>ద్వినీతే విగతేఽపి చ।అర్ధాం<br>జలౌ చ ప్రసృతం జంఘా<br>యాం ప్రసృతామతా॥(101) | **ప్రసృత :** త్రి. ఇది వృద్ధిబొందు దానికిని, నమ్రమనకును, పోయినదానికిని, న. చారెడు పరిమాణముకును, స్త్రీ. పిక్కకును పేరు. |
| సూనృతం మంగళే సత్య<br>ప్రియవాచి చ సూనృతం। | **సూనృత:** న. ఇది మంగళముకును, సత్యమైనట్టిన్ని ఇష్టమైనట్టిన్ని వాక్యముకును పేరు. |
| ప్రసూతం వాచ్యవజ్జాతే<br>ప్రసూతం కుసుమేఽపి చ॥ | **ప్రసూత :** త్రి. ఇది పుట్టిన దానికిని, న. పుష్పముకును పేరు. |
| విశ్రుతం జ్ఞాతసంహృష్ట<br>ప్రతీతేష్వభిధేయవత్। | **విశ్రుత :** త్రి. ఇది తెలియబడిన దానికిని, సంతోషింపజేయబడిన దానికిని, ప్రసిద్ధమైనదానికిని పేరు. |
| నిర్ముక్తస్త్యక్తసంగే స్యా<br>న్ముక్తకంచుక భోగిని॥(103) | **నిర్ముక్త:** త్రి. ఇది విడచిపెట్టబడినసంబంధముగలవానికిని, కుబుసము విడచిన పాముకును పేరు. |
| అవ్యక్త శ్శంకరే విష్ణా<br>వవ్యక్తం మహదాదికే।<br>ఆత్మన్యపిస్యాదవ్యక్త<br>మస్ఫుటే చాభిధేయవత్॥(104) | **అవ్యక్త :** పు. ఇది శివునకును, విష్ణువుకును, న. ప్రకృతి వికారములైన మహదహంకారాది తత్వములకును, పరమాత్మకును, త్రి. వ్యక్తము గాని దానికిని పేరు. |
| వివిక్తం స్యాదసంపృక్తే | **వివిక్త:** త్రి. ఇది సంబంధములేనిదానికిని, వివేకము |

వివేకాన్విత పూతయోః।
వాచ్యవద్ధర్మితో ధీరై
ర్వివిక్తంరహసి స్మృతం॥(105)

తో గూడినదానికిని, పవిత్రమైనదానికిని, న. రహస్యప్రదేశముకును పేరు.

రోహితం రుధిరే ధీర
ఋజుశక్ర శరాసనే।
రోహితో మీనమృగయో
ర్భేదే రోహితకద్రుమే॥ (106)

**రోహిత :** న. ఇది రక్తముకును, కుంకుమకును, వంకరలేని ఇంద్రధనస్సుకును, పు. మత్స్య విశేషముకును, వృక్షవిశేషముకును పేరు.

లోహితం కుంకుమే రక్తే
గోశీర్షే చ కుచందనే।
లోహిత స్స్యాన్నదే భౌమ
వర్ణభేదే తు వాచ్యవత్॥(107)

**లోహిత :** న. ఇది కుంకుమకును, రక్తముకును, మిగుల సువాసనగల చందన విశేషముకును, రక్తచందనముకును, పు. నదవిశేషముకును, అంగారక గ్రహముకును, త్రి. యెరుపు వర్ణము గలదానికిని పేరు.

పుటితం స్యాద్ధస్తపుటే
పాటిత స్స్యూతయోరపి।

**పుటిత:** న. ఇది హస్తప్రదేశముకును, త్రి. పెల్లగించబడినదానికిని, కుట్టబడినదానికిని పేరు.

పీడితం బాధితే స్త్రీణాం
కరణే చాపి యంత్రితే॥(108)

**పీడిత:** త్రి. ఇది బాధింపబడినదానికిని, న. స్త్రీలరతి బంధవిశేషముకును, త్రి. కట్టబడినదానికిని పేరు.

పిండితం గణితే సాంద్రే

**పిండిత :** త్రి. ఇది ఎంచబడినదానికిని, దట్టమైనదానికిని పేరు.

పండిత (శ్శల్లకే) స్సిల్హ కేకవౌ

**పండిత :** పు. ఇది తురుష్కదేశమునపుట్టిన ధూపద్రవ్యముకును, విద్వాంసునకును పేరు.

హారీతః పక్షిభేదే స్యా
న్మునిభేదేఽపి కైతవే॥(109)

**హారీత :** పు, ఇది పసిరిగ పిట్టకును, హారీతుడను మునికిని, మిషకును పేరు.

ప్రణీత స్సంస్కృతే వహ్నౌ
విహితే చ ప్రవేశితే।
నిక్షిప్తేచోప సంపన్నే
ప్రణీతో భేద్య వన్మతః॥(110)

**ప్రణీత :** పు. ఇది మంత్రముల చేతను సంస్కరింపబడిన అగ్నికిని, త్రి. చేయబడినదానికిని, ప్రవేశింపబడిన దానికిని, ఉంచబడినదానికిని, కూడుకొన్న దానికిని పేరు.

ప్రతీతః (ప్రథితే) సాదరేజ్ఞాతే

**ప్రతీత :** త్రి. ఇది ఆదరముతో గూడినదానికిని, తెలియబడినదానికిని పేరు.

ప్రఖ్యాతః ఖ్యాత హృష్టయోః।

**ప్రఖ్యాత :** త్రి. ఇది ప్రసిద్ధి చెందినదానికిని, సంతో

షించినదానికిని పేరు.

వాచ్యవత్స్యాత్ప్రమీతం తు
ప్రోక్షితేఽపి మృతేఽపిచ॥

**ప్రమీత :** త్రి. ఇది ప్రోక్షించబడినదానికిని, చచ్చిన దానికిని పేరు.

వినీత ముపనీతే స్యా
దపనీతే జితేంద్రియే।
వాణిజేసువహేఽశ్వే చ
నిభృతే చాభిధేయవత్॥ (112)

**వినీత :** త్రి. ఇది పొందించబడినదానికిని, తొలగించబడినదానికిని, ఇంద్రియనిగ్రహము గలవానికిని, పు. వర్తకునకును, గుర్రమునకును, త్రి. దృఢమైన దానికిని పేరు.

పృషతో హరిణే బిందా
పృషత శ్చాశ్వరోహితే।
భవేత్పృషదివ శ్వేతే
బిందుయుక్తేతు వాచ్యవత్॥(113)

**పృషత : పృషత్ :** పు. ఇవి ఇర్రికిని, బిందువుకును, తెల్లని మచ్చలుగల మృగవిశేషమునకును, తెలుపు వర్ణమునకును, త్రి. బిందువులుగల దానికిని పేరు.

భరతో నాట్యశాస్త్రేఽపి
దౌష్యంతౌ శబరే నటే।
రామానుజేఽపి భరత
స్తంతువాయేఽపి చ క్వచిత్॥

**భరత :** పు. ఇది నాట్యశాస్త్రమునకును, దుష్యంతుని పుత్రునకును, బోయవానికిని, నాట్యగానికిని, దశరథుని పుత్రునకును, సాలెవానికిని పేరు.

భారతం గ్రంథభేదే స్యా
జ్జంబూద్వీపేఽపి భారతం।
భారతీ తు సరస్వత్యాం
పక్షి వృత్తిప్రభేదయోః॥(115)

**భారత :** న. ఇది కురుపాండవ చారిత్రముగల గ్రంథమునకును, జంబూద్వీపమునకును పేరు.

**భారతీ :** స్త్రీ. ఇది సరస్వతికిని, పక్షివిశేషమునకును, కావ్య రసాశ్రయమగు భారతీ వృత్తికిని పేరు.

దుర్జాతం వ్యసనే ప్రోక్త
మసమ్యగ్జాతవస్తుని।

**దుర్జాత :** న. ఇది దుఃఖమునకును, త్రి. దుష్టమైన దానికిని, పేరు.

పరేతో భూతభేదే స్యా
త్పరేతో వాచ్యవన్మృతే॥

**పరేత :** పు. ఇది పిశాచ విశేషమునకును, త్రి. చచ్చిన దానికిని పేరు.

కపోతః పారావతేస్యాత్క
(పకా) పోతాఖ్యవిహంగమే।

**కపోత :** పు. ఇది పావురమునకును, అరణ్యమందుండెడు పక్షివిశేషమునకును పేరు.

కాపోత మంజనేఽపి స్యా
త్కాపోతానాం చ సంహతౌ॥

**కాపోత :** న. ఇది సౌవీరాంజనమునకును, పావురముల గుంపునకును పేరు.

వ్యాయతం వ్యాపృతే దీర్ఘే

**వ్యాయత :** త్రి. ఇది వ్యాపించిన దానికిని పొడవైన దాని

దృఢే చాతిశయే ఽన్యవత్।
వ్యాఘాతో యోగభేదేస్యా
దంతరాయప్రహారయోః॥
సంఘాత స్సంహతౌ ఘాతే
సంఘాతో నరకాంతరే।
రైవతస్తు సువర్ణాళౌ
శైలభే దేఽపి శూలిని॥(119)
స్యాత్కిరాతస్తు భూనింబే
మ్లేచ్ఛే చాల్పతనావపి।
మందాకిన్యాం కిరాతీ స్యా
త్కుట్టన్యామపి దృశ్యతే॥
ఆస్ఫోత శ్చార్కపర్ణే స్యా
దాస్ఫోతః కోవిదారకే।
ఆస్ఫోతా గిరికర్ణ్యాం చ
వనమల్యాం చ విశ్రుతా॥(121)
ఉదాత్త స్స్వరభేదే స్యా
త్కావ్యాలంకారహృద్యయోః।
ఉదాత్తో దాతృమహతో
ర్నిమిత్తం హేతు లక్ష్మణోః॥
ఉన్మత్త ఉన్మాదవతి
ధుత్తూరముచుకుందయోః।
పర్వత శ్శైలదేవర్ష్యోః
ప్రపాతో నిర్ఝరే భృగౌ॥
పర్యాప్తంతు యథేష్టేస్యా
త్తృప్తౌ శక్తే నివారణే।
జీమూత స్స్యాద్భృతికరే
శక్రేఽద్రౌ ఘోషకే ఘనే॥

కిని, దృఢమైన దానికిని, అధికమైన దానికిని పేరు.

**వ్యాఘాత**: పు. ఇది పంచాంగయోగవిశేషముకును, విఘ్నముకును, దెబ్బకును పేరు.

**సంఘాత**: పు. ఇది సమూహముకును, చంపుటకును, నరకవిశేషముకును పేరు.

**రైవత**: పు. ఇది వృక్షవిశేషముకును, రైవతకాద్రికిని, ఈశ్వరునకును పేరు.

**కిరాత**: పు. ఇది నేలవేమునకును, మ్లేచ్ఛునకును, పొట్టివానికిని పేరు.

**కిరాతీ** : స్త్రీ. ఇది ఆకాశపుగంగకును, కుంటెన కత్తెకును పేరు.

**ఆస్ఫోత**: పు. ఇది జిల్లేడు చెట్టుకును, యెర్రకాంచనపు చెట్టుకును, స్త్రీ. విష్ణుక్రాంతలతకును, అడవి మల్లికిని పేరు.

**ఉదాత్త** : పు. ఇది ఉదాత్తస్వరముకును, ఉదాత్తాలంకారముకును, త్రి. మనోహరమైన దానికిని, దాతకును, అధికమైన దానికిని పేరు.

**నిమిత్త**: న. ఇది హేతువుకును, చిహ్నకును పేరు.

**ఉన్మత్త**: త్రి. ఇది పిచ్చిపట్టిన వానికిని, పు. ఉమ్మెత్త చెట్టుకును, పుష్పవృక్షవిశేషముకును పేరు.

**పర్వత** : పు. ఇది పర్వతముకును, పర్వతుడను దేవర్షికిని పేరు.

**ప్రపాత**: పు. ఇదికొండకాలువకును, చరియకును పేరు.

**పర్యాప్త** : న. ఇది స్వేచ్ఛకును, తృప్తికిని, త్రి. సమర్థునకును, న. నివారించుటకును పేరు.

**జీమూత**: పు. ఇది కూలిచేయువానికిని, దేవేంద్రునకును, పర్వతముకును, చేతి బీర చెట్టుకును,

మేఘముకును పేరు.

జీవాతు ర్జీవితే భక్తే
జీవాతు ర్జీవనౌషధే।

**జీవాతు** : పు. ఇది జీవనముకును, అన్నముకును, జీవనాధారమగు మందుకును పేరు.

ఏధతుః పురుషే వహ్నౌ

**ఏధతు** : పు. ఇది పురుషునకును, అగ్నికిని పేరు.

వాహతుః పథికే వృషే॥

**వాహతు** : పు. ఇది మార్గస్థునకును, ఎద్దుకును పేరు.

విహస్తో విహ్వలే షండే

**విహస్త** : త్రి. ఇది వికలమైన దానికిని, పు. నపుంసకునకును పేరు.

పర్యస్తః పతితే హతే।

**పర్యస్త** : త్రి. ఇది పడిన దానికిని, చంపబడిన దానికిని పేరు.

ఆయస్త స్తిమితే క్షిప్తే
క్లేశితే కుపితే హతే॥(126)

**ఆయస్త** : త్రి. ఇది నిశ్చలమైన దానికిని, ఉంచబడిన దానికిని, క్లేశపెట్టబడిన దానికిని, కోపగించిన వానికిని, కొట్టబడిన దానికిని పేరు.

నిరస్తః ప్రేషితే షౌ స్యా
న్నిష్ఠ్యూతే త్వరితోదితే।
సంత్యక్తేచ ప్రతిహతే

**నిరస్త** : పు. ఇది విడచిన బాణముకును, ఉమ్మబడిన దానికిని, శీఘ్రముగానుచ్చరింపబడిన మాటకును, విడచిన దానికిని, కొట్టబడిన దానికిని పేరు.

విశ్వస్తో నిభృతే స్మృతః॥
విశ్వాసయోగే విశ్వస్తో
విశ్వస్తా విధవస్త్రియాం।

**విశ్వస్త** : త్రి. ఇది దృఢమైన దానికిని, విశ్వాసముగల దానికిని, స్త్రీ. మగడుచచ్చిన దానికిని పేరు.

నివాతో దృఢసంన్నాహే
నిర్వాతే చాశ్రయేऽపిచ॥

**నివాత** : పు. ఇది అభేద్యమైన కవచముకును, వాయువులేకపోవుటకును, ఉనికిపట్టుకును పేరు.

అనంత శ్శేష విష్ణ్వో స్స్యా
దనంతం సురవర్త్మని।
అనంత స్స్యాద్యనవధా
వాచ్యవత్సముదాహృతః॥(129)
అనంతా శారిబా దూర్వా
విశల్యా లాంగలీషు చ।
అనంతా హైమవత్యాం చ
గుడూచ్యాం చావనావపి॥

**అనంత** : పు. ఇది శేషునకును, విష్ణువుకును, న. ఆకాశముకును, త్రి. అంతములేని దానికిని, స్త్రీ. సుగంధిపాలచెట్టుకును, గరికెగడ్డికిని, వెన్నవెదురు చెట్టుకును, తరిగొట్టు చెట్టుకును, పార్వతికిని, తిప్పతీగకును, భూమికిని పేరు.

శకుంతః పక్షిభేదే స్యా
ద్భాసపక్షి విహంగయోః।
దృష్టాంత శ్శాస్త్ర ఉభయో
దాహరణే ప్రకీర్తితః॥
కృతాంతో యమ సిద్ధాంత
దైవా కుశలకర్మసు।
నిశాంతః కథిత శ్శాంతే
నిశాంతం భవనోషసోః॥(132)
వృత్తాంతః కథితో భావ
కార్త్స్న్య వార్తావిశేషయోః।
వృత్తాంతః ప్రక్రియాయాంచ
క్వచిదేకాంతవాచిచ॥(133)
ఉద్వాంతో నిర్మదగజే స
ముద్గీర్ణేచ వాచ్యవత్।
శుద్ధాంతోఽంతః పురే రాజ్ఞాం
రహః కక్షాంతరేఽపిచ॥
అస్వంత మశుభే చుల్యాం
మరణేఽనవధావపి।
క్షేత్రేఽపి కథ్యతే స్వంత
ముదంత స్సాధువార్తయోః॥

జయంత శ్శంకరేఽపిస్యా
జ్జయంతః పాకశాసనౌ।
జయంతీ పాదపే గౌర్యా
మింద్రపుత్రీ పతాకయోః॥
గోదంతో హరితాళే స్యా
ద్దంశితే హరితేఽపిచ।
భాసంత స్సుందరాకారే

**శకుంత :** పు. ఇది చమురుకాకికిని, భాస పక్షికిని, పక్షిసామాన్యముకును, పేరు.

**దృష్టాంత :** పు. ఇది శాస్త్రముకును, పరస్పరోదాహరణకును పేరు.

**కృతాంత :** పు. ఇది యమునికిని, సిద్ధాంతముకును, అదృష్టముకును, పాపకర్మకును పేరు.

**నిశాంత :** త్రి. ఇది ఓరిమిగల వానికిని, న. అంతఃపురముకును, ప్రాతఃకాలముకును పేరు.

**వృత్తాంత :** పు. ఇది సమయముకును, భావముకును, సమగ్రమైన వార్తకును, ప్రకరణముకును, రహస్యపు మాటకును పేరు.

**ఉద్వాంత :** పు. ఇది మదముడిగిన యేనుగకును, వెళ్ళగక్క బడిన దానికిని పేరు.

**శుద్ధాంత :** పు. ఇది రాజులయంతఃపురముకును, రాజులు విహరించు రహస్య ప్రదేశముకును పేరు.

**అస్వంత :** న. ఇది అమంగళముకును, పొయికిని, చావుకును, అవధిలేకయుండుటకును, వరిమడికిని పేరు.

**ఉదంత :** పు. ఇది సజ్జనునకును, వృత్తాంతముకును పేరు.

**జయంత :** పు. ఇది శివునకును, దేవేంద్రుని కుమారునకును పేరు.

**జయంతీ :** స్త్రీ. ఇది తక్కెడు చెట్టుకును, పార్వతికిని, ఇంద్రుని కుమార్తెకును, టెక్కెముకును పేరు.

**గోదంత :** పు. ఇది హరిదళముకును, త్రి. కవచము వేయబడిన దానికిని, పు. పచ్చని వర్ణముకును పేరు.

**భాసంత :** త్రి. ఇది సౌందర్యముగల దానికిని, పు.

భాసంతో భాసపక్షిణి॥(137)

చమురు కాకికిని పేరు.

మహ ద్రాజ్యే విశాలే చ

**మహత్:** పు. ఇది రాజ్యముకును, విస్తారముకును పేరు.

మహతీ వల్లకీభిది।

**మహతీ :** స్త్రీ. ఇది నారదుని వీణకు పేరు.

మరుద్దేవే సమీరే స్యా

**మరుత్ :** పు. ఇది దేవునకును, వాయువుకును పేరు.

దర్హన్ పూజ్యే జినే౽పిచ॥

**అర్హ :** పు. ఇది పూజ్యునకును, బుద్ధునకును పేరు.

జగ దాఖ్యా స్మృతా వాయౌ

విష్టపే జంగమే౽పిచ।

**జగత్ :** పు. ఇది వాయువుకును, న. భువనముకును, త్రి. గమనముగలమనుష్య పశుపక్ష్యాదులకును పేరు.

జగతీ భువనే క్ష్మాయాం

ఛందోభేదే జనే౽పిచ॥

**జగతీ :** స్త్రీ. ఇది లోకముకును, భూమికిని, ద్వాద శాక్షర ఛందస్సుకును, జనముకును పేరు.

పిత్స న్నిపతిష న్నేతౌ

పతనేచ్ఛు విహంగయోః।

**పిత్స : పిపతిష :** త్రి. ఇవి పడనిచ్ఛయించిదానికిని, పు. పక్షికిని పేరు.

హరిత్కకుభి వర్ణేచ

తృణవాజి విశేషయోః॥(140)

**హరిత్ :** స్త్రీ. ఇది దిక్కుకును, పు. పాలాశ వర్ణము కును, గడ్డికిని, పాలాశవర్ణముగల గుఱ్ఱముకును పేరు.

హరితో౽పి చ దూర్వాయాం

హరిద్వర్ణ యుతే౽న్యవత్।

**హరిత :** పు. ఇది గరికెగడ్డికిని, త్రి. పాలాశవర్ణము గల దానికిని పేరు.

విద్యుత్స్యాదామినీ సంధ్యో

ర్నిష్ప్రభే త్వభిధేయవత్॥

**విద్యుత్ :** స్త్రీ. ఇది మెరుపుకును, సంధ్యాకాలము కును, త్రి. కాంతిలేని దానికిని పేరు.

గరుత్మత్స్వర్ణలతయో

రోహిత్సూర్య లతాభిదోః।

**గరుత్మత్ :** స్త్రీ. ఇది బంగారుకును, లతకును పేరు.

**రోహిత్ :** పు. సూర్యునకును, స్త్రీ. లతావిశేషము కును పేరు.

భూభృన్నరేంద్రే శైలే చ

**భూభృత్ :** పు. ఇది రాజుకును, పర్వతముకును పేరు.

పతన్పాతుక పక్షిణోః॥(142)

**పతన్ :** త్రి. ఇది పడునట్టి దానికిని, పు. పక్షికిని పేరు.

కుర్వన్నర్మకరే భృత్యే

**కుర్వన్ :** త్రి. ఇది పనిచేయువానికిని, పు. సేవకున కును పేరు.

స్యాదర్వన్కుత్సితే౽న్యవత్।

**అర్వన్ :** త్రి. ఇది కుత్సితునకు పేరు.

అర్వతీ కుంభదాస్యాంచ

వామ్యాం చ పరికీర్తితా॥

**అర్వతీ :** స్త్రీ. ఇది తార్పుడుకత్తెకును, ఆడ గుఱ్ఱము కును పేరు.

శ్రీమాం స్తిలకవృక్షే స్యా

**శ్రీమాన్ :** పు. ఇది తిలకవృక్షముకును, మనోహర

ోజ్ఞే ధనికేऽపిచ।
ాన్వాచస్పతౌ ధీరే
స్వాన్భాస్వరసూర్యయోః॥

వ్రతా సుఖసందోహ్యా
రభ్యాం శోభనవ్రతే।

వృతా క్షుద్రరోగే స్యా
వృతం స్ఫుటే॥(145)
ితా జనితాత్య (ర్థాను
ాయాంచ) ర్థరాగయో
ియోషితి।వనితం యా
ऽపి స్యాద్వనితం సేవితేऽపిచ॥(146)
ామాతా వల్లభే సూర్యా
ऽపి ధుహితుఃపతౌ।
నేతా దేశికే రాజ్ఞి
ధాతా వేధసి స్మరే॥(147)
నతా పి (.ట) డకా భేదే
నతా తార్క్ష్యమాతరి।
నతః ప్రణతే భుగ్నే
క్షితేऽప్యభిధేయవత్॥
ంచతా పంచభావే స్యా
ంచతా మరణేऽపిచ।
జాతాఖ్యా ప్రసూతాయాం
ఃనితే వికృతేऽపిచ॥
ికతా వాలుకాయాం స్యు
స్కతాప్యామయాంతరే।
ికతా న్వితదేశే చ

మైన దానికిని, ధనవంతునకును పేరు.
**ధీమాన్** : పు. ఇది బృహస్పతికిని, పండితునకును పేరు.
**భాస్వాన్**: త్రి. ఇది ప్రకాశించుదానికిని పు. సూర్యునకును పేరు.
**సువ్రతా** : స్త్రీ. ఇది సుఖముగా పాలుపితుకనిచ్చెడి యావుకును. త్రి. యోగ్యమైన వ్రతముగలవానికిని పేరు.

**వివృతా** : స్త్రీ. ఇది రోగవిశేషముకును, త్రి. స్ఫుటమయిన దానికిని పేరు.
**వనితా** : స్త్రీ. ఇది మిగులయను రాగముగల స్త్రీకిని, సామాన్య స్త్రీకిని, త్రి. యాచించబడిన దానికిని, సేవించబడిన దానికిని పేరు.

**జామాతా** : పు. ఇది భర్తకును, శాకవిశేషముకును, అల్లునకును పేరు.
**వినేతా** : పు. ఇది గురువుకును, రాజుకును పేరు.
**విధాతా** : పు. ఇది బ్రహ్మకును, మన్మథునకును పేరు.
**వినతా** : స్త్రీ. ఇది కురుపులలోని భేదముకును, గరుడునితల్లికిని, త్రి. నమస్కరింపబడినదానికిని, వంగిన దానికిని, శిక్షింపబడిన దానికిని పేరు.

**పంచతా** : స్త్రీ. ఇది అయిదగుటకును, మరణమునకును పేరు.
**విజాతా** : స్త్రీ. ఇది ప్రసవించిన స్త్రీకిని, పుట్టించబడిన దానికిని, వికారరూపముగల దానికినిపేరు.
**సికతాః**: స్త్రీ. (నిత్యబహువచనం) ఇది ఇసుకకును, (ఏ) రోగ విశేషముకును, ఇసుక నేలకును, పంచదారకును పేరు..

| | |
|---|---|
| శర్కరాయాంచ కీర్తితా॥(150) | |
| వాసితా కరిణీ నార్యో | **వాసితా :** స్త్రీ. ఇది ఆడయేనుగకును, ఆడుదానికిని, |
| ర్వాసితం సురభీకృతే। | త్రి. కర్పూరాదులచేత పరిమళింపచేయబడిన దాని |
| జ్ఞానమాత్రే ఖగారావే | కిని, న. జ్ఞానముకును, పక్షిరుతముకును, త్రి. |
| వాసితం వస్త్రవేష్టితే॥(151) | వస్త్రముచేత చుట్టబడిన దానికిని పేరు. |
| పిశితా మాంసికాయాంస్యా | **పిశితా :** స్త్రీ. ఇది జటామాంసికిని, న. మాంసము |
| దామిషే పిశితం మతం। | కును పేరు. |
| తృణతాపి తృణత్యేస్యా | **తృణతా :** స్త్రీ. ఇది తృణమౌటకును, ధనస్సుకును |
| త్తృణతా కార్ముకేఽపిచ॥ | పేరు. |
| ద్విజాతి రండజే విప్రే | **ద్విజాతి :** పు. ఇది పక్ష్యాదులకును, బ్రాహ్మణున |
| | కును పేరు. |
| శ్రీపతిః క్ష్మాపతౌ హరౌ। | **శ్రీపతి :** పు. ఇది రాజుకును, విష్ణువుకును పేరు. |
| గోపతి శ్శంకరే షండే | **గోపతి :** పు. ఇది శివునకును, ఆబోతుకును, |
| పార్థివేఽపి వికర్తనే॥ (153) | రాజుకును, సూర్యునకును పేరు. |
| స్థపతి శ్శిల్పిభేదేఽపి | **స్థపతి :** పు. ఇది వడ్లవానికిని, అంతఃపురమును |
| స్థపతిఃకంచుకిన్యపి। | కాచువానికిని, బృహస్పతి సవనము చేసిన వాని |
| జీవేష్టియాజకే సూతేఽ | కిని, సూతునకును పేరు. |
| స్యమతిః కాల చంద్రయోః॥ | **అమతి :** పు. ఇదియమునకును, చంద్రునకును పేరు. |
| అంకతి స్స్యాదగ్ని హోత్రి | **అంకతి :** పు. ఇది నిత్యాగ్నిహోత్రికిని, అగ్నికిని, |
| జ్వలనాం బుజయోనిషు। | బ్రహ్మకును పేరు. |
| రమతి ర్నాయకే స్వర్గే | **రమతి :** పు. ఇది నాయకునకును, స్వర్గలోకము |
| | కును పేరు. |
| స్యంహతి స్త్యాగరోగయోః॥ | **అంహతి :** స్త్రీ. ఇది విడచుటకును, రోగముకును పేరు. |
| నిర్వృతి స్స్యాదలక్ష్మ్యాంచ | **నిర్వృతి :** స్త్రీ. ఇది జ్యేష్ఠలక్ష్మికిని, పు. దిక్పాలున |
| దిక్పాలే నిరుపద్రవే। | కును, త్రి. ఉపద్రవములేని దానికిని పేరు. |
| అగస్తిర్వంగసేనే స్యా | **అగస్తి :** పు. ఇది బకపుష్పపు చెట్టుకును, అగస్త్య |
| దగస్తిః కుంభసంభవే॥(156) | మునికిని పేరు. |
| గభస్తిః కిరణే సూర్యే | **గభస్తి :** పు. ఇది కిరణముకును, సూర్యునకును, |

స్వాహాయాం చ విలోక్యతే।
సంగతి స్సంగమే జ్ఞానే
సంనతిః ప్రణతౌ ధ్వనౌ॥
ఆయతి స్సంగమే దైర్ఘ్యే
ప్రభావా గామికాలయోః।
ఆయత్తి స్స్యాద్బలే స్నేహే
వశిత్వే వాసరేఽపిచ॥
మర్యాదాయాం తథాయత్తి
ర్విపత్తి ర్యాతనాపదోః।
నియతి ర్నియమే దైవే

త్రీ. స్వాహా దేవికిని పేరు.
**సంగతి :** త్రీ. ఇది కలయికకును, జ్ఞానముకును పేరు.
**సంనతి :** త్రీ. ఇది నమస్కారముకును, ధ్వనికిని పేరు.
**ఆయతి :** త్రీ. ఇది కూడుకొనుటకును, విస్తారముకును, సామర్థ్యముకును, రాబోవుకాలముకును పేరు.
**ఆయత్తి :** త్రీ. ఇది బలముకును, స్నేహముకును, అధీనమగుటకును, దినముకును, హద్దుకును పేరు.
**విపత్తి :** త్రీ. ఇది బాధకును, ఆపదకును పేరు.
**నియతి :** త్రీ. ఇది నియమముకును, అదృష్టముకును పేరు.

పద్ధతిః పంక్తిపద్మనోః॥(159)
సంతతిః పంక్తివిస్తార
గోత్రేషు కవిభి స్మృతా।
పరంపరాభవేఽపి స్యా
త్సంతతిః పుత్రకన్యయోః॥(160)

**పద్ధతి :** త్రీ. ఇది వరుసకును, మార్గముకును పేరు.
**సంతతి :** త్రీ. ఇది వరుసకును, విస్తారముకును, వంశపరంపరకును, త్రి. పరంపరయందు బుట్టిన దానికిని, పుత్రునకును, కన్యకును పేరు.

సమ్మతి స్స్యాదనుజ్ఞానేఽ
ప్యభిలాషేఽపి సమ్మతిః।
సమితి స్సంగరే సామ్యే
సభాయాం సంగమే చయే॥

**సమ్మతి :** త్రీ. ఇది అంగీకారముకును, ఇచ్ఛకును పేరు.
**సమితి :** త్రీ. ఇది యుద్ధముకును, పోలికకును, సభకును, కూడుకొనుటకును, సమూహముకును పేరు.

అదితి ర్వసుధాయాం స్యా
దదితి ర్దేవమాతరి।
వసతి స్స్యాదవస్థానే
యామిన్యాం చ నికేతనే॥(162)
పక్షతిః పక్షమూలే స్యా
త్పక్షతిః ప్రతిపత్తిథౌ।
ఉన్నతి స్తార్క్ష్యదారేషు

**అదితి :** త్రీ. ఇది భూమికిని, దేవతల తల్లికిని పేరు.
**వసతి :** త్రీ. ఇది ఉండుటకును, రాత్రికిని, గృహముకును పేరు.
**పక్షతి :** త్రీ. ఇది రెక్కల మొదటి భాగము కును, పాడ్యమికిని పేరు.
**ఉన్నతి :** త్రీ. ఇది గరుడుని తల్లికిని, పరిపూర్ణత్వ -

సమృద్ధా వుదయే<sup></sup>ఽపి చ॥(163)
ముకును, అభివృద్ధికిని పేరు.

ప్రసూతిస్తనయో త్పత్త్యో
స్తథా దుహితరి స్మృతా।
**ప్రసూతి** : స్త్రీ. ఇది పుత్రునకును, పుట్టుగకును, కుమార్తెకును పేరు.

వ్రతతి ర్విస్తృతే వల్ల్యాం
**వ్రతతి** : స్త్రీ. ఇది విస్తారముకును, లతకును పేరు.

వహతి స్సచివే గవి॥ (164)
**వహతి** : పు. ఇది మంత్రికిని, గోవుకును పేరు.

దుర్గతి ర్నరకే నిస్వే
**దుర్గతి**: స్త్రీ. ఇది నరకముకును, దారిద్ర్యముకును పేరు.

వికృతి ర్డింబరోగయోః।
వికృతిశ్చ వికారే స్యా
**వికృతి**: స్త్రీ. ఇది ఉపద్రవముకును, రోగముకును, వికార రూపముకును పేరు.

న్నికృతిశ్చ పరాభవే॥ (165)
నికృతి ర్ధూర్తనే క్షేపే
వదంతి శఠ శాఠ్యయోః।
**నికృతి**: స్త్రీ. ఇది తిరస్కారముకును, భయపెట్టుటకును, చిమ్ముటకును, పు. ధూర్తునకును, స్త్రీ. కుత్సితముకును పేరు.

ఆకృతిః కధితా రూప
సామాన్య వపుషోరపి॥(166)
**ఆకృతి**: స్త్రీ. ఇది ఆకారమాత్రముకును, శరీరముకును పేరు.

ప్రకృతిః కధితా యోనౌ
జంత్వమాత్యాది మాతృషు।
ప్రధానే కారణే ఛందః
ప్రభేదే భూతపంచకే॥
ప్రకృతి స్సహజే ప్రోక్తా
ప్రకృతిః పరమాత్మని।
**ప్రకృతి**: స్త్రీ. ఇది ఉపస్థకును, ప్రాణికిని, స్వామ్యమాత్యాదులను, తల్లికిని, ప్రధానముకును, కారణముకును, ప. ఛందస్సుకును, పంచభూతములకును స్వభావముకును, పరమాత్మకును పేరు.

నిర్వృతి స్స్వస్థతా యాం
స్యాదస్తంగమన సౌఖ్యయోః॥
**నిర్వృతి** : స్త్రీ. ఇది సుఖముగా నుండుట కును, నశించుటకును, సుఖముకును పేరు.

సునీతి శ్శోభననయే
సునీతిర్ధ్రువ మాతరి।
**సునీతి** : స్త్రీ. ఇది యోగ్యమగు నీతికిని, ధ్రువుని తల్లికిని పేరు.

ప్రవృత్తిః కథితా వృత్తౌ
ప్రవాహో దంతయోరపి॥
**ప్రవృత్తి** : స్త్రీ. ఇది వ్యాపారముకును, ప్రవాహముకును, వార్తకును పేరు.

విచ్ఛిత్తిరంగ రాగే స్యా
ద్భావవిచ్ఛేదయోరపి।
**విచ్ఛిత్తి** : స్త్రీ. ఇది మైపూతకును, స్త్రీల విలాస విశేషముకును, భేదముకును పేరు.

సంవిత్తిః ప్రతిపత్తౌ స్యాద
**సంవిత్తి** : స్త్రీ. ఇది జ్ఞానముకును, జనుల యొక్క

| | |
|---|---|
| వివాదే జనస్య చ ॥ (170) | వివాదలేకపోవుటకును పేరు. |
| ఆపత్తిః ప్రాపణే దోషే<br>చాసత్తి స్సంగలాభయోః। | **ఆపత్తి** : స్త్రీ. ఇది పొందించుటకును, దోషముకును పేరు. **ఆసత్తి** : స్త్రీ. ఇది కూడుకొనుటకును, లాభముకును పేరు. |
| పర్యాప్తి స్స్యా త్ప్రకామేఽపి<br>(ప్రాప్తౌ) తృప్తౌచ పరిరక్షణే॥ | **పర్యాప్తి** : స్త్రీ. ఇది అతిశయముకును, తృప్తికిని, రక్షించుటకును పేరు. |
| సమాప్తిశ్చావసానే స్యా<br>త్సమాప్తిశ్చ సమర్థనే। | **సమాప్తి** : స్త్రీ. ఇది అంతముకును, సమర్థించుటకును పేరు. |
| బృహతీ క్షుద్రవార్తాక్యాం<br>కంటకార్యాం చ వాచి చ॥<br>వారిధాన్యాం మహత్యాంచ<br>ఛందో వసనభేదయోః। | **బృహతీ**: స్త్రీ. ఇది నేలములగచెట్టుకును, వాకుడు చెట్టుకును, మాటకును, జలపాత్రకును, నారదుని వీణకును, నవాక్షర ఛ్ఛందముకును, ఉత్తరీయ వస్త్రముకును పేరు. |
| మాలతీ జాతియువతి<br>జ్యోత్స్నాసు సరిదంతరే॥(173)<br>కాకమాచ్యాం విశల్యాయాం<br>విభావర్యామపీష్యతే। | **మాలతీ**: స్త్రీ. ఇది జాజిచెట్టుకును, యౌవనస్త్రీకిని, వెన్నెలకును, మాలతీ నదికిని, కాచి చెట్టుకును, వెన్నపెదురు చెట్టుకును, రాత్రికిని పేరు. |
| భవతీ బాణభేదేస్యా (దన్య<br>వద్వత్సదర్థయోః) ద్భవద్యుష్మ<br>త్సతో స్త్రిషు॥(174) | **భవతీ** : స్త్రీ. ఇది విషమున పొదిగిన బాణముకును, త్రి. యుష్మదర్థకముకును (నీవు) సదర్థకముకును (ఉన్నది) పేరు. |
| రేవతీ హరిపత్న్యాం స్యా<br>త్తారాభేదేఽ పి మాతృషు। | **రేవతీ** : స్త్రీ. ఇది బలరాముని భార్యకును, రేవతీ నక్షత్రముకును, సప్తమాతృకలకును పేరు. |
| పార్వతీ (స) శల్లకీ దుర్గా<br>ద్రౌపదీ జీవనీషు చ॥(175) | **పార్వతీ** : స్త్రీ. ఇది అందుగ చెట్టుకును, పార్వతీ దేవికిని, ద్రౌపదికిని, పాలకూర కును పేరు. |
| స్రవంతీ చ ద్రవంతీ చ<br>సరిదోషధిభేదయోః। | **స్రవంతీ** : **ద్రవంతీ** : స్త్రీ. ఈరెండును, నదికిని, ఎలుక చెవిచెట్టుకును పేరు. |
| జీవంతీ జీవనీ శమ్యో<br>ర్గుడూచీ వందయోరపి॥(176) | **జీవంతీ** : స్త్రీ. ఇది పాలకూరకును, జమ్మి చెకును, తిప్పతీగకును, బదనికెకును పేరు. |
| హసంత్యంగారధాన్యాం చ | **హసంతీ** : స్త్రీ. ఇది కుంపటికిని, మల్లిచెట్టు |

మల్లికా శాకినీభిదోః।
వాసంతీ మాధవీ యూధ్యోః
పాటలాయాం క్రమేలకే॥
వాచ్యలింగస్త్వృతుభవే
వాసంతః కోకిలే విటే।

పెరుగు తోటకూరకును పేరు.
**వాసంతీ:** స్త్రీ. ఇది బండిగురివెందలతకును, అడవి మొల్లకును, పాటలీలతకును, ఒంటెకును, త్రి. వసంతకాలమున బుట్టిన దానికిని, పు. కోకిలకును, విటునకును పేరు.

★ అథతాంత శ్చతుర్వర్ణః ★

భవేదవసితం జ్ఞాతే
గతావృద్ధావసానయోః॥(178)

**అవసిత :** త్రి. ఇది తెలియబడిన దానికిని, న. గమనముకును, త్రి. నురిచిన ధాన్యముకును, అంతమును బొందిన దానికిని పేరు.

అవదాతం సితే పీతే
విశుద్ధే ప్రవరేఽపి చ।

**అవదాత:** త్రి. ఇదితెల్లని దానికిని, పచ్చని దానికిని, పరిశుద్ధమైన దానికిని, శ్రేష్ఠమైన దానికిని పేరు.

అవగీతం తు నిర్వాదే
ముహుర్దృష్టే విగర్హితే॥

**అవగీత :** న. జనాపవాదకును, త్రి. మాటిమాటికిని చూడబడిన దానికిని, నిందించ బడిన దానికిని పేరు.

అంతర్గతం విస్మృతే స్యా
న్మధ్యప్రాప్తే చ వాచ్యవత్।

**అంతర్గత:** త్రి. ఇది మరువబడిన దానికిని, మధ్యను బొందిన దానికిని పేరు.

అంగారితం పలాశీయ
కలికోద్గమ దగ్ధయోః॥(180)

**అంగారిత :** న. మోదుగ చెట్టు మొగ్గదొడుగుటకును, త్రి. తగులపెట్టబడిన దానికిని పేరు.

అత్యాహితం మహాభీతౌ
జీవానపేక్షికర్మణి।

**అత్యాహిత :** న. ఇది గొప్ప భయముకును, ప్రాణమందాశవదలిన సాహస కృత్యముకును పేరు.

ఉపాహితోఽనలోత్పాత
అహితే చాప్యుపాహితః॥

**ఉపాహిత:** పు. ఇది అగ్నివలనయుపద్రవముకును, త్రి. కూడుకొన్న దానికిని పేరు.

ఉపాకృతోఽధ్వరహతప
శూపద్రుత యోర్మతః।

**ఉపాకృత:** పు. ఇది యజ్ఞమందు చంపబడిన పశువుకును, త్రి. ఉపద్రవము చేయబడిన దానికిని పేరు.

ఉదాస్థితః ప్రతీహారే
ఽధ్యక్షేపి ప్రణి (ధౌ చరే) ధావపి॥(182)

**ఉదాస్థిత :** పు. ఇది ద్వారమునుగాచువానికిని, నాయకునకును, చారునకును పేరు.

అభినీతో భవేన్న్యాయ్యే
సంస్కృతామర్షిణోరపి।

**అభినీత:** పు. ఇది న్యాయముకును, త్రి. సంస్కరింపబడిన దానికిని, కోపముగల దానికిని పేరు.

అభిజాత స్స్మృతో న్యాయ్యే

**అభిజాత:**పు. ఇది న్యాయముకును, త్రి. సత్కులమందు

కులీన ప్రాప్తరూపయోః॥
పారిజాత స్సురతరౌ
మందారే పారిభద్రకే।
భవే త్పరిగతం లాభే
ప్రయాతే వేష్టితేఽపి చ॥
ఖ్యాతం ప్రణిహితం లబ్ధే
విన్యస్తే చ సమాహితే।
భవేత్ప్రతి(హి)హతో ద్విష్టే
ప్రతిస్ఖలితరుద్ధయోః॥
ఉల్లిఖితం సమత్కీర్ణే
వాచ్యవచ్చ తనూకృతే।
విద్యాదుపచితందగ్ధే
సమృద్ధే చ సమాహితే॥ (186)
సముద్ధత స్సముద్గీర్ణేఽప్య
వినీతే సముద్ధతః।
కుహరితం పికాలాపే
రటితే రతనిస్వనే॥ (187)
భవేత్పల్లవితం లాక్షా
రక్తేసప్రసవే త తే।

ఉజ్జృంభితం తు చేష్టాయాం
ప్రఫుల్లేచాభిధేయవత్॥
ఉద్గ్రాహితముపన్యస్తే
బద్ధగ్రాహితయోరపి।
నిస్తుషితం నిస్త్వచి స్యా
ద్వర్జితే చ లఘూకృతే॥
ఐరావతోఽభ్రమాతంగ
నారంగ లికుచా హిషు।

పుట్టిన దానికిని, సౌందర్య ముగల వానికిని పేరు.
**పారిజాత:** పు. ఇది దేవతావృక్షముకును, పారుజా తపు చెట్టుకును, దేవదారు చెట్టుకును పేరు.
**పరిగత :** న. ఇది లాభముకును, త్రి. గతించిన దానికిని, చుట్టుకొన్న దానికిని పేరు.
**ప్రణిహిత :** త్రి. ఇది పొందబడిన దానికిని, ఉంచ బడిన దానికిని, అంగీకరించబడిన దానికిని పేరు.
**ప్రతిహత :** త్రి. ద్వేషింపబడిన దానికిని, జారిన దానికి, అడ్డగింపబడిన దానికిని పేరు.
**ఉల్లిఖిత:** త్రి. ఇదిచిమ్మబడినదానికిని, సూక్ష్మంగా జేయబడిన దానికిని పేరు.
**ఉపచిత :** త్రి. ఇది పూయబడిన దానికిని, సమృద్ధ మైన దానికిని, పొందబడిన దానికిని పేరు.
**సముద్ధత :** త్రి. ఇది వెళ్ళకక్కబడిన దానికిని, గర్వించిన వానికిని పేరు.
**కుహరిత :** న. ఇది కోకిల ధ్వనికిని, చెప్పబడిన దానికిని, రతియందలి కంఠధ్వనికిని పేరు.
**పల్లవిత:** న. ఇది లత్తుకసంబంధమగు రక్తిమకును, త్రి. పుష్పాదులతోగూడినవృక్షముకును, విస్తరింప బడిన దానికిని పేరు.
**ఉజ్జృంభిత :** న. ఇది స్త్రీపురుషుల శృంగార చేష్ట కును, త్రి. వికసించిన దానికిని పేరు.
**ఉద్గ్రాహిత:** త్రి. ఇదిచెప్పబడినదానికిని, కట్టుపడిన దానికిని, స్వీకరించబడిన దాని కిని పేరు.
**నిస్తుషిత :** త్రి. ఇది పొట్టులేని దానికిని, విడచి పెట్టబడినదానికిని, సానపెట్టబడినదానికిని పేరు.
**ఐరావత :** పు. ఇది పూర్వదిగ్గజముకును, నారింజ చెట్టుకును, కమ్మరేగు చెట్టుకును, సర్పవిశేషము

ఐరావతం మహేంద్రస్య
ఋజుదీర్ఘశరాసనే॥ (190)
ఐరావతీ స్యాత్తటి
తి(తటిద్భేదేపి)సరిద్భేదేపి లక్ష్యతే

కును, న. వంకరలేకయుండు నట్టి ఇంద్రధనుస్సు కును ఈ. స్త్రీ. మెరుపునకును, పాంచాలదేశ మందలి నదీ విశేషముకును పేరు.

కలధౌతం రౌప్యహేమ్నోః
కలధౌతం కలధ్వనౌ॥ (191)

**కలధౌత**: న. ఇది వెండికిని, బంగారుకును, అవ్యక్త మధుర ధ్వనికిని పేరు.

దివాభీతః కుంభిలే స్యా
దులూకే కుముదాకరే।

**దివాభీత**: పు. ఇది దొంగవానికిని, గుడ్లగూబకును, కలువ సరస్సుకును పేరు.

పాశుపతో బకపుష్పే
పశుపత్యధిదైవతే॥ (192)

**పాశుపత** : పు. ఇది శివమల్లిచెట్టుకును, శివుడు అధిదేవతయైన మంత్రముకును పేరు.

నిష్కాసితో నిర్గమితేఽ
ప్యాహితేఽధికృతేఽపి చ।

**నిష్కాసిత**: త్రి. ఇది వెళ్ళగొట్టబడిన దానికిని, స్థాపించబడిన దానికిని, అధికార మివ్వబడిన దానికి ని పేరు.

వ్యతీపాతో మహోత్పాతే
యోగభేదాపయానయోః॥

**వ్యతీపాత** : పు. ఇది భూకంపాది దేశోపద్రవములకును, పంచాంగయోగ భేదముకును, పరుగెత్తుటకును పేరు.

సమాఘాతో వధే యుద్ధే

**సమాఘాత** : పు. ఇది చంపుటకును, యుద్ధముకును పేరు.

పరిఘాతోఽస్త్రఘాతయోః।

**పరిఘాత** : పు. ఇది అస్త్రముకును, దెబ్బకు ను పేరు.

వినిపాతోఽవపాతే స్యా
ద్దైవాదివ్యసనేఽపి చ॥

**వినిపాత** : పు. ఇది పడుటకును, దైవము వలన సంభవించు దుఃఖముకును పేరు.

సమాహితః ప్రతిజ్ఞాతే
సమాధిస్థే యతాత్మని।
వాచ్యవన్నిహితే సిద్ధే
సమాధానే సమాహితం॥(195)

**సమాహిత** : త్రి. ఇది ప్రతిజ్ఞ చేయబడిన దానికిని, సమాధియందున్న వానికిని, విషయాంతరసంచారములేని యాత్మగల వానికిని, ఉంచబడిన దానికిని, సిద్ధమైన దానికిని న. అంగీకారముకును పేరు.

నంద్యావర్త స్స్మృతో వేశ్మ
ప్రభేదే తగరుద్రుమే।

**నంద్యావర్త** : పు. ఇది రాజగృహవిశేషముకును, నందివర్ధనపు చెట్టుకును పేరు.

పరివర్తో వినిమయే
కూర్మరాజే పలాయనే॥(196)

**పరివర్త** : పు. ఇది న్యూనాధికములు సాటాలపైని మార్చుకొనుటకును, ఆది కూర్మముకును, పరుగెత్తుటకును పేరు.

అభియుక్తః పరైరుద్ధే
తథాస్యాదతిత్పరే।
అతిముక్తస్తు వా సంత్యాం
తినిశే నిష్కళేఽపి చ॥
ఉపరక్తస్సైంహికేయే
తద్గ్రహే వ్యవనాతురే।

**అభియుక్త**: త్రి. ఇది శత్రువులచేత ముట్టడింపబడిన దానికిని, అధికాసక్తిగల దాని కిని పేరు.
**అతిముక్త**: పు. ఇది బండిగురివెంద లతకును, నెమ్మి చెట్టుకును, త్రి. వీర్యబలము తప్పిన వానికిని పేరు.
**ఉపరక్త**: పు. ఇది రాహుగ్రహముకును, రాహువు చేత గ్రసించబడిన చంద్రసూర్యులకును, త్రి. కష్ట ములచేత పీడింపబడిన వానికిని పేరు.

సూర్యభక్తో బంధుజీవే
తథా భాస్కరపూజకే॥ (198)
నదీకాంత స్సముద్రే స్యా
త్సింధువారేఽపి హిజ్జలే।
నదీకాంతా స్మృతా జంబూ
కాకజంఘాల తాసు చ॥
నాగదంతో ద్విపరదే
గృహాంతర్గతదారణి।
నాగదంతీతు కుంభాయాం
శ్రీ హస్తిన్యామపీష్యతే॥ (200)

**సూర్యభక్త** : పు. ఇది మంకెన చెట్టుకును, త్రి. సూర్యోపాసకునకును పేరు.
**నదీకాంత** : పు. ఇది సముద్రునకును, వావిలి చెట్టుకును, నీటి గన్నేరు చెట్టుకును, స్త్రీ. నేరేడు చెట్టుకును, కాకి దొండ చెట్టు కును, ప్రేంకణపు చెట్టుకును పేరు.
**నాగదంత** : పు. ఇది గజదంతముకును, ఇంటికి వేసిన దూలము (లేక తనాబీ) కర్ర కును, ఈ. స్త్రీ. నాగదంతి చెట్టుకును, గురుగు చెట్టుకును పేరు.

పుష్పదంతస్తు దిజ్నాగే
నాగ విద్యాధరాంతరే।
చంద్రకాంతోఽశ్మభేదేస్యా
చ్చంద్ర కాంతం చ కైరవే॥
వైజయంతో గృహే శక్ర
ప్రాసాద ధ్వజయోరపి।
వైజయంతీ పతాకాయాం
జయంతీ వహ్నిమంథయోః॥
పురస్కృతం స్వీకృతా భి
శస్తయో రభిధేయవత్।
అగ్రేకృతా భ్యర్చితయో

**పుష్పదంత** : పు. ఇది వాయవ్యదిగ్గజము కును, సర్పవిశేషముకును, ఈ పేరుగల విద్యాధరునకును పేరు.
**చంద్రకాంత** : పు. ఇది చంద్రకాంతమణి కిని, న. కలువకును పేరు.
**వైజయంత** : పు. ఇది గృహముకును, ఇంద్రుని మేడకును, ఇంద్రునిధ్వజము కును, ఈ. స్త్రీ. జండా కును, తక్కెడు చెట్టుకును, కూరనెల్లి చెట్టుకును పేరు.
**పురస్కృత** : త్రి. ఇది స్వీకరించబడిన దానికిని, అగమ్యాగమనాదులచేత నిందింపబడిన వానికిని, ముందుగా జేయబడిన దానికిని, పూజింపబడిన

| | |
|---|---|
| స్సక్తే చాపి పురస్కృతం॥ | దానికిని, తడపబడిన దానికిని పేరు. |
| అవధ్వస్తం పరిత్యక్తే | **అవధ్వస్త** : త్రి. ఇది విడువబడిన దానికిని, నిందింప |
| నిందితేప్యవచూర్ణితే। | బడిన దానికిని, చూర్ణముగా జేయబడిన దానికిని పేరు. |
| ధూమకేతు స్స్మృతోవహ్నౌ | **ధూమకేతు** : పు. ఇది అగ్నికిని, తోకచుక్కకును, |
| వుత్పాతగ్రహభేదయోః॥ | గ్రహవిశేషముకును పేరు. |
| చిత్రగుప్తః కృతాంతే స్యా | **చిత్రగుప్త** : పు. ఇది యమునకును, యముని వద్ద |
| ల్లేఖకే చాస్యసమ్మతః। | జనులపాపపుణ్యముల వ్రాయువానికిని పేరు. |
| పంచగుప్తస్తు చార్వాక | **పంచగుప్త** : పు. ఇది చార్వాకమతశాస్త్రముకును, |
| దర్శనే కమఠేపి చ॥(205) | తాబేటికిని పేరు. |
| అధిక్షిప్తః ప్రణిహితే | **అధిక్షిప్త** : త్రి. ఇది పంపించబడిన దానికిని, కూట |
| తథానిర్భత్సితేపి చ। | సాక్ష్యాదులచేత నిందితునకును పేరు. |
| ప్రతిక్షిప్తం ప్రతిహతే | **ప్రతిక్షిప్త** : త్రి. ఇది కొట్టబడిన దానికిని, పంపించ |
| ప్రేషితే చ నిరాకృతే॥ (206) | బడిన దానికిని, తిరస్కరించబడిన దానికిని పేరు. |
| మరుత్వా న్మారుతా శక్రే | **మరుత్వాన్** : పు. ఇది హనుమంతునకును, ఇంద్రు |
| సరిత్వానంబుధౌ నదే। | నకును పేరు. **సరిత్వాన్** : పు. ఇది సముద్రునకును, నదముకును పేరు. |
| ఆయుష్మా న్యోగభేదే స్యా | **ఆయుష్మాన్** : పు. ఇది పంచాంగయోగ భేదము |
| దాయుష్మం శ్చిరజీవిని॥ | కును, దీర్ఘయుర్దాయముగల వానికి పేరు. |
| వివస్వాన్విబుధే భానౌ | **వివస్వాన్** : పు. ఇది విద్వాంసునకును, సూర్యు నకును పేరు. |
| భగవాన్బుద్ధపూజ్యయోః। | **భగవాన్**: పు. ఇది బుద్ధదేవునకును, పూజింపదగిన వానికిని పేరు. |
| ద్వీపవాన్సింధునదయో | **ద్వీపవాన్**:పు. ఇదిసముద్రునకును, నదముకును పేరు. |
| ర్ద్వీపవత్యాపగా భువోః॥ | **ద్వీపవతీ** : స్త్రీ. ఇది నదికిని, భూమికిని పేరు. |
| గరుత్మాన్విహగే తార్క్ష్యే | **గరుత్మాన్**: పు. ఇది పక్షికిని, గరుడునకును పేరు. |
| సంఖ్యావాన్పండితే మితే। | **సంఖ్యావాన్** : పు. ఇది పండితునకును, త్రి. సంఖ్య గల దానికిని పేరు. |
| అంశుమావ్భాస్కరే శాలి | **అంశుమాన్** : పు. ఇది సూర్యునకును, ఈ. స్త్రీ. |

పర్ణ్యామంశుమతీ మతా॥
అర్థపతిః కుబేరే స్యా
దీశ్వరేऽర్థపతి స్తథా।
గృహపతి ర్గృహస్థే స్యా
దత్యాధానేచసత్రిణి ॥ (207)
సేనాపతిః కార్తికేయే
ష్యనీ కాధికృతేऽపి చ।
లక్ష్మీపతి ర్వాసుదేవే
లవంగద్రుమపూగయోః॥(208)
ప్రజాపతి ర్విధౌ భూపే
హిమారాతిః ఖగేऽనలే।
వనస్పతి ర్వృక్షమాత్రే
వినాపుష్పం ఫలద్రుమే॥(209)
సదాగతి స్స్యాత్పవనే
నిర్వాణే చ నదీశ్వరే।
దివాకీర్తిస్తు చండాలే
నాపితో లూకయోరపి॥(210)
శతధృతి ర్ధాతరీంద్రే
సుధాసూతి ర్మఖే విధౌ।

భవేదపచితిః పూజా
క్షయహానిషు నిష్కృతౌ॥(211)
అనుమతి స్స్యాదూనేందు
పూర్ణిమానుజ్ఞయోరపి।
ప్రతికృతిః ప్రతీకారే
ప్రతిమాయాం చ పూజనే॥
నిరాకృతిః ప్రతిక్షేపేऽప్య
స్వాధ్యాయేऽప్యనాకృతౌ।

ముయ్యాకుల పొన్నచెట్టుకును పేరు.

**అర్థపతి** : పు. ఇది కుబేరునకును, రాజుకు ను పేరు.

**గృహపతి** : పు. ఇది గృహస్థునకును, నిత్యాగ్నిహోత్రికిని, యజ్ఞముచేయువాని కిని పేరు.

**సేనాపతి**: పు. ఇది కుమారస్వామికిని, సేనానాయకునకును పేరు.

**లక్ష్మీపతి** : పు. ఇది విష్ణువుకును, లవంగపు చెట్టుకును, పోకచెట్టుకును పేరు.

**ప్రజాపతి** : పు. ఇది బ్రహ్మకును, రాజుకు ను పేరు.

**హిమారాతి** : పు. ఇది సూర్యునకును, అగ్నికిని పేరు.

**వనస్పతి** : పు. ఇది వృక్షవిశేషముకును, పుష్పము లేకనే ఫలించెడి వృక్షముకును పేరు.

**సదాగతి**: పు. ఇది వాయువుకును, సుఖముకును, సముద్రునకును పేరు.

**దివాకీర్తి** : పు. ఇది మాదిగ వానికిని, మంగలి వానికిని, గుడ్లగూబకును పేరు.

**శతధృతి** : పు. ఇది బ్రహ్మకును, ఇంద్రున కును పేరు.

**సుధాసూతి** : పు. ఇది యజ్ఞముకును,చంద్రునకును పేరు.

**అపచితి**: స్త్రీ. పూజకును, నాశముకును, హానికిని, ప్రతీకారముకును పేరు.

**అనుమతి** : స్త్రీ. ఇది ఒక్క కళ తక్కువయైన చంద్రుడు గల పూర్ణిమకును, ఆజ్ఞకును పేరు.

**ప్రతికృతి**: స్త్రీ. ఇది ప్రతిక్రియకును, విష్ణు వినాయకాదిప్రతిమకును, పూజకును పేరు.

**నిరాకృతి**: స్త్రీ. ఇది తిరస్కరించుటకును, స్వాధ్యాయమును జదువని వానికిని త్రి. ఆకారములేని దానికిని పేరు.

ప్రతిపత్తిః పదప్రాప్తౌ
ప్రవృత్తౌ గౌరవే ऽపి చ॥(213)
ప్రాగల్భ్యే చ ప్రబోధే చ
ప్రతిపత్తిః ప్రయుజ్యతే।

**ప్రతిపత్తి :** స్త్రీ. ఇది స్థానమును బొందుటకు ను, వ్యాపారముకును, గౌరవముకును, ప్రతిభకును, జ్ఞానముకును పేరు.

ఉపసత్తి స్సంగమే స్యా
త్సేవాయాం ప్రతిపాదనే॥

**ఉపసత్తి:** స్త్రీ. ఇది కలయికకును, సేవించుటకును, సమర్థించుటకును పేరు.

అభిశస్తి స్మృతా లోకా
పవాదే ప్రార్థనేऽపి చ।

~~**అభిశస్తి:** స్త్రీ. ఇది జనాపవాదమునకును, యాచించుట~~
కును పేరు.

పారావతః కలరవే
శైలేమర్కటతిందుకే॥(215)

**పారావత :** పు. ఇది పావురముకును, పర్వతముకును, కోతి తుమికిచెట్టుకును పేరు.

భోగవతీ భుజంగానాం
నగరీ సరితోऽరపి।

**భోగవతీ:** స్త్రీ. ఇది పాతాళమందలిసర్ప పట్టణముకును, పాతాళనదికిని పేరు.

గంధవతీ సురా భూమ్యోః
పురీ యోజన గంధయోః॥

**గంధవతీ:** స్త్రీ. ఇది కల్లుకును, భూమికిని, వాయుదేవుని పట్టణముకును, వ్యాసుని తల్లికిని పేరు.

హైమవత్యభయా స్వర్ణ
క్షీర్యోః శ్వేతవచో మయోః।

**హైమవతి :** స్త్రీ. ఇది కరక చెట్టుకును, కంకుష్ఠపు చెట్టుకును, తెల్లవసకును, పార్వతికిని పేరు.

చర్మణ్వతీ నదీభేదే
కదళీపాదపేऽపి చ॥ (217)

**చర్మణ్వతీ :** స్త్రీ. ఇది నదీవిశేషముకును, అరటి చెట్టుకును పేరు.

కుముద్వతీ కుముదిన్యాం
కుశపత్న్యాం కుముద్వతీ।

**కుముద్వతీ :** స్త్రీ. ఇది కలువ సరస్సుకును, కుశుని భార్యకును పేరు.

శుభదంతీ సుదంత్యాం స్యా
త్పుష్పదంతే భయోషితి॥

**శుభదంతీ :** స్త్రీ. ఇది యోగ్యమైన దంతములు గల దానికిని, వాయవ్యదిగ్గజము భార్యకును పేరు.

సరస్వతీ సరిద్భేదే
గోవాగ్దేవతయోర్గిరి।
స్త్రీరత్నేచాపగాయాం చ
సరస్వా న్రసికేऽంబుధౌ॥

**సరస్వతీ:** స్త్రీ. ఇది నదీ విశేషముకును, గోవుకును, సరస్వతీ దేవికిని, మాటకును, స్త్రీరత్నముకును, నదీ సామాన్యముకును పేరు.

**సరస్వాన్ :** పు. ఇది రసికునకును, సముద్రముకును పేరు.

రంగమాతా పి కుట్టన్యాం

**రంగమాతా :** స్త్రీ. ఇది కుంటెనకత్తెకును, వృక్షరోగ

స్మృతా భూమిరుహేఽమయే।
ప్రధూమితా క్లేశితాయాం
సూర్యగంతవ్యదిశ్యపి॥(220)
ప్రవ్రాజితా తపస్విన్యాం
ముండిన్యాం మాంసికౌషధౌ।
ఋష్యప్రోక్తా శతావర్యాం
శూకశింబ్యాం బలాభిది॥
కృష్ణవృంతా పాటలాయాం
మాషపర్ణ్యాం చ భావితా।
సముద్రాంతాతు కార్పాసీ
స్పృక్కా- దురాలభాసు చ॥(222)

విశేషముకును పేరు.
**ప్రధూమితా :** స్త్రీ. ఇది క్లేశపెట్టబడిన దానికిని, సూర్యుడు పొందతగిన దిక్కునకు ను పేరు.
**ప్రవ్రాజితా :** స్త్రీ. ఇది యోగినికిని, జుట్టు గొరగబడిన దానికిని, జటామాంసికిని పేరు.
**ఋష్యప్రోక్తా :** స్త్రీ. ఇది పిల్లిపిచ్చరకును, దూలగొండి చెట్టుకును, చిట్టాముదపు చెట్టుకును పేరు.
**కృష్ణవృంతా :** స్త్రీ. ఇది కలిగొట్టుచెట్టుకును, కారుమినపచెట్టుకును పేరు.
**సముద్రాంతా :** స్త్రీ. ఇది ప్రత్తిచెట్టుకును, స్పృక్కయనెడు గంధద్రవ్యముకును, పిన్నరేగటి దూలగొండి చెట్టుకును పేరు.

★ అథ పంచస్వర తాంతాః ★

స్యాదవలోకితో బుద్ధే
ప్రేక్షితే త్వవలోకితం।
ఉపధూపిత ఆసన్న
మరణోపరిధూపితే॥(223)
స్యాదపరాజితో విష్ణౌ
శ్రీకంఠే చాపరాజితే।
శ్వేతాజయంతీ దుర్గాస్వ
నిర్జితే త్వభిధేయవత్॥
గణాధిపతి రిత్యాఖ్యా
శంకరేఽపి గజాననే।
యాదసాంపతిరంభోధౌ
ప్రతీచీదిక్పతావపి॥(225)
స్యాత్పృథివీ పతి ర్భూపే
ఋషభాఖ్యౌషధే (యమే)ఽపిచ।
మూర్ధాభిషిక్తో భూపాలే

**అవలోకిత :** పు. ఇది బుద్ధదేవునకును, త్రి. చూడబడిన దానికిని పేరు.
**ఉపధూపిత :** త్రి. ఇది సమీపించిన మరణము గలవానికిని, పీడపెట్టబడిన వానికిని పేరు.
**అపరాజిత :** పు. ఇది విష్ణువుకును, శివునకును, త్రి. జయింపబడని దానికిని పేరు.
**శ్వేతాజయంతీ :** త్రి. ఇది కోటలయందు జయింపబడని దానికిని పేరు.
**గణాధిపతి :** పు. ఇది శివునకును, గణపతికిని పేరు.
**యాదసాంపతి :** పు. ఇది సముద్రముకును, వరుణదేవునకును పేరు.
**పృథివీపతి :** పు. ఇది రాజుకును, ఋషభమను గంధద్రవ్యముకును పేరు.
**మూర్ధాభిషిక్త :** పు. ఇది రాజుకును, ముఖ్యాన

| | |
|---|---|
| ప్రధానే క్షత్రియేఽపి చ॥ | కును, క్షత్రియునకును పేరు. |
| వసంత దూత శ్చూతే స్యా త్పికపంచమరాగయోః। | **వసంతదూత** : పు. ఇది మామిడి చెట్టుకు ను, కోకిలకును, పంచమ స్వరముకును పేరు. |
| వసంతదూతీ పాటల్యాం (ప్రతీచ్యామతిముక్తకే) గణి కార్యతిముక్తయోః॥ (227) | **వసంతదూతీ**: స్త్రీ. ఇదిపాటలీలతకును, పుష్పవృక్ష విశేషముకును, బండిగురివెంద చెట్టుకును పేరు. |
| ★ అథతాంతషడ్వర్ణః ★ | |
| అర్ధపారావత శ్చిత్ర కంఠేతిత్తిరపక్షిణి। | **అర్ధపారావత** : పు. ఇది పావురములలో నిభేదము కును, తీతువ పిట్టకును పేరు. |
| ★ అథతాంత స్సప్తవర్ణః ★ | |
| సముద్రనవనీ తాఖ్యా పీయూషామృతరోచిషోః॥(228) | **సముద్రనవనీత** : పు. ఇది అమృతముకును, చంద్రునకును పేరు. |
| ★ అథ థాంతవర్గః ★ | |
| రథ స్స్యాత్స్యందనే కాయే చరణే వేతసేఽపి చ। | **రథ**: పు. ఇది రథముకును, శరీరముకును పాదము కును, ప్రబ్బలి చెట్టుకును పేరు. |
| కుథః ప్రవేణీ కుథయోః | **కుథ**: పు. ఇది ఏనుగుమీద పరచెడు చిత్ర కంబళికిని, దర్భకును పేరు. |
| పీథోఽర్కే పీథ మంభసి॥ | **పీథ** : పు. ఇది సూర్యునకును, న. జలముకును పేరు. |
| కోథస్తు శఠితే నేత్ర రుగ్భేదే మంథనేఽపి చ। | **కోథ**: పు. ఇది దుష్టత్వముకును, నేత్రరోగవిశేషము కును (కలకయందురు) మథించుటకును పేరు. |
| ప్రోథోఽధ్వగేఽశ్వఘోణాయాం కటీ స్త్రీగర్భయో రపి॥(2) | **ప్రోథ**: పు. ఇది మార్గస్థునకును, గుఱ్ఱపు ముట్టికిని, కటిదేశముకును, స్త్రీల గర్భముకును పేరు. |
| క్వాథ స్స్యాద్ద్రవనిష్పాకే దుఃఖ వ్యసనయోరపి। | **క్వాథ** : పు. ఇది ద్రవద్రవ్యమును కాచుటకును, దుఃఖముకును, ఆపదకును పేరు. |
| సిక్థం నీల్యాం మధూచ్ఛిష్టే సిక్థ ఓదనసంభవే॥(3) | **సిక్థ** : న. ఇది నీలిమందుకును, మైనముకును, పు. అన్నకణముకును పేరు. |
| పృథు ర్నృపే కృష్ణజీరే వాప్యాం పృథు మహత్యపి। | **పృథు**: పు. ఇది పృథుచక్రవర్తికిని, నల్లజీలకఱ్ఱ కును, దిగుడు బావికిని, త్రి. విస్తారమైన దానికిని పేరు. |

దుస్థ స్స్యాద్దుర్గతే మూర్ఖే
ప్రస్థ శ్శిఖర మానయోః॥ (4)
ప్రస్థ స్సానౌ ప్రయాణే తు
ప్రస్థాపి సరికథ్యతే।

**దుస్థ :** పు. ఇది దరిద్రునకును, మూర్ఖున కును పేరు.

**ప్రస్థ :** పు. ఇది పర్వత శిఖరముకును, కుంచెడు పరిమాణముకును, కొండచరియకును, స్త్రీ. ప్రయాణముకును పేరు.

తుత్థో గ్నావంజనే తుత్థా
నీలీ సూక్ష్మైలయోరపి॥(5)
మంథ స్సక్తుప మంథాన
నేత్రామయదివాకరే।

**తుత్థ :** పు. ఇది అగ్నికిని, న. మైలతుత్తముకును, స్త్రీ. నీలిచెట్టుకును, సన్నయేలకులకును పేరు.

**మంథ :** పు. ఇది సక్తుపిండితో చేయబడిన పానీయ ద్రవ్యవిశేషముకును, కవ్వముకును, నేత్ర రోగవిశేష ముకును, సూర్యునకును పేరు.

గ్రంథో ధనే స్యాత్సందర్భే
ద్వాత్రింశద్వర్ణనిర్మితే॥(6)
గ్రంథిః పర్వణికౌటిల్యే
గ్రంథిపర్ణే గదాంతరే।

**గ్రంథ :** పు. ఇది ధనముకును, ప్రబంధరచనకును, అనుష్టుపు శ్లోకముకును పేరు.

**గ్రంథి :** పు. ఇది చెరుకు మొదలగువాటి కణుపున కును, కుటిలత్వముకును, స్థానేయమను గంధ ద్రవ్యముకును, కంతిరోగముకును పేరు.

అర్థః ప్రకారే విషయే
విత్తకారణ వస్తుషు॥ (7)
అభిధేయే చ శబ్దానాం
నివృత్తౌ చప్రయోజనే।
తీర్థం శాస్త్రాధ్వర క్షేత్రో
పాయోపాధ్యాయ మంత్రిషు॥(8)
అవతార ర్షిజుష్టాంభః
స్త్రీరజస్సు చ విశ్రుతం।
సార్థో వణిక్సమూహే
స్యాదపి సంఘాతమాత్రకే॥
పార్థస్తు కకుభే జిష్ణౌ
గాథా వాగ్భేద వృత్తయోః।

**అర్థ :** పు. ఇది విధముకును, విషయముకును, ధనముకును, కారణముకును, మృత్పాషాణాది వస్తువుకును, శబ్దము యొక్క వాచ్యార్థముకును, మళ్ళుటకును, ప్రయోజనముకును పేరు.

**తీర్థ :** న. ఇది శాస్త్రముకును, యజ్ఞముకును, పుణ్య క్షేత్రముకును, ఉపాయముకును, గురువుకును, మంత్రికిని నీళ్ళరేవుకును, ఋషులు స్నానముచేయు జలాశయముకును, ముట్టు రక్తముకును పేరు.

**సార్థ :** పు. ఇది వర్తకులసమూహముకును, సంఘ సామాన్యముకును పేరు.

**పార్థ :** పు. ఇది వీణకరిదికిని, అర్జునునకును పేరు.

**గాథా :** స్త్రీ. ఇది ప్రాకృతాదిభాషకును, శ్లోకము కును పేరు.

కంథా మృన్మయభిత్తౌ చ
కంథా ప్రావరణాంతరే॥
ఆస్థా చాలంబనా స్థాన
.యత్నా పేక్షాసు కథ్యతే।
సంస్థా స్థితౌ చరే నాశే
వ్యక్తి సాదృశ్యయోరపి॥ (11)
వీథీ గృహాంగే పంక్తౌచ
నాట్యరూపక వర్త్మనోః।
యూథీ పుష్పప్రభేదే స్యా
న్మాగధ్యాం చ కురంటకే॥
యూథం తిర్యక్సమూహేస్యా
ద్బృందమాత్రే చ భాషితం।

**కంథా** : స్త్రీ. ఇది మట్టిగోడకును, బొంతకును పేరు.

**ఆస్థా** : స్త్రీ. ఇది ఆధారముకును, కొలువు కూటము కును, ప్రయత్నముకును, కోరికకును పేరు.

**సంస్థా** : స్త్రీ. ఇది ఉండుటకును, పు. దూతకును, స్త్రీ. నాశముకును, ఆకృతికిని సామ్యముకును పేరు.

**వీథీ** : స్త్రీ. ఇది గృహముల వరుసకును, వరున కును, నాటకభేదముకును, మార్గముకును పేరు.

**యూథీ** : స్త్రీ. ఇది పుష్ప విశేషముకును, అడవి మొల్లచెట్టుకును, పచ్చపువ్వుల గోరింటుకును పేరు.

**యూథ** : న. ఇది పశ్వాది సమూహము కును, సంఘసామాన్యముకును పేరు.

**★ అథ థాంత త్రివర్ణః ★**

మన్మథః కామచింతాయాం
కపిత్థే కుసుమాయుధే ॥ (13)
ఉన్మాథః కూటయంత్రేస్యా
న్మారణే ఘాతకేఽపి చ।
ప్రమథోఽపి గణే ప్రోక్తః
పథ్యాయాం ప్రమథామతా॥
నిశీథోఽప్యర్ధరాత్రే స్యా
న్నిశీథో రాత్రిమాత్రకే।
విదథో యోగికృతినో
రుద్రథశ్శుని కుక్కుటే॥ (15)
సనాథ స్సదృశే యుక్తే
నాథవత్యపి దృశ్యతే।
శమథ స్సచివే శాంతౌ
దమథో దమ దండయోః॥

**మన్మథ** : పు. ఇది మదనోద్రేకముకును, వెలగచెట్టు కును, మన్మథునకును పేరు.

**ఉన్మాథ** : పు. ఇది వ్యాఘ్రాదులను పట్టెడి బోను కును, చంపుటకును, ఘాతకునకును పేరు.

**ప్రమథ** : ఇది ప్రమథ గణముకును, స్త్రీ. కరక చెట్టుకును పేరు.

**నిశీథ** : పు. ఇది అర్ధరాత్రికిని, రాత్రిసామాన్యము కును పేరు.

**విదథ** : పు. ఇది యోగికిని, పుణ్యాత్మునకును పేరు.

**ఉద్రథ** : పు. కుక్కకును, కోడికిని పేరు.

**సనాథ** : త్రి. ఇది సమానమైన దానికిని, కూడు కొన్న దానికిని, నాథుడు కల దానికిని పేరు.

**శమథ** : పు. మంత్రికిని, ఓరిమికిని పేరు.

**దమథ** : పు. ఇది ఇంద్రియనిగ్రహాది క్లేశ మును సహించుటకును, శిక్షకును పేరు.

వరూథో రథగుప్తౌ స్యా
ద్వరూథం చర్మవేశ్మనోః।

**వరూథ** : పు. ఇది రథమునకు కప్పిన వ్యాఘ్రాది చర్మముకును, సామాన్య చర్మముకును, గృహము కును పేరు.

అతిథిః కుశపుత్రేऽపి
కోపేప్రాహుణికేऽపిచ॥ (17)

**అతిథి** : పు. ఇది కుశుని పుత్రునకును, కోపము కును, ఆగంతుకునకును పేరు.

వమథు ర్వమనేऽపి స్యా
ద్గజస్య కరశీకరే।

**వమథు** : పు. వాంతికిని, గజతుండాగ్రము వలన పుట్టెడి తుంపురులకును పేరు.

క్షవథుః (కథితః కాసే) స్యాత్ క్షుతే
కాసే హిక్కాయా మపి కథ్యతే॥ (18)

**క్షవథు** : పు. ఇది తుమ్ముకును, దగ్గుకు ను, ఎక్కిళ్ళకును పేరు.

స్సమర్థో పి హితే శక్తేసం
బంధార్థేऽపి సమ్మతః।

**సమర్థ** : పు. ఇది ఇష్టునకును, సామర్థ్యము గల వానికిని, సంబంధార్థముకును పేరు.

సిద్ధార్థ శ్శాక్యసింహే స్యా
త్సిద్ధార్థ స్సితసర్షపే॥ (19)

**సిద్ధార్థ** : పు. ఇది శాక్యసింహుడను బుద్ధునకును, తెల్లావాలకును పేరు.

కాయస్థోऽపి నృజాతేస్యా
త్ప్రభేధే పరమాత్మని।
కా యస్థా తు హరీత క్యా
మామలక్యాం చ దర్శితా॥(20)

**కాయస్థ** : పు. ఇది బ్రాహ్మణ స్త్రీయందు క్షత్రియుని వలన పుట్టిన వానికిని, పరమాత్మకును, స్త్రీ. కరక కాయకును, వుశిరి కాయకును పేరు.

వయస్థో వాచ్యవద్యూని
వయస్థా శాల్మలీద్రుమే।
బ్రాహ్మీ గుళూచీ కాకోళీ
సూక్ష్మేలా మలకీషు చ॥ (22)

**వయస్థ** : త్రి. ఇది పిన్నవయసుగల దానికిని, స్త్రీ. బూరుగచెట్టుకును, పొన్నగంటి కూరకును, తిప్ప తీగకును, కాకోళియను ఓషధి విశేషముకును, సన్నయేలకులకును, ఉశిరిగకాయకును పేరు.

అశ్వత్థో గర్దభాండే స్యా
త్పిప్పలే పూర్ణిమాతిథౌ।

**అశ్వత్థ** : పు. ఇది కలజువ్వి చెట్టుకును, రావిచెట్టు కును, పౌర్ణమాస్యకును పేరు.

ఉపస్థో మేఢ్ర ఉత్సంగే
భగే పాయౌ చ కథ్యతే॥

**ఉపస్థ** : పు. ఇది శిశ్నముకును, ఉపరి భాగము కును, యోనికిని, గుదస్థానమునకును పేరు.

నిర్గ్రంథో నగ్నకేऽపి స్యా
న్నిస్వ బాలిశయోరపి।

**నిర్గ్రంథ** : పు. ఇది దిగంబరునకును, దరిద్రున కును, వివేకహీనునకును పేరు.

గోగ్రంథిస్తు కరీషే స్యా

**గోగ్రంథి** : పు. ఇది ఎరివికిని, ఆవులమంద కును,

ద్గోష్ఠే గోజిహ్వా కాషదే॥(23)
అవ్యథా తు హారీతక్యాం
పన్నగే నిర్వ్యథేఽపి చ।
షడ్గ్రంథాపి వచా సింహ్యా
షడ్గ్రంథోఽపి ప్రకీర్త్యతే॥

యెద్దునాలుక చెట్టుకును పేరు.
**అవ్యథా**: స్త్రీ. ఇది ఉశిరిగచెట్టుకును, పాముకును, బాధలేకుండుటకును పేరు.
**షడ్గ్రంథ**: స్త్రీ. ఇది వసకును, ఆరు కణుపులు గల క్రానుగు చెట్టుకును పేరు.

★ అథ చతుఃస్వరథాంతవర్గః ★

చిత్రరథ స్స్యాద్గంధర్వే
రవౌ విద్యాధరాంతరే।
చతుష్పథ శ్చతుర్మార్గ
సంగమేఽపి ద్విజేఽపి చ॥(25)
వానప్రస్థో మధూకే స్యా-
త్కింశు కేచాశ్రమాంతరే।
దశమీస్థో నష్టబీజే
స్థవిరేచ ప్రచక్షతే॥ (26)
అనీకస్థో రణఖలే
గజశిక్షా విచక్షణే।
రాజరక్షే చ చిహ్నేచ
వీరమర్దళకేఽపి చ॥
భవేదితికథా నష్ట
ధర్మేఽపార్థే వచస్యపి।
అశ్రద్ధేయేఽ
ప్యుదరథి స్సముద్రే చ
వియన్మణౌ॥ (27)

**చిత్రరథ**: పు. ఇది చిత్ర రథుడను గంధర్వునకును, సూర్యునకును, విధ్యాధర విశేషునకును పేరు.
**చతుష్పథ**: పు. ఇది నాలుగు త్రోవలుకలసినచోటుకును, బ్రాహ్మణునకును పేరు.
**వానప్రస్థ**: పు. ఇది ఇప్పచెట్టుకును, మోదుగచెట్టుకును, మూడవ వాన ప్రస్థాశ్రమమునకును పేరు.
**దశమీస్థ**: పు. ఇది వీర్యపటుత్వము లేని వానికిని, ముసలి వానికిని పేరు.
**అనీకస్థ**: పు. ఇది యుద్ధభటునకును, గజ మును శిక్షింపనేర్పుగలవానికిని, రాజు యొక్క అంగరక్షకునకును, చిహ్నకును, యుద్ధమందు వాయించు మద్దెలకును పేరు.
**ఇతికథా**: స్త్రీ. ఇది అధర్మమైనట్టిన్ని, అపార్థము నిచ్చునట్టిన్ని వాక్యముకును, నమ్మతగని వాక్యమునకును పేరు.
**ఉదరథి**: పు. ఇది సముద్రునకును, సూర్యునకును పేరు.

★ అథ దాంతో ద్వివర్ణః ★

గదో భ్రాతరి విష్ణో స్స్యా
దామయేస్యాయుధే గదా
నద స్సముద్రే నినదే
నదీతు సరితి స్మృతా॥(1)

**గద**: పు. ఇది గదుడను కృష్ణునియన్నకును, రోగముకును, స్త్రీ. గదాయుధముకును పేరు.
**నద**: పు. ఇది సముద్రముకును, ధ్వనికి ని, ఈ. స్త్రీ. నదికిని పేరు.

| | |
|---|---|
| మదో రేతసి కస్తూర్యాం<br>గర్వే హర్షే భదానయోః।<br>మద్యేऽపి మద ఆఖ్యాతో<br>మదీ (కృ) చషక వస్తుని॥(2) | **మద :** పు. ఇది రేతస్సుకును, కస్తూరికిని, గర్వము కును, సంతోషముకును, గజమదముకును, కల్లుకును, ఈ. స్త్రీ. సురాపాత్రకును పేరు. |
| పదం శబ్దే చ వాక్యే చ<br>వ్యవసాయా పదేశ యోః।<br>పాద పచ్చిహ్నయోః స్థాన<br>త్రాణయో రంకవస్తువోః॥ | **పద :** న. ఇది శబ్దముకును, వాక్యముకును, మిషకును, పాదముకును, పాద చిహ్నముకును, ప్రదేశముకును, రక్షణకును, చిహ్నముకును, వస్తువుకును పేరు. |
| ఛదః పలాశే గరుతి<br>గ్రంధిపర్ణ తమాలాయోః। | **ఛద :** పు. ఇది ఆకుకును, రెక్కకును, స్థాణేయమను గంధద్రవ్యముకును, తాపింఛవృక్షముకును పేరు. |
| రదో విలేఖనే దంతే | **రద:** పు. ఇది వ్రాయుటకును, దంతముకును పేరు. |
| భద్రం కళ్యాణ శర్మణో ః॥(4) | **భద్ర:** పు. ఇది మంగళముకును, సుఖముకును పేరు. |
| భేదో ద్వైధేవిశేషేస్యా<br>దుపజాపే విదారణే। | **భేద :** పు. ఇది వేరగుటకును, విశేషముకును, భేదోపాయముకును, ఖండించుటకును పేరు. |
| స్వేదస్తు స్వేదనే ఘర్మే | **స్వేద :** పు. ఇది ఆవిమీదను ఔషధాదులను వండు యంత్రవిశేషముకును, ఉక్కకును పేరు. |
| శాదః కర్దమ శష్పయో ః॥(5) | **శాద :** పు. ఇది బురదకును, లేతగడ్డికిని పేరు |
| పాదో బుధ్నే తురీయాంశే<br>శైలప్రత్యంత పర్వతే।<br>చరణే చ మయూఖేచ | **పాద :** పు. ఇది చెట్టు పేరుకును, నాల్గవ భాగము కును, పర్వత ప్రాంతమందలి చిన్న మెట్టకును, పాదముకును, కరణముకును పేరు. |
| క్షోదో రజసి పేషణే॥(6) | **క్షోద :** పు. ఇది పిండికిని, నూరుటకును పేరు. |
| సూదస్తు సూపవత్సూప<br>కారే చ వ్యంజనాంతరే। | **సూద :** పు. ఇది సూప శబ్దమువలెనే, వంటలవాని కిని, ముద్దపప్పుకును పేరు. |
| స్వాదు ర్మనోజ్ఞే మృష్టేచ | **స్వాదు :** త్రి. ఇది మనోహరమైనదానికిని, రుచిగల దానికిని పేరు. |
| మృదుస్స్యాత్కోమలేऽఖరే | **మృదు :** త్రి. ఇది లేతగానుండు దానికిని, మెత్తని దానికిని పేరు. |
| అబ్దసంవత్సరే మేఘే | **అబ్ద :** పు. ఇది సంవత్సరముకును, మేఘముకును, |

| | |
|---|---|
| గిరిభేదే చ ముస్తకే। | పర్వతవిశేషముకును, తుంగముస్తకును పేరు. |
| బిందు ర్దంతక్షతేऽపి స్యా త్తథావేదిత్ర విప్రుషోః॥(8) | **బిందు :** పు. ఇది దంతక్షత విశేషముకును, లౌకిక వైదికజ్ఞానముగలవానికిని, జలకణముకును పేరు. |
| కుంద శ్చక్రభ్రమా మాఘ్యే నిధిభేదే మురద్విషి। | **కుంద :** పు. ఇది కత్తులు పట్టెడుసానకును, మొల్ల చెట్టుకును, కుబేరుని నిధివిశేషముకును, విష్ణువు కును పేరు. |
| కంద స్స్యాత్సూరణే సస్య మూలే జలధరేऽపి చ॥(9) | **కంద:** పు. ఇది కందదుంపకును, సామాన్యదుంప లకును, మబ్బుకును పేరు. |
| మందః ఖలే మదరతే మూర్ఖే స్వైరేऽల్ప రోగిణోః। అభాగ్యేऽపి చ పాతంగి గజజాతి ప్రభేదయోః॥(10) | **మంద:** త్రి. ఇది దుర్మార్గునకును, బద్ధకునకును, మూర్ఖునకు, స్వేచ్ఛగలవానికి, నీచునకును, రోగి కిని, నిర్భాగ్యునకు, పు. శనిగ్రహముకును, మంద జాతి యేనుగకును పేరు. |
| ఛందో వశేऽప్యభిప్రాయే | **ఛంద :** పు. ఇది అధీనముకును, అభిప్రాయము కును పేరు. |
| హృదాఖ్యాచిత్తబుక్కయోః। | **హృత్ :** పు. ఇది చిత్తముకును, వక్షస్థల మధ్య మందుండెడి మాంసవిశేషముకును పేరు. |
| వేది రంగుళిముద్రాయాం బుధేऽలంకృతభూతలే॥ | **వేది :** స్త్రీ. ఇది సుముఖాదిముద్రలకును, పు. విద్వాంసునకును, యజ్ఞమందు పశుబంధనార్థము సంస్కరించబడిన భూమికిని పేరు. |
| అం(దూ)దుస్స్యాచ్ఛృంఖల ద్రవ్యేప్రభేదే భూషణస్యచ। | **అందు :** పు. ఇది గొలుసుకును, స్త్రీల పాదమున ధరించు అందెకును పేరు. |
| నంది రానందనే ద్యూతే ప్రతిహారే హరస్య చ॥(12) | **నంది:** పు. ఇది ఆనందముకును, జూదముకును, పు. నందికేశ్వరునకును పేరు. |
| విదా జ్ఞానే చ బుద్ధౌచ | **విదా :** స్త్రీ. ఇది జ్ఞానముకును, బుద్ధికిని పేరు. |
| ధీదా కన్యా మనీషయోః। | **ధీదా :** స్త్రీ. ఇది పడుచుకును, బుద్ధికిని పేరు. |
| నిందాపవాదే కుత్సాయాం | **నిందా :** స్త్రీ. ఇది అపవాదుకును, దూషించుట కును పేరు. |
| నందా మణిక సంపదోః॥ | **నందా :** స్త్రీ. బానకును, సంపదకును పేరు. |

★ అథ దాంత త్రివర్ణః ★

ధనదో దాతరి శ్రీదే
జలదో ముస్తకేఽంబుదే।
నలదం స్యాత్పుష్పరసే
మాంసికోశీరయోరపి॥ (14)

**ధనద :** పు. ఇది దాతకును, కుబేరునకును పేరు.
**జలద :** పు. ఇది తుంగముస్తకును, మేఘముకును పేరు.
**నలద :** పు. ఇది మకరందముకును, జటామాంసికిని, వట్టివేరుకును పేరు.

ప్రమద స్సమ్మదే మత్తే
కామిన్యాం ప్రమదా మాతా।
విశదః పాండురే వ్యక్తే
జీవదో వైద్యవిద్విషోః॥ (15)

**ప్రమద :** పు. ఇది సంతోషముకును, త్రి. మదించిన దానికిని, స్త్రీ. ఆడుదానికిని పేరు.
**విశద :** త్రి. తెల్లదానికిని, స్ఫుటమైనదానికిని పేరు.
**జీవద :** పు. ఇది వైద్యునకును, శత్రువుకును పేరు.

అంగదః కపిభేదే స్యాత్కే-
యూరేఽంగదమిష్యతే।
అంగదా యామ్యదిగ్దంతి
హస్తిన్యాం సముదాహృతా॥(16)

**అంగద :** పు. ఇది వాలిపుత్రునకును, న. బాహుపురికిని, స్త్రీ. వామనుడను దిగ్గజము భార్యకును పేరు.

వరదోఽపి ప్రసన్నే స్యా
ద్వరదః శాంత చేతసి।
వరదాపి చ కన్యాయా
మామోదో గంధ హర్షయోః॥(17)

**వరద :** పు. ఇది అనుగ్రహించినవానికిని, ఓరిమి గలవానికిని, స్త్రీ. కన్యకును పేరు.
**ఆమోద :** పు. ఇది పరిమళముకును, సంతోషముకును పేరు.

నర్మదః కేళిసచివే
నర్మదా సరిదంతరే।
క్షణదో గణకే రాత్రౌ
క్షణదా క్షణదం జలే॥(18)
కపర్దః ఖండపరశో
ర్జటాజూటే వరాటకే।
ఆస్పదం తు పదేకత్యే
నిషాదా శ్శ్వపచే స్వరే॥(19)

**నర్మద:** పు. ఇది క్రీడాసచివునకును, నర్మదానదికిని పేరు.
**క్షణద:** పు. ఇది జ్యోతిష్కునకును, స్త్రీ. రాత్రికిని, న. జలముకును పేరు.
**కపర్ద :** పు. ఇది శివుని జటాజూటముకును, గవ్వకును పేరు.
**ఆస్పద :** న. ఇది స్థానముకును, కర్మకును పేరు.
**నిషాద:** పు. ఇది కిరాతకునకును, నిషాదస్వరముకును పేరు.

ప్రసాదోఽనుగ్రహే కావ్య

**ప్రసాద:** పు. ఇది దయకును, వైదర్భీరీతితో గూడిన

| | |
|---|---|
| గుణ స్వాస్థ్య ప్రసక్తిషు। | కావ్యగుణముకును, స్వస్థతకును, ప్రయోజనముకును పేరు. |
| ప్రాసాదః కథ్యతే దేవ<br>నరదేవ నివాసయోః॥(20) | **ప్రాసాద :** పు. ఇది దేవాలయమ్ముకును, రాజాంతః పురముకును పేరు. |
| శారదః పీతముద్గే స్యా<br>చ్ఛాలీనేఽప్రతిభే నవే।<br>వర్షేఽథజలపిప్పల్యాం<br>సప్తపర్ణే చ శారదీ॥ (21) | **శారద :** పు. ఇది పచ్చపెసలకును, త్రి. పిరికివానికిని, తెలివిలేనివానికిని, నూతనమైనదానికిని, పు. సంవత్సరముకును, స్త్రీ. నీటిపిప్పలికిని, ఏడాకుల రటిచెట్టుకును పేరు. |
| దారదో విషభేదే స్యా<br>ద్హింగుళే పారదేఽపి చ। | **ధారద :** పు. ఇది దరదదేశమందుపుట్టిన విషముకును, పాదరసముకును, ఇంగు వకును పేరు. |
| తోయదం తు ఘృతే ప్రోక్తం<br>తోయదో ముస్తకాబ్దయోః॥(22) | **తోయద :** న. ఇది నేతికిని, పు. తుంగ ముస్తకును, మేఘముకును పేరు. |
| నిర్వాద స్స్యాత్పరీవాద<br>పరినిష్ఠితవాదయోః। | **నిర్వాద :** పు. ఇది అపవాదునకును, నిశ్చయపు నిందకును పేరు. |
| అర్బుదో మాంసకీలే స్యా<br>ద్దశకోటిషు చార్బుదం॥ (23) | **అర్బుద:** పు. ఇది మాంసపుకండకును, న. పదికోట్ల సంఖ్యకును, పు. పర్వత ముకును పేరు. |
| శైలేఽర్బుదోఽథసంభేద<br>స్స్ఫుటనే సింధు సంగమే। | **సంభేద :** పు. ఇది భేదించుటకును, నదీ సాగర సంగముకును పేరు. |
| కుసీదం జీవనే వృధ్యా<br>కుసీదశ్చ కుసీదికే॥(24) | **కుసీద:** న. ఇది వడ్డీవ్యాపారముకును, త్రి. వడ్డీచేత జీవించువానికిని పేరు. |
| ప్రణాద స్తారశబ్దే స్యా<br>త్ప్రణాదః శ్రవణామయే। | **ప్రణాద :** పు. ఇది బిగ్గరగానరచుటకును, కర్ణరోగ విశేషముకును పేరు. |
| ప్రహ్లాదః ప్రమదే దైత్యే | **ప్రహ్లాద :** పు. ఇది సంతోషముకును, ప్రహ్లాదునకును పేరు. |
| దాయాదో జ్ఞాతిపుత్రయోః॥ | **దాయాద :** పు. ఇది జ్ఞాతికిని, పుత్రునకును పేరు. |
| మేనాదః కేకి మార్జాల<br>ఛాగలేషు సమీరితః। | **మేనాద :** పు. ఇది నెమలికిని, పిల్లికిని, మేకకును పేరు. |
| గోవిందో వాసుదేవే స్యా | **గోవింద :** పు. ఇది విష్ణువుకును, గోవులు కాచు |

ధ్గవాధ్యక్షే బృహస్పతౌ॥

వానికిని, బృహస్పతికిని పేరు.

ఆక్రందో దారుణరణే
మిత్రే త్రాతరి రోదనే।

**ఆక్రంద** : పు. ఇది భయంకర యుద్ధముకును, స్నేహితునకును, రక్షకునకును, ఏడ్పుటకును పేరు.

మాకంద స్సహకారే స్యా
న్మాకంద్యామలఫకీలే ॥ (27)

**మాకంద** : పు. ఇది తియ్యమామిడికిని, ఈ. స్త్రీ. ఉశిరికాయకును పేరు.

అర్ధేందు శ్చంద్రశకలే
గళహస్త నఖాంకయోః।
అర్ధేందు స్స్యాదతి ప్రౌఢ
స్త్రీగుహ్యాంగుళియోజనే॥(28)

**అర్ధేందు** : స్త్రీ. ఇది అర్ధచంద్రునకును, చాచబడిన తర్జన్యంగుష్ఠములుగల హస్తముకును, నఖచిహ్నాకును, రతివేళల ప్రౌఢ స్త్రీలభగమందు అంగుష్ఠము జొనుపుటకును పేరు.

కర్ణేందు రుత్ క్షిప్తికాయాం
కర్ణపా(శ్యా)ళ్యా మపీరితా।

**కర్ణేందు** : పు. ఇది కర్ణభూషణ విశేషముకును, కర్ణ ప్రదేశముకును పేరు.

స్యాత్కౌముదః కార్తికే
చంద్రికాయాంచ కౌముదీ॥

**కౌముద** : పు. ఇది కార్తీకమాసముకును, వెన్నెలకును పేరు.

కుముదం కైరవే రక్త
పంకజే కుముదః కపౌ।
దైత్యాంతరే చ దిజ్నాగ
నాగయోరపి కీర్తితః॥ (30)
కుముదా కుంభి గంభార్యో

**కుముద** : న. ఇది తెల్లకలువకును, యెఱ్ఱదామరకును, పు. కుముదుడను వానరునకును కుముదాసురునకును, దిగ్గజముకును, సర్పవిశేషముకును, స్త్రీ. టేకు చెట్టుకును, గుమ్మడి చెట్టుకును పేరు.

స్స్యాత్కుముత్కృపణేఽన్యవత్।
కుముదేఽపి కుముత్ప్రోక్తం

**కుముత్** : త్రి. ఇది లోభికిని, సంతోషము లేనివానికిని పేరు.

క్రవ్యాన్మాంసాశి రక్షసోః॥

**క్రవ్యాత్** : త్రి. ఇది మాంసమును దినువానికిని, రాక్షసునకును పేరు.

కకుద్వత్కకుదం శ్రేష్ఠే
వృషాంకే రాజలక్ష్మణి।

**కకుత్: కకుద** : న. ఇది శ్రేష్ఠముకును, ఎద్దు మూపురముకును, ఛత్రచామరాది రాజచిహ్నాకును పేరు.

ముకుందః పుండరీ కాక్షే
రత్నభేదే చ పారదే ॥(32)

**ముకుంద** : పు. ఇది విష్ణువుకును, రత్నవిశేషముకును, పాదరసముకును పేరు.

దరత్ప్రపాతాద్రిభయే

**దరత్** : స్త్రీ. ఇది కొండచరియకును, పర్వతము

కును, భయముకును పేరు.

శరత్సంవత్సరే ఋతౌ। — **శరత్** : స్త్రీ. ఇది సంవత్సరముకును, శరదృతువుకును పేరు.

దృషత్పేషణపట్టే స్యాద్ధృషత్పాషణమాత్రకే॥(33) — **దృషత్** : స్త్రీ. ఇది సన్నికంటికిని, సామాన్య పురాతికిని పేరు.

సంపద్భూతౌ గుణోత్కర్షే హారభేదే చ దృశ్యతే। — **సంపత్** : స్త్రీ. ఇది సంపదకును, గుణాతి శయముకును, పుష్పహార విశేషముకును పేరు.

(భా) భసత్ర్పభాస్వరే మాంసే — **భసత్** : స్త్రీ. ఇది ప్రకాంశించు దానికిని, మాంసముకును పేరు.

తరత్కారండవే ప్లవే॥(34) — **తరత్** : స్త్రీ. ఇది కన్నెలేడు పిట్టకును, తెప్పకును పేరు.

సంవిత్ జ్ఞానే ప్రతిజ్ఞాయాం సంకేతా చార నామసు। సంభాషణే తోషణేపి క్రియాకారే చ సంగరే॥(35) — **సంవిత్** : స్త్రీ. ఇది జ్ఞానముకును, ప్రతిజ్ఞకును, సంకేతముకును, ఆచారముకును, నామధేయముకును, సంభాషించుటకును, సంతోషముకును, క్రియానిశ్చయముకును, యుద్ధముకును పేరు.

కామదా ధేనుకాయాం స్యాద్వాచ్యవత్కామదోగ్ధరి। — **కామదా** : స్త్రీ. ఇది కామధేనువుకును, స్త్రీ. కోరికలనిచ్చువానికిని పేరు.

సునందా రోచనా నార్యోః — **సునందా** : స్త్రీ. ఇది గోరోచనముకును, స్త్రీకిని పేరు.

మర్యాదా సీమని స్థితౌ॥(36) — **మర్యాద** : స్త్రీ. ఇది హద్దుకును, ఆచారము తప్పకుండుటకును పేరు.

★ అథ దాంత శ్చతుర్వర్ణః ★

ఏకపదం స్యాత్తత్కాలే (వర్త్న్యా) పదవ్యామేకపద్యపి। — **ఏకపద** : న. ఇది అప్పుడనుటకును, ఈ స్త్రీ. మార్గముకును పేరు.

చతుష్పద స్యాత్కరణే గవాశ్వాదిపశుష్వపి॥(37) — **చతుష్పద** : పు. ఇది కరణ విశేషముకును, పశువుకును పేరు.

భవే ద్విష్ణుపదాభిఖ్యా క్షీరోదే గగనేఽంబుజే। — **విష్ణుపద** : న. ఇది పాలసముద్రముకును, ఆకాశముకును, పద్మముకును పేరు.

ప్రోక్తా విష్ణుపదీ గంగా సంక్రాంతి ద్వారకాసు చ॥ — **విష్ణుపదీ** : స్త్రీ. ఇది గంగకును, సంక్రమణ విశేషముకును, ద్వారకాపట్టణముకును పేరు.

భవేజ్జనపదే దేశే — **జనపద** : పు. ఇది దేశముకును పేరు.

జనే జానపదోఽపి చ। — **జానపద** : పు. ఇది మనుష్యునకు పేరు.

ప్రియంవదః ఖేచరే స్యా — **ప్రియంవద** : పు. ఇది దేవునకును, త్రి. ప్రియ

త్ప్రియవాచి చ వాచ్యవత్॥ — వాక్యములను చెప్పువానికిని పేరు.

అపవాదస్తునిందాయా — **అపవాద**: పు. ఇది నిందకును, ఆజ్ఞకును, విశ్వాస

మాజ్ఞా విస్రంభయోరపి। — ముకును పేరు.

పరివాదః కలంకే స్యా — **పరివాద** : పు. ఇది నిందకును, వీణవాయించు

ద్వీణావాదనవస్తుని॥(40) — కొడుపునకును పేరు.

సమర్యాద స్సమీపే స్యా — **సమర్యాద**: పు. ఇదిసమీపముకును, త్రి. మర్యాద

న్మర్యాదాసహితేఽపి చ। — తోగూడుకొన్న దానికిని పేరు.

పుటభేదో నదీవక్త్రే — **పుటభేద** : పు. ఇది నదులకు నీరువచ్చు మార్గము

పత్తనా తోద్యయోరపి॥ (41) — కును, పట్టణముకును, వాద్యవిశేషముకును పేరు.

అష్టాపదం స్యాత్కనకే — **అష్టాపద**: న. ఇది బంగారుకును, పాచికలాడుబల్ల

శారీణాం ఫలకేఽపి చ। — కును, పు. శరభమనుమృగము కును, వృక్షవిశేషము

అష్టాపదశ్చ శరభే — కును, సాలెపురుగుకును పేరు.

చంద్ర మల్యాంచ మర్కటే॥(42)

మేఘనాదస్తు వరుణే — **మేఘనాద** : పు. ఇది వరుణదేవునకును, మేఘ

స్తనితే రావణాత్మజే। — ధ్వనికిని, ఇంద్రజిత్తుకును పేరు.

మహానాదః కుంజరే స్యా — **మహానాద** : పు. ఇది ఏనుగకును, వర్షించు

ద్వర్షుకాబ్దే శయానకే॥(43) — మేఘముకును, సర్పముకును పేరు.

భవేత్కోకనదం రక్త — **కోకనాద** : న. ఇది ఎర్రకలువకును, ఎర్ర తామర

కైరవే రక్తపంకజే। — కును పేరు.

విశారదో బుధే ధృష్టేఽ — **విశారద** : పు. ఇది విద్వాంసునకును, ప్రగల్భ వాక్యములు పలుకువానికిని పేరు.

భిమర్దో రణ మంథయోః॥ — **అభిమర్ద**:పు. ఇది యుద్ధముకును, కవ్వముకును పేరు.

పీఠమర్దో తిధృష్టే స్యా — **పీఠమర్ద**: పు. ఇది మిగులదిట్టరికిని, నాట్యపరిభాష

న్నాట్యోక్తౌ నాయకప్రియే। — యందు కోపముగల స్త్రీని సాధుచేయు నాయకుని దూతకును పేరు.

| | |
|---|---|
| ముచుకుందో ద్రుభేదేస్యా<br>న్మని దైత్యవిశేషయోః॥(45) | **ముచుకుంద :** పు. ఇది పుష్పవృక్ష విశేషముకును, ముచుకుందమునికిని, దైత్యవిశేషునకును పేరు. |
| కురువిందస్తు ముస్తాయాం<br>కుల్మాష వ్రీహిభేదయోః।<br>హింగుళే పద్మరాగే స్యా<br>న్ముకురే చ సమీరితః॥ (46) | **కురువింద :** పు. ఇది కోలతుంగముస్తకును, అల చందలకును, ధాన్యవిశేషముకును, ఇంగువకును, పద్మరాగమణికిని, అద్దముకును పేరు. |
| అభిష్యందో౽తి వృద్ధౌ స్యా<br>దాస్రావే౽క్షిగదే౽పి చ। | **అభిష్యంద :** పు. ఇది మిగులవృద్ధి బొందుటకును, స్రవించుటకును, నేత్రరోగముకును పేరు. |
| కటుకందం విదుశ్శిగ్రౌ<br>శృంగిబేర రసోనయోః॥ (47) | **కటుకంద :** న. ఇది మునుగచెట్టుకును, అల్లము కును, వెల్లుల్లికిని పేరు. |
| తమోనుదగ్నిం ద్వర్కేషు | **తమోనుత్ :** పు. ఇది అగ్నికిని, చంద్రునకును, సూర్యునకును పేరు. |
| ప్రతిపత్తిథి సంవిదోః। | **ప్రతిపత్ :** స్త్రీ. ఇది ప్రతిపత్తిథికిని, జ్ఞానముకును పేరు. |
| శతహ్రదా భవేద్వజ్రే<br>సౌదా(మి) మన్యాంచ కీర్తితా॥ | **శతహ్రదా :** స్త్రీ. ఇది వజ్రాయుధముకును, మెరుపు నకును పేరు. |
| చక్రపాచ్చక్రపాదశ్చ స్యం<br>దనే కుంజరే౽పి చ। | **చక్రపాత్ :** పు. ఇది రథముకును,<br>**చక్రపాద :** ఏనుగకుకు పేరు. |

★ అథ దాంతః పంచవర్ణః ★

| | |
|---|---|
| సహస్రపాదః కారండే<br>మా(ర్తం) ర్తాండే యజ్ఞపూరుషే।<br>భవేదుపనిషద్ధర్మే<br>వేదాంత తే౽పి రహస్యపి॥ (50) | **సహస్రపాద :** పు. ఇది కన్నెలేడు పిట్టకును, సూర్యునకును, యజ్ఞపురుషునకును పేరు.<br>**ఉపనిషత్ :** పు. ఇది ధర్మముకును, వేదాంత శాస్త్రముకును, విజనప్రదేశముకును పేరు. |

★ అథధాంతవర్గః ★

| | |
|---|---|
| రాధో వైశాఖమాసే స్యా<br>ద్రాధా గోప్యాంచ విద్యుతి।<br>విష్ణుక్రాంతా మలక్యోశ్చ<br>చిత్ర (వేధే) భేదే౽పి ధన్వినాం॥ | **రాధ :** పు. ఇది వైశాఖ మాసముకును, స్త్రీ. గోపాంగనకును, మెరుపునకును, విష్ణుక్రాంతలత కును, ఉశిరిచెట్టుకును, విలుకాండ్రయొక్క నైపుణ్యా విశేషముకును పేరు. |
| గాధ స్థానే చలిప్సాయాం | **గాధ :** పు. ఇది ప్రదేశముకును, కోరికకును పేరు. |

వ్యాధో మృగయుదుష్టయోః।
మేధః క్రతౌ ధియాం మేధా
మేధి స్స్యాత్ఖలదారుణి॥

**వ్యాధ** : పు. ఇది కిరాతునకును, దుష్టునకును పేరు.
**మేధ** : పు. ఇది యజ్ఞముకును, స్త్రీ. ధారణగల బుద్ధికిని, ఈ. స్త్రీ. కళ్ళమునందు పశువులను కట్టుటకు పాతిన కఱ్ఱాటుకును పేరు.

బుధః కవౌ సురే సౌమ్యే
మిద్ధమాలస్య నిద్రయోః।
మిద్ధం చిత్తాభిసంక్షేపే

**బుధ** : పు. ఇది విద్వాంసునకును, దేవునకును, బుధగ్రహముకును పేరు.
**మిద్ధ** : న. ఇది ఆలస్యముకను, నిద్రకును, మైమరచుటకును పేరు.

నద్ధముద్వృత్తబద్ధయోః॥

**నద్ధ** : త్రి. ఇది మర్యాదనతిక్రమించిన దానికిని, కట్టుబడిన దానికిని పేరు.

సిద్ధో వ్యాసాదిషు ఖ్యాతః
సిద్ధా స్స్యు ర్దేవయోనిషు।

**సిద్ధ** : పు. ఇది వ్యాసాది సిద్ధులకును, సిద్ధులను దేవయోనివిశేషులకును, త్రి. నిత్యమైన దానికిని, ప్రసిద్ధమైన దానికిని, సిద్ధమైన దానికిని పేరు.

నిత్యే ప్రసిద్ధే నిష్పన్నే
పీత్వాఽమాతప్తదీప్తయోః॥ (4)
బుద్ధం త్వతిసమృద్ధే స్యా
త్సంపన్నార్థేఽపి వాచ్యవత్।
వృద్ధం తు శైలజే సూరి
జీర్ణరూఢేషు భేద్యవత్॥ (5)
విద్ధం స్యాద్వేధితే క్షిప్తే
సాదృశ్యే చ నిగద్యతే।
బుద్ధో జినే చ ధీరే చ
సౌమ్యే చ బుధితే త్రిషు॥ (6)
అర్ధః ఖండే సమాంశేఽర్ధం
లుబ్ధో మృగయుకాంక్షిణోః।
అంధం స్యాత్తిమిరే దృష్టి
హీనేఽంధః సముదాహృతః॥
గంధో గంధక ఆమోదే

**ఇద్ధ** : త్రి. ఇది తపింపచేయబడిన దానికిని, ప్రజ్వలింపచేయబడిన దానికిని పేరు.
**ఋద్ధ** : త్రి. ఇది మిగుల సమృద్ధమైన దానికిని, సాధించబడిన దానికిని పేరు.
**వృద్ధ**: న. ఇది రాతిపువ్వుకును, త్రి. విద్వాంసునకును, ముసలివానికిని, వృద్ధి పొందిన వానికిని పేరు.
**విద్ధ** : త్రి. ఇది తొలవెయ్యబడినదానికిని, త్రోయబడినదానికిని, సామ్యమైన దానికిని పేరు,
**బుద్ధ**: పు. ఇది బుద్ధదేవునకును, విద్వాంసునకును, శాంతునకును, త్రి. తెలియబడినదానికిని పేరు.
**అర్ధ** : పు. ఇది తునకకును, సగపాలుకును పేరు.
**లుబ్ధ** : పు. ఇది కిరాతునకును, లోభికిని పేరు.
**అంధ** : న. ఇది అంధకారముకును, త్రి. కండ్లు లేనివానికిని పేరు.
**గంధ** : పు. ఇది గంధకముకును, పరిమళముకును,

| | |
|---|---|
| లేశే సంబంధగర్వయోః। | స్వల్పముకును, సంబంధముకును, గర్వముకును పేరు. |
| స్కంధః ప్రకాండే సైన్యాంశే | **స్కంధ**: పు. ఇదిచెట్టుమొదలుకును, సైన్యమందలి |
| బాహుమూల సమూహయోః॥(8) | భాగముకును, భుజముకును, సమూహముకును, |
| సమీక నృప యోశ్చాపి | ద్వంద్వయుద్ధముకును, స్కంధరాజుకును పేరు. |
| బంధ స్త్వాధౌ చ బంధనే। | **బంధ** : పు. ఇది వ్యాధికిని, కట్టుటకును పేరు. |
| దగ్ధం ప్లుష్టేఽన్యవద్దగ్ధా | **దగ్ధ** : త్రి. ఇది తగులబెట్టబడినదానికిని, స్త్రీ. |
| స్థితార్కదిశి దర్శితా॥(9) | సూర్యుడు ఉన్నదిక్కుకును పేరు. |
| దిగ్ధం విషాక్తబాణే స్యా | **దిగ్ధ** : న. ఇది విషముచేత పూయబడిన బాణము |
| ద్దిగ్ధం లిప్తార్థకేఽన్యవత్। | కును, త్రి. పూయబడినదానికిని పేరు. |
| దుగ్ధం ప్రపూరణే క్షీరే | **దుగ్ధ**: న. ఇది పూరించుటకును, పాలకును పేరు. |
| ముగ్ధ స్సుందరమూఢయోః॥ | **ముగ్ధ**: త్రి. ఇదిసుందరమైనదానికిని, అవివేకికిని పేరు. |
| మధు క్షౌద్రే జలే క్షీరే | **మధు** : న. ఇది తేనెకును, ఉదకముకును, పాల |
| మద్యే పుష్పరసే మధుః। | కును, కల్లుకును, మకరందముకును, పు. రాక్షస |
| దైత్యే చైత్రే సవసంతే చ | విశేషముకును, చైత్రమాసముకును, వసంతఋతువు |
| జీవాశాకే మధుద్రుమే॥(11) | కును, పాలకూరకును, ఇప్పచెట్టుకును పేరు. |
| విధు శ్శశాంకే కర్పూరే | **విధు**: పు. ఇదిచంద్రునకును, కర్పూరముకును, |
| హృషీకేశేఽపి రాక్షసే। | విష్ణువుకును, రాక్షసున కును పేరు. |
| సాధు ర్వార్ధుషికే చారౌ | **సాధు** : త్రి. ఇది వడ్డీవ్యాపారముచేత జీవించు |
| సజ్జనే (నిపుణేఽన్యవత్) | వానికిని, సుందరమైనదానికిని, సజ్జనునకును |
| చాభిధేయవత్॥(12) | పేరు. |
| సింధుస్సముద్రే నద్యాంచ | **సింధు**: పు. ఇది సముద్రముకును, స్త్రీ. నదికిని, |
| నదే దేశే భదానయోః। | పు. నదముకును, సింధుదేశముకును, గజమదము |
| | కును పేరు. |
| బంధుర్బంధూకపుష్పేస్యా | **బంధు**: పు. ఇది మంకెనచెట్టుకును, అన్నకును, |
| ద్బంధుర్భ్రాతరి బాంధవే। | బంధువుకును పేరు. |
| ఆధి ర్మానసపీడాయాం | **ఆధి**: స్త్రీ. ఇది మనఃపరితాపముకును, ఆశకును, |
| ప్రత్యాశాయాం చ బంధకే। | తాకట్టుకును, దుఃఖముకును, ఆశ్రయముకును |
| వ్యసనే చాప్యధిష్ఠానే | పేరు. |

| | |
|---|---|
| వ్యాధిరామయవాక్యయోః॥ | **వ్యాధి :** స్త్రీ. ఇది రోగముకును, వాక్యముకును పేరు. |
| బోధి స్సమాధిభేదే స్యా<br>ద్బోధిః పిప్పలపాదపే। | **బోధి :** పు. ఇది సమాధి యోగవిశేషము కును, రావిచెట్టుకును పేరు. |
| సంధిర్భేదే సురుంగాయాం<br>భగే సంఘటనేఽపి చ॥(15) | **సంధి :** పు. ఇది భేదముకును, రంధ్రము కును, యోనికిని, కూర్చుటకును పేరు. |
| అబ్ధిస్సముద్రే సరసి | **అబ్ధి :** పు. ఇదిసముద్రముకును, తటాకముకును పేరు. |
| సిద్ధిర్నిష్పత్తి యోగయోః। | **సిద్ధి :** స్త్రీ. ఇది సిద్ధమగుటకును, పంచాంగ యోగ విశేషముకును పేరు. |
| వృద్ధి రానందనే బుద్ధౌ<br>వర్ధనేఽపి కలాంతరే॥(16) | **వృద్ధి :** స్త్రీ. ఇది సంతోషముకును, ఋద్ధి వృద్ధియను ఓషధికిని, వృద్ధిబొందుటకును, వృద్ధికళకును పేరు. |
| దోగ్ధా గోపాలకే వత్సేక<br>వా వర్ధో పజీవిని। | **దోగ్ధా :** పు. ఇది గొల్లవానికిని, లేగకును, విద్వాంసు నకును, యాచనవలన జీవించువానికిని పేరు. |
| విధా గజాన్నే బుద్ధౌ చ<br>ప్రకారే వేతనే విధా ॥(18) | **విధా :** స్త్రీ. ఇది ఏనుగకు పెట్టు అన్నకబళముకును, సమృద్ధికిని, ప్రకారముకును కూలికిని, చేయుటకును పేరు. |
| గోధాతలే నిహాకాయాం | **గోధా :** స్త్రీ. ఇది నారిదెబ్బ తగులకుండ చేతికి కట్టుకొన్న తోలుకును, ఉడుముకును పేరు. |
| బాధా దుఃఖనిషేధయోః। | **బాధా :** స్త్రీ. ఇది దుఃఖముకును, వలదనుటకును పేరు. |
| సుధామృతే స్నుహీమూర్వా<br>లేప గాంగేష్టి కాసు చ ॥ | **సుధా :** స్త్రీ. ఇది అమృతముకును, జముడు కాడ కును, చాగచెట్టుకును, గారసున్నము (గచ్చు) కును, లతావిశేషముకును పేరు. |
| సంధా స్థితౌ ప్రతిజ్ఞాయాం | **సంధా :** స్త్రీ. ఉనికికిని, ప్రతిజ్ఞకును పేరు. |
| శ్రద్ధా శ్రాద్ధత్వ కాంక్షయోః। | **శ్రద్ధా :** స్త్రీ. ఇది ఆదరముకును, కోరికకును పేరు. |
| స్పర్ధా సంఘర్షణే సామ్యే<br>స్పర్ధాక్రమసమున్నతౌ॥ (19) | **స్పర్ధా :** స్త్రీ. ఇది ఒరియుటకును, సామ్యముకును, క్రమముగా వృద్ధినొందుటకును పేరు. |
| వధూ స్స్నుషే నవోఢాస్త్రీ<br>భార్యా స్పృక్కాంగ నాసు చ। | **వధూః :** స్త్రీ. ఇదికోడలకును, క్రొత్తగాపెండ్లియైన స్త్రీకిని, భార్యకును, స్పృక్కయనెడిగంధద్రవ్యము |

శాట్యాంచ శారిబాయాంచ — కును, సామాన్య స్త్రీకి ని, నల్లయతివసకును, సుగంధి పాలచెట్టు కును పేరు.

స్పృధూ ర్బుద్ధౌ గుదేऽపి చ॥ — **స్పృధూః :** స్త్రీ. ఇది బుద్ధికిని, గుదస్థానము కును పేరు.

**★ అథ ధాంత త్రివర్ణః ★**

వివధో వీవధ శ్చాపి
పర్యాహారేऽధ్వభారయోః। — **వివధ : వీవధ :** పు. ఇవి వర్తకుడు దేశాంతరము నుంచితెచ్చి విక్రయస్థానమందుంచిన వస్తువుకును, మార్గముకును, బరువు కును పేరు.

విబుధః పండితే దేవే — **విబుధ :** పు. ఇది విద్వాంసునకును, దేవునకును పేరు.

సంబాధ స్సంకటే భగే॥(21) — **సంబాధ :** పు. ఇది సమ్మర్దముకును, యోనికిని పేరు.

నిషధః కఠినే దేశే
తద్రాజే చ నగాంతరే। — **నిషధ:** పు. ఇది కఠినునకును, నిషధదేశముకును, నిషధరాజుకును, నిషధపర్వతముకును పేరు.

సంరోధో రోధనే క్షేపే — **సంరోధ:** పు. ఇది అడ్డగించుటకును, తిరస్కరించుటకును పేరు.

నిరోధో రోధనాశయోః॥ — **నిరోధ:** పు. ఇది అడ్డగించుటకును, నాశముకును పేరు.

ఉత్సేధ శ్చోచ్ఛ్రయే కాయే — **ఉత్సేధ:** పు. ఇది ఔన్నత్యముకును, శరీరముకును పేరు.

దుర్విధో దుర్గతే ఖలే। — **దుర్విధ:** పు. ఇది దరిద్రునకును, దుర్మార్గునకును పేరు.

విస్రబ్ధోऽనుద్భటేऽత్యర్థే
శాంతవిస్తృతయోరపి॥(23) — **విస్రబ్ధ :** త్రి. ఇది అధికమైన దానికిని, విస్తారమైన దానికిని, శాంతమైన దానికిని, విస్తరింపబడిన దానికిని పేరు.

న్యగ్రోధో వ్యామ వటయో
ర్న్యగ్రోధశ్చ శమీతరౌ।
న్యగ్రోధో వృషపర్ణ్యాంచ
మోహనాఖ్యౌషధావపి॥ (24) — **న్యగ్రోధ :** పు. ఇది బారకును, మర్రిచెట్టు కును, జమ్మిచెట్టుకును, అడ్డసరపుచెట్టు కును, మోహన మను ఓషధికిని పేరు.

అగాధో వివరే స్థానే — **అగాధ:** పు. ఇది రంధ్రముకును, మిగులలోతుగల ప్రదేశముకును పేరు.

ప్రసిద్ధోऽలంకృతేऽపి చ।
విఖ్యాతేऽపి చ — **ప్రసిద్ధ :** త్రి. ఇది అలంకరింపబడిన దానికిని, ప్రకటనమైన దానికిని పేరు.

సన్నద్ధో వర్మిత — **సన్నద్ధ :** త్రి. ఇది కవచము వేయబడిన దానికిని,

వ్యూఢ యోరపి॥(25)
ఆనద్ధం బద్ధమాత్రే స్యా
దానద్ధం మురజాదికే।
ఆవిద్ధో వాచ్యవత్ జ్ఞేయః
కుటిలే చ పరాహతే॥ (26)
కబంధస్తూదరే రక్షో
విశేషేపి విధుంతుదే।
ఆబంధో దృఢబంధే స్యా
త్ప్రేమా లంకారయోరపి॥
సుగంధి స్స్యాదిష్టగంధే
సుగంధిహరివాలుకే।
ఉపాధి ర్ధర్మచింతాయాం
కైతవేऽపి విశేషణే ॥(28)
కుటుంబవ్యాపృతేऽపిస్యా
దుపధి ర్వ్యాజచక్రయోః।
పరిధి ర్యజ్ఞియతరో
శ్శాఖాయా ముపసూర్యకే॥(29)

ఆవధి స్త్వవధానే స్యా
త్సీమ్నికాలే బిలేऽపి చ।

సమాధిర్నియమే ధ్యానే
నీవాకే చ సమర్థనే॥(30)

సన్నిధిస్సన్నిధానే స్యా
ద్భవేదింద్రియగోచరే।
సంసిద్ధి స్సహజే సిద్ధౌ
మదోగ్రాయామపి స్మృతా॥

వ్యూహముగా నుంచబడిన సేనకును పేరు.

**ఆనద్ధ** : త్రి. ఇది కట్టుబడిన దానికిని, చర్మకట్టు వాద్యములకును పేరు.

**ఆవిద్ధ** : త్రి. ఇది వక్రమైన దానికిని, కొట్టుబడిన దానికిని పేరు.

**కబంధ**: పు. ఇది బొజ్జకును, కబంధుడను రాక్షసునకును, రాహుగ్రహముకును పేరు.

**ఆబంధ** : పు. ఇది దృఢముగా కట్టుటకును, ప్రేమకును, శరీరమునధరించు అలంకారముకును పేరు.

**సుగంధి** : పు. ఇది పరిమళముకును, న. నూగుదోసచెట్టుకును పేరు.

**ఉపాధి** : పు. ఇది ధర్మవిచారణకును, మిషకును, విశేషణముకును, కుటుంబపోషణార్థవ్యాపారమును చేయువానికిని పేరు.

**ఉపధి**: పు. ఇది మిషకును, రథచక్రముకును పేరు.

**పరిధి** : పు. ఇది యజ్ఞమందు పశువును గట్టుటకు పాతిన మారేడు, చంద్ర మొదలగు చెట్లకొమ్మకును, సూర్యాదిపరివేషములకును పేరు.

**అవధి**: పు. ఇది దృఢముగా మనస్సుతో సంబంధింపజేయుటకును పొలిమేరకును, కాలముకును, బిలముకును పేరు.

**సమాధి**: పు. ఇది నియమముకును, ధ్యానించుటకును, మాటలాడకుండుటకును, శంకనుపరిహరించి సిద్ధాంతమును స్థిరపరచుటకును పేరు.

**సన్నిధి**: స్త్రీ. సమీపముకును, త్వగాదింద్రియములకు గోచరమగుటకును పేరు.

**సంసిద్ధి** : స్త్రీ. ఇది స్వభావముకును, మదించిన స్త్రీకిని పేరు.

ప్రణిధిశ్చరే యాచ్ఞాయాం
వీరుద్విటప శాఖయోః।
మాగధీ పిప్పలీ యూథ్యో
ర్మాగధో మగధోద్భవే॥
వైశ్యజక్షత్రియాపుత్రే
శుక్రజీరకవందినోః।

**ప్రణిధి :** పు. ఇది చారునకును, యాచనకును పేరు.
**వీరుత్ :** పు. ఇదిచెట్లగుంపునకును, కొమ్మకును పేరు.
**మాగధీ :** స్త్రీ. ఇది పిప్పలి చెట్టుకును, అడవి మొల్ల చెట్టుకును, అ.త్రి. మగధదేశమందుపుట్టిన దానికిని, పు. వైశ్యుని వలన క్షత్రియ స్త్రీయందు బుట్టిన వానికిని, తెల్లజీలకర్రకును, స్తుతిపాఠకునకును పేరు.

★ అథ ధాంత శ్చతుర్వర్ణః ★

అవరోధ స్తిరోధానే
శుద్ధాంతే రాజవేశ్మని॥(33)

**అవరోధ :** పు. ఇది కప్పుటకును, రాజస్త్రీల గృహముకును, రాజగృహముకును పేరు.

మహౌషధం శృంగిబేరే
విషాయాం లశునేఽపి చ।

**మహౌషధ :** న. ఇది శొంఠి (లేక అల్లము) కును, అతివసకును, వెల్లుల్లికిని పేరు.

పరివ్యాధో వేతసే స్యా
త్పరివ్యాధో ద్రుమోత్పలే॥(34)

**పరివ్యాధ :** పు. ఇది ప్రబ్బలిచెట్టుకును, కొండగోగు చెట్టుకును పేరు.

అవష్టబ్ధ మదూరే స్యా
దాక్రాంతే (చవి) చావలంబితే।

**అవష్టబ్ధ :** త్రి. సమీపమైన దానికిని, ఆవరించబడిన దానికిని ఆశ్రయించబడిన దానికిని పేరు.

సమున్నద్ధ స్సముద్భూతే
పండితంమన్యదృప్తయోః॥

**సమున్నద్ధ :** త్రి. ఇది పుట్టిన దానికిని, తనను పండితునిగా నెంచుకొనువానికిని, దుష్టునకును పేరు.

అనిరుద్ధ ఉషానాధే
చరే చానర్గ ళేన్యవత్।

**అనిరుద్ధ :** పు. ఇది అనిరుద్ధునకును, చారునకును, త్రి. అడ్డులేనివానికిని పేరు.

అనుబంధః ప్రకృత్యాదౌ
దోషోత్పాదే వినశ్వరే॥(36)
ముఖ్యానుయాయిని శిశౌ
(ప్రవృత్తస్య నివర్తనే) ప్రకృ
తస్యానువర్తనే।అనుబంధీ
చ హిక్కాయాం తృష్ణా
యామపి కథ్యతే॥

**అనుబంధ :** పు. ఇది ప్రకృతి ప్రత్యయాగమాదేశములకును, దోషమునుపుట్టించుటకును, ఉచ్చరణ మాత్రప్రయోజనము గల ఇత్సంజ్ఞకవర్ణముకును, ప్రయాణాదులయందు తండ్రి మొదలగు వారిని అనుసరించు శిశువుకును, ప్రకృతమునను సరించుటకును, ఈ.స్త్రీ. ఎక్కిళ్ళకును, ఆశకును పేరు.

కాలస్కంధ స్తమాలేస్యా
త్తిందుకే జీవకద్రుమే।

**కాలస్కంధ :** పు. ఇది చీకటి మానుకును, నల్లతుమికి చెట్టుకును, వేగిసచెట్టుకును పేరు.

ఆశాబంధ స్సమాశ్వాసే
తథా మర్కటజాలకే॥
బ్రహ్మబంధు రధిక్షేపే
నిర్దే శే చ ద్విజన్మనాం।

**ఆశాబంధ :** పు. ఇది ఆశగలిగియుండుటకును, సాలెపురుగుమగ్గముకును పేరు.
**బ్రహ్మబంధు:** పు. ఇది బ్రాహ్మణులను ఆక్షేపించుట కును, ద్వేషాదులవలన గ్రహించదగని నామధేయ ముగల బ్రాహ్మణుని నిర్దేశించుటకును పేరు.

ఉగ్రగంధా జమోదాయాం
వచాయాం ఛిక్కికౌషధౌ॥
తీక్ష్ణగంధా వచాయాం చ
శిగ్రు రాజిక యోరపి।
ఇక్షుగంధా కోకిలాక్షే
క్రోష్ట్ర్యం కాశే చ గోక్షురే॥
తృణగోధా చిత్రకోలే
కృకలాసే చ లక్ష్యతే।
ఉపలబ్ధి ర్మతౌ ప్రాప్తౌ
జ్ఞానే చాపి ప్రయుజ్యతే॥ (41)

**ఉగ్రగంధా:** స్త్రీ. ఇది ఓమములోని భేదముకును, వసకును, ఛిక్కికమను ఓషధికిని పేరు.
**తీక్ష్ణగంధా:** స్త్రీ. ఇది వసకును, మునగజిట్టుకును, నల్లావాలకును పేరు.
**ఇక్షుగంధా :** స్త్రీ. ఇది గొలిమిడి చెట్టుకును, నేల గుమ్ముడుచెట్టుకును, ఏనుగపల్లేరు చెట్టుకును పేరు.
**తృణగోధా:** స్త్రీ. ఇది జంతువిశేషముకును, తొండ కును పేరు.
**ఉపలబ్ధి :** స్త్రీ. ఇది బుద్ధికిని, పొందుట కును, జ్ఞానముకును పేరు.

★ అథ ధ పంచవర్ణః ★

యోజనగంధా కస్తూర్యాం
సీతాయాం వ్యాసమాతరి।

**యోజనగంధా :** స్త్రీ. ఇది కస్తూరికిని, సీతకును, సత్యవతికిని పేరు.

★ అథ నాంతవర్గః ★

ఇన స్సూర్యే నృపే పత్యౌ
ధనం గోధనవిత్తయోః।
జిన స్స్యాదతివృద్ధే చ
బుద్ధే చార్హతి జిత్వరే॥ (1)
జనో లోకే మహర్లో కా
త్పరలోకే చ పామరే।
జనీ సీమంతినీ వధ్వో
రుత్పత్తౌ చ జనిర్మతా॥ (2)

**ఇన :** పు. ఇది సూర్యునకును, రాజుకును, భర్త కును పేరు.
**ధన:** న. ఇది పశుసంపత్తికిని, ధనముకును పేరు.
**జిన :** పు. మిక్కిలి ముసలివానికిని, బుద్ధ దేవున కును, పూజ్యునకును, త్రి. జయశీలు నకును పేరు.
**జన :** పు. ఇది మనుష్యునకును, జనోలోకముకు ను, మూఢునకును, ఈ. స్త్రీ. ఆడుదానికిని, భార్య కును, ఈ. స్త్రీ. పుట్టుగకును పేరు.

| | |
|---|---|
| ఘనం స్యాత్కాంస్యతాళాది<br>వాద్య మధ్య మనృత్యయోః।<br>ఘనం సాంద్రేదృఢే దార్ఢ్యే<br>విస్తారే లోహముద్గరే॥<br>మేఘముస్తకయో శ్చాపి | **ఘన**: న. కంచుతాళముల యొక్క వాద్యముకును, దురితముగాని నాట్యముకును, త్రి. దట్టమైన దానికిని, దృఢమైన దానికిని, పు. బలముకును, ఇనుప గుదియకును, మేఘముకును, తుంగముస్తకును పేరు. |
| వనం కాననం నీరయోః।<br>ప్రవాసే నిలయే చాపి<br>వనంప్రస్రవణేఽపి చ॥(4) | **వన**: న. ఇది అడవికిని, జలముకును, పరదేశముకును, గృహముకును, కొండ కాలువకును పేరు. |
| వానం శుష్కఫలే శుష్కే<br>కటే సీవన కర్మణి।<br>జలసం (ప్ల) స్రవనాతో ర్మి<br>సురంగా గతి సౌరభే॥ | **వాన**: త్రి. ఇది ఎండుకాయకును, ఎండిన దానికిని, గండస్థలముకును, కుట్టుటకును, నీటిపట్టునుంచి ప్రసరించుగాలికిని, సొరంగముకును, గమనముకును, పరిమళముకును పేరు. |
| దానం గజమదే త్యాగే<br>పాలన చ్ఛేద శుద్ధిషు। | **దాన** : న. ఇది ఏనుగమదముకును, ఈవికిని, పరిపాలించుటకును, ఛేదించుటకును, పరిశుద్ధికిని పేరు. |
| మానం ప్రమాణే ప్రస్థాదౌ<br>మాన శ్చిత్తోన్నతౌ గ్రహే॥ | **మాన**: న. పరిమితికిని, కుంచెడు మొదలగు కొలకును, పు. మనోగర్వముకును గ్రహముకును పేరు. |
| యానం గతౌ రక్షణేఽపి | **యాన** .: న. ఇది గమనముకును, గజాందోళికాదులకును పేరు. |
| పానం పీతౌ చ రక్షణే। | **పాన**: న. త్రాగుటకును, రక్షించుటకును పేరు. |
| స్త్యానం స్నిగ్ధే ప్రతిధ్వానే<br>ఘనత్వాలస్యయోరపి॥ | **స్త్యాన**: న. నున్ననకును, ప్రతిధ్వనికిని, గొప్పతనముకును, ఆలస్యముకును పేరు. |
| స్థానం స్థితౌ చ సాదృశ్యే<br>సన్నివేశావకాశయోః। | **స్థాన** : న. ఉనికికిని, సామ్యముకును, నివాసస్థానముకును, అవకాశముకును పేరు. |
| యుక్తార్థే కరణార్థే చ<br>స్థానే స్యాదవ్యయం పునః॥ | **స్థానే అవ్యయం**: ఇది యుక్తమనుటకును, హేతువయనుటకును పేరు. |
| సూనం వాచ్యన దూనేషు<br>సూనం ప్రసవపుష్పయోః। | **సూన**: త్రి. స్వల్పమైన దానికిని, న. కనుటకును, పుష్పముకును, స్త్రీ. కుమార్తెకును, మృగాదులను |

సూనా పుత్ర్యాం వధస్థాన
గళశుండికి యోరపి॥(9)
ఊనం హీనే రణోద్యోగే
స్యూనః కిరణసూర్యయోః।

మీనో రాశ్యంతరే మత్స్యే
శీనో జగర మూర్ఖయోః॥
చీనో మృగాంతరే తంతు
వ్రీహి దేశాం శుకాంతరే।

హీనం గర్హ్యోనయోర్న్యూన
మనయోరపి కీర్తితం॥(11)
కృత్స్నం కుక్షౌ సమస్తే చ
రస్న స్తక్షక చండయోః।
వస్నం స్యాద్వేతనే మూల్యే
వసనద్రవ్యయోరపి॥(12)
స్వప్న స్సుప్తస్య విజ్ఞానే
స్వప్న స్స్వాపే చ దర్శనే।
బుధ్న శ్శిఫాయాం రుద్రే చ
రత్నం శ్రేష్ఠే మణావపి॥

నగ్నోఽపి చ క్షపణకే
వివస్త్రే చాభిధేయవత్।
లగ్నం రాశ్యుదయే లగ్నం
సక్త లజ్జితయోరపి॥(14)
ఛన్నం రహ శ్ఛాదితయో

స్స్యాదన్నం భుక్తభక్తయోః।

చంపు ప్రదేశముకును, కొండనాలుకకును పేరు.

**ఊన :** న. ఇది తక్కువకును, యుద్ధ ప్రయత్నము కును పేరు. **స్యూన :** పు. ఇది కిరణముకును, సూర్యునకును పేరు.

**మీన :** పు. మీనరాశికిని, చేపకును పేరు.

**శీన :** పు. కొండచిలువకును, మూర్ఖునకును పేరు.

**చీన :** పు. ఇది మృగవిశేషముకును, దారముకును, చీన ధాన్యముకును, దేశవిశేషముకును, (చీనా) చీనాంబరముకును పేరు.

**హీన : న్యూన :** త్రి. ఇవి నిందింపదగిన దానికిని, తక్కువయైన దానికిని పేరు.

**కృత్స్న :** న. ఇది ఉదరముకును, సమస్తముకును పేరు.

**రస్న :** పు. ఇది వడ్లవానికిని, కోపముగలవానికిని పేరు.

**వస్న :** న. కూలికిని, వెలకును, వస్త్రము కును, ధనముకును పేరు.

**స్వప్న :** పు. ఇది కలకును, నిద్రకును, చూచుట కును పేరు.

**బుధ్న :** పు. చెట్టువేరుకును, శివునకును పేరు.

**రత్న :** న. ఇది సజాతీయ శ్రేష్ఠవస్తువుకును, మణికిని పేరు.

**నగ్న :** పు. ఇది క్షపణమతస్థునకును, త్రి. వస్త్రవిహీనునకును పేరు.

**లగ్న :** న. ఇది మేషాది రాసులయొక్క ఉదయించుటకును త్రి. కలుసుకొన్నదానికిని, లజ్జించిన వానికిని పేరు.

**ఛన్న :** న. ఇది రహస్యముకును, త్రి. కప్పబడిన దానికిని పేరు.

**అన్న :** త్రి. ఇది భక్షింపబడిన దానికిని, అన్నముకును పేరు.

భిన్న మన్యార్థవచనే
సంగతే దారితే స్ఫుటే॥ (15)

**భిన్న** : త్రి. ఇది వేరైనదనుటకును, కూడుకొన్న దానికిని, భేదింపబడిన దానికిని, వికసించిన దానికిని పేరు.

విన్నం జ్ఞాతే స్థితే లబ్ధే
ఛిన్నం భిన్నేతు వాచ్యవత్।
ఛిన్నామృతా యాం పుంశ్చల్యా

**విన్న** : త్రి. ఇది తెలియబడిన దానికిని, ఉన్నదానికిని, పొందబడిన దానికిని పేరు.

**ఛిన్న** : త్రి. ఇది భేదింపబడిన దానికిని, స్త్రీ. తిప్పతీగకును, రంకులాడికిని పేరు.

మున్నః క్లిన్నే చ సూరతే॥(16)
చిహ్నం ధ్వజే పతాకాయాం
ద్యుమ్నం విత్తే పరాక్రమే।
ధను స్సంజ్ఞా పియాలద్రౌ
రాశిభేదే శరాసనే॥ (17)
తనుః కాయే కృశే చాల్పే
విరళేఽపి చ వాచ్యవత్।
హనుః ప్రహరణే మృత్యౌ
కపోలావయవే గదే॥ (18)
హన్వర్హట్టవిలాసిన్యాం
సూనుః పుత్రేఽను జే రవౌ

**ఉన్న** : త్రి. ఇది తడిసిన దానికిని, దయకలవానికిని పేరు.

**చిహ్న** : న. ఇది గురుతుకును, జండాకును పేరు.

**ద్యుమ్న** : న. ఇది ధనముకును, పోటురితనముకును పేరు.

**ధను** : (ష) న. మొరటుచెట్టుకును, ధనూరాశికిని, వింటి బద్ధకును పేరు..

**తను** : స్త్రీ. ఇది శరీరముకును, త్రి. కృశించిన దానికిని, అల్పమైన దానికిని, విరళమైన దానికిని పేరు.

**హను** : స్త్రీ. ఇది దెబ్బకును, మృత్యువుకును, దవడకును, రోగముకును, నఖ మనెడి గంధద్రవ్యముకును పేరు.

**సూను** : పు. ఇది పుత్రునకును, తమ్మునకును, సూర్యునకును పేరు.

సాను శ్శృంగే బుధే మార్గే
వాత్యాయాం పల్లవే వనే॥(19)

**సాను** : పు. ఇది శిఖరముకును, విద్వాంసునకును, త్రోవకును, వాయుసంఘముకు ను, చిగురుకును, వనముకును పేరు.

దాను ర్దాతరి విజ్ఞాతే
భానుః కిరణ సూర్యయోః।
ధేన స్సముద్రే నద్యాం తు

**దాను** : త్రి. ఇది దాతకును, తెలియబడిన దానికిని పేరు. **భాను** : పు. ఇది కిరణముకును, సూర్యునకును పేరు. **ధేన** : పు. ఇది సముద్రముకును, ఈ. స్త్రీ. నదికిని పేరు.

ధేనీ శ్యేన స్సితే ఖగే॥ (20)
ముని ర్వ్యాసం గుదీ బుద్ధ

**శ్యేన** : త్రి. ఇది తెల్లని దానికిని, డేగకును పేరు.

**ముని** : పు. ఇది వ్యాసాదిమునులకును, గారచెట్టు

పియాలా గస్తికింశుకే।

జ్యాని ర్హానౌ స్రవంత్యాం చ
యోని స్స్యాదాకరే భగే॥
జ్యోత్స్ని పటోలికాయాంస్యా
జ్జ్యోత్స్నా యుక్తవిభావరౌ।
జ్యోత్స్నా సచంద్రనక్షత్ర
రాత్రే చంద్రాత పే పిచ॥
రాస్నా స్మృతా భుజంగాక్ష్యా
మేలాపర్ణ్యాంచకథ్యతే।
మృత్స్నా తు వరికాయాంస్యా
న్మృత్స్నాయామపి దృశ్యతే॥(23)
దీనామూషిక యోషాయాం
దుర్గతే కాతరేऽ న్యవత్।
ధానా భృష్టయవే ప్రోక్తా
ధాన్యాకేऽభినవోద్భిది॥

★ అథ నాంత త్రివర్ణః ★

అవనం రక్షణే ప్రీతౌ

భవనం భావ వేశ్మనోః।

భువనం విష్టపే మహ్యాం
సలిలేऽపి వియత్యపి॥ (25)
సవనం యజనే స్నానే
సోమనిర్దళనేऽపి చ।
అయనం పథి భానో స్స్యా
దుదగ్దక్షిణతో గతౌ॥ (26)
జయనం స్యాత్తురంగాది

కును, బుద్ధ దేవునకును, మొరట చెట్టుకును, అగిసెచెట్టుకును, మోదుగ చెట్టుకును పేరు.

**జ్యాని :** స్త్రీ. ఇది హానికిని, నదికిని పేరు.

**యోని :** పు. ఇది స్థానముకును, భగముకును పేరు.

**జ్యోత్స్నీ :** స్త్రీ. ఇది చేతిపొట్ల చెట్టుకును, వెన్నెలగల రాత్రికిని పేరు.

**జ్యోత్స్నా :** స్త్రీ. చంద్రునితో గూడిన రాత్రికిని, వెన్నెలకును పేరు.

**రాస్నా :** స్త్రీ. ఇది సర్పాక్షి చెట్టుకును, దుంప రాష్ట్రముకును పేరు.

**మృత్స్నా :** స్త్రీ. ఇది తొవరిమన్నుకును, శ్రేష్ఠమైన మన్నుకును పేరు.

**దీనా :** స్త్రీ. ఇది ఆడయెలుకకును, త్రి. దరిద్రున కును, భయపడువానికిని పేరు.

**ధానా :** స్త్రీ. వేపుడు బియ్యముకును, ధనియము కును, క్రొత్త విత్తనముకును పేరు.

**అవన :** న. ఇది రక్షించుటకును, తృప్తిబొందుట కును పేరు.

**భవన :** న. ఇది అభిప్రాయముకును, గృహము కును పేరు.

**భువన :** న. ఇది లోకముకును, భూమికిని, జల ముకును, ఆకాశముకును పేరు.

**సవన:** న. ఇది యజ్ఞముకును, అవభృథస్నానము కును, సోమలతను ఛేదించుటకును పేరు.

**అయన:** న. ఇది మార్గముకును, సూర్యుని ఉత్తర దక్షిణ దిక్కులయందలి గమనముకును పేరు.

**జయన :** న. ఇది అశ్వమును కవచాదులు తొడగి

సన్నాహే విజయేఽపి చ।

సిద్ధముచేయుటకును, జయము కును పేరు.

శయనం సురతే నిద్రా
శయ్యయోరపి భాషితం॥(27)

**శయన:** న. సురతమునకును, నిద్రకును, పానుపు నకును పేరు.

శమనం శాంతి వధయో
శ్శమన శ్శ్రాద్ధదైవతే।

**శమన :** న. ఓరిమికిని, చంపుటకును, పు. యమ దేవునకును పేరు.

దశనః కవచే దంతే
దశన శ్శిఖరేఽపి చ॥(28)

**దశన :** పు. ఇది కవచముకును, దంతము కును, అగ్రముకును పేరు.

జఘనం కామినీశ్రోణి
పురోభాగే కటీరకే।

**జఘన :** న. స్త్రీలయొక్క కటిముందరి భాగము కును, కటి ప్రదేశముకును పేరు.

తపన స్తరణౌ తాపే
భల్లాతే నరకాంతరే॥(29)

**తపన :** పు. సూర్యునకును, వేడిమికిని, జీడి చెట్టుకును, నరక విశేషముకును పేరు.

రసనం స్వాదనే ధ్వానే
రసనా కాంచి జిహ్వయోః।
రసనా చాపి రాస్నాయాం

**రసన :** న. ఇది రుచించుటకును, ధ్వనికిని, స్త్రీ. మొలనూలుకును, నాలుకకును, దుంపరాష్ట్రము కును పేరు.

వసనం ఛాదనేఽంశుకే॥

**వసన:** న. ఇది కప్పుటకును, వస్త్రముకును పేరు.

హసనంచ స్మితే హాసే
ఽంగారధాన్యాం హసన్యపి।

**హసన:** న. ఇది నవ్వుటకును, ఈ. స్త్రీ. కుంపటికిని, పేరు.

శ్వసనో మారుతే శ్వాసే
శ్వసనో మదనద్రుమే॥

**శ్వసన :** పు. వాయువుకును, నిట్టూర్పు నకును, మ్రంగచెట్టుకును పేరు.

కదనం మర్దనే పాపే

**కదన:** న. ఇది మర్దించుటకును, పాపము కును పేరు.

సదనం మందిరే జలే।

**సదన :** న. ఇది గృహముకును, జలముకు ను పేరు.

మదన స్స్మర ధుత్తూర
వసంత ద్రుమ సిక్థకే॥(32)

**మదన:** పు. మన్మథునకును, ఉమ్మెత్తచెట్టుకును, వసంత ఋతువుకును, పుష్ప వృక్ష విశేషముకును, మైనముకును పేరు.

దహన శ్చిత్రకే వహ్నౌ
భల్లాతే దుష్టచేష్టితే।

**దహన :** పు. చిత్రమూలపు చెట్టుకును, అగ్నికిని, జీడి చెట్టుకును, త్రి. దుర్వ్యాపారముగల వానికిని పేరు.

గహనం గహ్వరే దుఃఖే
విపినే కలిలేఽపి చ॥(33)

**గహన :** న. ఇది గుహకును, దుఃఖముకును, అడవికిని, త్రి. దుష్ప్రవేశమైన దానికిని పేరు.

స్తననం ధ్వనిమాత్రే స్యా
త్కుంథనే మేఘగర్జితే।
నిధనం స్యాత్కులే నాశే
ప్రధనం దారణే రణే ॥ (34)
పవనాఖ్యా కులాలస్య పా
కస్థా నేऽపి మారుతే।
నిష్పావే చాథ వపనం
బీజాధానేऽపి ముండనే॥ (35)
దమనః కుసుమే వీరే
వమన శ్ఛర్దనేऽర్ద నే।
స్యాదాహృతౌ చ
యమనం దుఃఖే
చోపరతౌ యమే॥ (36)
కమనః కాముకే కామేऽ
భిరూపేऽశోకపాదపే।
ధమనో ప్యనలే భస్త్రా
ధ్మాపక క్రూరయోరపి ॥ (37)
ధమనీ తు హరిద్రాయాం
కంధరా శిరయోరపి।
మలనః పటవాసే స్యా
న్మర్దనే మలనం మతం॥(38)
చలనం కంపనం కంపే
కంప్రే చలన కంపనౌ।
చలనీ వస్త్రఘర్ఘర్యాం
వా(రి) రీభేదేऽపి చ క్వచిత్॥
సేచనం రక్షణే సేకే
నౌకాసేచనభాజనే।
సేవనం సీవనో పాస్త్యో

**స్తనన** : న. ధ్వనికిని, మొరవోవుటకును, మేఘ ధ్వనికిని పేరు.

**నిధన** : న. ఇది కులముకును, నాశముకు ను పేరు.

**ప్రధన** : న. ఛేదించుటకును, యుద్ధము కును పేరు.

**పవన** : పు. ఇది కుమ్మరివాడు కుండలు కాల్చు ప్రదేశముకును, వాయువుకును, తూర్పెత్తుటకును పేరు.

**వపన**: న. ఇది విత్తనములు చల్లుటకును, క్షౌరము కును పేరు.

**దమన**: పు. దమన పుష్పముకును, వీరునకును పేరు.

**వమన** : పు. కక్కుటకును, యాచించుటకును, సంగ్రహించుటకును పేరు.

**యమన**: న. దుఃఖముకును, అనాసక్తికిని, ఇంద్రియనిగ్రహాదులకును పేరు.

**కమన** : పు. ఇది విటునకును, మన్మధునకును, రూపవంతునకును, అశోక వృక్షముకును పేరు.

**ధమన** : పు. ఇది అగ్నికిని, తిత్తి ఊదువానికిని, క్రూరునకును పేరు.

**ధమనీ** : స్త్రీ. ఇది పసపునకును, కంఠముకును, బోలునరముకును పేరు.

**మలన**: పు. ఇది డేరాకును, న. మర్దించుటకును పేరు.

**చలన**: **కంపన**: న. ఈరెండును, చలించుటకును, త్రి. చలించుదానికిని పేరు.

**చలనీ** : స్త్రీ. ఇది గాగరాకును, (లేక లంగా) గజ బంధన విశేషముకును పేరు.

**సేచన**: న. ఇది రక్షించుటకును, తడుపు టకును, ఓడలోని నీళ్ళుతోడుపాత్రకును పేరు.

**సేవన** : న. ఇది కుట్టుటకును, సేవించుటకును పేరు.

| | |
|---|---|
| స్సంవ్యానం ఛాదనేऽంశుకే॥ | **సంవ్యాన**: న. ఇది కప్పుటకును, ఉత్తరీయ వస్త్రము కును పేరు. |
| సమానం సత్సమైకేష్వ సమానో నాభిమారుతే। | **సమాన** : త్రి. యోగ్యమైన దానికిని, సమమైన దానికిని, ఒక్కటియైన దానికిని, పు. సమాన వాయువుకును పేరు. |
| శోభనో గ్రహయోగేస్యా చ్చోభనో సుందరేऽన్యవత్॥ | **శోభన** : పు. పంచాంగ యోగవిశేషముకును, త్రి. సుందరమైన దానికిని పేరు. |
| శాసనం రాజదత్తోర్వ్యాం లేఖా జ్ఞా శాస్త్ర శాస్తిషు। | **శాసన** : న. ఇది రాజుచేత నివ్వబడిన భూమికిని, జాబుకును, ఆజ్ఞకును, శాస్త్రముకును, శిక్షకును పేరు. |
| వాసనం వసనే (పీ) వారా సనే జ్ఞానే చ ధూపనే॥(42) | **వాసన** : న. ఇది వస్త్రముకును, జలాధార ప్రదేశము కును, జ్ఞానముకును, పరిమళ ద్రవ్యముకును పేరు. |
| ఆసనం ద్విరదస్కంధే పీఠేయాత్రానివర్తనే। ఆసనీ పణ్యవీధ్యాం స్యా దాసనో జీవకద్రుమే॥(43) | **ఆసన** : న. ఇది ఏనుగ మూపురముకును, పీఠము కును, దేశకాలాద్యపేక్షవలన యుద్ధ యాత్రనుంచి మళ్ళుటకును, ఈ. స్త్రీ. అంగడివీధికిని, పు. వేగిస చెట్టుకును పేరు. |
| స్పర్శనో మారుతే స్పర్శా దానయో స్స్పర్శనం మతం। | **స్పర్శన**: పు. వాయువుకును, న. స్పృశించుటకును, ఈవికిని పేరు. |
| దర్శనం నయన స్వప్న బుద్ధిధర్మోపలబ్ధిషు॥ (44) శాస్త్ర దర్పణయోశ్చాపి | **దర్శన** : న. ఇది నేత్రముకును, స్వప్నముకును, బుద్ధికిని, ధర్మముకును, జ్ఞానముకు ను, శాస్త్రము కును, అద్దముకును పేరు. |
| దంశనం దంశ వర్మణోః। | **దంశన**: న. ఇది దంతాదులచేత ఖండించుటకును, కవచముకును పేరు. |
| పిశునం కుంకుమే క్రూరే సూచకే చాభిధేయవత్॥ | **పిశున** : న. ఇది కుంకుమకును, త్రి. క్రూరమైన దానికిని, కొండెగానికిని, కోతి ముఖముకును, స్త్రీ. స్పృక్కయనెడు గ్రంధ్యద్రవ్యముకును పేరు. |
| శకునం చ శుభాశంసా నిమిత్తే శకునః ఖగే। | **శకున** : న. ఇది శుభమును సూచించు నిమిత్తము కును, పు. పక్షికిని పేరు |
| మిథునో రాశిభేదే స్యా | **మిథున** : పు. మిథునరాశికిని, న. స్త్రీ. పురుషుల |

న్మిథునం దంపతీయుగే॥ (46)
తలునః పవనే యూని
స్త్రియాంచ తలునీం విదుః।
తలినం విరళే స్తోకే
స్వచ్ఛే పి తలినం మతం॥ (47)
మలినం దూషితే కృష్ణే
ఋతుమత్యాం మలిన్యపి।
కఠినం నిష్ఠురే స్థాల్యాం
శర్కరాయాం గుడస్యచ॥
కఠినా కాటికాయాం తు
కఠినీతి ప్రయుజ్యతే।
పీతనం హరితాళే స్యా
త్కుంకుమే పీతదారుణి॥
ఆమ్రాతకే పీతవశ్చ
హరిద్రాయాం చ పీతనా।
పీతనం త్రిషు పీతేऽపి
మైథునం సంగతే రతే॥

కేతనం లాంఛనే కార్యే
గేహే చోపనిమంత్రణే।
ఛర్దనోऽలంబుషే నింబే
ఛర్దనం వమనేऽపి చ॥
ఛేదనం కర్తనే భేదే
ఛదనం పక్ష పత్రయోః।
తోదనం వ్యధనే తోత్రే
రోదనం క్రందనేऽశ్రుణి॥ (52)
అపానంతు గుదే ప్రోక్త
మపాన స్తస్య మారుతే।

ద్వంద్వముకును పేరు.

**తలున** : పు. ఇది వాయువుకును, పిన్న వయసు వానికిని, ఈ. స్త్రీ. యౌవన స్త్రీకిని పేరు.

**తలిన** : త్రి. ఇది విరళమైన దానికిని, స్వల్పమైన దానికిని, స్వచ్ఛమైన దానికిని పేరు.

**మలిన** : త్రి. ఇది దూషింపబడిన దానికిని, నల్లని దానికిని, ఈ. స్త్రీ. ముట్టయిన స్త్రీకిని పేరు.

**కఠిన** : త్రి. ఇది కఠినమైన దానికిని, పాత్రకును, స్త్రీ. బెల్లపు పంచదారకును, ఈ. స్త్రీ. హరిదళము, మణిశిల మొదలగు ఉపధాతువులకును పేరు.

**పీతన**: న. ఇది హరిదళముకును, కుంకుమకును, పు. దేవదారు చెట్టుకును, అంబాళవృక్షముకును, స్త్రీ. పసపునకును, త్రి. పచ్చని దానికిని పేరు.

**మైథున** : న. ఇది సంబంధముకును, సురతముకును పేరు.

**కేతన** : న. ఇది చిహ్నకును, చేయదగిన పనికిని, గృహముకును, పిలచుటకును పేరు.

**ఛర్దన** : పు. ఇది చిర్రికూరకును, వేప చెట్టుకును, న. వమనముకును పేరు.

**ఛేదన** : న. ఇది నరుకుటకును, భేదించుటకును పేరు.

**ఛదన** : న. రెక్కకును, ఆకుకును పేరు.

**తోదన** : న. ఇది బాధకును, కొరడాకును పేరు.

**రోదన** : న. ఏడ్పుటకును, కన్నీటికిని పేరు.

**అపాన** : న. ఇది గుదస్థానముకును, పు. అపాన వాయువుకును పేరు.

సంతాన స్సంతతౌ గోత్రే
స్యాదపత్యే సురద్రుమే॥ (53)

**సంతాన**: పు. ఇది పరంపరకును, వంశము కును, స్త్రీపుంరూప సంతానముకును, కల్పవృక్షముకును పేరు.

వితానో యజ్ఞవిస్తారో
ల్లోచేషు క్రతుకర్మణి।
వృత్తభేదావసరయో
ర్వితానం తుచ్ఛ మందయోః॥(54)

**వితాన**: పు. ఇది యజ్ఞముకును, విస్తారముకును, ఛాదినీకిని, యజ్ఞకర్మకును, న. వృత్తవిశేషముకును, సమయముకును, త్రి. నీచమైన దానికిని, మంద మైన దానికిని పేరు.

ఉత్తానం స్యాదగంభీరే
తథా సుప్తోన్ముఖేఽన్యవత్।

**ఉత్తాన**: త్రి. ఇది మెరకయైన దానికిని, ఊర్ధ్వముఖ ముగా శయినించు దానికిని పేరు.

ఆదానం గ్రహణే విద్యా
దలంకారేఽపి వాజినాం॥

**ఆదాన**: న. ఇది గ్రహించుటకును, అశ్వాలంకార ముకును పేరు.

నిదానం కారణే రోగ
న్నిర్ణయే వత్సదామని।

**నిదాన**: న. ఇది కారణముకును, రోగ నిదానము కును, దూడను కట్టుకన్నె త్రాటి కిని పేరు.

ఉద్యానం వనభేదే స్యా
న్నిస్సృతేఽపి ప్రయోజనే॥

**ఉద్యాన**: న. శృంగారవనముకును, వెడలుటకును, ప్రయోజనముకును పేరు.

ఆమ్లానో ఝింటికాభేదే
వాచ్యవన్నిర్మలే స్మృతః।

**అమ్లాన** : పు. ఇది తెల్ల పెద్ద గోరింటకును త్రి. నిర్మలమైన దానికిని పేరు.

వ్యుత్థానం స్వైరకరణే
విరోధాచరణేఽపి చ॥(57)

**వ్యుత్థాన** : న. స్వతంత్రమైన కార్యముకును, విరోధమును చేయుటకును పేరు.

ఉత్థాన ముద్యమే తంత్రే
పౌరుషే పుస్తకే రణే।
అంగణోద్గమ హర్షే షు
మలవేగేఽపి కీర్తితం॥ (58)

**ఉత్థాన** : న. ఇది ప్రయత్నముకును, తన రాజ్య సైన్యములను గూర్చి విచారణచేయుటకును, పురుషకారముకును, పుస్తకముకును, యుద్ధము కును, ముంగిలివాకిలికిని, బయలుదేరుటకును, సంతోషముకును, మలము విడుచుటకును పేరు.

సంస్థాన మాకృతౌ మృత్యౌ
సన్నివేశే చతుష్పథే।

**సంస్థాన** : న. ఇది ఆకారముకును, చావుకును, నగరముచుట్టునుండు బయలు ప్రదేశముకును, నాలుగు త్రోవలు కలిసిన ప్రదేశముకును పేరు.

ధావనం ప్రగమే శుద్ధౌ

**ధావన** : న. ఇది పరుగెత్తుటకును, పరిశుద్ధికిని,

పృశ్నిపర్ణ్యాం తు ధావనీ॥
పావనం తు జలే కృచ్ఛ్రే
పావకాధ్మానయోరపి।
పావనస్స్యాల్లకే వహ్నౌ
ప్రాయశ్చిత్తే చ పావనం॥ (60)
వాచ్యవత్పావయితరి
హరీతక్యాం తు పావనీ।
వామనోऽంకోట వైకుంఠ
ఖర్వ దక్షిణదిగ్గజే॥ (61)
స్థాపనం స్యాత్పుంసవనే
సమాధౌ రోపణేऽపి చ।
యాపనం వర్తనే కాల
క్షేపే నిరసనేऽపి చ॥ (62)
యుంజాన స్సారథౌ విప్రే
బుధానః పండితే గురౌ।

దృశానం జ్యోతిషి ప్రోక్తం
దృశానశ్చ విరోచనే॥ (63)
జవనో దేశభేదే స్యా
ద్వేగవేగాధికాశ్వయోః।
జవన్యోషధిభేదే స్యా
ద్వాచ్యవద్వేగిని స్మృతః॥ (64)
జీవనం వర్తనే నీరే
పుత్రజీవేతు జీవనః।
జీవనీ జీవనా చేతి
జీవంతీమేదయోః క్రమాత్॥(65)
దేవనం వ్యవహారే స్యా
జ్జిగీషే క్రీడయోరపి।

ఈ. స్త్రీ. కోలపొన్న చెట్టుకును పేరు.
**పావన**: న. ఇది జలముకును, కృచ్ఛ్రవ్రతముకును, పరిశుద్ధికిని, వాతరోగముకును పు. అందుగబంక తోచేసిన ధూపద్రవ్యముకును, అగ్నికిని, ప్రాయశ్చిత్తముకును, పవిత్రము చేయుదానికిని ఈ. స్త్రీ. కరకచెట్టుకును పేరు.

**వామన**: పు. ఇది ఊడుగచెట్టుకును, విష్ణువుకును, పొట్టివానికిని, దక్షిణ దిగ్గజ ముకును పేరు.
**స్థాపన**: న. ఇది పుంసవనకర్మకును, సమాధికిని, ఆరోపించుటకును పేరు.
**యాపన** : న. ఇది వ్యాపారముకును, కాలము జరుపుటకును, వెళ్ళించుటకును పేరు.
**యుంజాన**: పు. ఇదిసారధికిని, బ్రాహ్మణునకును పేరు. **బుధాన** : పు. ఇది విద్వాంసునకును, బృహస్పతికిని పేరు.
**దృశాన** : న. ఇది కాంతికిని, పు. సూర్యున కును పేరు.
**జవన**: పు. ఇది జవనదేశముకును, వేగముకును, వేగముగల అశ్వముకును, ఈ. స్త్రీ. ఓషధి విశేషము కును, త్రి. వేగము గల దానికిని పేరు.

**జీవన**: న. ఇది జీవనార్థ వ్యాపారముకును, జలము కును, పు. పుత్రజీవిచెట్టుకును పేరు.
**జీవనీ** : స్త్రీ. ఇది పాలకూరకును పేరు. **జీవనా** : స్త్రీ. మేధయను గంధద్రవ్యముకును పేరు.
**దేవన**: న. ఇది వ్యవహారముకును, జయేచ్ఛకును, ఆటకును, పు. ఆటపాచిక లకును పేరు.

| | |
|---|---|
| అత్రేషు దేవనః ప్రోక్తో | |
| మేహనం మూత్రశిశ్నయోః ॥ | **మేహన :** న. ఇది మూత్రముకును, లింగముకును పేరు. |
| తేమనం వ్యంజనే క్లేదే<br>తేమనీ చుల్లికాంతరే। | **తేమన :** న. ఇది పులుసుకును, తడుపు టకును, ఈ. స్త్రీ. పొయికిని పేరు. |
| సావనో యజ్ఞకర్మాంతే<br>యజమానప్రచేతసోః॥ (67) | **సావన :** పు. ఇది యాగాంతముకును, యజ్ఞము చేసిన వానికిని, వరుణదేవునకును పేరు. |
| విజ్ఞానం కార్మణే జ్ఞానే | **విజ్ఞాన:** న. ఇది ఓషధులచేతను స్తంభనమోహనాదులను చేయుటకును, శిల్పాదు లయందలి బుద్ధికిని పేరు. |
| ప్రజ్ఞానం లాంఛనే ధియి। | **ప్రజ్ఞాన :** న. చిహ్నాముకును, బుద్ధికిని పేరు. |
| హాయనోర్చిషి వర్షే చ<br>వ్రీహిభేదే చ హాయనః॥(68) | **హాయన :** పు. అగ్నిజ్వాలకును, సంవత్సరము కును, ధాన్యవిశేషముకును పేరు. |
| ఫాల్గునస్తు తపస్యేऽపి<br>పూర్ణి మాయాం తు ఫాల్గునీ। | **ఫాల్గున:** పు. ఇది ఫాల్గున మాసముకును, ఈ. స్త్రీ. ఫాల్గునమాసపూర్ణిమకును పేరు. |
| ఫల్గునః కథితః పార్థే<br>నదీజే కకుభేऽపి చ॥ (69) | **ఫల్గున :** పు. ఇది అర్జునునకును, బ్రహ్మ మేడి చెట్టుకును, మద్దిచెట్టుకును పేరు. |
| వేష్టనం కర్ణశష్కుల్యా<br>ముష్ణీషే పరివారణే। | **వేష్టన :** న. ఇది చెవికుడకకును, తల పాగాకును, చుట్టుకొనుటకును పేరు. |
| గోస్తనో హారభేదేऽపి<br>ద్రాక్షాయామపి గోస్తనీ॥ | **గోస్తన:** పు. ఇది నలుబది పేటల ముత్యాలహారము కును, ఈ. స్త్రీ. ద్రాక్షతీగకును పేరు. |
| కల్పనం కర్తనే క్లుప్తౌ<br>సజ్జనాయాంతు కల్పనా। | **కల్పన:** న. ఛేదించుటకును, రచించుటకును, స్త్రీ. సిద్ధముచేయుటకును పేరు. |
| కర్తనం ఛేదనే ప్రాహు<br>ర్నారీణాం తూలసే (చ) వనే॥(71) | **కర్తన :** న. ఛేదించుటకును, స్త్రీలచేత చేయబడు సూత్రనిర్మాణముకును పేరు. |
| లంఘనం తూపవాసే స్యా<br>త్క్రమణేప్లవనేऽపి చ। | **లంఘన:** న. ఇది లంకణముకును, నడచుటకును, దాటుటకును పేరు |
| మండనం స్యాదలంకారే<br>లంకరిష్ణౌ తు వాచ్యవత్ ॥ | **మండన :** న. ఇది అలంకారముకును, త్రి. అలం కారమగు వస్తువుకును పేరు. |
| భండనం కవచే యుద్ధే | **భండన:** న. ఇది కవచముకును, యుద్ధముకును, |

| | |
|---|---|
| ఖలీకారేఽపి వర్తతే। | అపకారముకును పేరు. |
| ముండనం వపనే త్రాణే | **ముండన**: న. ఇది క్షౌరముకును, రక్షించుటకును |
| హిండనం లేఖనే రతే॥ (73) | పేరు. **హిండన** : న. ఇది వ్రాయుటకును, సురత ముకును పేరు. |
| అంగనం ప్రాంగణే యానే | **అంగన** : న. ఇది ముంగిలి వాకిలికిని, నడచుట |
| కామిన్యామంగనా మతా। | కును, స్త్రీ. స్త్రీకిని, ఉత్తర దిగ్గజము యొక్క భార్య |
| కుబేరదిక్కరిణ్యామ | కును పేరు. |
| ప్యంగనాపరికీర్తితా ॥ (74) | |
| గంధనం సూచనో త్సాహ | **గంధన** : న. ఇది సూచించుటకును, ఉత్సాహము |
| హింసనేషు ప్రకాశనే। | కును, హింసించుటకును, ప్రకాశించుటకును పేరు. |
| నందనం వాసవోద్యానే | **నందన**: న. ఇది ఇంద్రవనముకును, పు. సంతోష |
| నందనో హర్షకే సుతే॥ | ముకును, పుత్రునకును పేరు. |
| స్యందనం తు స్రుతౌ నీరే | **స్యందన**: న. ఇది స్రవించుటకును, జలము కును, |
| స్యందన స్తినిశే రథే। | పు. నెమ్మిచెట్టుకును, రథముకును పేరు. |
| క్రందనం రోదనే హ్వానే | **క్రందన** : న. ఇది ఏడ్చుటకును, పిలచు టకును పేరు. |
| చందనం మలయోద్భవే॥ | |
| చందనః కపిభేదే స్యా | **చందన**: న. ఇది మంచి గంధముకును, పు. చంద |
| న్నదీభేదే తు చందనీ। | నుడను వానరునకును, ఈ. స్త్రీ. నదీవిశేషముకును పేరు. |
| వర్ధనం ఛేదనే వృద్ధౌ | **వర్ధన** : న. ఇది ఛేదించుటకును, వృద్ధి బొందుట |
| వారిధాన్యాం చ వర్ధనీ॥ (77) | కును, ఈ. స్త్రీ. జలపాత్ర విశేషముకును పేరు. |
| వ్యంజనం తేమనే చిహ్నే | **వ్యంజన** : న. ఇది పప్పు, పులుసు మొదలగు వాటి |
| శ్మశ్రుణ్యవయవేఽపి చ। | కిని, చిహ్నకును, ముఖరోమములకును, కరచ రణాద్యవయవముకును పేరు. |
| రంజనో రాగజనకే | **రంజన** : పు. ఇది అనురాగమును పుట్టించువాని |
| రంజనం రక్త చందనే॥ (78) | కిని, న. రక్తచందనముకును, ఈ. స్త్రీ. ప్రేంకణపు |
| గుంద్రా రోచనికా నీలీ | చెట్టుకును, గోరోచనముకును, నీలిచెట్టుకును, |
| మంజిష్ఠాను చ రంజనీ। | మంజిష్ఠకును పేరు. |

| | |
|---|---|
| అంజనం కజ్జలే చాక్తౌ<br>సౌవీరే చ రసాంజనే ॥ (79)<br>అంజనో దిగ్గజే జ్యేష్ఠ్యే<br>మంజనాప్యనిలస్త్రియాం।<br>అంజనీ లేపనాయాం చ | **అంజన** : న. ఇది కాటుక మసికిని, కూడుటకును, సౌవీరాంజనముకును, రసాంజనముకును, పు. పశ్చిమదిగ్గజముకును, బల్లికిని, స్త్రీ. వాయుదేవుని భార్యకును ఈ. స్త్రీ. పూతకును పేరు. |
| గృంజనస్తు రసోనకే ॥ (80)<br>విషదిగ్ధ పశోర్మాంసే<br>గృంజనం చ ప్రకీర్తితం। | **గృంజన** : పు. ఇది వెల్లుల్లికిని, న. విష మందు పొదగబడిన పశుమాంసముకును పేరు. |
| లేఖనం ఛదనే భూర్జే<br>లిపిన్యాసే చ లేఖనం ॥ (81) | **లేఖన** : న. ఇది ఛేదించుటకును, భుజిపత్రి చెట్టుకును, వ్రాతకును పేరు. |
| యోజనం చ చతుష్క్రోశ్యాం<br>యోగేచ పరమాత్మని। | **యోజన** : న. ఇది 4 క్రోసుల దూరముకును, కూడికకును, పరమాత్మకును పేరు. |
| గర్జనం నిస్వనే కోపే | **గర్జన** : న. ధ్వనికిని, కోపముకును పేరు. |
| వర్జనం త్యాగహింసయోః ॥ | **వర్జన** : న. ఇది విడుచుటకును, చంపుటకును పేరు. |
| మార్జనం కథితం మార్ష్టౌ<br>మార్జనో లోధ్రశాఖిని। | **మార్జన**: న. ఇది తుడచుటకును, పు. యెర్రలొద్దుగ చెట్టుకును పేరు. |
| సజ్జనో వాచ్యవత్సాధౌ<br>సజ్జనం ఘట్టగుల్మకే॥(83)<br>సజ్జనా కల్పనాయాం తు | **సజ్జన** : త్రి. ఇది యోగ్యునకును, న. సేనారక్షణార్థమై శిబిరముల చుట్టువేయు ఆవరణకును, స్త్రీ. రచించుటకును పేరు. |
| భాజనం యోగ్యపాత్రయోః। | **భాజన**:న. ఇది యోగ్యముకును, పాత్రముకును పేరు. |
| అర్జునః కకుభే పార్థే<br>కార్తవీర్య మయూరయోః॥ (84)<br>మాతు రేకసుతేऽపి స్యా<br>దర్జునో ధవళేన్యవత్।<br>అర్జునంతు తృణే నేత్ర<br>గదే స్యాదర్జునీ గవి॥ (85)<br>ఉషాయాం కరతోయాయాం<br>కుట్టన్యామపి చ క్వచిత్। | **అర్జున**: పు. ఇది మద్దిచెట్టుకును, కార్తవీర్యార్జునునకును, నెమలికిని, తల్లికి ఒక్కడె పుత్రుడైనవానికిని, త్రి. తెల్లని దానికిని, న. తృణవిశేషముకును, నేత్రరోగముకును, ఈ. స్త్రీ. గోవుకును, అనిరుద్ధుని భార్యకును, ఈశ్వరుని హస్తము వలన బుట్టిన నదీ విశేషముకును, కుంటెన కత్తెకును పేరు. |

| | |
|---|---|
| వృజినం కల్మషేక్లేశే<br>వృజినః కుటిలేऽన్యవత్॥(86) | **వృజిన** : న. ఇది పాపముకును, కష్టము కును, త్రి. కుటిలునకును పేరు. |
| లాంఛనం లక్ష్మణే నామ్ని | **లాంఛన** : న. ఇది చిహ్నకును, నామధేయము కును పేరు. |
| బంధనం వధ బంధయోః। | **బంధన**: న. ఇది చంపుటకును, కట్టుటకును పేరు. |
| జగత్ను రగ్నౌ జంతౌ చ | **జగత్ను** : పు. ఇది అగ్నికిని, జంతువుకును పేరు. |
| వచక్ను ర్వాగ్మి విప్రయోః॥ | **వచక్ను** : త్రి. ఇది వాచాలునకును, బ్రాహ్మణున కును పేరు. |
| ప్రసూనం వాచ్యవత్సూనే<br>ప్రసూనం ఫల పుష్పయోః। | **ప్రసూన** : త్రి. ఇది పుట్టిన దానికిని, న. ఫలము కును, పుష్పముకును పేరు. |
| కానీనః కన్యకాజాత<br>తనయే వ్యాసకర్ణయోః॥(88) | **కానీన** : పు. ఇది కన్యయందు పుట్టినవానికిని, వ్యాసమునికిని, కర్ణునకును పేరు. |
| కాననం విపినే గేహే<br>పరమేష్ఠిముఖేऽపి చ। | **కానన**: న. ఇది అడవికిని, గృహముకును బ్రహ్మ యొక్క ముఖముకును పేరు. |
| కాంచనః కాంచనారే స్యా<br>చ్చంపకే నాగకేసరే॥(89)<br>ఉదుంబరే చ (పున్నాగే)<br>ధుత్తూరే హరిద్రాయాం చ<br>కాంచనీ।కాంచనం హేమ్ని కింజల్కే | **కాంచన** : పు. ఇది దేవకాంచనపు చెట్టుకును, సంపెంగచెట్టుకును, నాగకేసరపుచెట్టుకును, మేడి చెట్టుకును, ఉమ్మెత్త చెట్టుకును, ఈ. స్త్రీ. పసపున కును, న. బంగారు కును, పద్మకింజల్కముల కును పేరు. |
| కుహనం కాచభాజనే॥<br>గోలకే చాథ | **కుహన** : న. ఇది గాజుపాత్రకును, ఉండకును పేరు. |
| శకుని స్సౌబలేకరణే ఖగే। | **శకుని**: పు. ఇది దుర్యోధనుని మంత్రియగు శకునికిని, 8వ పంచాంగ కరణముకును, పక్షికిని పేరు. |
| రోచనా రక్తకల్హారే<br>రోచనః కూటశాల్మలౌ॥ (91)<br>మంగళ్యేऽపి చ గోపిత్తే<br>రోచనా రుచిరస్త్రియాం। | **రోచన** : స్త్రీ. ఇది యెఱ్ఱకలువకును, పు. పిన్న బూరుగచెట్టుకును, కలుగ్రానుగచెట్టుకును, స్త్రీ. గోరోచనముకును, సుందరమైన స్త్రీకిని పేరు. |
| వ్యసనం త్వశుభే సక్తౌ | **వ్యసన**: న. ఇది దుఃఖముకును, ఆసక్తికిని, స |

| | |
|---|---|
| పాన స్త్రీ మృగయాదిషు ॥(92) | పానాది సప్తవ్యసనములకును, దైవము వలన |
| దైవానిష్టఫలే పాపే | సంభవించు కష్టముకును, పాపము కును, ఫలహీన |
| విపత్తౌ నిష్ఫలోద్యమే। | ప్రయత్నముకు పేరు. |
| ఉదానోऽప్యుదరావర్తే | **ఉదాన:** పు. ఇది నాభికిని, ఉదానవాయువుకును, |
| మరుత్సర్ప విశేషయోః॥ (93) | సర్పవిశేషముకును పేరు. |
| ఉద్ధాన ముద్గతే చుల్యాం | **ఉద్ధాన** : త్రి. ఇది బయలువెడలిన దానికిని, న. పొయికిని పేరు. |
| విలగ్నో లగ్న మధ్యయోః। | **విలగ్న** : త్రి. ఇది తగులుకొన్న దానికిని, నడుము కును పేరు. |
| సంధానం స్యాదభిషవే | **సంధాన** : న. ఇది పానకాలమందు పుచ్చుకొను |
| తథా సంఘటనేऽపి చ ॥(94) | సంజుడు మాంసముకును, కూర్చుటకును పేరు. |
| రాధనం రాధనే ప్రాప్తౌ | **రాధన:** న. ఇది పూజించుటకును, పొందుటకును, |
| రాధనం తోషణేऽపి చ। | సంతోషించుటకును పేరు. |
| సాధనం నిర్వృతౌ మేఢ్రే | **సాధన** : న. ఇది నాశముకును, శిశ్నముకును, |
| సైన్యే సిద్ధౌ గతౌ వధే ॥(95) | సైన్యముకును, సిద్ధికిని, నడచుటకును, చంపుట |
| ఉపాయే మృత సంస్కారే | కును, ఉపాయముకును, మరణించినవానికి జేయు |
| దాపనేऽ నుగమే ధనే। | దహనాదిక్రియలకును, సాధించుటకును, కూడా వెళ్ళుటకును, ధనముకును పేరు. |
| ప్రధానస్తు మహామా (త్యే) త్రే | **ప్రధాన** : పు. ముఖ్యునకును, న. మాయారూప |
| ప్రకృతౌ పరమాత్మని॥ | మగు నీశ్వరశక్తికిని, పరమాత్మకును, ప్రజ్ఞకును, |
| ప్రజ్ఞాయాం చ ప్రధానంస్యా | ఒక్కటియగుటకును, సజాతీయ శ్రేష్ఠునకును |
| దేకత్వేऽను షధోత్తమే। | పేరు. |
| గ్రామీణో గ్రామసంభూతే | **గ్రామీణ** : త్రి. ఇది గ్రామమందుపుట్టిన దానికిని, |
| గ్రామీణ శ్శునివాయసే॥ (97) | కుక్కకును, కాకికిని పేరు. |
| పాఠీనో మీనభేదే స్యా | **పాఠీన** : పు. ఇది వేయికోరలుగల మత్స్య విశేషము |
| త్పాఠకే గుగ్గులుద్రుమే। | కును, ఉపాధ్యాయునకును, గుగ్గిలపుచెట్టుకును పేరు. |
| కౌలీనం స్యాత్కు లీనత్వే | **కౌలీన** : న. ఇది సత్కుల ప్రసూనత్వముకును, |
| గుహ్యే జన్యే కుకర్మణి ॥(98) | మర్మాంగముకును, యుద్ధముకును, దుష్టకర్మ |

కౌశేయకే విహంగాది
పశూనాం సంగరేఽపి చ।

కును, పట్టుబట్టకును, పశు పక్ష్యాదుల యుద్ధము కును పేరు.

కౌపీనం స్యాదకార్యే స్యా
ద్గుహ్యే చీరప్రదేశయోః॥ (99)

**కౌపీన** : న. ఇది పాపకృత్యముకును, పురుష మర్మాంగముకును, గోచిగుడ్డకును పేరు.

విక్లిన్నో జరయా జీర్ణే
శీర్ణే చార్ద్రే చ వాచ్యవత్।

**విక్లిన్న** : త్రి. ఇది ముదిమిచేతశిథిలమైన దానికిని, చినిగిన దానికిని, తడిసిన దాని కిని పేరు.

ఆపన్న స్సవిపత్తౌ స్యా
త్ప్రాప్తే వాచ్యవదీరితః॥ (100)

**అపన్న** : త్రి. ఇది ఆపదతోగూడిన దాని కిని, పొందబడిన దానికిని పేరు.

విపన్నః కథితో నష్టే
విపన్నశ్చ భుజంగమే।

**విపన్న**: త్రి. ఇది నష్టమైనదానికిని, పు. పాముకును పేరు.

విచ్ఛిన్నం చ సమాలబ్ధే
విపన్నే కుటిలేఽన్యవత్ ॥(101)

**విచ్ఛిన్న** : త్రి. కుంకుమాదులమైపూతకును, ఆపదను బొందిన దానికిని, కుటిల మైన దానికిని పేరు.

సంపన్నం సాధితే ప్రోక్తం
సంపత్తిసహితేఽన్యవత్।

**సంపన్న**: త్రి. సాధించబడినదానికిని, సంపదలతో గూడుకొన్న వానికి పేరు.

తమోఘ్న స్సూర్యవహ్నీందు
బుద్ధ శంకర విష్ణుషు॥

**తమోఘ్న** : పు. ఇది సూర్యునకును, అగ్నికిని, చంద్రునకును, బుద్ధదేవునకును, శివునకును, విష్ణునకును పేరు.

విషఘ్నాఖ్యా శిరీషే స్యా
త్త్రివృతా మృతయోరపి।

**విషఘ్న** : పు. ఇది దిరిశెన చెట్టుకును, తెల్ల తెగడ కును, తిప్పతీగకు పేరు.

శిఖీ వహ్నౌ బలీవర్దే
శరే కేతుగ్రహే ద్రుమే॥
కేకి కుక్కుటయోశ్చాథ
శిఖీచూడాన్వితేఽన్యవత్।

**శిఖీ**: పు. ఇది అగ్నికిని, వృషభముకును, బాణము కును, కేతుగ్రహముకును, వృక్షముకును, నెమలి కిని, కోడికిని, త్రి. జుట్టుకల దానికిని పేరు.

శాఖీ స్యాత్పాదపే వేదే
తురుష్కాఖ్యజనేఽపి చ॥

**శాఖీ** : పు. ఇది వృక్షముకును, వేదముకును, తురకవానికిని పేరు.

ఖడ్గీ ఖడ్గాయుధే ఖడ్గే
శృంగీ నాగ ద్రుమా ద్రిషు।

**ఖడ్గీ**: పు. ఇది ఖడ్గాయుధముకును, ఖడ్గ మృగము కును పేరు. **శృంగీ** :పు. ఇది ఏనుగకును, చెట్టు కును, పర్వతముకును పేరు.

సాదీ తురంగ మాతంగ
రథారోహేషు కధ్యతే ॥(105)

**సాదీ :** పు. ఇది గుఱ్ఱపు రౌతుకును, మావటి వానికిని, రథము నడపు వానికిని పేరు.

పత్రీ శ్యేనే రథే కాండే
ఖగ ద్రు రథికా ద్రిషు।

**పత్రీ :** పు. ఇది డేగకును, రథముకును, బాణముకును, పక్షికిని, వృక్షముకును, రథికునకును, పర్వతమునకును పేరు.

వజ్రీ దశబలే శక్రే
వాజీ బాణా శ్వ పక్షిషు॥

**వజ్రీ :** పు. ఇది బుద్ధదేవునకును, ఇంద్రునకును పేరు.

**వాజీ :** పు. ఇది బాణముకును, గుఱ్ఱముకును, పక్షికిని పేరు.

చక్రీ కులాల వైకుంఠ
కోకా హి గ్రామజాలిషు।

**చక్రీ :** పు. ఇది కుమ్మరివానికిని, విష్ణువుకును, చక్రవాక పక్షికిని, సర్పముకును, అనేక గ్రామాధి పతికిని పేరు.

ధన్వీ ధనుర్ధరే పార్థే
విద్ధ్రే కకుభ ద్రుమే॥ (107)
కృతీ స్యాత్పండితేయోగ్యే
పాశీ పాశధరేఽప్పతౌ।

**ధన్వీ :** పు. ఇది ధనుస్సుపట్టిన వానికిని, అర్జునునకును, నేర్పరికిని, మద్దిచెట్టుకును పేరు.

**కృతీ :** పు. ఇది విద్వాంసునకును, సజ్జనునకును పేరు.

**పాశీ :** పు. ఇది పాశమును ధరించిన వానికిని, వరుణదేవునకును పేరు.

నందీ హరప్రతీహారే
గర్దభాండే వటద్రుమే ॥(108)
నందినీ తు ననందాయాం
ధేన్వాం సురసరిత్యపి।
రోహీ రోహితకేఽశ్వత్థ
వటపాదపయోరపి ॥(109)
హలీ బలే కృషీకే స్యా

**నందీ :** పు. ఇది నందికేశ్వరునకును, కలజువ్వి చెట్టుకును, మఱ్ఱిచెట్టుకును పేరు.

**నందినీ :** స్త్రీ. ఇది ఆడుబిడ్డకును, నందినీ ధేనువుకును, ఆకాశగంగకును పేరు.

**రోహీ :** పు. ములుమోదుగచెట్టుకును, రావిచెట్టుకును, మఱ్ఱిచెట్టుకును పేరు.

**హలీ :** పు. ఇది బలరామునకును, వ్యవసాయదారునకును పేరు.

-దళీ వృశ్చిక భృంగయోః।
వర్ణీ స్యాల్లేఖకే చిత్రక
రే స్యాద్బ్రహ్మచారిణి ॥(110)
శిల్పీ తు వాచ్యవత్కా రౌ

**అళీ :** పు. తేలుకును, తుమ్మెదకును పేరు.

**వర్ణీ :** పు. వ్రాతగానికిని, చిత్తరువులు వ్రాయువానికిని, బ్రహ్మచారికిని పేరు.

**శిల్పీ :** పు. ఇది వజ్రము మొదలగు పనులు చేయు

నగ్నికాయాం చ శిల్పినీ।
కామీ స్యాత్కాముకేచక్ర
వాకే పారావతేऽపి చ॥
గోమీ చోపాసకే ఫేరౌ
వాగ్మీ వాచస్పతౌ పటౌ
చర్మీఫలకపాణౌ స్యా
ద్భూర్జే భృంగరిటావపి॥ (112)
అర్థీ స్యాద్యాచకే (యక్షే)ऽపి స్యా
త్సేవకే చ వివాదిని
స్వామీ ప్రభౌ విశాఖే చ
రాగీరక్తే చ కాముకే॥ (113)

వానికిని, స్త్రీ. సమర్త్తాడని పడుచుకును పేరు.

**కామీ :** పు. ఇది విటునకును, చక్రవాక పక్షికిని, పావురముకును పేరు.

**గోమీ :** పు. ఇది ఉపాసకునకును, నక్కకును పేరు.

**వాగ్మీ :** పు. ఇది బృహస్పతికిని, సమర్థునకును పేరు.

**చర్మీ :** పు. ఇది డాలుపట్టిన వానికిని, భుజిపత్రి చెట్టుకును, భృంగరిటియను శివ ద్వారపాలునకును పేరు.

**అర్థీ:** పు. ఇది యాచకునకును, సేవించు వానికిని, వివాదను బొందిన వానికిని పేరు.

**స్వామీ :** పు. ఇది ప్రభువుకును, కుమార స్వామికిని పేరు.

**రాగీ :** పు. ఇది అనురాగముగల వానికిని; విటునకును పేరు.

ధ్వజీ శైలే రథే విప్రే
భుజంగమ తురంగయోః।
భోగీ భుజంగమే రాజ్ఞి
గ్రామిణ్యాం నాపితేऽపి చ॥
విహాయ మహిషీం చాన్య
రాజయోషితి భోగినీ।

**ధ్వజీ :** పు. ఇది పర్వతముకును, రథముకును, బ్రాహ్మణునకును, సర్పముకును, అశ్వముకును పేరు.

**భోగీ:** పు. ఇదిసర్పముకును; రాజుకును, నీలిచెట్టుకును, మంగలి వానికిని పేరు.

**భోగినీ:** స్త్రీ. ఇది రాణి గాక రాజుయొక్క భోగార్థమైన స్త్రీకిని పేరు.

ద్యువా త్వభినవే భానౌ
ప్రేత్వా మరుతి
(పారకే) వా సవే॥ (115)
రాజా ప్రభౌ నృపే చంద్రే
యక్షే క్షత్రియ శక్రయోః।

**ద్యువా :** పు. ఇది లేత సూర్యుని పేరు.

**ప్రేత్వా :** పు. ఇది వాయువుకును, ఇంద్రునకును పేరు.

**రాజా :** పు. ప్రభువుకును, రాజుకును, చంద్రునకును, యక్షునకును, రెండవజాతివానికిని, ఇంద్రునకును పేరు.

అధ్వా వర్త్మని సంస్థానే
స్యాదవస్కంద కాలయోః॥

**అధ్వా:** పు. ఇది త్రోవకును, పురమునకు వెలుపలి ప్రదేశముకును, శిబిరముకును, కాలముకును పేరు.

| | |
|---|---|
| ధన్వా జాంగలదేశే స్యా<br>ద్ధన్వ చాపే స్థలేఽపి చ। | **ధన్వా**: పు. ఇది మైదానముకును, న. ధనస్సుకును, ప్రదేశముకును పేరు. |
| ఆత్మా దేహ మనో బ్రహ్మ<br>స్వభావ ధృతి బుద్ధిషు॥(117)<br>ప్రయత్నే చాప్యథ | **ఆత్మా** : పు. ఇది శరీరముకును, మనస్సుకును, పరబ్రహ్మకును, స్వభావముకును, ధైర్యముకును, బుద్ధికిని, ప్రయత్నముకును పేరు. |
| గ్రావా ప్రస్తరే జలదే గిరౌ। | **గ్రావా**: పు. ఇది రాతికిని, మబ్బుకును, పర్వతముకును పేరు. |
| బ్రహ్మో విరించ ద్విజయో<br>రృత్విక్షుంద్రార్క- యోగయోః॥(118) | **బ్రహ్మో** : పు. ఇది బ్రహ్మకును, బ్రాహ్మణునకును, ఆచార్యునకును, పంచాంగయోగ విశేషముకును పేరు. |
| బ్రహ్మ ప్రోక్తం తపోఽధ్యాత్మ<br>వేద జ్ఞానేషు సూరిభిః। | **బ్రహ్మ**: న. తపస్సుకును, పరమాత్మకును, వేదముకును, బ్రహ్మజ్ఞానముకును పేరు. |
| అర్వా చ కుత్సితే వాహే | **అర్వా**: త్రి. ఇది కుత్సితునకును, పు. అశ్వముకును పేరు. |
| వృషా కర్ణ మహేంద్రయోః॥ | **వృషా**: పు. ఇది కర్ణునకును, ఇంద్రునకును పేరు. |
| యువా స్యాత్తరుణే శ్రేష్ఠే<br>నిసర్గ బలశాలిని। | **యువా**: త్రి. ఇది యౌవనవంతునకును, శ్రేష్ఠమైనదానికిని, స్వతస్సిద్ధమైన బలము గలవానికిని పేరు. |
| పర్వ స్యాదుత్సవే గ్రంథౌ<br>ప్రస్తావే లక్షణాంతరే॥(120)<br>దర్శప్రతిపదో స్సంధౌ<br>విషువత్ప్రభృతిష్వపి। | **పర్వ** : న. ఇది ఉత్సవముకును, కణుపునకును, సమయముకును, లక్షణ విశేషముకును, అమావాస్య ప్రతిపత్తుల సంధికాలముకును, సంక్రమణ విషువదాది పుణ్యకాలములకును పేరు. |
| భర్మ స్వర్ణే భృతౌ భారే<br>చర్మ స్యాద్వల్కల త్వచోః॥ | **భర్మ** : న. ఇది బంగారుకును, కూలికిని, బరువుకును పేరు. **చర్మ**: న. ఇది నారపట్టుకును, త్వగింద్రియముకును పేరు. |
| కర్మవ్యాప్యే క్రియాయాంచ | **కర్మ** : న. ఇది సాధనము (లేక కర్తకర్మక్రియల యందలి రెండవది) క్రియకును పేరు. |
| వర్త్మ నేత్ర ఛదా ధ్వనోః॥ | **వర్త్మ** : న. ఇది కనురెప్పకును, మార్గముకును పేరు. |
| వర్ష్మ దేహే ప్రమాణాతి<br>సుందరాకారయో రపి॥ | **వర్ష్మ**: న. ఇది శరీరముకును, పరిమితికిని, మిక్కిలి సుందరమగు నాకారముకును పేరు. |
| సద్మ స్యాన్మందిరే నీరే | **సద్మ**: న. ఇది గృహముకును, జలముకును పేరు. |

ఛద్మశాఠ్యా పదేశయోః।
ధామ దేహే గృహే రశ్మౌ
స్థానే జన్మ ప్రభావయోః॥

**ఛద్మ** : న. ఇది కుటిలత్వముకును, మిషకును పేరు.
**ధామ** : న. ఇది శరీరముకును, గృహముకును, కిరణముకును, స్థానముకును, పుట్టుగకును, ప్రభావముకును పేరు.

ప్రేమ నర్మణి చ స్నేహే
వ్యోమ వారి విహాయసోః।
పక్ష్మసూత్రాది సూక్ష్మాంశే
కింజల్కే నేత్రలోమని॥
లక్ష్మచిహ్నే ప్రధానే స్యా
దశనిః పవివిద్యుతోః।

**ప్రేమ**: న. ఇదిపరిహాసముకును, స్నేహముకును పేరు.
**వ్యోమ** : న. ఇది జలముకును, ఆకాశము కును పేరు.
**పక్ష్మ**: న. ఇది ధారము మొదలయిన వాటి యేచకు ను, పుష్ప కేసరముకును, రెప్పల వెంట్రుకలకును పేరు.
**లక్ష్మ**: న. ఇది గురుతుకును, ముఖ్యముకును పేరు.
**అశని** : పు. ఇది వజ్రాయుధముకును, మెరుపుకును పేరు.

అరత్నిః కఫణౌ హస్తే
నప్రకోష్ఠతతాంగళౌ॥ (125)
సేనానీః కార్తికేయే స్యా
త్తథా సేనాపతావపి।
హ్రాదినీ వజ్రతటితోః

**అరత్ని** : పు. మోచేతికిని, మూరకును, లొడితెడు ప్రమాణముకును పేరు.
**సేనానీ** : పు. ఇది కుమారస్వామికిని, సేనానాయకునకును పేరు.
**హ్రాదినీ**: స్త్రీ. ఇది వజ్రాయుధముకును, మెరుపునకును పేరు.

కామినీ భరువందయోః॥
వాహినీ స్యాత్తరంగిణ్యాం
సేనా సైన్యప్రభేదయోః।
వర్తనీ తర్కుపిండే స్యా
ద్వర్తనీ మలినే పథి॥ (127)

**కామినీ** : స్త్రీ. స్త్రీకిని, బదనికెకును పేరు.
**వాహినీ** : స్త్రీ. ఇది నదికిని, సేనకును, సేనావిశేషముకును పేరు.
**వర్తనీ** : స్త్రీ. ఇది నూలువడుకు రాట్నమందలి మట్టి ముద్దకును, త్రి. మలినమైన దానికిని స్త్రీ. మార్గముకును పేరు.

బోధనీ బోధ పిప్పల్యో
ర్బోధనం గంధబోధనే।
వాణినీ నర్తకే మత్త
విదగ్ధవనితాసు చ॥ (128)
రజనీ నీలికా లాక్షా

**బోధనీ** : స్త్రీ. ఇది తెలియుటకును, పిప్పలి చెట్టుకును, న. పరిమళింపజేయుటకును పేరు.
**వాణినీ** : స్త్రీ. ఇది నాట్య స్త్రీకిని, మదించిన స్త్రీకిని, ప్రౌఢ స్త్రీకిని పేరు.
**రజనీ** : స్త్రీ. ఇది నీలిచెట్టుకును, లక్క కును,

హరిద్రాయామినీషు చ।
నళినీ పద్మినీ పద్మ
వ్యోమసింధు సరోవరే॥ (129)
నళికాయాం చ నళినీ
నళినం కమలే జలే।
మాలినీ వృత్తభేదే స్యా
న్మాలాకార స్త్రియామపి॥
చంపానగర్యాం గౌర్యాంచ
మందాకిన్యాం చ మాలినీ।
శంఖినీ శ్వేతపున్నాగే
చౌరపుష్ప్యాం వధూభిది॥ (131)
పద్మినీ స్త్రీవిశేషే స్యా
త్పరస్యామంబుజేఽపి చ।
హస్తినీ గజయోషాయాం
నారీ భేదే చ హస్తినీ॥ (132)
సంధినీ తు వృషాక్రాంతా
కాలదుగ్ధగవో స్స్మృతా।

భట్టినీ ద్విజభార్యాయాం
నాట్యోక్తౌ రాజయోషితి॥

రేచనీ త్రివృతా దంతీ
గుడరోచనికాసు చ।
అర్శోఘ్నీ తాళమూల్యాంస్యా
దర్శోఘ్ను స్సూరణేఽపి చ॥(134)
శతఘ్నీ శస్త్రభేదే స్యా
ద్వృశ్చికాళ్యాం కరంజకే।
అసిక్నీ స్యాదవృద్ధాంతః

పసపునకును, రాత్రికిని పేరు.

**నళినీ :** స్త్రీ. ఇది పద్మసమూహముకును, ప సామాన్యముకును, ఆకాశగంగకును, పద్మసరస కును, లతావిశేషముకును పేరు.

**నళిన:** న.-ఇది పద్మముకును, ఉదకముకును పేర

**మాలినీ :** స్త్రీ. ఇది మాలినీ వృత్తముకును, పూ దండలగుచ్చెడు స్త్రీకిని, చంపా పట్టణముకు పార్వతికిని, ఆకాశగంగకును పేరు.

**శంఖినీ :** స్త్రీ. వెలిపొన్న చెట్టుకును, కట్లె చెట్టు కును, శంఖినీ జాతి స్త్రీకిని పేరు.

**పద్మినీ :** స్త్రీ. ఇది పద్మినీజాతి స్త్రీకిని పద్మ సరస్సు కును, పద్మముకును పేరు.

**హస్తినీ :** స్త్రీ. ఇది ఆడుయేనుగకును, హస్తినీజాతి స్త్రీకిని పేరు.

**సంధినీ :** స్త్రీ. ఇది వెదగొనుటచేత వృషభముచేత నెక్కబడిన గోవుకును, అకాలమందు పాలిచ్చు యావుకును పేరు.

**భట్టినీ :** స్త్రీ. ఇది బ్రాహ్మణుని భార్యకును, నాట్య భాషయందు, పట్టపుదేవి గాక ఇతరమైన రాజభార్య కును పేరు.

**రేచనీ :** స్త్రీ. ఇది తెల్ల తెగడకును, నాగదంతి చెట్టు కును, కంపిల్లమనెడి గంధ ద్రవ్యముకును పేరు.

**అర్శోఘ్నీ :** స్త్రీ. ఇది తేగకును, పు. కందదుంపకును పేరు

**శతఘ్నీ :** స్త్రీ. ఇది ఫిరంగికిని, తేలుమణిచెట్టుకును, కానుగ చెట్టుకును పేరు.

**అసిక్నీ :** స్త్రీ. ఇది అంతఃపురపరిచారికయగు యావన

| | |
|---|---|
| పుర(ప్రేష్య స్త్రియాం ధునౌ॥ | స్త్రీకిని, నదికిని పేరు. |
| సూచనా వ్యధనే దృష్టౌ | **సూచనా :** స్త్రీ. ఇది బాధించుటకును, చూపునటను, |
| గంధనేऽభినయేऽపి చ। | కొండెములు చెప్పుటకును, అభినయముకును పేరు. |
| భావనా లేపనే ధ్యానే | **భావనా :** స్త్రీ. ఇది పూతకును, ధ్యానించుటకును పేరు. |
| వేదనా జ్ఞానదుఃఖయోః॥ | **వేదనా :** స్త్రీ. ఇది జ్ఞానముకును, దుఃఖము కును పేరు. |
| కుహనా దంభచర్యాయా | **కుహనా :** స్త్రీ. ఇది దంభాచారముకును, పు. |
| మీర్ష్యాళౌ కుహనః పునః। | అసూయా స్వభావము గలవానికిని పేరు. |
| పూతనా రాక్షసీభేదే | **పూతనా :** స్త్రీ. ఇది పూతనయనురక్కసి కిని, |
| హరీతక్యాం చ పూతనా॥ (137) | కరకచెట్టుకును పేరు. |
| చేతనా సంవిదిప్రోక్తా | **చేతనా :** స్త్రీ. ఇది బుద్ధికిని, త్రి. ప్రాణము గల |
| వాచ్యవత్ప్రాణిని స్మృతా। | దానికిని పేరు. |
| ప్రసన్నా మదిరాయాం స్యా | **ప్రసన్నా :** స్త్రీ. ఇది కల్లుకును, త్రి. నిర్మల మైన |
| త్ప్రసాదసహితేऽన్యవత్॥ | దానికిని పేరు. |
| లలనా నాడికాభేదే | **లలనా :** స్త్రీ. నరములలోని భేదముకును, |
| జిహ్వాయాం వరయోషితి। | నాలుకకును, ఉత్తమ స్త్రీకిని పేరు. |
| శ్లేష్మఘ్నీ కధితా మల్యాం | **శ్లేష్మఘ్నీ :** ఇది మల్లిచెట్టుకును, కంపిల్లమను |
| కంపిల్లక ఫణిజ్జయోః॥ (139) | గంధద్రవ్యముకును, నల్లగగ్గెర చెట్టుకును పేరు. |

★ అథ నాంత శ్చతుర్వర్ణః ★

| | |
|---|---|
| మహాధనం మహామూల్యే | **మహాధన :** త్రి. గొప్ప విలువగల దానికిని, న. |
| సువస్త్రే సిల్హకేऽపి చ। | విలువ గల వస్త్రముకును, అందుగ బంకతో చేసిన |
| | ధూపద్రవ్యముకును పేరు. |
| తపోధన స్తాపసే స్యాన్ముం | **తపోధన :** పు. ఇది మునీశ్వరునకును, స్త్రీ. చిర్రి |
| డీర్యాం చ తపోధనా॥ | కూరకును పేరు. |
| ఆరాధనం తోషణే స్యా | **ఆరాధన :** న. ఇది సంతోషించుటకును, పొందుట |
| త్ప్రాప్తౌ చ పచనేऽపి చ। | కును, పరిపక్వముకును పేరు. |
| ఉపధానం విషేऽపి స్యా | **ఉపధాన :** న. ఇది విషముకును, తలగడాకును, |
| ద్గేండుకే ప్రణయేऽపి చ॥ | ప్రేమకును పేరు. |
| ప్రణిధానం ప్రయత్నే స్యా | **ప్రణిధాన :** న. ఇది ప్రయత్నముకును, ప్రవేశించుట |

త్రువేశే చ సమాహితౌ।

కును, కూడుకొనుటకును పేరు.

ఆయోధనం వధే యుద్ధే

**ఆయోధన:** న. ఇది చంపుటకును, యుద్ధముకును పేరు.

ఽవలగ్నో మధ్యలగ్నయోః॥

**అవలగ్న:** పు. ఇది నడుముకును, త్రి. తగులుకొన్న దానికిని పేరు.

అభిజనః కులే ఖ్యాతౌ
జన్మభూమ్యాం కులధ్వజే।

**అభిజన:** పు. ఇది వంశముకును, ఖ్యాతికిని. పుట్టిన దేశముకును, వంశపరంపరగా వచ్చుచున్న చిహ్నముకును పేరు.

భవేత్పుణ్యజనో యక్షే
రాక్షసే సజ్జనేఽపి చ॥

**పుణ్యజన:** పు. ఇది యక్షునకును, రాక్షసునకును, సజ్జనునకును పేరు.

విసర్జనం పరిత్యాగే
దానే సంప్రేషణేఽపి చ।

**విసర్జన:** న. ఇది విడచుటకును, ఈవికిని, పంపించుటకును పేరు.

పృథగ్జనస్స్మృతో నీచే
మూర్ఖే చాథ

**పృథగ్జన :** పు. ఇది నీచునకును, మూఢునకును పేరు.

ప్రయోజనం॥కార్య హేత్వో

**ప్రయోజన :** న. ఇది కార్యముకును, కారణముకును పేరు.

ర్నిధువనం సురతే
కంప నేఽపి చ।

**నిధువన:** న. ఇది సురతముకును, చలించుటకును పేరు.

అనూచానో వినీతే స్యా
త్సాంగ వేదవిచక్షణే॥ (145)

**అనూచాన :** పు. ఇది వినయముగల వానికిని, సాంగవేదాధ్యయనము చేసినవానికిని పేరు.

అవాచీన మవాగర్థే
విపర్యస్తే చ వాచ్యవత్।

**అవాచీన :** త్రి. తలవంచుకొన్నదానికిని, వ్యత్యస్తమైన దానికిని పేరు.

ప్రవచనం స్మృతం వేదే
ప్రకృష్టవచనేఽపి చ॥ (146)

**ప్రవచన :** న. ఇది వేదముకును, గొప్ప వాక్యముకును పేరు.

వైరోచనస్తు సుగతే
బలిదైత్యార్క-పుత్రయోః।

**వైరోచన :** పు. ఇది బుద్ధదేవునకును, బలిచక్రవర్తికిని, సూర్యుని పుత్రునకును పేరు.

విరోచనోఽర్కే దహనే
చంద్రే ప్రహ్లాదనందనే॥

**విరోచన :** పు. ఇది సూర్యునకును, అగ్నికిని, చంద్రునకును, ప్రహ్లాదుని కుమారునికిని పేరు.

ఆతంచనం ప్రతీవాప

**ఆతంచన :** న. ఇది తోడు పెట్టుటకును, వేగము

| | |
|---|---|
| జవనా ప్యాయనేషు చ। | కును, తృప్తిపొందుటకును పేరు. |
| అభిపన్నో ऽ పరార్ధే భి<br>ద్రుతే గ్రస్తే విపద్గతే॥ (147) | **అభిపన్న :** త్రి. ఇది అపరాధము చేసినవానికిని, తరుమబడినవానికిని, శత్రువుచే నాక్రమించబడిన వానికిని, ఆపత్తును బొందిన వానికిని పేరు. |
| అతిపన్న స్స్మృతో ధీరై<br>ర్విజ్ఞాతే ऽ ంగీకృతే ऽ పిచ। | **అతిపన్న :** త్రి. ఇదితెలియబడినదానికిని, అంగీకరించబడినదానికిని పేరు. |
| సమాపన్నం సమాప్తే స్యా<br>త్ప్రాప్తేక్లిష్టే వధే ऽ పి చ॥ | **సమాపన్న :** త్రి. ఇది సమాప్తిపొందించబడిన దానికిని, పొందబడినదానికిని, క్లేశపెట్టబడిన దానికిని, వధకును పేరు. |
| భవే ప్రజననం యోనౌ<br>జన్మని ప్రగమే ऽ పి చ। | **ప్రజనన :** న. ఇది భగముకును, పుట్టుగకును, శీఘ్రగమనముకును పేరు. |
| ఆకలనం నిబంధే స్యా<br>దాకాంక్షా పరిసంఖ్యయోః॥ | **ఆకలన :** న. కట్టుటకును, పదప్రశ్నకును, లెక్కపెట్టుటకును పేరు. |
| సంమూర్ఛన మభివ్యాప్తౌ<br>సంమూర్ఛా మోహయోరపి। | **సంమూర్ఛన :** న. అంతటా వ్యాపించుటకును, మూర్ఛిల్లుటకును, మోహమును బొందుటకును పేరు. |
| నిర్యాతనం వైరశుద్ధౌ<br>దానేన్యాసార్పణేమతౌ॥(151) | **నిర్యాతన :** న. ఇది పగదీర్చుకొనుటకును, ఈవికిని, దాచినధనమును మరలనిచ్చుటకును, బుద్ధికిని పేరు. |
| కపీతనం గర్దభాండ<br>శిరీషే మ్రాతకే ऽ పి చ।<br>అశ్వత్థే చ | **కపీతన :** న. ఇది కలజువ్విచెట్టుకును, దిరిశెన చెట్టుకును, అంబాళవృక్షముకును, రావిచెట్టుకును పేరు. |
| సముత్థాన ముద్యమే<br>రోగన్నిర్ణయే॥ (152) | **సముత్థాన :** న. ఇది ప్రయత్నముకును, వ్యాధిని నిశ్చయించుటకును పేరు. |
| ఆచ్ఛాదనం సంపిధా నే<br>స్మృతం వస్త్రే ప్రవారణే। | **ఆచ్ఛాదన :** న. ఇది కప్పుటకును, వస్త్రముకును, నిషేధించుటకును పేరు. |
| రాజాదనం క్షీరికాయాం<br>ప్రియాళౌ కింశుకే ऽ పి చ॥ | **రాజాదన:** న. పాలచెట్టుకును, మొరళిచెట్టుకును, మోదుగచెట్టుకును పేరు. |
| క్రౌంచాదనస్తు పిప్పల్యాం<br>చించోటక మృణాళయోః। | **క్రౌంచాదన :** పు. ఇది రావిచెట్టుకును, తృణవిశేషముకును, తామరతూడుకును పేరు. |

ఉత్పాదనం సముల్లేఖో
ద్వాహనోద్వర్తనేషు చ॥
వృక్షాదన శ్చలదళే మధు
(క్షుద్ర) చ్ఛత్రకుఠారయోః
వృక్షాదనీ స్మృతా వందా
విదారీగంధయోరపి॥(155)

**ఉత్పాదన** : పు. ఇది ఎత్తిపొడుపు మాటకును, వివాహముకును, ఎగురుటకును పేరు.

**వృక్షాదన** : పు. ఇది రావిచెట్టుకును, తేనె పట్టుకును, గండ్రగొడ్డలికిని, ఈ. స్త్రీ. బదనికెకును, ముయ్యాకుపొన్న చెట్టుకును పేరు.

సదాదానోఽభ్ర మాతంగే
హేరంబే గంధహస్తిని।
అ(ప)వదానం చేతి వృత్త
కర్మఖండనయోరపి॥(156)

**సదాదాన**: పు. ఇది ఐరావతముకును, విఘ్నేశ్వరునకును, మదపుటేనుగకును పేరు.

**అవదాన**: న. ఇది పూర్వమందు గతించిన పరిశుద్ధ వ్యాపారముకును, ఖండించుటకును పేరు.

కుచందనం చ పత్రాంగే
ద్రుభేదే రక్తచందనే।
ఆస్కందనం తిరస్కారే
రణే సంశోషణేఽపి చ॥

**కుచందన** : న. ఇది రక్తచందనసదృశమగు కాష్ఠవిశేషముకును, వృక్షవిశేషముకును, రక్తచందనముకును పేరు.

**ఆస్కందన**: న. ఇది తిరస్కరించుటకును, యుద్ధముకును, తపింపజేయుటకును పేరు.

సంవననం సమాలోచే
వశీకారే ప్రకీర్తితం।
విహేడనం చ హింసాయాం
మర్దనే చ విడంబనే॥(158)

**సంవనన** : న. ఆలోచించుటకును, స్వాధీనము చేసుకొనుటకును పేరు.

**విహేడన** : న. ఇది హింసించుటకును, కొట్టుటకును, పరిహాసముచేయుటకును పేరు.

జలాటనో లోహపృష్ఠే
జలూకాయాం జలాటనీ।
ప్రస్ఫోటనం భవేత్సూర్పే
తాడనే చ ప్రకాశనే॥(159)

**జలాటన** : పు. ఇది రాబులుగుకును, ఈ. స్త్రీ. జలగకును పేరు.

**ప్రస్ఫోటన** : న. ఇది చేటకును, కొట్టుటకును, ప్రకాశించుటకును పేరు.

ఉత్పతనం సముత్పత్తౌ
తథోర్ధ్వగమనేఽపి చ।
ఉద్వర్తనం చోత్పతనే
స్పష్టే ప్యుత్తాపితేఽపనే॥(160)

**ఉత్పతన** : న. ఇది పుట్టుగకును, ఎగురుటకును పేరు.

**ఉద్వర్తన**: న. ఇది ఎగురుటకును, దొరలుటకును, నలుగుపిండికిని పేరు.

సమాదానం సమీచీన
గ్రహణే నిత్యకర్మణి।

**సమాదాన** : న. ఇది లెస్సగా గ్రహించుటకును, నిత్యకర్మకును పేరు.

| | |
|---|---|
| సంయమనీ వ్రతే పుర్యాం<br>సంయమనీ యమస్య చ॥ | **సంయమనీ :** స్త్రీ. ఇది వ్రతముకును, యముని పట్టణముకును పేరు. |
| నిశమనం శ్రుతౌ ద్రష్టౌ | **నిశమన :** న. ఇది వినుటకును, చూచుటకును పేరు. |
| దృష్ట్యాలోచే నిశామనం। | **నిశామన :** న. ఇది చూచుటకును, ఆలోచించుటకును పేరు. |
| ప్రతిమానం ప్రతిచ్ఛాయా<br>గజదంతాంతరాళయోః॥ | **ప్రతిమాన :** న. ఇది ప్రతిబింబముకును, ఏనుగ రెండుదంతముల నడిమి భాగముకును పేరు. |
| అభిమానస్స్మృతో జ్ఞానే<br>గర్వే ప్రణయ హింసయోః। | **అభిమాన :** పు. జ్ఞానముకును, గర్వముకును, ప్రేమకును, హింసకును పేరు. |
| అధిష్ఠానం పురే చక్రే<br>ప్రభావేऽ ధ్యాసనేऽ పి చ॥ | **అధిష్ఠాన :** న. ఇది పట్టణముకును, బండి చక్రముకును, ప్రభావముకును, ఆక్రమించుటకును పేరు. |
| వర్ధమానః ప్రశ్నభేదే<br>శరావైరండవిష్ణుషు। | **వర్ధమాన :** పు. ఇది అభినయమందలి ప్రశ్నవిశేషముకును, మూకుడుకును, ఆముదపుచెట్టుకును, విష్ణువుకును పేరు. |
| మాలుధాన శ్చిత్రసర్పే<br>మాలుధానీ లతాంతరే॥ (164) | **మాలుధాన :** పు. ఇది ముత్రబాముకును, ఈ. స్త్రీ. లతావిశేషముకును పేరు. |
| ప్రతియత్నస్తు సంస్కార<br>లిప్సోపగ్రహణేషు చ। | **ప్రతియత్న :** పు. ఇది గుణాతిశయమును గలిగించుటకును, అభిలాషకును, చెరపెట్టుటకును పేరు. |
| భవేదుదయనో వత్స<br>రాజేగస్త్యమునావపి ॥(165) | **ఉదయన :** పు. ఇది వత్సరాజుకును, అగస్త్యమహామునికిని పేరు. |
| విహననం విఘాతే స్యా<br>త్పింజనే తూలధూననే। | **విహనన :** న. ఇది విఘ్నముకును, విల్లువలె నుండు దూదినేకు సాధనముకును, దూదేకుటకును పేరు. |
| సంవాహనం వాహనేऽ పి<br>భారాదే రంగమర్ద నే॥ | **సంవాహన :** న. ఇది బరువు మోయుటకును, శరీరమును మర్దించుటకును పేరు. |
| ఉద్వాహనం ద్విసీత్యేస్యా<br>ద్రజ్వా ముద్వాహినీమతా। | **ఉద్వాహన :** న. ఇదిరెండుసార్లుదున్నినభూమికిని, ఈ. స్త్రీ. త్రాటికిని పేరు. |
| మహాసేనో విశాఖే స్యా<br>న్మహా సైన్యపతావపి॥ (167) | **మహాసేన :** పు. ఇది కుమారస్వామికిని, గొప్ప సేనానాయకునకును పేరు. |

రసాయనం విడంగే స్యా
జ్జరావ్యాధిజితౌషధే।
రసాయణః పక్షి రాజే
విషేఽపిచ రసాయనం॥(168)

**రసాయన:** న. ఇది వాయువిడంగముకును, క్షయ రోగమును హరించు ఔషధముకును, పు. గరుత్మంతునకును, న. గరళముకును పేరు.

కాత్యాయనో వరరుచౌ
గౌర్యాం కాత్యాయనీ మతా
కాషాయవస్త్రవిధవార్ధ
జరత్యా మపీష్యతే॥ (169)

**కాత్యాయన :** పు. ఇది మునిత్రయమందలి కాత్యాయన నామాంతరము గల వరరుచికిని, ఈ. స్త్రీ. పార్వతికిని, సగము వయసు గతించి కాషాయ వస్త్రములు ధరించిన విధవకును పేరు.

సుదర్శనో హరేశ్చక్రేఽ
మరావత్యాం సుదర్శనా।
ఆజ్ఞాయా మోషధీభేదే
మేరుజంబ్వాం సుదర్శనా॥(170)

**సుదర్శన :** పు. ఇది విష్ణుచక్రముకును, స్త్రీ. స్వర్గపట్టణముకును, ఆజ్ఞకును, ఓషధివిశేషముకును, జంబూద్వీపసంజ్ఞాహేతుభూతమగు మేరుపర్వతమందలి నేరేడు చెట్టుకును పేరు.

నిర్భృత్సనం ఖలీ కారేఽ
లక్తకే చ సమాపనం।

**నిర్భర్త్సన:** న. అపకారముకును, లత్తుకకును పేరు.

పరిచ్ఛేదే సమాప్తౌచ
సమాధానే ప్రమాపణే॥(171)

**సమాపన:** న. ఇది గ్రంథవిచ్ఛేదముకును, ముగియుటకును, అంగీకారముకును, చంపుటకును పేరు.

అన్వాసనం స్నేహ వస్తా
వుపాస్తా వనుశోచనే।

**అన్వాసన :** న. ఇది చమురుగల వస్తువుకును, సేవించుటకును, దుఃఖించుటకును పేరు.

ఉపాసనం శరాభ్యాసే
శుశ్రూషాయాం చ హింసనే॥

**ఉపాసన :** న. ఇది ధనుర్విద్యాభ్యాసముకును, శుశ్రూషకును, హింసించుటకును పేరు.

నిరసనం నిరాసే స్యా
ద్వధే నిష్ఠీవనేఽపి చ।

**నిరసన :** న. ఇది తిరస్కరించుటకును, చంపుటకును, ఉమియుటకును పేరు.

నిర్వాసనం హింసనే చ
నగరాధే ర్బహిష్కృతౌ॥ (173)

**నిర్వాసన :** న. ఇది చంపుటకును, పురము నుండి వెడలు గొట్టుటకును పేరు.

ఆవేశనం శిల్పిగృహే
భూతావేశ ప్రవేశయోః।

**ఆవేశన:** న. ఇది కంసాలిమొదలగువారు పనిచేయు శాలకును, గ్రహము సోకుటకును, ప్రవేశించుటకును పేరు.

సారసనం మేఖలాయా

**సారసన :** న. ఇది మగువల మొలనూలుకును,

మురస్త్రేచ తనుత్రిణాం॥(174)

కవచాదులయొక్క దార్ఢ్యార్థము భటులు మొల నుంచుకొను పటకాకును పేరు.

ప్రహసనం భవేర్భంగే
ప్రహాసాక్షే పయోరపి।

**ప్రహసన** : న. ఇది భంగముకును, అధికమైన నవ్వుకును, ఆక్షేపించుటకును పేరు.

వరాసనం వాస్పదనే (సుచాప)
షిద్గక ద్వారపాలయోః॥

**వరాసన**: న. ఇది జలాధారప్రదేశముకును, విటగానికిని, ద్వారపాలునకును పేరు

ఘనాఘనో ఘాతుకమ
త్తదంతినో ర్నిరంతరే
వాసవవర్షు కాబ్దయోః।

**ఘనాఘన** : పు. ఇది దుష్టునకును, మదపుటేనుగకును, దట్టునకును, ఇంద్రునకును, వర్షించుమేఘముకును పేరు.

సనాతన శ్శాశ్వతకం
స్వైరిణో శ్శివే పిత్ర్యా
ణా మతిథౌ సునిశ్చలే॥ (176)

**సనాతన** : త్రి. ఇది నాశము లేనిదానికిని, పు. విష్ణువుకును, శివునకును, పితృదేవతల అతిథికిని, త్రి. నిశ్చలమైనదానికిని పేరు.

శరాసనం తు కోదండే
జలస్థాన నిషంగయోః।

**శరాసన** : న. ఇది ధనస్సుకును, జలప్రదేశముకును, అమ్ములపొదికిని పేరు.

సుయామునో వత్సరాజే
ప్రసాదేఽభ్రాంతరేఽచ్యుతే॥

**సుయామున** : పు. ఇది వత్సరాజుకును, ప్రసాదముకును, మేఘవిశేషముకును, విష్ణువుకును పేరు.

విస్మాపనాఖ్యా కుహకే
గంధర్వనగరేఽచ్యుతే।

**విస్మాపన**: పు. కుత్సితునకును, గంధర్వుల పట్టణముకును, విష్ణువుకును పేరు.

సుకర్మాగ్రహయోగే స్యా
త్సుకర్మా దేవశిల్పిని॥(178)

**సుకర్మా** : పు. ఇది పంచాంగ యోగభేదముకును, దేవతల శిల్పికిని పేరు.

దుర్నామాఖ్యాఽపి గుదజ
దీర్ఘకోశికయోరపి।

**దుర్నామా** : పు. ఇది మూలశంక రోగముకును, ఏనుగ జలగకును పేరు.

ద్విజన్మాదశనే విప్రే

**ద్విజన్మా** : పు. ఇది దంతముకును, బ్రాహ్మణునకును పేరు.

భూతాత్మా పుద్గలే విధౌ॥

**భూతాత్మా**: పు. ఇది శరీరముకును, బ్రహ్మకును పేరు.

అర్యమా సూర్యభక్తాయాం
సూర్యే చ పిత్ర్యదైవతే।

**అర్యమా** : పు. ఇది మంకెన చెట్టుకును, సూర్యునికిని, పితృదేవతావిశేషముకును పేరు.

సుదామా భూధరే మేఘే

**సుదామా** : పు. ఇది పర్వతముకును, అగ్నికిని పేరు.

విశ్వప్సాఽనలచంద్రయోః॥
సుధాన్వా ప్రౌఢధానుష్కే-
సుధన్వా విశ్వకర్మణి।
వనశ్వా గంధమార్జాలే
వంచక వ్యాఘ్రయోరపి॥
పరిశ్వా క్రతుకర్మజ్ఞే
యాజ్ఞికే పరిచారకే।
అథర్వా బ్రాహ్మణే వేదే
త్వథర్వ పరికీర్తితం॥
సుపర్వా త్రిదశే వంశే
శరే ధూమేఽపి పర్వణి।
లలామ చ లలామం చ
లాంఛన ధ్వజ వాజిషు॥
శృంగే ప్రధానే భూషాయాం
రమ్యే వాలధి పుంద్రయోః।
ప్రభావే చ
కలాపీ తు ప్లక్ష బర్హిణ
యోరపి॥ (184)
ప్రత్యర్థీ కథిత శ్శత్రౌ
ప్రత్యర్థీ ప్రతివాదిని।
కేసరీ తురగే సింహే
పున్నాగే నాగకేసరే॥ (185)
శిఖరీ పాదపే శైలే తథా
పామార్గ కోట్టయోః।
శృంగారీ తు సువేషే స్యా
త్క్రముకే చ మతంగజే॥
విలాసీ భోగిని వ్యాళే
పలాశీ వృక్ష రక్షసోః।

**విశ్వప్సా :** పు. ఇది అగ్నికిని, చంద్రునకును పేరు

**సుధన్వా :** పు. ఇది మంచివిలుకానికిని, దేవశిల్పికి పేరు.

**వనశ్వా :** పు. ఇది జవ్వాది పిల్లికిని, నక్కకును పెద్దపులికిని పేరు.

**పరిశ్వా :** పు. ఇది యజ్ఞకర్మ తెలిసిన వానికిని యాజ్ఞికునకును, ఉపచారము చేయు వానికిని పేరు

**అథర్వా :** పు. ఇది బ్రాహ్మణునకును, న. వేదమ కును పేరు.

**సుపర్వా :** పు. ఇది దేవతకును, వెదురుకును రెల్లుకును, పొగకును, పర్వముకును పేరు.

**లలామ :** న. ఇది చిహ్నకును, **లలామ :** టెక్కెమ కును, కొమ్ముకును, ముఖ్యమైనదానికిని, అలంకా రముకును, సుందరమైన దానికిని, వెంద్రుకల గలతోకకును, తిలకముకును, సామర్థ్యముకున పేరు.

**కలాపీ :** న. ఇది జువ్విచెట్టుకును, నెమలికిని పేరు

**ప్రత్యర్థీ :** పు. ఇది శత్రువుకును, ఎదరివాదముచేయు వానికిని పేరు.

**కేసరీ :** పు. ఇది అశ్వముకును, సింహముకును, పొన్నచెట్టుకును, నాగకేసరపుచెట్టుకును పేరు.

**శిఖరి :** పు. ఇది వృక్షముకును, పర్వతముకును, ఉత్తరేణిచెట్టుకును, కోటగలపురమునకును పేరు.

**శృంగారీ :** పు. ఇది మంచి వేషముగలవానికిని, పోకచెట్టుకును, ఏనుగకును పేరు.

**విలాసీ :** పు. ఇది భోగవంతునకును, సర్పముకును పేరు.

**పలాసీ :** పు. ఇది వృక్షముకును, రాక్షసునకును పేరు.

శిఖండీ తు మయూరే స్యా
ద్బాణ క్షత్రియభేదయోః॥ (187)
కలాపేచాథ

**శిఖండీ :** పు. ఇది నెమలికిని, బాణముకును, ద్రుపదరాజు పుత్రునకును, నెమలి పింఛమునకును పేరు.

గుంజాయాం యూధికాయాం
శిఖండినీ।

**శిఖండినీ :** స్త్రీ. ఇది గురివెంద పూసకును, అడవి మొల్లచెట్టుకును పేరు.

విషయిత్విం(ద్రియే ఖ్యాతం
వాచ్యవద్విషయాన్వితే॥ (188)

**విషయి :** న. ఇది నేత్రాదీంద్రియముకును, త్రి. విషయములతో గూడినదానికిని పేరు.

వ్యవాయీకాముకే ద్రవ్య
విశేషే చ సమీరితః।

**వ్యవాయీ :** పు. ఇది కాముకునకును, ద్రవ్యభేదముకును పేరు.

తపస్వీ తాపసే చాను
కంపనేచ

**తపస్వీ :** పు. ఇది మునీశ్వరునకును, దయగలవానికిని పేరు.

తపస్వినీ॥(189)
మాంసికా కటురోహిణ్యో

**తపస్వినీ :** స్త్రీ. ఇది జటామాంసికిని, కటుక రోహిణికిని పేరు.

స్తరస్వీ వేగి శూరయోః।

**తరస్వీ :** పు. ఇది వేగముగలవానికిని, శూరునకును పేరు.

లాంగలీ బలభద్రే స్యా
న్నారికేళే చ లాంగలీ॥

**లాంగలీ :** పు. ఇది బలారామునకును, కొబ్బరి చెట్టుకును పేరు.

కుండలీ వరుణే కేకి
భోగినోశ్చ సకుండలే

**కుండలీ :** పు. ఇది వరుణదేవునకును, నెమలికిని, సర్పముకును, కుండలములతో గూడుకొన్నవానికిని పేరు.

చోళకీతు కరీరే స్యా
న్నారంగే కిష్కు పర్వణి॥(191)

**చోళకీ :** పు. వెదురుబోడుకును, నారింజ చెట్టుకును, మోచేతి కణుపునకును పేరు.

ఫలకీ స్యాదల్లిసాఖ్య
మత్స్యేఫలకపాణిని

**ఫలకీ :** పు. ఇది అల్లీసమను చేపకును, డాలుపట్టినవానికిని పేరు.

కంచుకీ భుజగే షిద్గే
మల్లేజాంగలికద్రుమే॥ (192)

**కంచుకీ :** పు. ఇది సర్పముకును, విటునకును, భటునకును, వృక్షవిశేషముకును పేరు.

సామయోనిస్తు సామోత్థే
సామయోనిర్గ జేవిధౌ।

**సామయోని :** త్రి. ఇది సామమువలన పుట్టినదానికిని, పు. ఏనుగకును, బ్రహ్మకును పేరు.

కుంభయోని రగస్త్యే స్యా

**కుంభయోని :** పు. ఇది అగస్త్యమునికిని, ద్రోణా

| | |
|---|---|
| దర్జు నస్య గురావపి ॥(193). | చార్యునకును పేరు. |
| ఆత్మయోనిర్విధౌ కామే | **ఆత్మయోని:** పు. ఇది బ్రహ్మకును, మన్మథునకును పేరు. |
| చిత్రభానుః ఖగేऽనలే। | **చిత్రభాను :** పు. సూర్యునకును, అగ్నికిని పేరు. |
| మహాముని రగస్త్యే స్యా | **మహాముని:** పు. ఇది అగస్త్యమునికిని, ధనియము |
| ద్ధన్యాకా గస్త్యయోరపి॥ | కును, అగిసె చెట్టుకును పేరు. |
| కలధ్వనిః కోకిలే స్యా | **కలధ్వని:** పు. ఇది కోయిలకును, పావురముకును, |
| త్పారావత మయూరయోః। | నెమలికిని పేరు. |
| గదయిత్ను స్స్మృతః కామే | **గదయిత్ను:** పు. ఇది మన్మథునకును, త్రి. వాచాలు |
| జల్పాకేకా(ర్మ) ముకేऽపిచ॥(195) | నకును, విటునకును పేరు. |
| మదయిత్ను ర్భవేత్సీధౌ | **మదయిత్ను :** పు. ఇది చెరుకు సారాకును, న. |
| మద్యేస్యాన్మదయిత్ను చ। | కల్లుకును పేరు. |
| హర్షయిత్ను స్సుతే హేమ్ని | **హర్షయిత్ను :** పు. పుత్రునకును, బంగారుకును పేరు. |
| ఘోషయిత్ను ర్ద్విజే పికే॥(196) | **ఘోషయిత్ను:** పు. బ్రాహ్మణునకును, కోకిలకును పేరు. |
| స్తనయిత్నుః పయోవాహే | **స్తనయిత్ను :** పు. ఇది మేఘముకును, ఆమేఘ |
| తద్ధ్వనౌ మృత్యు రోగయోః। | ధ్వనికిని, మృత్యువుకును, రోగముకును పేరు. |
| విష్వక్సే నాఫలిన్యాం స్యా | **విష్వక్సేన :** స్త్రీ. ఇది ప్రేంకణపు చెట్టుకును, పు. |
| ద్విష్వక్సే నోజనార్ద నే॥ | విష్ణువుకును పేరు. |
| దేవసేనేంద్ర (వాహిన్యాం) | **దేవసేనా :** స్త్రీ. ఇది ఇంద్రునిపుత్రికకును, దేవతల |
| కన్యాయాం సేనాయాం చ దివౌకసాం। | సేనకును పేరు. |
| నాగాం (గనా) జనానాగ | **నాగాంజనా:** స్త్రీ. ఇది తటాకాదులనడుమ ప్రతిష్ఠ |
| యష్టికరిముద్గరికాఖ్యయోః | చేయు స్థంభముకును, ఏనుగను శిక్షించు ఇనుప గుదియకును పేరు. |
| శ్లేష్మఘనా మల్లికాయాం | **శ్లేష్మఘనా :** స్త్రీ. ఇది మల్లిచెట్టుకును, మొగలి |
| కేతక్యామపి కథ్యతే। | చెట్టుకును పేరు. |
| ప్రసాధనీ కంకతికా, | **ప్రసాధనీ:** స్త్రీ. దువ్వెనకును, సిద్ధికిని, న. వేషము |
| సిద్ధ్యో ర్వేషే ప్రసాధనం॥ | కును పేరు. |
| సామిధేనీ ఋచి ప్రోక్తా | **సామిధేనీ :** స్త్రీ. అగ్ని ప్రజ్వాలనార్థమైన ఋక్కు- |

సామిధేనీ సమిధ్యపి।
సరోజినీ స్యాత్కాసారే
పద్మినీ పద్మయోరపి॥ (200)
విలేపనీ స్యాత్తరళా
సువేషాంగనయోరపి।
మాతులానీ కలాయే స్యా
ద్భంగాయాం మాతులస్త్రియాం॥
పయస్వినీ తు గోధేన్వాం
విభావర్యాం సరిత్యపి।
గవాదనీంద్ర వారుణ్యాం
గవాంఘా సాదనాశ్రయే॥
సౌదా(మ) మిన్యప్సరోభే
దే తటిత్త ద్భేదయోరపి।

★ అథ నాంతః పంచవర్ణః ★

పీతచందనమిత్యే త
త్కాలేయక హరిద్రయోః॥
వరచందన మామ్నాతం
కాలేయే దేవదారుణి।
హరిచందనమామ్నాతం
గోశీర్షే సురపాద పే॥ (204)
జ్యోత్స్నాయాంऽ కుంకుమే
చాతిసర్జనం వధదానయోః।
మధుసూదన సంజ్ఞాచ
భ్రమరేవనమాలిని॥(205)
స్యాన్మృత్యువంచన శ్శంభౌ
శ్రీఫలద్రోణకాకయోః।
స్యాదపవర్జనం మోక్షే
పరిత్యాగే విహాయితే॥

కును, సమిధకును పేరు.

**సరోజినీ** : స్త్రీ. ఇది పద్మసరస్సుకును, పద్మలతకును, పద్మముకును పేరు.

**విలేపనీ** : స్త్రీ. ఇది గంజికిని, మంచివేషము గల స్త్రీకిని పేరు.

**మాతులానీ**: స్త్రీ. లంకలనెడి వడ్లకును, జనపవిత్తులకును, మేనమామ భార్యకును పేరు.

**పయస్వినీ**: స్త్రీ. ఇది క్రొత్తగా యీనిన గోవుకును, రాత్రికిని, నదికిని పేరు.

**గవాదనీ**: స్త్రీ. ఇది పెద్దపాపరచెట్టుకును, గోవులు మేయు బీడు మొదలైన వాటికిని పేరు.

**సౌదామినీ**: స్త్రీ. ఈ పేరుగల అప్సరస్త్రీకిని, మెరుపునకును, ఆ మెరుపులలోని భేధముకును పేరు.

**పీతచందన**: న. ఇది పచ్చచందనముకును, పసుపునకును పేరు.

**వరచందన** : న. ఇది కృష్ణచందనముకును, దేవదారు చెట్టుకును పేరు.

**హరిచందన** : న. రక్త కృష్ణచందనమునకును, కల్పవృక్షముకును, వెన్నెలకును, కుంకుమకును పేరు.

**అతిసర్జన**: న. చంపుటకును, దానముకును పేరు.

**మధుసూదన** : పు. తుమ్మెదకును, విష్ణువుకును పేరు.

**మృత్యువంచన** : పు. ఇది శివునకును, మారేడు చెట్టుకును, బొంతకాకికిని పేరు.

**అపవర్జన** : న. ఇది మోక్షముకును, విడుచుటకును, దానముకును పేరు.

| | |
|---|---|
| అతిసర్జనమామ్నాతం<br>పరివర్జన దానయోః। | **అతిసర్జన** : న. విడుచుటకును, అతిశయదానము కును పేరు. |
| మహారజన ముద్దిష్టం<br>శాతకుంభ కుసుంభయోః॥ | **మహారజన** : న. బంగారుకును, కుసుంభా పువ్వు కును పేరు. |
| స్యాత్ప్రతిపాదనందా నే<br>ప్రతిపత్తౌ చ బోధనే। | **ప్రతిపాదన** : న. ఈవికిని, వ్యాపారముకును, బోధించుటకును పేరు. |
| గంధమాదన మిత్యాహు<br>ర్గంధకేవానరాంతరే॥ (208)<br>అద్రిభేదే చ భృంగే చ<br>సురాయాం గంధమాదనీ। | **గంధమాదన** : పు. ఇది గంధకముకును, వానర విశేషముకును, గంధమాదన పర్వతముకును, తుమ్మెదకును, ఈ.స్త్రీ. కల్లుకును పేరు. |
| స్యాదనువాసనం స్నేహ<br>కర్మ ధూపనయోరపి॥ (209) | **అనువాసన** : న. ఇదితైలముచేత మర్దించుటకును, పరిమళింపజేయుటకును పేరు. |
| శ్వేతవాహన ఇత్యాఖ్యా<br>సుధాధామ్ని ధనంజయే। | **శ్వేతవాహన** : పు. చంద్రునకును, అర్జునకును పేరు. |
| హరివాహన ఇత్యుక్త<br>శ్శచీపతి వివస్వతోః॥ (210) | **హరివాహన** : పు. ఇంద్రునకును, సూర్యునకును పేరు. |
| అభినిష్ఠాన శబ్దోఽపి<br>విసర్జనీయే ఽక్షరే మతః। | **అభినిష్ఠాన** : పు. ఇది విసర్గకును, అక్షరముకును పేరు. |
| ధూమకేతన మిచ్ఛంతి<br>హుతాశ గ్రహభేదయోః॥ | **ధూమకేతన** : పు. ఇది అగ్నికిని, తోకచుక్కకును పేరు. |
| స్యాదుపస్పర్శనం స్పర్శే<br>స్నానాచమనయోరపి। | **ఉపస్పర్శన** : న. ఇది స్పృశించుటకును, స్నానము కును, ఆచమనముకును పేరు. |
| శివకీర్తన నామాపి<br>భృంగరీటే మురద్విషి॥ (213) | **శివకీర్తన** : పు. భృంగరిటియను శివద్వారపాలున కును, విష్ణునకును పేరు. |
| శాలంకాయన శబ్దస్స్యా<br>దృషిభేదే చ నందిని॥ | **శాలంకాయన** : పు. ఈ పేరుగల మునికిని, నంది కేశ్వరునకును పేరు. |
| పద్మలాంఛన శబ్దోయం<br>విధౌ లోకేశ్వరార్కయోః॥ | **పద్మలాంఛన** : ఇది బ్రహ్మకును, చక్రవర్తికిని, సూర్యునకును, కుబేరునకును, స్త్రీ. సరస్వతికిని, |

ధనదే చ సరస్వత్యాం
తారాలక్ష్మ్యోరపి స్మృతం।
స్యాత్షష్టిహాయనో ధాన్య
విశేషేఽపి మతంగజే॥
జానీయాదుపసంపన్నం
నిహితే చ సుసంస్కృతే।
విశ్వకర్మా దేవశిల్పి
మునిభేదోష్ణరశ్మిషు॥ (216)
కృష్ణవర్త్మా హుతాశేస్యా
ద్దురాచారే విధుంతుదే।
అగ్రజన్మా ద్విజే జ్యేష్ఠ
భ్రాతరిబ్రహ్మణి స్మృతః॥
శ్వేతధామా కళానాథే
ఘనసారాబ్ధి ఫేనయోః।
తిక్తపర్వాతు యష్ట్యాహ్వా
గుడూచీ హిలమోచిషు॥(218)
కిష్కుపర్వా భవేదిక్షౌ
వేణౌ పోటగళేఽపిచ।
వృషపర్వాహరే దైత్యే
భృంగారుణిక శేరుణో॥(219)
వ్యోమచారీ ఖగే దేవే
చిరజీవీ ద్వికాజయోః।
కారంధమీ కాంస్యకారే
ధాతువాదరతేఽపిచ॥(220)
వనమాలీతు గోవిందే
వారాహ్యాం వనమాలినీ।
ప్రచలాకీ భుజంగే స్యా
చ్చిత్రమే ఖలకేఽపిచ॥ (221)

తారకును, లక్ష్మికిని పేరు.

**షష్టిహాయన:** పు. ఇది ధాన్యవిశేషముకును, ఏనుగకును పేరు.

**ఉపసంపన్న:** త్రి. ఇది ఉంచబడిన దానికిని, సంస్కరింపబడిన దానికిని పేరు.

**విశ్వకర్మా :** పు. ఇది దేవశిల్పికిని, ప్రభాసుడను మునిపుత్రునకును, సూర్యునకును పేరు.

**కృష్ణవర్త్మా:** ఇది అగ్నికిని, దురాచారవంతునకును, రాహుగ్రహముకును పేరు.

**అగ్రజన్మా :** పు. ఇది బ్రాహ్మణునకును, అన్నకును, బ్రహ్మకును పేరు.

**శ్వేతధామా:** పు. ఇది చంద్రునకును, కర్పూరముకును, సముద్రపు నురగకును పేరు.

**తిక్తపర్వా :** పు. ఇది యష్టిమధుకముకును, తిప్పతీగకును, చక్రవర్తికూరకును పేరు.

**కిష్కుపర్వా:** పు. ఇదిచెరుకునకును, వెదురుకును, కిక్కిసగడ్డికిని పేరు.

**వృషపర్వా:** పు. ఇది శివునకును, వృషపర్వుడను రక్కసునకును, వృక్షవిశేషముకును, తుంగముస్తకును పేరు.

**వ్యోమచారీ :** పు. సూర్యునకును, దేవునకును పేరు.

**చిరజీవీ :** పు. ఇది కాకికిని, బ్రహ్మకును పేరు.

**కారంధమీ :** పు. ఇది కంచుపనివానికిని, ధాతువాదమందాసక్తిగల వానికిని పేరు.

**వనమాలీ :** పు. ఇది శ్రీకృష్ణునకును, **వనమాలినీ:** స్త్రీ. బ్రాహ్మ్యాది సప్తమాతృకలలో నొకతెకును పేరు.

**ప్రచలాకీ:** పు. ఇది సర్పముకును, నెమలికిని పేరు.

సం(ప్రయోగీ కలాకేళౌ
కాముకే సం(ప్రయోజకే।
అంతేవాసీ భవేచ్ఛిష్యే
చండాలే (ప్రాంతగేఽపిచ॥
విఘ్నకారీ స్మృతో-ఘోర
దర్శనేఽపి విఘాతిని।
కామచారీ తు కమనే
స్వచ్ఛంద కలవింకయోః॥ (223)
పృష్ఠశృంగీ, భవేద్ధంశ
భీరౌ షండే వృకోదరే।
శకులాదన్యభిఖ్యా తు
మాంసీకించులికాఖ్యయోః॥
కటుకాజలపిప్పల్యోః
కథ్యతే శకులాదనీ।
స్యాద్వరవర్ణినీ లాక్షా
హరి(ద్రారోచనాసు చ॥
స్త్రీరత్నే చ ఫలిన్యాంచ
దృశ్యతే వరవర్ణినీ।
★ అథనాంత షడ్వర్ణః ★
అంతావసాయీ శ్వపచే
మునిభేదేఽపి నాపితే॥
జాయానుజీవ తు నటే
దుర్గ తేఽపి, (ప్రకీర్తితః।
సహ(స్రవేధీ, స్యాదామ్ల
వేతసే, రామఠేఽపిచ॥ (227)
కలానునాదీ రోలంబే
కలవింకే కపింజలే।

**సం(ప్రయోగీ :** పు. ఇది మన్మథునకును, విటున కును, సురతముచేయు వానికిని పేరు.
**అంతేవాసీ :** పు. ఇది శిష్యునకును, మాదిగ వాని కిని, సమీపమందున్న వానికిని పేరు.
**విఘ్నకారీ :** పు. ఇది భయంకరాకారునకును, ఘాతుకునకును పేరు.
**కామచారీ :** పు. ఇది విటునకును, ఇష్టము వచ్చి నట్లు విహరించువానికిని, ఊరపిచ్చుకకును పేరు.
**పృష్ఠశృంగీ:** పు. ఇది మహిషముకును, నపుంసకు నకును, భీమునకుమ పేరు.
**శకులాదనీ:** స్త్రీ. ఇది జటామాంసికిని, ఎ(రయను జంతువుకును, కటుకరోహిణికి ని, నీటిపిప్పలికిని పేరు.

**వరవర్ణినీ :** స్త్రీ. ఇది లక్కకును, పసపునకును, గోరోచనముకును, (శేష్ఠమైన స్త్రీకిని, (పేంకణపు చెట్టుకును పేరు.

**అంతావసాయీ :** పు. చండాలునకును, ఒక ముని కిని, మంగలి వానికిని పేరు.
**జాయానుజీవీ:** పు. నాట్యగానికిని, దరి(ద్రునకును పేరు.
**సహ(స్రవేధీ :** పు. ఇది పుల్ల(పబ్బలి చెట్టుకును, ఇంగువకును పేరు.
**కలానువాదీ :** పు. ఇది తుమ్మెదకును, పిచ్చుక కును, కాటుక పిట్టకును పేరు.

★ అథ పాంతవర్గః ★

రూపం స్వభావే సౌంద ర్యే
నాణకే పశు శబ్దయోః।
గ్రంథావృత్తౌ నాటకాదా
వాకార శ్లోకయోరపి॥ (1)

రూప : న. ఇది స్వభావముకును, చక్కదనము కును, రూప్యాది వెండి బంగారు నాణెముకును, చతుష్పాద జంతువుకును, సంస్కృతాదిశబ్దము కును, గ్రంథమును చింతనజేయుకును, నాటకాదు లకును, ఆకృతికిని, శ్లోకముకును పేరు.

రేప స్స్యాన్నిందితే క్రూరే
రోపో రోపణ బాణయోః।
సూపో వ్యంజనభేదే చ
సూపకారే చ కీర్తితః॥(2)
ఛుపః క్షుపస్పర్శ నయో
శ్చుపః పవన యుద్ధయోః।
కూపః కూపక గర్తాంధు
మృన్మాన గుణవృక్షకే॥(3)

రేప: త్రి. నిందించబడిన వానికిని, క్రూరునకును పేరు.

రోప :పు. ఇది ఆరోపించుటకును, బాణముకును పేరు.

సూప : పు. ఇది పప్పుకును, వంటల వానికిని పేరు.

ఛుప : పు. ఇది గుజ్జుమ్రానుకును, స్పృశించుట కును, వాయువుకును, యుద్ధముకును పేరు.

కూప : పు. ఆడుదాని పిరుదులమీది చిరు గుంట కును, గోతికిని, నూతికిని, మట్టికొలత కొరకు పెట్టిన కొలిమి గోతికిని, ఓడకంబముకును పేరు.

తాపో పతాపే దవథౌ
తాపీ తు సరిదంతరే।
శాప శ్శపథ ఆక్రోశే
త్రపు సీసక రంగయోః॥
స్వాప స్స్పుర్శా జ్ఞతా నిద్రా
శయనాజ్ఞాతమాత్రకే।
నీపో ధూళికదంబే స్యా
న్నీలాశోకే చ ధన్వినిః॥ (5)
గోపో గ్రామౌఘు గోష్ఠాధి
కృత యోర్వల్ల వే నృపే।
గోపే గోపాలమహిళా
శారిబారక్తి కాసు చ॥ (6)
క్షేపో విలంబే నిందాయాం

తాప : పు. సంతానముకును, జ్వరముకును, ఈ. స్త్రీ. నదీ విశేషముకును పేరు.

శాప : పు. ఇది ఒట్టుకును, తిట్టుకును పేరు.

త్రపు: న. ఇది సీసముకును, తగరముకును పేరు.

స్వాప : పు. స్పర్శజ్ఞానము లేకుండటకును, నిద్ర కును, పండుకొనుటకును, అజ్ఞానముకును పేరు.

నీప : పు. ఇది వసంత కడిమిచెట్టుకును, నల్ల యశోకవృక్షముకును, మద్దిచెట్టుకును పేరు.

గోప : పు. అనేక గ్రామాధికారికిని, గోవులగాచు వానికిని, గొల్లవానికిని, రాజుకును, ఈ. స్త్రీ. గొల్లదానికిని, గూడపాలచెట్టుకును, గులివెందలత కును పేరు.

క్షేప : పు. ఇది ఆలస్యముకును, నిందకును, స్త్రీల

హేలా ప్రేరణ లంఘనే
గర్వేఽపి

విలాసముకును, ప్రేరేపించుటకును, దాటుటకును, గర్వముకును పేరు.

లేపస్తు సుధా
జేమనా లేపనేషు చ ॥ (7)

**లేప** : పు. ఇది సున్నముకును, తినుటకును, పూతకును పేరు.

తల్పం తు శయనీయే స్యా
త్తల్ప మట్టకళత్రయోః

**తల్ప** : న. ఇది పాన్పునకును, కోట కొత్తళముపైన గట్టిన శాలకును, భార్యకును పేరు.

కల్ప స్స్యాత్ప్రళయే న్యాయే
శాస్త్రే బ్రాహ్మదినే విధౌ ॥ (8)

**కల్ప** : పు. న్యాయముకును, కల్పమను వేదాంగభూతమగు శాస్త్రముకును, శ్వేతవరాహాది కల్పముకును, వేదాది విధులకును పేరు.

దర్పో హంకారకస్తూర్యో
ర్బాష్పో నేత్రజలోష్మణోః।

**దర్ప** : పు. ఇది గర్వముకును, కస్తూరికిని పేరు.

**బాష్ప** : పు. ఇది కన్నీటికిని, ఆవిరికిని పేరు.

పుష్పం వికాసే కుసుమే
స్త్రీణాం చ రజసిస్మృతం॥

**పుష్ప** : న. ఇది వికసించుటకును, పూవుకును, ముట్టు రక్తముకును పేరు.

శష్పం స్యాత్ప్రతిభాహానౌ
శష్పంబాలతృణేఽపిచ।

**శష్ప** : న. ఇది ప్రజ్ఞాభంగముకును, లేత గడ్డికిని పేరు.

శిల్పంస్రువేక్రియాయోగ్యే
ఖష్పః క్రోధే బలాత్కృతౌ॥(10)

**శిల్ప** : న. ఇది స్రువముకును, శిల్పముకును పేరు.

**ఖష్ప** : పు. ఇది కోపముకును, బలాత్కారముకును పేరు.

కృపా దయాయాం వ్యా సర్షౌ
కృపోభారతపూరుషే।

**కృపా** : స్త్రీ. ఇది దయకును, పు. వ్యాస మునికిని, కృపాచార్యునకును పేరు.

త్రపా లజ్జా కులటయో
ర్వపా వివర మేదసోః ॥ (11)

**త్రపా** : స్త్రీ. ఇది లజ్జకును, లంజకును పేరు.

**వపా** : స్త్రీ. ఇది రంధ్రముకును, నాభీ సమీపమందుండు వస్త్రరూపమగు మేదస్సుకును పేరు.

★ అథ పాంత త్రివర్ణః ★

కుతప స్స్యాత్కుశే వాద్యే
తపనే ఛాగకంబళే।
కుతపో భాగినేయే స్యా
దష్టమాంశే దివస్యచ॥ (12)

**కుతప** : పు. దర్భకును, వాద్య విశేషముకును, సూర్యునకును, మేకబొచ్చుతోనేసిన కంబళికిని, మేనల్లునకును, పగటియందెనిమిదవ ముహూర్తముకును పేరు.

కుటపో మానభేదే స్యా

**కుటప** : పు. ఇది మానెడు ప్రమాణముకును,

| | |
|---|---|
| త్కుటపో నిష్కుటే మునౌ। | గృహోద్యానముకును, ఒకమునికిని పేరు. |
| విటపః పల్లవే షిద్గే | **విటప :** పు. ఇది చిగురుకును, విటశ్రేష్ఠునకును, |
| విస్తారే స్తంబ శాఖయోః॥ (13) | చిగుళ్ళుకొమ్మలు మొదలగువాటి గుంపునకును, కాడకును, కొమ్మకును పేరు. |
| ఉలపస్తృణభేదే స్యా | **ఉలప :** పు. ఇది బల్బజ గడ్డికిని, న. దట్టముగా |
| ద్గుల్మిన్యా ములపం స్మృతం। | నల్లుకొన్నలతకును పేరు. |
| కాశ్యప స్స్యాన్మునౌ మీన | **కాశ్యప :** పు. ఇది కణాదుడను మునికిని, మత్స్య |
| భేదే భూమౌ తు కాశ్య పీ॥ (14) | విశేషముకును, ఈ. స్త్రీ. భూమికిని పేరు. |
| ఉడుప(ంతు) స్తు ప్లవే చంద్రే | **ఉడుప :** పు. ఇది తెప్పకును, పు. చంద్రునకును పేరు. |
| ప్రతాపః ఖేద తేజసోః। | **ప్రతాప :** పు. ఇది దుఃఖముకును, ప్రతాపముకును పేరు. |
| రక్తపో రక్షసి ప్రోక్తో | **రక్తప :** పు. ఇది రాక్షసునకును, స్త్రీ. జలగకును |
| జలూకాయాం తు రక్తపా॥ | పేరు. |
| జిహ్వప శ్శుని మార్జారే | **జిహ్వప :** పు. ఇది కుక్కకును, పిల్లికిని, పెద్దపులి |
| వ్యాఘ్ర చిత్రకయోరపి। | కిని, చిరుతపులికిని పేరు. |
| పాదపః పాదపీఠేऽద్రౌ | **పాదప :** పు. ఇది పాదములుంచుకొను పీటకును, |
| పాదుకాయాం తు పాదపా॥ | స్త్రీ. పాదుకకును పేరు. |
| అనూపో మహిషే విద్యా | **అనూప :** పు. ఇది ఎనుబోతుకును, త్రి. నీరు |
| జ్జలప్రాయే తు వాచ్యవత్। | విస్తారముగానుంచు చోటుకును పేరు. |
| ఆవాపో భాండ(పవనే) పవనే | **ఆవాప :** పు. క్షౌరముకును, వ్యథపెట్టుటకును, |
| పరిక్షేపాలవాలయోః॥ | చెట్లపాదుకును పేరు. |
| ఆక్షేపో భర్త్సనా కృష్టి | **ఆక్షేప :** పు. ఇది భయపెట్టుటకును, ఆకర్షించుట |
| కావ్యాలంకృతిషు స్మృతః। | కును, ఆక్షేపాలంకారముకును పేరు. |
| ఏకోక్త్యా కశిపు ర్భక్తా | **కశిపు :** పు. ఇది ఏకోక్తి చేతను, అన్న వస్త్రముల |
| చ్ఛాదనే చద్వయోః పృథక్॥ | కును, వేరుగా రెంటికిని పేరు. ఏకోక్తియందు కశిపూ అని ద్వివచనము. |
| ఆకల్ప కల్పనే వేషే | **ఆకల్ప :** పు. ఇది కల్పించుటకును, అలంకరించుట కును పేరు. |
| వికల్పో భ్రాంతి పక్షయోః। | **వికల్ప :** పు. ఇది భ్రమకును, వికల్పముకును పేరు. |

కచ్ఛపీ వల్లకీభేదే
ధుల్యాంక్షుద్రగదాంతరే ॥ (19)
మల్ల బంధవిశేషేऽపి
కచ్ఛపః కుణపీ పునః।
విట్సారి కాయాం కుణపః
పూతిగంధేశ వేऽపిచ॥
కలాపో భూషణే బర్హే
తూణీరే సంహతావపి।

**కచ్ఛపీ :** స్త్రీ. ఇది సరస్వతివీణకును, ఆడు తాబేటికిని, క్షుద్రరోగ విశేషముకును, జెట్టివాండ్రకుస్తీ పట్టుకును పేరు.

**కుణపీ :** స్త్రీ. ఇది పీతిగోరింకయను పక్షికిని, పు. దుగంధముకును, శవముకును పేరు.

**కలాప :** పు. ఇది అలంకారముకును, నెమలిపింఛముకును, అమ్ములపొదికిని, సమూహముకును పేరు.

★ అథ పాంతశ్చతుర్వర్ణః ★

ప్రాప్తరూపో బుధేరమ్యే
ప్యభిరూప సురూపవత్॥
బహురూపశ్శివే విష్ణౌ
ధూనకే సరళే స్మరే।

**ప్రాప్తరూప :** త్రి. ఇది అభిరూప సురూపశబ్దముల వలెనే, పండితునకును, మనోజ్ఞమైనదానికిని పేరు.

**బహురూప :** పు. ఇది శివునకును, విష్ణువుకును, సర్జరసమను ధూపద్రవ్యముకును, తొండకును, మన్మథునకును పేరు.

వృకధూపస్తు సరళ
ద్రవకృత్రిమధూపయోః॥(22)

**వృకధూప :** పు. ఇది దేవదారుబంకతో చేసిన ధూపద్రవ్యముకును, అనేకసుగంధద్రవ్యములతో చేసిన ధూపద్రవ్యముకును పేరు.

పరివాపస్తు పర్యుప్తౌ
జలస్థానే పరిచ్ఛదే।
ఉపతాపస్త్వ రాయాంస్యా
దుత్తాపగదయోరపి॥(23)
అవలేపస్తు గర్వేస్యా
ల్లేపనే దూషణేऽపిచ।
విప్రలాపో విరోధోక్తా
వపార్థ వచనేऽపిచ ॥ (24)
వృషాకపి శ్శివే విష్ణౌ
జ్వలనే చ వృషాకపిః।
పరికంపో భయే కంపే

**పరివాప :** పు. విత్తనములు చల్లుటకును, నీళ్ళు నిలుచుచోటుకును, గుడారముకును పేరు.

**ఉపతాప :** పు. ఇది తొందరపాటుకును, పరితాపముకును, రోగముకును పేరు.

**అవలేప :** పు. ఇది గర్వముకును, పూయుటకును, దూషించుటకును పేరు.

**విప్రలాప :** పు. విరోధవచనముకును, అపార్థము నిచ్చు వాక్యముకును పేరు.

**వృషాకపి :** పు. శివునకును, విష్ణువుకును, అగ్నికిని పేరు.

**పరికంప :** పు. ఇది భయముకును, చలించుటకును పేరు.

ऽపలాపః ప్రేమ్ణ్యపహ్నవే॥
బీజపుష్పం మరువకే
తథా దమనకేऽపిచ।
హేమపుష్పం జపాపుష్పే
చంపకాశోకయోరపి॥
నాగపుష్పస్తు పున్నాగ
నాగకేసర చంపకే।
పిండపుష్పమశోకేచ
జపాయాం చకుశేశయే॥ (27)
మేఘపుష్పంతు పిండాభ్రే
నాదేయ జలయోరపి।
జలకూపీ కూపగర్తే
పుష్కరిణ్యాం చ కథ్యతే॥
భవేచ్చామరపుష్పస్తు
చూతే కేతక కాశయోః।

**అపలాప:** పు. ప్రేమకును, కప్పిపుచ్చుటకును పేరు.
**బీజపుష్ప :** న. ఇది మరువమునకును, దమనమునకును పేరు.
**హేమపుష్ప:** న. ఇది మంకెనపువ్వుకును, సంపెంగ పువ్వుకును, అశోక పుష్పమునకును పేరు.
**నాగపుష్ప :** పు. పొన్నచెట్టుకును, నాగకేసరపు చెట్టుకును, సంపెంగ చెట్టుకును పేరు.
**పిండపుష్ప:** న. ఇది అశోకపుష్పమునకును, మంకెన పూవుకును, పద్మమునకును పేరు.
**మేఘపుష్ప:** న. ఇది వడగలికిని, నదీజలమునకును, జలసామాన్యమునకును పేరు.
**జలకూపీ :** స్త్రీ. నూతికిని, తటాకమునకును పేరు.

**చామరపుష్ప :** పు. మామిడి చెట్టుకును, మొగలి చెట్టుకును, రెల్లుకును పేరు.

★ అథ ఫాంత వర్గః ★

రేఫో రవర్ణే కథితః
కుత్సితే వాచ్యవన్మతః।
శఫం మూలే తరూణాం
స్యాద్గవాదీనాం ఖురేऽపిచ॥
గుంఫ స్స్యాద్గుంఫనే బాహ్వో
రలంకారేऽపి కీర్తితః।
శిఫా జటాయాం సరితి
మాంసికాయాం చ మాతరి॥ (2)

**రేఫ:** పు. ఇది రేఫకును, త్రి. కుటిలునకును పేరు.

**శఫ:** న. ఇది చెట్టుపేరుకును, గోవు మొదలగువాటి డెక్కకును పేరు.
**గుంఫ :** పు. ఇది పుష్పాదులను గుచ్చుటకును, బాహుపురికిని పేరు.
**శిఫా :** స్త్రీ. ఇది చెట్టువూడకును, శిఫానదికిని, జటామాంసికిని, తల్లికిని పేరు.

★ అథ బాంతవర్గః ★

పూర్వాఖ్యా పూర్వజేష్వస్యా
దగ్రే ప్రాచి చ వాచ్యవత్।
బింబం ఫలే బింబికాయాః

**పూర్వ :** త్రి. ఇది పూర్వమందుపుట్టిన దానికిని, ముందుగాననుటకును, తూర్పు దిశకును పేరు.
**బింబ :** న. దొండపండుకును, ప్రతి బింబము

ప్రతిబింబే చ మండలే ॥(1)

కును, పు. సూర్యాదిమండలముకును పేరు.

డింబ స్స్యాద్విప్లవ ప్లీహ్నో
రేరండే పుష్పసంచయే

**డింబ:** పు. ఇదిదేశోపద్రవముకును, రొమ్మునకు నెడమ ప్రక్కనుండు మాంస విశేషముకును, ఆముదపు చెట్టుకును, పూలగుత్తికిని పేరు.

స్తంబో గుచ్ఛే తృణాదీనా
మప్రకాండద్రుమేऽపిచ॥

**స్తంబ:** పు. ఇది గడ్డి మొదలగువాటి దుబ్బుకును, మానులేని చెట్టుకును పేరు.

శంబ స్స్యాన్ముసలాగ్రస్థ
లోహమండలకే పవౌ।
శుభాన్వితే చ

**శంబ:** పు. ఇది రోకటి పొన్నుకును, వజ్రాయుధముకును, త్రి. భాగ్యవంతున కును పేరు.

ఖర్వస్తుహ్రస్వే సంఖ్యాం
తరేऽపిచ॥

**ఖర్వ :** పు. పొట్టివానికిని, సంఖ్యాభేదముకును పేరు.

కంబు శ్శంబూకగజయో
గ్రీవావలయ శంఖయోః।

**కంబు :** పు. ఇది నత్తగుల్లకును, ఏనుగకును, కంఠముకును, శంఖముకును పేరు.

జంబూ స్సుమేరుసరితి
ద్వీప ద్రుమవిశేషయోః॥ (4)

**జంబూః :** స్త్రీ. ఇది మేరుపర్వతమందలి నదికిని, జంబూద్వీపముకును, నేరేడు చెట్టుకును పేరు.

కంబి రంశే చ వంశస్య
ఖజాకాయా మపీష్యతే।

**కంబి:** స్త్రీ. ఇదివెదురులోని భాగముకును, గరిటె కును పేరు.

దర్వీ భవేత్ఖజాకాయాం
ఫణాయా మురగస్య చ॥ (5)

**దర్వీ:** స్త్రీ. ఇది గరిటెకును, పాముపడగకును పేరు.

దార్వీ దారు హరిద్రాయాం
దేవదారు హరిద్రయోః।

**దార్వీ :** స్త్రీ. ఇది మానిపసపునకును, దేవదారు చెట్టుకును, పసపునకును పేరు.

చార్వీతు శోభనా బుద్ధ్యో

**చార్వీ :** స్త్రీ. పసపునకును, బుద్ధికిని పేరు.

ర్లంబాశ్రీతిక్తతుంబయోః॥

**లంబా :** స్త్రీ. ఇదిలక్ష్మికిని, చేతియానుగచెట్టుకును పేరు.

★ అథ బాంత త్రివర్ణః ★

కదంబ మాహు స్సిద్ధార్థే
నీపేऽపి నికురుంబకే।

**కదంబ :** పు. ఇది తెల్లావాలకును, కడిమి చెట్టుకును, సమూహముకును పేరు.

కాదంబః కలహంసేష్వో।
ర్ద్విజిహ్వోభుజగే ఖలే॥

**ద్విజిహ్వ :** పు. సర్పముకును, దుర్మార్గునకును పేరు.

గజాహ్వా కరిపిప్పల్యాం
గజాహ్వా హస్తినాపురే।
నితంబో రోధసి స్కంధే
శిఖరే చ కటీరకే॥ (8)

**గజాహ్వా** : స్త్రీ. ఇది ఏనుగ పిప్పలికిని, హస్తినా పురికిని పేరు.

**నితంబ** : పు. ఇది ఒడ్డుకును, చెట్టు మొదలుకును, పర్వత శిఖరముకును, స్త్రీల కటి ప్రదేశముకును పేరు.

హేరంబో విఘ్నరాజేస్యా
న్మహిషే శౌర్యగర్జి తే।

**హేరంబ**: పు. ఇది విఘ్నేశ్వరునకును, ఎనుబోతుకును, శౌర్యముచేత గర్జించుటకును పేరు.

కలంబ స్సాయకే నీపే
నాళిశాకే కలంబ్యపి॥ (9)

**కలంబ**: పు. ఇది బాణముకును, కడిమిచెట్టుకును, ఈ. స్త్రీ. తూటికూరకును పేరు.

ప్రలంబో దైత్యభేదే స్యా
త్తాలాంకురక శాఖయోః।
ప్రలంబో హారభేదే స్యా
త్త్రపుష్వేऽపి పయోధరే॥ (10)

**ప్రలంబ** : పు. ప్రలంబాసురునకును, తేగకును, కొమ్మకును, ముక్తాహారముకును, సీసముకును, కుచముకును పేరు.

గంధర్వో మృగభేదే స్యా
త్పుంస్కోకిల తురంగయోః।
అంతరాభవసత్వే చ
గాయ నే ఖేచ రేऽపిచ॥

**గంధర్వ**: పు. ఇది కస్తూరి మృగముకును, పురుష కోకిలకును, అశ్వముకును, అంతర పిశాచముకును, గానము చేయువానికిని, గంధర్వుడను దేవ యోని విశేషునకును పేరు.

గోతుంబశ్చిర్భ వృంతే స్యా
ద్గవాదన్యాః ఫలేऽపిచ।

**గోతుంబ** : పు. ఇది నక్కదోసకాయకును, పిన్న సొపరకాయకును పేరు.

భూజంబూరపి గోధూమే
వికంకత ఫలేऽపిచ॥ (12)

**భూజంబూః** : స్త్రీ. ఇది గోధుమలకును, పుల్ల వెలగపండుకును పేరు.

★ అథ బాంతశ్చతుర్వర్ణః ★

చలజిహ్వో మతో హింస్రే
క్రమేళక శునోరపి।

**చలజిహ్వ**: త్రి. ఘాతుకునకును, పు. ఒంటెకును, కుక్కకును పేరు.

శతపర్వా చ దూర్వాయాం
భాగ వస్య స్త్రియామపి॥(13)

**శతపర్వా** : స్త్రీ. ఇది గరికెగడ్డికిని, శుక్రాచార్యుని భార్యకును పేరు.

రాజజంబూస్తు జంబూభి
త్పిండఖర్జూరయోరపి।

**రాజజంబూః** : స్త్రీ. ఇది అల్లనేరేడు చెట్టుకును, ముద్ద ఖర్జూరముకును పేరు.

★ అథబాంతపంచవర్గః ★

| | |
|---|---|
| ధూళీకదంబో నీపే స్యా<br>త్తినిశే వరుణద్రుమే॥ (14) | **ధూళీకదంబ :** పు. ఇది కడిమిచెట్టుకును, నెమ్మిచెట్టుకును, ఉలిమిడిచెట్టుకును పేరు. |
| గోరక్షజంబూ ర్గోధూమే<br>తథా గోరక్షతండులే। | **గోరక్షజంబూః :** స్త్రీ. ఇది గోధుమలకును, జిబిలికె చెట్టుకును పేరు. |
| సృగాలజంబూ ర్గోతుంబే<br>క్వాపి ఘోంటాఫలే పి చ॥(15) | **సృగాలజంబూః :** స్త్రీ. ఇది నక్కదోస చెట్టుకును, రేగుపండుకును పేరు. |

★ అథ భాంత వర్గః ★

| | |
|---|---|
| భస్స్యాచ్ఛుక్రే మయూఖే భా<br>భం నక్షత్రే ప్రకీర్తితం। | **భ :** పు. ఇది శుక్రాచార్యునకును, స్త్రీ. కిరణముకును, న. నక్షత్రముకును పేరు. |
| భూః పృథివ్యాం స్థానమాత్రే | **భూః :** స్త్రీ. ఇది భూమికిని, ప్రదేశముకును పేరు. |

★ అథ భాంతో ద్వివర్గః ★

| | |
|---|---|
| స్వభూ ర్వేధసి శార్జ్గిణి॥ | **స్వభూః :** పు. ఇది బ్రహ్మకును, విష్ణువుకును పేరు. |
| శుభో యోగే శుభం క్షేమే। | **శుభ :** పు. పంచాంగయోగ విశేషముకును, న. మంగళముకును పేరు. |
| నిభో వ్యాజసదృక్షయోః | **నిభ :** పు. ఇది మిషకును, త్రి. ఉపమావాచకముకును పేరు. |
| విభు శ్శివే ప్రభౌ నిత్యే। | **విభు :** పు. ఇది శివునకును, ప్రభువుకును, నిత్యునకును పేరు. |
| శంభు ర్బ్రహ్మార్హతో ర్హరే॥ (2) | **శంభు :** పు. బ్రహ్మకును, బుద్ధదేవునకును, శివునకును పేరు. |
| దంభస్తు కైతవే కల్కే | **దంభ :** పు. ఇది మిషసును, డాంబికవేషముకును పేరు. |
| డింభో బాలిశ పోతయోః | **డింభ :** పు. ఇది మూర్ఖునకును, బాలునకును పేరు. |
| జంభో దైత్యాంతరే దంభే<br>జంబీరే భక్షణే ऽపి చ॥ (3) | **జంభ :** పు. ఇది జంభాసురునకును, కపటముకును, నిమ్మచెట్టుకును, తినుటకును పేరు. |
| కుంభ స్స్యాత్కుంభ కర్ణస్య<br>సుతే వేశ్యాపతౌ ఘటే।<br>రాశిభేదే ద్విపాంగే చ | **కుంభ :** పు. ఇది కుంభాసురునకును, విటునకును, కడవకును, కుంభరాశికిని, ఏనుగ కుంభస్థలముకును, న. తెల్లతెగడకును, గుగ్గిలపు చెట్టుకును |

కుంభం త్రివృతిగుగ్గులౌ॥ (4)
కుంభీతు పాటలా వారి
పర్ణీ పిఠర కట్ఫలే।

ఈ. స్త్రీ. పాటల వృక్షముకును, నాచుకును, పిడత కును, టేకు చెట్టుకును పేరు.

గర్భో భ్రూణేఽర్భ కే కుక్షౌ
సంధౌ పవనసంకటే॥ (5)
అన్నే వహ్నౌ

**గర్భ** : పు. ఇది గర్భస్థ పిండముకును, బాలునకును, కడుపునకును, గర్భ సంధియను నాటకాంగముకును, వాతరోగముకును, అన్నముకును, అగ్నికిని పేరు.

వథో జృంభో ముఖఖేం
దాంగ భంగయోః।
జృంభో మతో వికాసే చ

**జృంభ** : పు. ఇది ఆవలింతకును, వళ్ళు విరుపున కును, వికసించుటకును పేరు.

స్తంభస్స్థూణ జడత్వయోః॥(6)

**స్తంభ**:పు. ఇది స్తంభముకును, నిశ్చేష్టత్వముకును పేరు.

రంభా కదళ్యప్సరసో
రంభో వైణవదండకే।

**రంభా** : స్త్రీ. ఇది అరటి చెట్టుకును, అప్సర స్త్రీకిని, పు. వెదురు కర్రకును పేరు.

సభా సామాజికే ద్యూతే
గోష్ఠీ మందిరయోరపి॥ (7)

**సభా** : స్త్రీ. ఇది సభికునకును, జూదముకును, సభకును, చావడికిని పేరు.

శోభా కాంతీ చ్ఛయోరుక్తా

**శోభా** : స్త్రీ. కాంతికిని, అభిలాషకును పేరు.

దృగ్భూః పన్నగ వజ్రయోః।

**దృగ్భూః**: స్త్రీ. ఇది సర్పముకును, వజ్రాయుధము కును పేరు.

నాభిః ప్రాణ్యంగకే క్షత్రే
చక్రాంత శ్చక్రవర్తినోః॥ (8)
నాభిః ప్రధానే కస్తూరీ
మదేచక్వచిదీరితః।

**నాభి** : ఇది ఉదరమందలిసుడికిని, పు. క్షత్రియున కును, చక్రమునడిమి రంధ్రముకును, చక్రవర్తికిని, ప్రధానునకును, కస్తూరికిని పేరు.

★ అథభాంత త్రివర్ణః ★

కరభో మణిబంధాది
కనిష్ఠాంతే క్రమేళకే॥ (9)

**కరభ** : పు. ఇది మణిబంధము మొదలు చిటికిన వ్రేలివరకునుండు హస్తము బహిఃప్రదేశముకును, ఒంటెకును పేరు.

శరభ శ్శలభే చాష్టా
పదేప్రోక్తో మృగాంతరే।

**శరభ** : పు. ఇది మిడుతకును, ఎనిమిది కాళ్ళుగల శరభమను మృగముకును, ఒంటెకును పేరు.

ఋషభ స్స్వరభేదే స్యా

**ఋషభ** : పు. సప్తస్వరములయందలి ఋషభ

దష్టవర్గౌషధే వృషే॥(10)
శ్రేష్ఠార్థే చ వరాహస్య
పుచ్ఛే రంధ్రే చ కర్ణయోః।
ఋషభీ శూకశింబ్యాం స్యా
న్నరాకార స్త్రియామపి॥ (11)
విధవాయాం శిరాలాయాం

స్వరముకును, ఋషభమను ఓషధికిని, ఎద్దుకును, శ్రేష్ఠవాచకముకును, పందితోకకును, కణరంధ్రముకును, ఈ. స్త్రీ. దూలగొండిచెట్టుకును, మాచకమ్మకును, విధవకును, వృక్షవిశేషముకును పేరు.

వృషభః పుంగవే వృషే।

**వృషభ :** పు. శ్రేష్ఠునకును, ఎద్దుకును పేరు.

వల్లభో దయితేఽధ్యక్షే
కులీనా శ్వేఽపి వల్లభః॥

**వల్లభ :** పు. ఇది భర్తకును, అధిపతికిని, మంచి జాతి గుఱ్ఱముకును పేరు.

దుర్లభః కచ్చురే జ్ఞేయో
దుష్ప్రాపే వల్లభేఽపి చ।

**దుర్లభ :** పు. ఇది కచ్చోరముకును, త్రి. పొందశక్యముగాని దానికిని, ప్రియమైన దానికిని పేరు.

నికుంభః కథితో దంత్యాం
కుంభకర్ణ సుతేఽపిచ ॥ (13)

**నికుంభ:** పు. ఇది నాగదంతిచెట్టుకును, నికుంభాసురునకును పేరు.

కుసుంభో హేమని మహా
రజనే చ కమండలౌ।

**కుసుంభ :** పు. ఇది బంగారుకును, కుసుంభాపువ్వుకును, కమండలముకును పేరు.

విష్టంభః ప్రతి బంధేఽపి
(వైధవ్యేచ ప్రయుజ్యతే)
రోగభేదేఽపి కీర్తితః॥ (14)

**విష్టంభ :** పు. ఇది ప్రతిబంధముకును, రోగవిశేషముకును పేరు.

విస్రంభః కేళికలహే
విశ్వాసే ప్రణయేఽపి చ।

**విస్రంభ:** పు. ఇది ప్రణయకలహముకును, విశ్వాసముకును, ప్రేమకును పేరు.

విష్కంభో యోగభేదేస్యా
ద్విస్తార ప్రతిబంధయోః॥ (15)
రూపకాంగ ప్రభేదేచ
బంధభేదే చ యోగినాం।

**విష్కంభ:** పు. ఇది పంచాంగయోగవిశేషముకును, విస్తారముకును, విఘ్నముకును, నాటకాంగముకును, యోగబంధవిశేషముకును పేరు.

కకుభో రాగభేదేఽపి
వీణాంగేఽర్జున పాదపే॥(16)

**కకుభ :** పు. ఇది కకుభరాగముకును, వీణకరిదెకును, కొడిశచెట్టుకును పేరు.

ఆరంభస్తు త్వరాయాంస్యా
దుద్యమే వధదర్పయోః।

**ఆరంభ :** పు. ఇది వేగిరపాటుకును, ప్రయత్నముకును, చంపుటకును, దర్పముకును పేరు.

ప్యాధి పత్యా పవర్గయోః॥(117)

ముకును, మోక్షముకును పేరు.

స్థాలోచ్చయ స్స్వసాకల్యే
గండోపల వరండయోః।
గజానాం మధ్యమగతౌ
స్థాలోచ్చయ ఉదాహృతః॥

**స్థూలోచ్చయః** పు. అసంపూర్ణత్వముకును, చఱప రాతికిని, లోపలితీనెకును, ఏనుగులయొక్క మధ్యమ గతికిని పేరు.

ధనంజయోऽర్జునే వహ్నౌ
కకుభే దేహమారుతే।
నాగాంతరే చాऽ

**ధనంజయ:** పు. పాండవ మధ్యమునకును, అగ్నికిని, మద్దిచెట్టుకును, శరీర సంబంధమైన బహిర్వాయు విశేషముకును, సర్పవిశేషముకును పేరు.

పసవ్యం దక్షిణ
ప్రతికూలయోః॥(119)

**అవసవ్య:** త్రి. శరీరముయొక్క కుడివైపు దానికిని, ప్రతికూలమైన దానికిని పేరు.

మార్జా(రీ) లీయ స్స్మృతశ్శూద్రే
బిడాలే కాయశోధనే।

**మార్జాలీయ** : పు. ఇది శూద్రునకును, పిల్లికిని శరీర శుద్ధికిని పేరు.

తండులీయ శ్శాకభేదే
విడంగద్రుమ ధాన్యయోః॥

**తండులీయ** : పు. ఇది చిర్రికూరకును, వాయు విడంగపు చెట్టుకును, ధాన్యముకును పేరు.

తృణశూన్యం మల్లికాయాం
కేతక్యాశ్చ ఫలే ऽపి చ।

**తృణశూన్య:** న. ఇది మల్లితీగెకును, మొగలి పండుకును, పేరు. (పా. తృణశూల్యం)

మహామూల్యం మహార్ఘే స్య
త్పద్మరాగమణావపి॥ (121)

**మహామూల్య:** త్రి. గొప్ప విలువగల దానికిని, న. పద్మరాగ మాణిక్యముకును పేరు.

అధశ్శయ్యా మృతౌ భూమి
శయ్యాయాంపితృకాననే।

**అధశ్శయ్యా:** స్త్రీ. ఇది మరణముకును, భూమియందు శయనించుటకును, శ్మశాన వాటికకును పేరు.

ఉపకార్యా వస్త్రసద్మ
న్యుప కారోచితే న్యవత్॥(122)

**ఉపకార్యా:** స్త్రీ. ఇది డేరాకును, త్రి. ఉపకారమునకు తగినదానికిని పేరు.

★ అథయాంతః పంచవర్ణః ★

దుగ్ధతాలీయ మిత్యేత
ద్దుగ్ధాగ్రె దుగ్ధఫేనకే।

**దుగ్ధతాలీయ:** న. పాలమామిడి చెట్టుకును, పాల మీదినుఱుగకును పేరు.

భవేత్ప్రవచ నీ యా ఖ్యా
ప్రవాచ్యే చ ప్రవక్తరి॥

**ప్రవచనీయ:** త్రి. చెప్పదగిన దానికిని, వాచాలునకును పేరు.

కాలానుసార్యం కా (లే) లీయే

**కాలానుసార్య:** న. ఇది జాపక పర్వతమున బుట్టు

శైలేయే శంశుపాద్రుమే।

కృష్ణచందనముకును, రాతిపువ్వుకును, ఇరుగుడు చెట్టుకును పేరు.

వృషాకపాయీ శ్రీగౌర్యో
ర్జీవంత్యాం చ శతావరౌ॥

**వృషాకపాయీ** : స్త్రీ. లక్ష్మికిని, పార్వతికిని, పాల కూరకును, పిల్లిపిచ్చరకును పేరు.

ప్రత్యుద్గమనీయ ముప
స్థేయే ధౌతాంశుకద్వయే।

**ప్రత్యుద్గమనీయ**: న. పొందదగిన దానికిని, క్షాళణ చేయబడిన వస్త్రయుగ్మముకును పేరు.

విష్వక్సేన ప్రియాలక్ష్మ్యాం
త్రాయమాణౌషధావపి॥(125)

**విష్వక్సేనప్రియా** : స్త్రీ. ఇది లక్ష్మికిని, కలుద్రానుగు చెట్టుకును పేరు.

★ అథ రాంతవర్గః ★

రః పావకే చతీక్ష్ణే చ
రాస్స్మృత స్స్వర్ణ విత్తయోః।
స్రు స్స్రువే నిర్ఝరేచాపి
ద్రూ స్స్వర్ణే కామరూపిణి॥ (1)

**ర** : పు. ఇది అగ్నికిని, తీక్షణముకును పేరు.

**రాః** : పు. ఇది బంగారుకును, ధనముకును పేరు.

**స్రుః**: స్త్రీ. ఇది స్రువముకును, ప్రవాహముకును పేరు.

**ద్రూః** : పు. ఇది బంగారుకును, ఇచ్ఛాధీనమైన రూపముగల వానికిని పేరు.

శ్రీ ర్వేషరచనా శోభా
భారతీ సరళద్రుషు।
లక్ష్మ్యాం త్రివర్గ సంప(త్త్యా) త్తి
వేషో పకరణే మతా॥ (2)

**శ్రీ** : స్త్రీ. ఇది అలంకరించుటకును, కాంతికిని, సరస్వతికిని, సరళదేవదారు చెట్టుకును, లక్ష్మికిని, ధర్మార్థ కామములకును, సంపదకును, వేషముకును, సాధనముకును పేరు.

★ అథ రాంతో ద్వివర్ణః ★

అరం శీఘ్రే చ చక్రాంగే
శీఘ్రగే పునరన్యవత్।
కరో వర్షోపలే పాణౌ
శుండా ప్రత్యాయరశ్మిషు॥
ఖరస్స్యాద్గర్ద భే దేవ
తాడే తీక్ష్ణేఽసురేఽపి చ।
గరో వ్యాధా వుపవిశే
విషే చ కరణే గరం॥ (4)
చరో ద్యూతప్రభేదే స్యా

**అర** : న. ఇది శీఘ్రముకును, చక్రము యొక్క అంచుకును, త్రి. శీఘ్రగామికిని పేరు.

**కర** : పు. ఇది వడగండ్లకును, హస్తముకును, గజ తుండముకును, పన్నుకును, కిరణముకును పేరు.

**ఖర** : పు. ఇది గాడిదకును, దేవతాళ వృక్షముకును, త్రి. తీవ్రమైన దానికిని, పు. ఖరాసురునకును పేరు.

**గర** : పు. ఇది వ్యాధికిని, కృత్రిమ విషముకును, విషముకును, న. పంచాంగకరణముకును పేరు.

**చర** : పు. ఇది ద్యూత విశేషముకును, గుణదోష

చ్చార జంగమయో శ్చలే।

గ్రహణార్థము రాజుచే పంపబడిన గూఢచారికిని త్రి. చలించు దానికిని, పు. చలించుటకును పేరు.

నరం తు రామకర్పూరే
నరోऽజేమానవేऽర్జునే॥

**నర :** న. ఇది రామకర్పూరమను తృణవిశేషముకును, పు. బ్రహ్మకును, మనుష్యునకును, అర్జునునకును పేరు.

పర స్స్యాదుత్తమా న్యాత్మ
వైరి దూరేషు కేవలే।
పరమవ్యయమిచ్ఛంతి

**పర :** త్రి. ఇది శ్రేష్ఠమైన దానికిని, మరియొక దానికిని, పు. పరమాత్మకును, శత్రువుకును, త్రి. దూరమైన దానికిని, అ. ముఖ్యముకును పేరు.

భరోऽతిశయ భారయోః॥

**భర :** పు. ఇది అతిశయముకును, బరువుకును పేరు.

వరోऽభీష్టే దేవతాదే
ర్వరో జామాతృ షిద్గయోః।
శ్రేష్ఠేऽన్యవత్పరివృతౌ
వరం కాశ్మీరజే మతం॥ (7)
త్రిఫలాయాం వరాప్రోక్తా
శతావర్యాం వరీవరం।
అవ్యయం స్యాన్మనాగిష్టే

**వర :** పు. ఇది దేవతలు మొదలగు వారివల్లనుంచి కోరికకును, అల్లునకును, విటునకును, త్రి. శ్రేష్ఠమైనదానికిని, పు. ఆవరణముకును, (వరించుటయని కొందరు) న. కుంకుమకును, స్త్రీ. కరకాదిత్రి ఫలములకును, ఈ. స్త్రీ. పిల్లిపిచ్చ రకును, అ. ఇంచుక యిష్టమైన దానికిని పేరు.

శరో దధ్యగ్ర బాణయోః॥ (8)
శరం నీరే శరః ప్రోక్త
శ్శణ తేజనయో రపి।

**శర :** పు. తోడు పెట్టిన పెరుగుపై భాగముకును, బాణముకును, న. జలముకును, పు. రెల్లుకును, కాకి వెదురుకును పేరు.

స్వరోऽకారాదిమాత్రా సు
మధ్యమాదిషు చధ్వనౌ॥ (9)
ఉదాత్తాదిష్వపి ప్రోక్త
స్స్వరో నాసాసమీరణే।

**స్వర :** పు. ఇది హ్రస్వదీర్ఘ ప్లుతరూపములైన అకారాది షోడశ స్వరములకును, మధ్యమాది సంగీత స్వరములకును, ప్రాణిధ్వనికిని, ఉదాత్తాది వైదిక స్వరములకును, ముక్కులోని గాలికిని పేరు.

ధరస్తు శైలే కార్పాస
తూలకే కమఠాధిపే॥ (10)
ధరా మేదసి భూమ్యాంచ
స్త్రీణాం గర్భా శయేऽపి చ।

**ధర :** పు. ఇది పర్వతముకును, ప్రత్తి దూదికిని, కూర్మరాజుకును, స్త్రీ. రొమ్ము చుట్టునుండు క్రొవ్వుకును, భూమికిని మావికిని పేరు.

క్షరం నీరే క్షరో మేఘే

**క్షర :** న. ఇది జలముకును, పు. మేఘముకును పేరు.

దర స్సాధ్వస గర్తయోః ॥
కందరే తు దరీ మా హ
రీషదర్థే దరావ్యయం।
క్షుర స్స్యాచ్చేదన ద్రవ్యే
కోకిలాక్షే చ గోక్షు రే॥(12)

**దర** : పు. ఇది భయముకును, గోతికిని, ఈ. స్త్రీ. కొండగుహకును. అ. ఇంచుకయనుటకును పేరు.

**క్షుర** : పు. ఇది కత్తికిని, గొలిమిడి చెట్టుకును, ఏనుగుపల్లేరు చెట్టుకును పేరు.

పురం పాటలిపుత్రే స్యా
ద్గృహోపరిగృహే పురం।
పురం పురిశరీరేచ
గుగ్గులౌకథితః పురః ॥ (13)
పురా వ్యయం పూర్వకాలే

**పుర** : న. ఇది పాటలీపుత్రమను నగరముకును, మేడకును, పట్టణముకును, దేహముకును, పు. గుగ్గిలపుచెట్టుకును, అ. పూర్వకాలముకును పేరు.

ఖురః కోలదళే శఫే।

**ఖుర** : పు. ఇది నఖమనెడు గంధద్రవ్యముకును, డెక్కకును పేరు.

సురో దేవే సురా మద్యే
చషకేఽపి సురా క్వచిత్॥

**సుర** : పు. ఇది దేవునకును, స్త్రీ. కల్లుకును, పానపాత్రముకును పేరు.

కారో వధే నిశ్చయే చ
బలౌ యత్నే యతావపి।
కారస్తు పాదశైలే చ
కారాధూత్యాం ప్రసేవకే॥(15)
బంధనే బంధనాగారే
హేమ కారికయోరపి।

**కార** : పు. ఇది చంపుటకును, నిశ్చయముకును, పన్నుకును, ప్రయత్నముకును, సన్యాసికిని, ప్రత్యంత పర్వతముకును, స్త్రీ. దూతికకును, వీణకరిదెకును, కట్టుటకును, చెరసాలకును, బంగారుకును, ప్రామాణిక శ్లోకముకును పేరు.

చారః ప్రియాళువృక్షే చ
గతౌ బంధాపసర్పయోః॥

**చార** : పు. ఇది మొరటి చెట్టుకును, గమనముకును, కట్టుటకును, రాజాజ్ఞచే సంచరించు గూఢచారికిని పేరు.

పారం పరతటే ప్రాంతే
పారీ పాత్రీ పరాగయోః।
కర్కరీ పూరయోః పారీ
పాదరజ్జ్వాం చదంతి నః॥(17)

**పార**: న. ఇది ఆవలియొడ్డుకును, సమీపముకును, ఈ. స్త్రీ. పాత్రముకును, ధూళికిని, గరిగెపిడతకును, జలసమూహముకును, ఏనుగు కాలికి కట్టెడు గొలుసుకును పేరు.

వార స్సూర్యాది దివసే
వారోఽవసర బృందయోః।

**వార** : పు. ఇది ఆదివారము మొదలగు వాటికిని, సమయముకును, సమూహముకును, కుబ్జమను

కుబ్జవృక్షే హరే వారం
ద్వారేమద్యస్యభాజనే॥ (18)
తారో ముక్తాదిసంశుద్ధౌ
తరణే శుద్ధమౌక్తికే।
తారం చ రజతేఽత్యుచ్చ
స్వరేఽప్యన్యవ దీరితం॥(19)
బుఖా క్ష్మ్యధయో స్తారా
సు గ్రీవగురుయోషితోః।
బుద్ధదేవ్యాం మతాతారా.
శార శ్శబల వాతయోః॥
భారస్తు వీవధే స్వర్ణ
పలానామయుతద్వయే।
మారో మృతౌ వృషేఽనంగే
మారీ చండ్యా జనక్షయే॥(21)
స్ఫార స్స్యాద్వికటే స్ఫారః
కనకాదేశ్చ బుద్బుదే।
క్షారో రసాంతరే ధూర్తే
లవణే కాచ భస్మనోః॥
హారో ముక్తావళౌ యుద్ధేఽ
ప్యారః క్షితిసుతేఽర్కజే
ఆరాతు చర్మభేదిన్యాం॥

నార స్తర్ణ క నీరయోః॥(23)
నారం జ్ఞానేఽపి నారస్స్యా
న్నరసంబంధిని త్రిషు।
సారో బలే మజ్జని చ
స్థిరాంశే న్యాయ్యే చ నీరే
చ ధనే చ సారం। వరేఽన్య

వృక్షవిశేషముకును, శివునకును, న. ద్వారము కును, కల్లుకుండకును పేరు.

**తార**: పు. ఇది ముత్యము మొదలగు వాటి శుద్ధికిని, దాటుటకును, శుద్ధిచేసిన ముత్యముకును, న. వెండికిని, త్రి. ఉన్నతస్వరముకును, స్త్రీ. నక్షత్రము కును, కంటి నల్లగుడ్డుకును, సుగ్రీవుని భార్య కును, బృహస్పతి భార్యకును, బుద్ధదేవుని భార్య కును పేరు.

**శార**: పు. ఇది శబలవర్ణముకును, వాయువుకును పేరు.

**భార**: పు. ఇది కావడికిని, రెండుపేల పలములయెత్తు బంగారముకును పేరు. (బారువ)

**మార** : పు. చావుకును, అబోతుకును, మన్మథు నకును, ఈ. స్త్రీ. పార్వతికిని, మారకముకును పేరు.

**స్ఫార** : త్రి. ఇది వికటమైన దానికిని పు. బంగారు మొదలగు వాటి బుడగకును పేరు.

**క్షార** : పు. ఇది కారముకును, ధూర్తునకును, ఉప్పునకును, గాజుకును, బూడిదెకును పేరు.

**హార**: పు. ఇది ముత్యాలహారముకును, యుద్ధము కును పేరు.

**ఆర** : పు. ఇది అంగారకునకును, శనికిని, స్త్రీ. ఆరెయను చెప్పులుకుట్టుసాధనముకును పేరు.

**నార** : పు. లేగదూడకును, జలముకును, న. బ్రహ్మజ్ఞానముకును, త్రి. మనుష్య సంబంధమైన దానికిని పేరు.

**సార** : పు. ఇది బలముకును, ఎముకల నడుమ నుండెడు క్రొవ్వుకును, వృక్షాదులచేవకును, న. న్యాయముకును, జలముకును, ధనముకును, త్రి.

వత్సారముదాహరంతి।
ద్వారం పునర్నిర్గమనే
ऽప్యుపాయే॥(25)
పూరో జలప్రవాహేస్యా
ద్వ్రణసంశుద్ధి ఖాద్యయోః।
చీరం తు గోస్తనే వస్త్రే
చూడాయాం సీసకేऽపి చ॥
క్రూరస్తు కఠినే ఘోరే
నృశంసే (త్వ)ऽప్యభిధేయవత్।
సూర శ్చారభటే సూర్యే
చోర శ్చోర సుగంధయోః॥

తీరం తటే త్రపౌ తీరః
సీర స్తిగ్మకరే హలే।
చీరీ కచ్ఛురికా ఝిల్ల్యో
స్స్వైర స్వచ్ఛంద మందయోః॥(28)

జీరః ఖడ్గే వణిగ్ద్రవ్యే
మీర స్తోయధి శైలఃయోః।
క్షీరం నీరే చ దుగ్ధే చ
కీరో జనపదే శుకే॥(29)
గౌరః పీతేऽరుణే శ్వేతే
విశుద్ధే చాభిధేయవత్।
గౌరం తు విశదే పద్మ
కేసరే సితసర్ష పే॥(30)
గౌర శ్శశిని గౌరీ తు
నగ్నకన్యోమయోస్స్మృతా।
రోచనీ రజనీ పింగా

శ్రేష్ఠమైన దానికిని పేరు.

**ద్వార :** న. ఇది ద్వారముకును ఉపాయముకును పేరు.

**పూర :** పు. ఇది జలప్రవాహముకును, వ్రణశుద్ధికిని, భక్ష్య విశేషముకును పేరు.

**చీర:** న. ఇది నాల్గు పేటల ముత్యాలహారముకును, వస్త్ర విశేషముకును, శిఖకును, సీసముకును పేరు.

**క్రూర:** త్రి. ఇది కఠినమైన దానికిని, భయంకరమైన దానికిని ఘాతుకునకును పేరు.

**సూర:** పు. ఇది కాలిబంటుకును, సూర్యునకును పేరు:

**చోర :** పు. ఇది దొంగకును, చోరకమను సుగంధద్రవ్యముకును పేరు.

**తీర:** న. ఇది ఏటి యొడ్డుకును, పు. తగరముకును పేరు.

**సీర :** పు. ఇది సూర్యునకును, నాగటికిని పేరు.

**చీరీ :** స్త్రీ. ఇది కచ్ఛోరముకును, చిమ్మెటకును పేరు.

**స్వైర:** త్రి. యథేచ్ఛగా విహరించువానికిని, మందునకును పేరు.

**జీర :** పు. ఇది కత్తికిని, జీలకఱ్ఱకును పేరు.

**మీర :** పు. సముద్రముకును, పర్వతముకును పేరు.

**క్షీర :** న. ఇది జలముకును, పాలకును పేరు.

**కీర :** పు. ఇది దేశముకును, చిలుకకును పేరు.

**గౌర:** త్రి. ఇది పచ్చని వర్ణముగల దానికిని, ఎరుపు వర్ణముగల దానికిని, తెల్లని దానికిని, పరిశుద్ధమైన దానికిని, న. స్వచ్ఛ వర్ణముకును, పద్మకింజల్కముకును, పు. తెల్లావాలకును, చంద్రునకును, ఈ. స్త్రీ. 8 సం. వయసు గల బట్టకట్టని స్త్రీకిని, పార్వతికిని, గోరోచనముకును, రాత్రికిని, పసపుకును, ప్రేంకణపు చెట్టుకును, భూమికిని, నదీవిశేషము

ప్రియంగు వసుధాసు చ॥(31)
నదీభేదేఽపి గౌరీ స్యా
ద్వరుణస్యచయోషితి।

పౌరం తు కత్తృణే పౌర
స్మృతః పురభవేఽన్యవత్॥(32)
వేరం శరీరే కాశ్మీరే
వేరం వాతింగణేఽపి చ।
ఘోరం భీమే హరే ఘోర
ష్టారో లంగ తురంగయోః॥(33)
హోరాలగ్నేఽపిరాశ్యర్ధే
శాస్త్ర రేఖాభిధో రపి।

హీరా పిపీలికా లక్ష్మ్యో
ర్హీర శ్శంకర వజ్రయోః॥
గోత్రం నామ్నికులే క్షేత్రే
కాననే విత్త వర్త్మనోః।
సంభావ నీయభోధేఽపి
గోత్రః క్షోణీధరే మతః॥(35)
గోసమూహ భువో ర్గోత్రా
గాత్ర మంగే కళేబరే।
స్తంబేరమాగ్రజంఘాది
విభాగే చ సమీరితం॥(36)
పత్రం స్యాద్వాహనే పర్ణే
పక్షే చ శర పక్షిణోః।
పాత్రం తు భాజనే యోగ్యే
పాత్రం తీరద్వయాంతరే॥
పాత్రం స్రువాదౌపర్ణే పి

కును, వరుణదేవుని భార్యకును పేరు. (రక్తవర్ణార్థ మందు 'తరుణాదిత్యగౌరైశ్చ' అని రామాయణము. శ్వేతార్థమందు; కైలాస గౌరం వృషమారురుక్షోః' అని రఘువంశము)

**పౌర**: న. ఇది కామంచి గడ్డికిని, త్రి. పట్టణమందైన దానికిని పేరు.

**వేర** : న. ఇది దేహముకును, కుంకుమకును, వంగచెట్టుకును పేరు.

**ఘోర**: న. భయానకరసముకును, పు. శివునకును పేరు.

**టార** : పు. విటునకును, అశ్వముకును పేరు.

**హోరా** : స్త్రీ. ఇది లగ్నముకును, రెండున్నర ఘడియకాలముకును (గంట), జ్యోతిశ్శాస్త్రముకును, రేఖా విశేషముకును పేరు.

**హీరా** : స్త్రీ. చీమకును, లక్ష్మికిని, పు. శివునకును, వజ్రమణికిని పేరు.

**గోత్ర**: న. ఇది పేరుకును, వంబముకును, వరిపంట భూమికిని, అడవికిని, ధనముకును, మార్గముకును, కొనియాడదగిన జ్ఞానముకును, పు. పర్వతముకును, స్త్రీ. గోవులమందకును, భూమికిని పేరు.

**గాత్ర**: న. ఇది కరచరణాద్యవయవముకును, శరీరముకును, ఏనుగ పిక్కల ముందరి భాగముకును పేరు.

**పత్ర** : న. ఇది వాహనముకును, ఆకుకును, బాణపు రెక్కకును, పక్షి రెక్కకును పేరు.

**పాత్ర** : న. ఇది మృల్లోహాది పాత్రముకును, యోగ్యునకును, ఏటి రెండు గట్ల నడిమి భాగముకును, స్రుక్స్రువాది పాత్రములకును, ఆకుకును,

రాజమంత్రిణి చోచ్యతే।
రాజు యొక్క ప్రధానోద్యోగికిని పేరు.

పోత్రం వస్త్రే ముఖాగ్రే చ
సూకరస్య హలస్యచ॥
**పోత్ర** : న. ఇది వలువకును, పందిముట్టెకును, నాగటి మొనకును పేరు.

చిత్రం స్యాదద్భుతా లేఖ్య
తిలకేషు విహాయసి।
చిత్రా ఖుపర్ణీ గోతుంబా
సు భద్రా దంతికాసు చ॥(39)
ఋక్షా ప్సరోఽహిభేదేషు
కర్బు రేచాభిధేయవత్।
**చిత్ర** : న. ఇది అచ్చెరువుకును, చిత్తరువుకును, నుదుటి బొట్టుకును, ఆకసముకును, స్త్రీ. ఎలుక చెవి చెట్టుకును, పిల్లపాపర చెట్టుకును, గుమ్మడి చెట్టుకును, నాగదంతిచెట్టుకును, చిత్రా నక్షత్రముకును, అప్సర స్త్రీ విశేషముకును, సర్పవిశేషముకును, త్రి. కర్బురవర్ణముగల దానికిని పేరు.

చైత్రం మృతకచిత్యేస్యా
చ్చైత్రో మాసా ద్రిభేదయోః॥(40)
**చైత్ర** : న. ఇది పీనుగలను కాల్చు చితికిని, పు. చైత్ర మాసముకును, చైత్రమను కులపర్వతముకును పేరు.

వృత్రో రిపౌఘనే ధ్వాంతే
శైలే శక్రేచ దానవే।
**వృత్ర** : పు. ఇది శత్రువుకును, మేఘముకును, చీకటికిని, పర్వత విశేషముకును, ఇంద్రునకును, వృత్రాసురునకును పేరు.

సత్ర మాచ్ఛాదనే యజ్ఞే
సదాదానే చ కైతవే॥(41)
**సత్ర** : న. ఇది వస్త్రముకును, యజ్ఞముకును, ఎల్లప్పుడును దానముచేయుటకును, మిషకును పేరు.

సూత్రం తు సూచనగ్రంథే
సూత్రం తంతు వ్యవస్థయోః।
**సూత్ర** : న. ఇది వ్యాకరణాది శాస్త్ర సూచన గ్రంథముకును, ధారమునకును, మర్యాదకును పేరు.

మిత్రం సుహృది మిత్రోఽర్కే
**మిత్ర** : న. ఇది స్నేహితునకును, పు. సూర్యునకును పేరు.

శాస్త్రం గ్రంథ నిదేశయోః॥(42)
**శాస్త్ర**: న. ఇది వ్యాకరణాది శాస్త్ర గ్రంథముకును, ఆజ్ఞకును పేరు.

మాత్రం చావధృతౌ కార్త్స్న్యే
మాత్రా కర్ణవిభూషణే।
అక్షరావయవే విత్తే
మానే ల్పేచ పరచ్ఛదే॥(43)
**మాత్ర** : న. ఇది నిశ్చయముకును, అంతయుననుటకును, స్త్రీ. చెవియాభరణముకును, వర్ణోచ్చారణ కాలముకును, ధనముకును, పరిమాణముకును స్వల్పార్థముకును, గజాశ్వాది పరివారముకును పేరు.

శస్త్రం లోహా స్త్రయోశ్చస్త్రీ
ఛురికాయాం చ విశ్రుతా।
**శస్త్ర** : న. ఇది ఇనుముకును, అస్త్రముకును, ఈ. స్త్రీ. చూరకత్తికిని పేరు.

అస్త్రం ప్రహరణే చాపే
వక్త్రం ఛందోంతరే ముఖే॥(44)

**అస్త్ర** : న. ఇది ఆయుధముకును, ధనస్సుకును పేరు.
**వక్త్ర**: న. ఇది వృత్త విశేషముకును, ముఖముకును పేరు.

నేత్రం మథిగుణే వస్త్రే
తరుమూలే విలోచనే।
రథే జటాయాం నాడ్యాం చ
నేత్రో నేతరి వాచ్యవత్॥

**నేత్ర** : న. ఇది కవ్వపు త్రాటికిని, వలువకును, చెట్టుపేరుకును, కంటికిని, రథముకును, జడకును, నరముకును, త్రి. రక్షించు దానికిని పేరు.

క్షేత్రం శరీరే కేదారే
సిద్ధస్థాన కళత్రయోః।

**క్షేత్ర** : న. ఇది దేహముకును, పంట భూమికిని, పుణ్యక్షేత్రముకును, భార్యకును పేరు.

రేత్రం రేతసి పియ్యూషే
పటవాసేఽపి సూతకే॥

**రేత్ర** : న. ఇధి శుక్లముకును, అమృతముకును, వస్త్ర పరిమళ ద్రవ్యముకును, (సెంటు) పాదరస ముకును పేరు.

మంత్రో వేదప్రభేదేస్యా
ద్దేవాదీనాం చ సాధనే।

**మంత్ర**: పు. ఇదివేదమందలి మంత్ర భాగముకును, దేవతలను వశపరచుకొనుటకును, రహస్య సంభాషణముకును పేరు.

గుప్తవాదే చ
తోత్రంతు ప్రాజనే
వేణుకేఽపి చ॥(47)

**తోత్ర**: న. ఇది కొరడాకును, ఏనుగును శిక్షించుటకై అలుగు వేసిన వెదురు కఱ్ఱకును పేరు.

తంత్రంకుటుంబ కృత్యేస్యా
త్కారణే చ పరిచ్ఛదే।
శాస్త్ర ప్రధానే సిద్ధాంతే
తంతువాయేఽగదోత్తమే॥(48)
తత్వాదిసాధనోపాయే
శ్రుతిశాఖాంతరేఽపి చ।
ఇతికర్తవ్యతాయాం చ
తంత్రీ వీణాగుణే తనోః॥ (49)
శిరాయా మమృతాయాం చ

**తంత్ర** : న. ఇది కుటుంబ పోషణార్థమైన వ్యాపార ముకును, హేతువుకును, పరివారముకును, శాస్త్ర ముకును, ముఖ్యముకును, సిద్ధాంతముకును, మగ్గముకును, ఔషధ శ్రేష్ఠముకును, జ్ఞానసాధన మగు యోగాదులకును, వేదశాఖా విశేషముకును, ఈలాగునచేయవలయుననుటకును, ఈ. స్త్రీ. వీణ తీగకును, నరముకును, తిప్పతీగకును పేరు.

ఛత్ర మాతపవారణే।
ఛత్రా మధురికాయాం చ
కుస్తుంబరు శిలీంధ్రయోః॥

**ఛత్ర** : న. గొడుగుకును, స్త్రీ. పిన్న సదాప చెట్టుకును, కొత్తిమిరికిని, నేల తాడి చెట్టుకును పేరు.

చక్రో గణే చక్రవాకే
చక్రం సైన్యరథాంగయోః।
గ్రామజాలే కులాలస్య
భాండే రాష్ట్రేస్త్రయోరపి॥
అంభసామపి చావర్తే
చుక్రశ్చామ్లేమ్లవేతసే।
చుక్రీ చాంగేరికాయాం చ
వృక్షామ్లే చుక్రమిష్యతే॥(52)
శుక్రః కావ్యే నలే జ్యేష్ఠే
శుక్రో రేతో క్షిరోగయోః।
శుక్రం
శక్రో మహేంద్రే స్యా
త్కుటజార్జున భూరుహోః॥(53)
నక్రః కుంభీరకే నక్రం
నాసాయా మగ్రదారుణి।
వక్రస్యాత్కుటిలేక్రూరే
పుటభేదే శనైశ్చరే॥
అగ్రమాలంబనే వ్రాతే
పరిమాణే ఫలస్య చ।
ప్రాంతేపురస్తా దధికే
ప్రధానే ప్రథమోర్ధ్వయోః॥(55)
ఉగ్రశ్శూద్రాసుతే క్షత్రా
చ్ఛీ కంఠే చోత్కటే ऽన్యవత్।
ఉగ్రావచా ఛిక్కికయో
ర్వ్యగ్రో వ్యాసక్త ఆకులే॥(56)

**చక్ర :** పు. ఇది సమూహముకును, చక్రవాక పక్షికిని, న. చతురంగ సైన్యముకును, రథ చక్రముకును, గ్రామ సమూహముకును. కుమ్మరిసారెకును, రాజ్యముకును, చక్రాయుధముకును, నీటి సుడికిని పేరు.

**చుక్ర :** పు. ఇది చింతచెట్టుకును, పుల్ల ప్రబ్బచెట్టుకును, ఈ.స్త్రీ. పులిచింతచెట్టుకును, న. చింత పండుకును పేరు.

**శుక్ర :** పు. ఇది శుక్రాచార్యునకును, అగ్నికిని, జ్యేష్ఠమాసముకును, పు. రేతస్సుకును, నేత్ర రోగ విశేషముకును పేరు.

**శక్ర :** పు. ఇది ఇంద్రునకును, కొండిశచెట్టుకును, మద్దిచెట్టుకును పేరు.

**నక్ర :** పు. ఇది కాఋమొసలికిని, న. ముక్కుకును, ద్వారముమీద వేసెడు నక్రాకారమైన కమ్మికిని పేరు.

**వక్ర :** త్రి. ఇది వంకరయైన దానికిని, భయంకరమైన దానికిని, పు. నదీవక్రముకును, శనిగ్రహముకును పేరు.

**అగ్ర:** న. ఇది ఆధారముకును, సమూహముకును, ఫలపరిమాణముకును, సమీపముకును, ముందరి భాగముకును, త్రి. అధికమైనదానికిని, ముఖ్యమైన దానికిని, మొదటి దానికిని, మీదైన దానికిని పేరు.

**ఉగ్ర :** పు. క్షత్రియునివలన శూద్ర స్త్రీయందు బుట్టిన వానికిని, శివునకును, త్రి. తీవ్రమైన దాని కిని, స్త్రీ. నల్లవసకును, ఈ పేరుగల గంధద్రవ్యముకు పేరు.

**వ్యగ్ర :** త్రి. అధికాసక్తిగల దానికిని, వ్యాకులమైన దానికిని పేరు.

భద్రం స్యాన్మంగళే హేమ్ని
ముస్తకే కరణాంతరే।

**భద్ర:** న. ఇది శుభముకును, బంగారుకును, భద్ర ముస్తకును, భద్రకరణముకును, పు. శివునకును,

భద్రో రుద్రే వృషే రామ
భద్రే మేరుకదంబయోః॥ (57)
హస్తిజాత్యంతరే భద్రో
వాచ్యవచ్ఛ్రేష్ఠ సాధునోః।
భద్రా మందాకినీ రాస్నా
కృష్ణానంతాసు కట్ఫలే॥(58)
క్షుద్ర స్స్యాదధమే క్రూరే
కృపణేऽల్పే చ వాచ్యవత్।
క్షుద్రా వేశ్యా నటీ కంట
కారికా సరఘాసు చ॥ (59)
చాంగేరీ బృహతీ హింస్రా
మక్షికామాత్రకేషు చ।
క్షౌద్రం మధుని పానీయే
వర్ధ్రంత్రపు వరత్రయోః॥(60)
గృధ్రః ఖగాంతరే ప్రోక్తో
వాచ్యవచ్చార్ధ లుబ్ధకే।
రోధ్ర (స్రో) శ్శా బరకే రోధ్ర
మవరాధేऽపి కిల్బిషే॥(61)
నీధ్రం నేమౌ వలీకేऽద్రౌ
రేవతీభే చ కాననే।

ఎద్దుకును, శ్రీరామునకును, మేరు పర్వతము కును, కడిమిచెట్టుకును, భద్రగజముకును, త్రి. శ్రేష్ఠమైన దానికిని, యోగ్యమైన దానికిని, స్త్రీ. ఆకాశగంగకును, దుంపరాష్ట్రముకును, పిప్పలి చెట్టుకును, సుగంధిపాల చెట్టుకును, గుమ్మడు తీకు చెట్టుకును పేరు.

**క్షుద్ర**: త్రి. నీచునకును, క్రూరునకును, లోభికిని, అల్పమైన దానికిని, స్త్రీ. వెలయాలికిని, నాట్యకత్తె కును, వాకుడు చెట్టుకును, తేనెటీగకును, పులి చింతకును, నేలములగ చెట్టుకును, గురివెందలత కును, సామాన్యపు తీగకును పేరు.

**క్షౌద్ర** : న. ఇది తేనెకును, జలముకును పేరు.
**వర్ధ్ర** : న. ఇది సీసముకును, తోలు వాఱుకును పేరు.
**గృధ్ర**: పు. గెద్దకును, త్రి. ధనమందులుబ్ధత్వముగల వానికిని పేరు.

**రోధ్ర** : పు. ఇది తెల్లలొద్దుగ చెట్టుకును, న. తప్పిదముకును, పాపముకును పేరు.

**నీధ్ర** : న. ఇది చక్రాగ్రముకును, ఇంటి చూరు కును, పర్వతముకును, రేవతీ నక్షత్రముకును, అడవికిని పేరు.

రాష్ట్ర ముద్దిష్ట ముత్పాతే
తథా స్యాదుపవర్తనే॥
కృచ్ఛ్ర ముద్దిష్ట మాభీలే
పాప సాంత పనాదినోః।
చంద్ర స్సుధాంశు కర్పూర
కంపిల్ల స్స్వర్ణవారిషు॥

**రాష్ట్ర** : న. ఇది ఉపద్రవముకును, జనపద సమూహముకును పేరు.

**కృచ్ఛ్ర** : న. ఇది కష్టముకును, పాపముకును, సాంతపనాది వ్రతములకును పేరు.

**చంద్ర**: పు. ఇది చంద్రునకును, కర్పూరముకును, కంపిల్లమను గంధద్రవ్యముకును, బంగారుకును, జలముకును పేరు.

ఇంద్ర శ్శచీపతా వంత
రాత్మన్యాదిత్య యోగయోః।
ఇంద్రా ఫణిజ్జకే
సాంద్రో ఘనకాననయో
ర్మృదౌ॥ (64)
గుంద్రస్తే జనకే గుంద్రా
ప్రియంగౌ భద్రముస్తకే।
కైవర్తీముస్తకే చాపి
రౌద్రో నాట్యరసాంతరే॥(65)
రౌద్రోపి భీషణే తీవ్రే
రౌద్రా స్కందస్యమాతరి।
ఓఢ్రో జనే జపా వృక్షే
చోఢ్రా జన పదాంతరే॥
పితృ కేదారయో ర్వప్రో
వప్రః ప్రకార రోధసోః।
పుంద్రో దైత్యవిశేషే క్షు
భేదయో రతిముక్తకే॥(67)
చిత్రే కృమౌ పుండరీకే
పుంద్రా స్యుర్నీవృదంతరే।
వజ్రం హీరక దంభోళి(బా)
వాలకా మలకేషుచ॥(68)
వజ్రా గుడూచికాయాం స్యా
త్తామ్రం శుల్బేఽరుణేఽన్యవత్।
తీవ్ర మత్యుష్ణ కటుక
నితాంతేష్వభిధేయవత్॥(69)
తీవ్రాచ కటురోహిణ్యా
మాసురీ గండదూర్వయోః।
అస్రః కోణే శిరసిజే

**ఇంద్ర:** పు. ఇది దేవరాజుకును, అంతరాత్మకును, ద్వాదశాదిత్యులలో నొకనికిని, పంచాంగయోగ భేదముకును, స్త్రీ. మరువముకును పేరు.

**సాంద్ర:** త్రి. ఇది దట్టమైన దానికిని, న. అడవికిని, మృదువైన దానికిని పేరు.

**గుంద్ర:** పు. ఇది కాకివెదురుకును, స్త్రీ. ప్రేంకణపు చెట్టుకును. భద్రతుంగముస్తకును, గుంద్రతుంగ ముస్తకును పేరు.

**రౌద్ర:** పు. రౌద్రరసముకును, త్రి. భయంకరమైన దానికిని, తీవ్రమైన దానికిని, స్త్రీ. పార్వతికిని పేరు.

**ఓఢ్ర:** పు. ఓఢ్రదేశస్థునకును, మంకెన చెట్టుకును, ఓఢ్రదేశముకును పేరు.

**వప్ర :** పు. ఇది తండ్రికిని, పంట భూమికిని, పు. కోటకును, ఏటియొడ్డుకును పేరు.

**పుండ్ర:** పు. ఇది పుండ్రకాసురునకును, చెరుకుల లోని భేదముకును, పూలగురివెంద చెట్టుకును, తిలకముకును, పురుగుకును, తెల్లదామర పువ్వు కును, దేశవిశేషముకును పేరు.

**వజ్ర:** న. ఇది వజ్రమణికిని, వజ్రాయుధముకును, కురువేరుకును, ఉసిరిగ చెట్టుకును, స్త్రీ. తిప్పతీగ కును పేరు.

**తామ్ర:** న. ఇది రాగికిని, త్రి. ఎఱ్ఱని దానికిని పేరు.

**తీవ్ర:** త్రి. ఇది మిగులవేడియైన దానికిని, కారము గల దానికిని, విస్తారమైన దానికిని, స్త్రీ. కటుక రోహిణికిని, నల్లావాలకును, గరికెలోని భేదము కును పేరు.

**అస్రః:** పు. ఇది మూలకును, తలవెంట్రుకలకును,

| | |
|---|---|
| చాస్ర మస్రుణి చేష్యతే॥(70) | న. కన్నీటికిని, నెత్తురుకును పేరు. |
| దస్రః ఖరే చాశ్వినేయే | **దస్ర**: పు. గాడిదకును, అశ్వినీదేవతలకును పేరు. |
| ఘస్రో దివసహింస్రయోః। | **ఘస్ర** : పు. ఇది దినముకును, త్రి. హింసించు దానికిని పేరు. |
| వాస్రోఽపి దివసే వాస్రం మందిరే చ చతుష్పథే॥ | **వాస్ర**: పు. ఇది దినముకును, న. గృహముకును, నాలుగు త్రోవలు కలసినచోటుకును పేరు. |
| శీఘ్రం ధృతగతౌ శీఘ్రం చంక్రాంగో శీరయోరపి। | **శీఘ్ర** : త్రి. ఇది వేగముగా నడచు దానికిని, న. హంసకును, వట్టివేరుకును పేరు. |
| వ్యాఘ్రోద్వీపిని విఖ్యాతో రకైరండ కరంజయోః॥ వ్యాఘ్రీ నిదిగ్ధికాయాంచ శ్రేష్ఠే స్యాదుత్తరస్థితః। | **వ్యాఘ్ర** : పు. ఇది పెద్దపులికిని, ఎఱ్ఱాముదపు చెట్టుకును, నఖమనెడి గంధ ద్రవ్యముకును, ఈ. స్త్రీ. వాకుడుచెట్టుకును, సమాసోత్తరపదమైనపుడు శ్రేష్ఠముకును పేరు. |
| అభ్రం నభ స్వర్గబలాహకేషు। | **అభ్ర** : న. ఇది ఆకాశముకును, స్వర్గముకును, మేఘముకును పేరు. |
| శుభ్రం ప్రదీప్తే ధవళేఽభ్రకేచ। | **శుభ్ర**: త్రి. ప్రకాశించుదానికిని, తెల్లని దానికిని, న. అభ్రకముకును పేరు. |
| బభ్రుర్విశాలే నకులే కృశానావ్యాజే మునౌ శూలిని పింగళే చ॥(73) | **బభ్రు** : పు. ఇది విస్తారముకును, ముంగిసకును, అగ్నికిని, నేతికిని, శివునకును, పింగళవర్ణముకును పేరు. |
| శిగ్రు శ్శోభాంజనే శాకే | **శిగ్రు**: పు. ఇది మునుగచెట్టుకును, అన్నిశాకములకును పేరు. |
| శరుః కులిశ కోపయోః। | **శరుః** : పు. ఇది వజ్రాయుధముకును, కోపముకును పేరు. |
| స్వరుర్వజ్రేఽధ్వరే బాణే యూపఖండేపి చ స్వరుః॥(74) | **స్వరు** : పు. ఇది వజ్రాయుధముకును, యజ్ఞముకును, బాణముకును, యూపస్తంభమందలియొక భాగముకును పేరు. |
| ఖరు ర్దంతే హరే దర్పే హయే శ్వేతే తు వాచ్యవత్। | **ఖరు**: పు. ఇది దంతముకును, శివునకును, గర్వముకును, అశ్వముకును, త్రి. తెల్లని దానికిని పేరు. |

చరుర్భాండేతు హవ్యాన్నే

**చరు :** పు. ఇది కుండకును, హోమార్థమైనయన్నముకును పేరు.

భరు ర్భర్తరి కాంచనే॥

**భరు :** పు. ఇది మగనికిని, బంగారుకును పేరు.

గురు ర్నిషేకాదికరే పి
త్రాదౌ సురమంత్రిణి।
దుర్భరా లఘునోః ప్రోక్తో
గురు ర్మహతి వాచ్యవత్॥

**గురు :** పు. ఇది విధ్యుక్తముగా నిషేక, సీమంతోన్నయనాదులను జేయువానికిని, తండ్రి, పురోహితుడు మొదలగువారికిని, బృహస్పతికిని, త్రి. భరించ శక్యముగానిదానికిని, అధికమైనదానికిని, శ్రేష్ఠమైనదానికిని పేరు.

రురు ర్మృగే దైత్యభేదే

**రురు :** పు. ఇది నల్లచారలు గల దుప్పికిని, రాక్షస భేదముకును పేరు.

కారుః కారక శిల్పినోః।
విశ్వకర్మణి శిల్పేచ

**కారు :** పు. ఇది చేయువానికిని, వడ్రంగి మొదలగు పనివానికిని, విశ్వకర్మకును, శిల్పముకును పేరు.

కురు శ్రీకంఠ జాంగలే॥(77)
ఓదనే నృపభేదే చ

**కురు :** పు. ఇది కురుదేశమందైన మరు భూమికిని, అన్నముకును, కురురాజుకును పేరు.

పురుః ప్రాజ్య పరాగయోః।
పురు స్స్వర్లోక నృపయోః

**పురు :** పు. ఇది విస్తారముకును, దూళికిని, స్వర్గలోకముకును, పురురాజుకును పేరు.

మరు ర్భూధర ధన్వనోః॥

**మరు :** పు. ఇది పర్వతముకును, నిర్జల భూమికిని పేరు.

ఆరు స్తరువిశేషేఽపి
తథా కర్కట దంష్ట్రిణోః।

**ఆరు :** పు. ఇది వృక్ష విశేషముకును, పీతకును, పందికిని పేరు.

కద్రూ ర్మాతరి నాగానాం
కద్రుః కనకపింగళే ॥ (79)

**కద్రూః :** స్త్రీ. సర్పమాతకును, పు. బంగారువంటి పచ్చని వర్ణముకు పేరు.

హరిర్వాతార్క చంద్రేంద్ర
యమోపేంద్ర మరీచిషు।
సింహాశ్వ కపి భేకాహి
శుక లోకాంతరేషుచ॥(80)
హరి ర్వాచ్యవదాఖ్యాతో
హరిత్కపిల వర్ణయోః।

**హరి :** పు. ఇది వాయువుకును, సూర్యునకును, చంద్రునకును, ఇంద్రునకును, యమునకును, విష్ణువుకును, కిరణముకును, సింహముకును, అశ్వముకును, కోతికిని, కప్పకును, సర్పముకును, చిలుకకును, విష్ణులోకముకును, త్రి. ఆకుపచ్చనిదానికిని, కపిలవర్ణము గలదానికిని పేరు.

భూరి ర్బ్రహ్మే చ్యుతేశేషు

**భూరి :** పు. ఇది బ్రహ్మకును, విష్ణువుకును, శివునకును,

| | |
|---|---|
| భూరి ప్రాజ్య సువర్ణయోః॥ (81) | న. విస్తారముకును, బంగారుకును పేరు. |
| గిరి ర్గీర్ణే గిరియకే<br>క్రీడాకందుక శైలయోః।<br>నే త్రామయవిశేషే చ<br>పూజ్యే తు గిరి రన్యవత్॥(82) | **గిరి** : పు. ఇది తినుటకును, పర్వతమునుంచి పడిన రాతిపలకకును, బంతికిని, పర్వతముకును, నేత్రరోగవిశేషముకును, త్రి. పూజ్యునకును పేరు. |
| వారి స్స్రుతా సరస్వత్యాం<br>వారి హ్రీబేర నీరయోః।<br>వారీ ఘటీభబంధన్యో | **వారి** : స్త్రీ. ఇది సరస్వతికిని, న. కురువేరుకును, జలముకును, ఈ. స్త్రీ. చిన్నకుండకును, ఏనుగులను పట్టెడుగోతికిని పేరు. |
| రంఘ్రి స్స్యాత్పాద బుధ్నయోః॥ | **అంఘ్రి** : పు. ఇది పాదముకును, చెట్టువేరుకును పేరు. |
| శారీ (సారీ) త్వక్షోపకరణే<br>తథా శకునికాంతరే।<br>యుద్ధార్థ గజపర్యాణే<br>వ్యవహారేऽపి చ క్వచిత్॥(84) | **శారీ** : స్త్రీ. ఇది జూదమాడు పాచికలకును, (సారె) గోరింక పిట్టకును, యుద్ధసన్నద్ధమైన యేనుగుకు కట్టిన జీను (లేక గంత) కును, వ్యవహారముకును పేరు. |
| కారిః క్రియాయా మాఖ్యాతో<br>నాపితాదికశిల్పిని। | **కారి** : స్త్రీ. ఇది కార్యముకును, పు. మంగలి మొదలగు వానికిని పేరు. |
| అద్రి శ్శైల ద్రుమార్కేషు | **అద్రి** : పు. ఇది పర్వతముకును, వృక్షముకును, సూర్యునకును పేరు. |
| చైంద్రిః కాకజయంతయోః॥(85)<br>ఐంద్రి రంభోధరే జిష్ణౌ | **ఐంద్రిః** : పు. ఇది బొంతకాకికిని, ఇంద్రుని పుత్రుడగు జయంతునకును, మేఘముకును, అర్జునునకును పేరు. |
| తంద్రీ నిద్రా ప్రమీలయోః। | **తంద్రీ** : స్త్రీ. ఇది నిద్రకును, కునికిపాటుకును పేరు. |
| ధాత్రీ జనన్యా మలకీ<br>వసుమత్యుప మాతృషు॥ (86) | **ధాత్రీ** : స్త్రీ. ఇది తల్లికిని, ఉసిరిగ చెట్టుకును, భూమికిని, పెంపుడు తల్లికిని పేరు. |
| ఉష్ట్రీ గోలకికాయాం స్యా<br>త్కరభస్య చయోషితి। | **ఉష్ట్రీ** : స్త్రీ. ఇది కడవకును, ఆడుయొంటెకును పేరు.. |
| క్రోష్ట్రీ సృగాలికా క్షీర<br>విదారీ లాంగలీషు చ॥(87) | **క్రోష్ట్రీ** : స్త్రీ. ఆడునక్కకును, పాలనేల గుమ్ముడు చెట్టుకును, నీటి పిప్పలికిని పేరు. |
| తరి ర్నావి దశాయాంచ | **తరి** : స్త్రీ. ఇది నావకును, అవస్థకును, వస్త్రాదు |

వస్త్రాదీనాంచ పేటకే।
లుంచుకొను పెట్టికిని పేరు.

జారీ స్యాదోషధీభేదే
జార స్తూపవతా వపి॥(88)

**జారీ :** స్త్రీ. ఇది ఓషధి విశేషముకును, పు. విటునకును పేరు.

ఇరా వారి సురా భూమి
భారతీషు ప్రయుజ్యతే।

**ఇరా :** స్త్రీ. ఇది ఉదకముకును, కల్లుకును, భూమికిని, వాక్కుకును పేరు.

స్థిరా భూమౌ (శా) పాలపర్ణ్యాం
స్థిరో నిశ్చల మోక్షయోః॥(89)

**స్థిరా :** స్త్రీ. ఇది భూమికిని, ముయ్యాకు పొన్నచెట్టుకును, త్రి. నిశ్చలమైన దానికిని, పు. మోక్షముకును పేరు.

ధారా సైన్యాగ్రిమస్కం ధ
సంతత్యోః పత్తనాంతరే।
ద్రవద్రవ్య ప్రపాతేఽపి
తురంగ గతిపంచకే॥(90)
ఖడ్గాదీనాం చ నిశిత
ముఖే ధారా ప్రకీర్తితా।
ధారః క్వచిద్ఘనాసార
వర్షణేస్యాదృణేఽపి చ॥(91)

**ధారా :** స్త్రీ. ఇది సేనాగ్ర భాగముకును, పరంపరకును, ధారానగరముకును, జలాదుల యొక్క యవిచ్ఛిన్నస్రావముకును, అశ్వము యొక్క ఆస్కందితాదిపంచగతి భేదములకును, ఖడ్గాదుల వాడికిని, ధారావర్షముకును, పు. అప్పునకును పేరు.

వీరా స్యాత్ క్షీరకాకోలీ
తామల క్యేలవాలుషు।
పతి పుత్రవతీ రంభా
గంభారీ మదిరాసు చ ॥(92)
గోష్ఠోదుం బరికా క్షీర
విదారీ దుగ్ధికా సు చ।
వీరస్తు సుభటే శ్రేష్ఠే
వీరం శృంగ్యాం నతేఽపి చ॥(93)

**వీరా :** స్త్రీ. ఇది క్షీరకాకోలిచెట్టుకును, నేలవుసిరికచెట్టుకును, కూతురు బుడమ చెట్టుకును, పెనిమిటిన్ని బిడ్డలు గలస్త్రీకిని, అరటిచెట్టుకును, గుమ్ముడుచెట్టుకును, కల్లుకును, మేడిచెట్లలోని భేదముకును, పాలనేల గుమ్ముడు చెట్టుకును, పిన్నపాలచెట్టు కును, త్రి. యుద్ధభటునకును, శ్రేష్ఠునకును, న. కర్కాటక శృంగికిని, గ్రంధితగరపు చెట్టుకును పేరు.

ధీరో విదుషి శైలేఽపి
సముద్రే ధైర్యవత్యపి।
ధీరం తు కుంకుమే

**ధీర :** పు. ఇది విద్వాంసునకును, పర్వతముకును, సముద్రముకును, త్రి. ధైర్యవంతునకును, న. కుంకుమముకును పేరు.

శూర స్సూర్యే
వీరే చ కుక్కుటే॥(94)

**శూర :** పు. ఇది సూర్యునకును, శూరునకును, కోడికిని పేరు.

ఆర్ద్రా నక్షత్రభేదే స్యా
దార్ద్రంక్లిన్నేభిధేయవత్।
యాత్రాతుయాపనోపాయే
గతౌ దేవార్చ నోత్సవే॥(95)
ఉస్రా గవ్యుప చిత్రాయా
ముస్రస్తు కిరణే స్మృతః।
హింస్రా కాకాదనీ మాంస్యో
ర్హింస్ర స్స్యాద్ఘాతుకేఽన్యవత్॥(96)

**ఆర్ద్రా :** స్త్రీ. ఇది ఆర్ద్రానక్షత్రముకును, త్రి. తడిసిన దానికిని పేరు.
**యాత్రా :** స్త్రీ. ఇది వెళ్ళించుటకును, ఉపాయముకును, గమనముకును, దేవతాసేవకును, ఉత్సవముకును పేరు.
**ఉస్రా :** స్త్రీ. ఇది గోవుకును, ఎలుకచెవిచెట్టుకును, పు. కిరణముకును పేరు.
**హింస్రా :** స్త్రీ. గురివెందలతకును, జటామాంసికిని, త్రి. క్రూరమైన దానికిని పేరు.

★ అథ రాంత స్త్రీవర్ణః ★

అమర స్త్రిదశేఽప్యస్థి
హారే చ వకుళద్రుమే।
దూర్వా మరావతీ స్థూణా
గుడూ చీష్వమరా మతా॥(97)

**అమర :** పు. ఇది దేవునకును, శివునకును, పొగడ చెట్టుకును, స్త్రీ. గరికెకును, ఇంద్రపట్టణముకును, స్తంభముకును, తిప్పతీగకును పేరు.

అ(వ)పరం త్వఘునార్థేస్యా
త్పశ్చాద్గాత్రేఽపి దంతినాం।
అర్వాచీనేఽపరం ప్రాహు
ర్జరాయౌ చాపరా మతా॥(98)

**అపర :** న. ఇది అల్పార్థముకును, ఏనుగు వెనుక భాగముకును, త్రి. పూర్వమందైన దానికిని, స్త్రీ. మావికిని పేరు.

అధరో దంతవసనేఽ
నూర్ధ్వే హీనేఽపివాచ్యవత్।
అధ్వరో వసుభేదే స్యా
త్సావధానేక్రతావపి॥(99)
అంతరంతు పరీధానే
భేదేరంధ్రా వకాశయోః।
ఆత్మాంతర్ధి వినాత్మీయ
బహిర్మ ధ్యావధిష్వపి॥(100)
తాదర్థ్యే ఽ వసరే చోక్త
మవరం చరమేఽన్యవత్।
గజాంత్య జంఘాదేశే చ

**అధర :** పు. ఇది అధరోష్ఠముకును, త్రి. క్రింది దానికిని, నీచమైన దానికిని పేరు.
**అధ్వర :** పు. ఇది వసుదేవతలయందొకనికిని, సావధానముకును, యజ్ఞముకును పేరు.
**అంతర :** న. కప్పుకొనుబట్టకును, భేదముకును, కన్నముకును, ఎడముకును, అంతరాత్మకును, కప్పుటకును, వినార్థముకును, తన సంబంధమైన దానికిని, వెలుపలకును, మధ్యకును, హద్దుకును, తదర్థమనుటకును, సమయముకును పేరు.
**అవర :** త్రి. ఇది వెనుక ప్రక్క దానికిని, ఏనుగు యొక్క తోక మొదలు పిక్కలవరకునుండు ప్రదేశ

| | |
|---|---|
| భవాన్యాముపరా మతా॥ | ముకును స్త్రీ. పార్వతికిని పేరు. |
| ఉత్తరం ప్రతివాక్యే స్యా<br>దూర్ధ్వే దీచ్యోత్తమేఽన్యవత్।<br>ఉత్తరస్తు విరాటస్య<br>తనయే దిశి చోత్తరా॥ | **ఉత్తర:** న. ఇది జవాబుకును, త్రి. మీదైన దానికిని, ఉత్తరదిక్కుయందైన దానికిని, శ్రేష్ఠమైన దానికిని, పు. విరట రాజుపుత్రునకును, స్త్రీ. ఉత్తర దిక్కుకును పేరు. |
| ఇతరః పామరేఽన్యస్మి | **ఇతర :** త్రి. ఇది నీచునకును, మఱియొక దానికిని పేరు. |
| న్నక్షరం బ్రహ్మవర్ణయోః। | **అక్షర :** న. ఇది పరబ్రహ్మకును, అకారాదివర్ణముకును పేరు. |
| ఋక్షరం వారిధారాయా<br>మృక్షరోఽప్యర్త్విజి స్మృతః॥(103) | **ఋక్షర :** న. ఇది జలధారకును, పు. యజ్ఞాదికర్మలను జేయించువానికిని పేరు. |
| ప్రవర స్సంతతౌ గోత్రే<br>శ్రేష్ఠే తు ప్రవరోఽన్యవత్। | **ప్రవర :** పు. ఇది వంశపరంపరకును, వంశప్రవర్తకమైన మునిగణముకును, తి. శ్రేష్ఠమైన దానికిని పేరు. |
| శ(వ) బరో వారిచండాల<br>భేదయో శ్శంకరేఽపి చ॥ | **శబర :** పు. ఇది జలముకును, కిరాతునకును, శివునకును పేరు. |
| అంబరం వసనే వ్యోమ్ని<br>కార్పాసే చ సుగంధకే। | **అంబర :** న. ఇది వస్త్రముకును, ఆకాశముకును, ప్రత్తికిని, పరిమళద్రవ్య విశేషముకును పేరు. |
| శంబరం సలిలే విత్త<br>భౌద్ధవ్రత విశేషయోః॥(105)<br>శంబరో దైత్యహరిణ<br>మత్స్యశైల జినాంత రే।<br>ఔషధౌ శంబరీమాహుః | **శంబర :** న. ఇది ఉదకముకును, ధనముకును, బౌద్ధులవ్రతముకును, పు. శంబరాసురునకును ఇఱ్ఱికిని, చేపకును, పర్వత విశేషముకును, బౌద్ధ విశేషముకును, ఈ. స్త్రీ. ఓషధివిశేషముకును పేరు |
| ప్రఖరోఽశ్వతరే శుని॥(106)<br>తురంగాణాం చ సన్నాహే<br>ప్రఖరోఽతిభృశంఖరే। | **ప్రఖర:** పు. ఇది కంచరగాడిదకును, కుక్కకును, గుఱ్ఱపు కవచముకును, త్రి. మిక్కిలి తీవ్రమైన దానికిని పేరు. |
| శిఖరం శైల వృక్షాగ్ర<br>కక్షాపులక కోటిషు॥<br>పక్వ దాడిమబీజాభ<br>మాణిక్య శకలేఽపి చ | **శిఖర :** న. ఇది పర్వతాగ్రముకును, వృక్షాగ్రముకును, చంకకును, గగుర్పాటుకును, అంచుకును, పండిన దానిమ్మగింజతో సమమైన మాణిక్య ఖండముకును పేరు. |

| | |
|---|---|
| ఖింఖరస్తు శివాభేదే | **ఖింఖర**: పు. ఇది నక్కలలోని భేదముకును, ఖట్వాంగ |
| ఖట్వాంగే వారి(వా) బాలకే॥(108) | మను శివుని యాయుధముకును, వారిబాలకమను ఓషధి |
| ఖింఖీరా వధ్బహుత్వేఽపి | విశేషముకును, బహుత్వముకును పేరు. |
| విష్టరశ్చ మహీరుహే। | **విష్టర** : పు. ఇది వృక్షముకును, పీటకును, దర్భ |
| ఆసనే కుశముష్టౌ చ | పిడిలికిని పేరు. |
| వఠర శ్శఠ వేష్టయోః॥(109) | **వఠర** : పు. ఇది శఠునకును, చెట్టుబంకకును, |
| ఘటేఽపి చాథ | కుండకును పేరు. |
| పిఠరో ముస్త మంథాన | **పిఠర** : పు. ఇది తుంగముస్తకును, చల్లకవ్వము |
| దండయోః।పిఠర స్స్యాదు | కును, కుండకును పేరు. |
| ఖాయాం చ | |
| జఠర కఠినేఽన్యవత్॥(110) | **జఠర** : త్రి. ఇది కఠినమైన దానికిని, న. గర్భము |
| కుక్షౌ వృద్ధే చ జఠరం | కును, త్రి. వృద్ధిబొందిన దానికిని పేరు. |
| వంఠరస్తాళపల్లవే | **వంఠర** : పు. ఇది తాటి మొవ్వకును, వెదురు గర్భ |
| కరీరకో శేఽప్య | ముకును పేరు. |
| రరం కవాటే ఛదనేఽపి చ॥(111) | **అరర**: న. ఇది తలుపునకును, కప్పుటకును పేరు. |
| క్రకరః క్రకచే దీనే | **క్రకర** : పు. ఇది రంపముకును, దీనునకును, |
| కరీ రే చ ఖగాంతరే। | వెణుతురు చెట్టునకును, కొక్కెర పక్షికిని పేరు. |
| కదర శ్శ్వేతఖదిరే | **కదర** : పు. ఇది తెల్ల తుమ్మచెట్టుకును, రోగ |
| క్షుద్రరోగేఽపి భాషితః॥ (112) | విశేషముకును పేరు. |
| బదరం కోళికార్పాస్యోః | **బదర**: న. ఇది రేగుపండుకును, ప్రత్తికాయకును, |
| ఫలే స్యాద్బదరీ తయోః। | ఈ. స్త్రీ. ఆ చెట్లకును, స్త్రీ. దుంపరాష్ట్రముకును, |
| ఏ లాపర్ణ్యాంతు బదరా | విష్ణుక్రాంతపు చెట్టుకును పేరు. |
| విష్ణుక్రాంతౌషదావపి॥(113) | |
| ప్రదరో రోగభేదే స్యా | **ప్రదర** : పు. ఇది స్త్రీలవ్యాధి విశేషముకును (కుసు |
| త్ప్రదర శ్శరభంగయోః। | మ), బాణముకును, విరుచుటకును పేరు. |
| మకరో యాదసి జ్ఞేయో | **మకర** : పు. ఇది మొసలికిని, కుబేరుని మకర |
| నిధి రాశిప్రభేదయోః॥ | నిధికిని మకర రాశికిని పేరు. |
| నికరో నివహే సారే | **నికర** : పు. ఇది సమూహముకును, చేవకును, |

| | |
|---|---|
| న్యాయదేయధనాంతరే। | న్యాయముగానివ్వదగిన సొమ్ముకును పేరు. |
| శీకర శ్శబలే వాత<br>సృతాంబుకణయోః స్మృతః॥ | **శీకర** : పు. ఇది శబలవర్ణముకును, వాయువుచే జిమ్మబడిన జలముకును, ఉదకకణముకును పేరు. |
| ప్రకర శ్చోపకారశ్చ<br>వికీర్ణ కుసుమాదిషు।<br>సంహతౌ చో పకృత్యాయాం<br>యథాసంఖ్య మవస్థితౌ॥(116) | **ప్రకర, ఉపకార** : పు. ఈ రెండును, చిమ్మబడిన పుష్పాదులకును, యథాక్రమముగా ప్రకరశబ్దము కును, సమూహముకును, ఉపకారశబ్దము, ఉప కారముకును పేరు. |
| జోంగకే<br>ప్రకరం ప్రోక్తం ప్రకరీ<br>చత్వరావనౌ। | **ప్రకర** : న. అగరు గంధముకును, ఈ. స్త్రీ. ఇంటి ముంగిటి భూమికిని పేరు. |
| విస్తరస్తు ప్రపంచే స్యా<br>ద్విస్తారే ప్రణయేఽపి చ॥ | **విస్తర**: పు. ఇది ప్రపంచముకును, విస్తారముకును, ప్రేమకును పేరు. |
| సంస్తరప్రస్తరావేతౌ<br>సంస్తరాధ్వరయోరపి।<br>మణిపాషాణయోశ్చాపి<br>యథాక్రమముదీరితౌ॥(118) | **సంస్తర** : పు. ఇది పల్లవాదులచేత రచియింపబడిన శయ్యకును, యజ్ఞముకును పేరు. **ప్రస్తర** : పు. మాణిక్యముకును, ఱాతికిని పేరు. |
| టగరష్టంకణక్షారే<br>హేలావిభ్రమ గోచరే।<br>వాచ్యవత్కేకరాక్షే తు | **టగర** : పు. ఇది వెలిగారముకును, స్త్రీలవిలాస ప్రకటముకును, త్రి. మెల్లకంటివానికిని పేరు. |
| ముద్గరం మల్లికాభిది॥(119)<br>లోష్టాదిభేదనేఽపి స్యా | **ముద్గర** : న. ఇది మల్లి చెట్లలోని భేదముకును, ఆయుధ విశేషముకును పేరు. |
| దుదరం జఠరే యుధి। | **ఉదర** : న. ఇది కడుపునకును, యుద్ధముకును పేరు. |
| ప్రసరః ప్రణయే వేగే<br>సంగరే చాథ | **ప్రసర**: పు. ఇది ప్రేమకును, వేగముకును, యుద్ధ ముకును పేరు. |
| మత్సరః॥(120) అసహ్యాపర<br>సంపత్తౌమాత్సర్యే<br>కృపణే కృధిమత్సరా<br>మక్షికాయాం చ | **మత్సర** : త్రి. ఇది పరుల శుభమును సహించని వానికిని, పు. పరుల శుభముకును సహించకుండుట కును లోభికిని, క్రోధముకును, స్త్రీ. ఈగకును పేరు. |

| | |
|---|---|
| విసరః ప్రసరే వ్రజే॥ | **విసర :** పు. ఇది వ్యాపించుటకును, సమూహము కును పేరు. |
| కుహరః కోటరే ఛిద్రే<br>నాగ రాజవిశేషయోః। | **కుహర :** పు. ఇది తొఱటకును, రంధ్రముకును, సర్పవిశేషముకును, కుహరరాజుకును పేరు. |
| దహరో మూషికాయాం చ<br>స్వల్పే భ్రాతరి బాలకే॥ | **దహర :** పు. ఇది ఎలుకకును, అల్పముకును, సోదరునకును, బాలునకును పేరు. |
| చమరం చామరే ప్రాహు<br>ర్మంజరీ మృగభేదయోః।<br>చమరీ | **చమర :** న. ఇది సురటీకిని, ఈ.స్త్రీ. గుత్తికిని, చమరీ మృగముకును పేరు. |
| భ్రమరో భృంగే<br>కాముకేచ మధూద్రవత్॥(123) | **భ్రమర, మధూద్ర :** పు. ఇది తుమ్మెదకును, విటున కును పేరు. |
| రుధిరోऽంగారకే ప్రోక్తో<br>రుధిరం కుంకుమా సృజోః। | **రుధిర :** పు. ఇది అంగారక గ్రహముకును, న. కుంకుమకును, రక్తముకును పేరు. |
| చందిరోऽనేకపే చంద్రే | **చందిర :** పు. ఇది ఏనుగుకును, చంద్రునకును పేరు. |
| ముదిరః కాముకేऽంబుదే॥ | **ముదిర :** పు. విటునకును, మేఘముకును పేరు. |
| మిహిరో భాస్కరే వృద్ధే | **మిహిర :** పు. ఇది సూర్యునకును, వృద్ధునకును పేరు. |
| ముహిరః కామ మూర్ఖయోః। | **ముహిర :** పు. ఇది మన్మథునకును, మూర్ఖునకును పేరు. |
| వివరం దూషణే గర్తే<br>కథితం ఛిద్ర రంధ్రవత్॥ | **వివర :** న. ఇది ఛిద్ర, రంధ్ర, శబ్దములవలెనే దోష ముకును, రంధ్రముకును పేరు. |
| ఖపురః క్రముకే భద్ర<br>ముస్తకేऽలసకేऽపి చ। | **ఖపుర :** పు. ఇది పోకచెట్టుకును, భద్రముస్తకును, త్రి. మందునకును పేరు. |
| గోపురం తు పురద్వారే<br>ద్వారమాత్రే చ ముస్తకే॥ | **గోపుర :** న. ఇది పట్టణద్వారముకును, ద్వార సామాన్యముకును, కైవర్తీముస్తకును పేరు. |
| చికుర శ్చంచలే కేశే<br>గృహబభ్రు భుజంగయోః।<br>పక్షిద్రుభేదయో శ్శైలే | **చికుర :** త్రి. చపల స్వభావముగల వానికిని, పు. జుట్టుకును, పెంపుడు ముంగికిని, సర్పముకును, చికుర పక్షికిని, వృక్షభేదముకును, పర్వతముకును పేరు. |
| చంకురో రథవృక్షయోః॥ | **చంకుర :** పు. ఇది రథముకును, వృక్షముకును, పేరు. |
| అంకురో రుధిరే రోమ్ణి | **అంకుర :** పు. ఇది నెత్తురుకును, రోమముకును, |

పానీయే ऽభినవోద్భిది।
కుక్కు(ర్కు)రో వక్రపుచ్ఛే స్యా
ద్గంధిపర్ణే తుకుక్కురం॥(128)
ముకురో మల్లికా పుష్పే
దర్పణే చ కలిద్రుమే।
కులాలదండే వకుళే
మకురోऽప్యేషు విశ్రుతః॥(129)
అజిరం ప్రాంగణే వాతే
విషయే దర్దురే తనౌ।

జలముకును, మొలకకును పేరు.

**కుక్కుర**: పు. ఇది కుక్కకును, న. స్థాణేయమను గంధ ద్రవ్యముకును పేరు.

**ముకుర, మకుర** : పు. ఇది మల్లిపూవుకును, అద్దముకును, తాండ్రచెట్టుకును, కుమ్మరికి పాత్ర నిర్మాణ సాధనమగు దండముకును, పొగడ చెట్టు కును పేరు.

**అజిర** : న. ఇది ఇంటిముందఱి భాగముకును వాయువుకును, విషయముకును, కప్పకును, శరీరముకును పేరు.

అశిరో రాక్షసే వహ్నౌ
వశిరస్తపనేऽపి చ॥(130)
శిశిర స్స్యాదృతోర్భే దే
తుషారే శీతలే న్యవత్।
వశిరం కిణిహీ సింధు
లవణేభకణాసు చ॥(131)
సు(శు) షిరం వివరే వాద్యే
సురంధ్రే సుషిరోऽన్యవత్
సుషిరోऽగ్నౌ చ
తిమిరం ధ్వాంతే
నేత్రామ యేऽపి చ॥(132)
ఛిదిరః పావకే రజ్జౌ
కరవాలే పరశ్వథే।
దంతురం వాచ్యవద్విద్యా
ద్విషమోన్నతదంతయోః॥
విదురో నాగరే ధీరే
కౌరవాణాం చ మంత్రిణి।
విధురం స్యాత్ప్రవిశ్లేషే

**అశిర**: పు. ఇది రాక్షసునకును, అగ్నికిని, సూర్యునకును పేరు.

**శిశిర**: పు. ఇది శిశిరఋతువుకును, మంచుకును, త్రి. చల్లని దానికిని పేరు.

**వశిర** : న. ఇది గినియ చెట్టుకును, సముద్రపు లవణముకును, గజపిప్పలికిని పేరు.

**సుషిర** : న. ఇది రంధ్రముకును, వాద్యవిశేషము (అలుగోజా) కును, త్రి. రంధ్రముగలదానికిని, పు. అగ్నికిని పేరు.

**తిమిర**: న. ఇదిచీకటికిని, నేత్రరోగవిశేషముకును పేరు.

**ఛిదిర** : అ: పు. ఇది అగ్నికిని, త్రాటికిని, ఖడ్గము కును, గండ్రగొడ్డటికిని పేరు.

**దంతుర**: త్రి. ఇది హెచ్చు తగ్గుపండ్లుగలవానికిని, మిట్టపండ్లవానికిని పేరు.

**విదుర** : పు. ఇది నేర్పరికిని, విద్వాంసునకును, విదురునకును పేరు.

**విధుర**: న. ఇదిఎడబాయుటకును, త్రి. వికలమైన

విధురో వికలేఽన్యవత్॥
విధురాపి రసాలాయాం
మధురస్తు రసే విషే।
మధురం రసవత్స్వాదు
ప్రియేషు మధురోఽన్యవత్॥(135)
మధురా శతపుష్ప్యాయాం
మిశ్రేయా నగరీభిదోః।
మధు (కర్కటికా) కుక్కుటికామేదా
మధూళీయష్టికాసు చ॥(136)
బంధూర బంధురౌ రమ్యే
నమ్రే హంసే తు బంధురః।
బంధూకే చ (విడంగే) విహంగే చ
బంధురా పణ్యయోషితి॥(137)
బర్బరః పామరే కేశ
విన్యాసే నీవృదంతరే।
బర్బరా ఫం (హం) వికాయాం తు
బర్బరా శాక పుష్పయోః॥(138)
కర్బురం సలిలే హేమ్ని
కర్బురః పాప రక్షసోః।
కర్బురా కృష్ణవృంతాయాం
కిమ్మీరే కర్బురాన్యవత్॥
కర్పర స్స్యాత్కపాలే చ
శస్త్రభేద కటాహయోః।
కూర్పరో జానుని ప్రోక్తః
కఫోణావపి కూర్పరః॥(140)
ఖర్పర స్తస్కరే ధూర్తే
భిక్షాపాత్ర కపాలయోః।
గర్గరో మీనభేదే స్యా

దానికిని, త్రీ. ఓషధి విశేషముకును పేరు.

**మధుర:** పు. ఇది మధురరసముకును, న. విషముకును, త్రి. తీయని దానికిని, రుచిగల దానికిని, ఇష్టమైన దానికిని, త్రీ. పెద్ద సదాప చెట్టుకును, పిన్నసదాప చెట్టుకును, మధురాపట్టణముకును, తీయమాదీఫలపు చెట్టుకును, మేదయను గంధ ద్రవ్యముకును ఓషధి విశేషముకును, యష్టిమధుకముకును పేరు.

**బంధూర, బంధుర:** త్రి. ఈ రెండును, సుందరమైన దానికిని, వంగిన దానికిని, బంధుర, పు. హంసకును, మంకెనచెట్టుకును, పక్షికిని, త్రీ. వెలయాలికిని పేరు.

**బర్బర :** పు. ఇది నీచునకును, కేశపాశముకును, బర్బరదేశముకును, త్రీ. గంటుభారంగికిని, శాకవిశేషముకును, పుష్పవిశేషముకును పేరు.

**కర్బుర :** న. ఇది జలముకును, బంగారుకును, పు. పాపముకును, రాక్షసునకును, త్రీ. కలుగొట్టు చెట్టుకును, త్రి. కర్బుర వర్ణముగల దానికిని పేరు.

**కర్పర :** పు. ఇది పుఱ్ఱెకును, శస్త్రవిశేషముకును, గాబునకును పేరు.

**కూర్పర :** పు. ఇది మోకాలికిని, మోచేతికిని పేరు.

**ఖర్పర :** పు. ఇది చోరునకును, విటునకును, బిచ్చమెత్తుపాత్రముకును, పుఱ్ఱెకును పేరు.

**గర్గర :** పు. ఇది మత్స్యవిశేషముకును, ఈ. త్రీ.

న్మంథన్యామపి గర్గరీ॥ (141)
ఘర్ఘరస్తు చలద్వారి
ధ్యానే ఘూకే నదాంతరే।
ని(ర్ఘ)ర్ఘురస్తు సహస్రాంశు
తురంగే తుషపావకే॥(142)
ముర్మురస్తుషవహ్నౌస్యా
న్మన్మథే రవివాజిని।
జర్జరో వాచ్యవజ్జీర్ణే
జర్జరం వాసవధ్వజే॥(143)
నిర్జరస్తు జరాత్యక్తే
వాచ్యవన్నిర్జర స్సురే।
నిర్జరాతు గుడూచ్యాం స్యా
త్తాలపత్ర్యామపి క్వచిత్॥
ఝుర్ఝురస్స్యాత్కలియుగే
వాద్యభాండే నదాంతరే।
దర్దురస్తు గిరా వీష
ద్భగ్నవస్తునివాచ్యవత్॥(145)
దర్దురస్తోయదే భేకే
వాద్యభాండా ద్రిభేదయోః।
దర్దురా చండికాయాం చ
గ్రామజాలే చ దర్దురం॥
వార్దరం దక్షిణావర్త
శంఖే క్రిమిజ నీరయోః।
కాక చించ్యాస్తు బీజే చ
వాచి వార్ద రమిష్యతే॥(148)
దుర్ధరం వాచ్యవద్దుఃఖ
ధార్యే స్యాదృష భౌషధే।
దుర్ధరో నిర్ధరం సారే

పెరుగుతరిచెడు కడవకును పేరు.

**ఘర్ఘర** : పు. ఇది చరించుచున్న యుదక ధ్వనికిని, గుడ్లగూబకును, నదవిశేషముకును పేరు.

**నిర్ఘుర** : పు. ఇది సూర్యాశ్వముకును, ఉమక నిప్పునకును పేరు.

**ముర్మర** : పు. ఉమక నిప్పునకును, మన్మథున కును, సూర్యాశ్వముకును పేరు.

**జర్జర** : త్రి. ఇది శిథిలమైన దానికిని, న. ఇంద్ర ధ్వజముకును పేరు.

**నిర్జర** : త్రి. ఇది ముదిమిలేని దానికిని, పు. దేవున కును, స్త్రీ. తిప్పతీగకును, మురయనెడు గంధ ద్రవ్యముకును పేరు.

**ఝుర్ఝుర** : పు. ఇది కలియుగముకును, వాయిం చెడి కుండకును, నదవిశేషముకును పేరు.

**దర్దుర** : పు. ఇది పర్వతముకును, త్రి. ఇంచుక శిథిలమైన దానికిని, పు. మేఘముకును, కప్పకును, వాద్యభాండవిశేషముకును, దర్దుర పర్వతము కును, స్త్రీ. పార్వతికిని, న. గ్రామ సమూహము కును పేరు.

**వార్దర** : న. ఇది దక్షిణావర్తశంఖముకును, అగరు చెక్కకును, ఉదకముకును, గురివెందగింజకును, వాక్కుకును పేరు.

**దుర్ధర** : త్రి. ఇది అతికష్టముచేత ధరించదగిన దానికిని, పు. ఋషభమను ఓషధికిని పేరు.

**నిర్ధర** : న. చేవకును, త్రి. భయములేని వానికిని,

నిర్భ (రే)యే నిరపత్ర పే॥(149)
కుంజరోఽనేకపే కేశే
ధాతక్యామపి కుంజరా।
పింజరం కనకే వాజి
భేదే పీతే చ పింజరః॥(150)
మందరో మంథశైలే స్యా
త్స్వర్గ మందారయోరపి।
మందరో వహనే మందే
కందరో వివరేఽంకుశే॥
మందిరం నగరేఽగారే
మందిరో మకరాలయే।
వర్కర స్తరుణే మేషే
కర్కరో దర్పణే దృఢే॥

లజ్జలేనివానికిని పేరు.
**కుంజర** : పు. ఏనుగుకును, జుట్టుకును, స్త్రీ. పుష్పవృక్ష విశేషముకును పేరు.
**పింజర:** న. ఇది బంగారుకును, పు. అశ్వ విశేషముకును, త్రి. పచ్చని దానికిని పేరు.
**మందర** : పు. ఇది మంథర పర్వతముకును, స్వర్గముకును, కల్పవృక్షముకును, కలమనెడి యోడకును, అలసతకును పేరు.
**కందర** : పు. ఇది గుహకును, అంకుశముకును పేరు.
**మందిర** : న. ఇది పట్టణమునకును, గృహముకును, పు. సముద్రముకును పేరు.
**వ(బ)ర్కర:** పు. లేగపశువుకును, మేకకును పేరు.
**కర్కర** : పు. ఇది అద్దముకును, త్రి. దృఢమైన దానికిని పేరు.

కంధరో వారివాహే స్యా
ద్గ్రీవాయామపి కంధరా।
వ(ల్లు)ల్లరం శాద్వలేప్రోక్తం
నిర్జల స్థాన కుంజయోః॥(153)
భిల్లక్షేత్రే చ మంజర్యాం
వల్లరీతి ప్రకీర్తితా।

**కంధర:** పు. ఇదిమేఘముకును, స్త్రీ. కంఠముకును పేరు.
**వ(ల్లు)ల్లర** : న. ఇది పచ్చిక పట్టుకును, మరుభూమికిని, లతాగృహముకును, ఈ. స్త్రీ. బోయ వాండ్ల గృహముకును, పూలగుత్తికిని పేరు.

మంథర స్సూచకే కోశే
మంథానే చాథ మంథరం॥(154)
కుసుంభ్యాం మంథరో మందే
పృథౌ వక్రే చవాచ్యవత్।
కంకరం కుత్సితే తక్రే
చత్వరం స్థండిలేఽంగణే॥(155)

**మంథర** : పు. ఇది కొండెగానికిని, పుష్పాదుల మధ్యభాగముకును, కవ్వముకును, న. కుసుంభా పువ్వుకును, త్రి. మందమైన దానికిని, అధికమైన దానికిని, వంకరయైన దానికిని పేరు.
**కంకర:** త్రి. ఇది కుత్సితునకును, న. మజ్జిగకును పేరు.
**చత్వర:** న. అగ్న్యాది స్థాపనముకొరకు సంస్కరించ బడిన ప్రదేశముకును, ముంగిలికిని పేరు.

ఛిత్వరం ఛేదనద్రవ్యే

**ఛిత్వర** : న. ఖడ్గము మొదలగు వాటికిని, పు.

| | |
|---|---|
| ఛిత్వరో ధూర్తవైరిణోః। | విటునకును, శత్రువుకును పేరు. |
| ఇత్వరోదుర్విధేనీచే<br>పథికక్రూరకర్మణోః॥(156) | **ఇత్వర** : పు. ఇది దరిద్రునకును, నీచునకును, తెరువరికిని, దుర్జనునకును పేరు. |
| పుష్కరం పంకజే వ్యోమ్ని<br>పయః కరికరాగ్రయోః।<br>ఔషధ ద్వీప విహగ<br>తీర్థ రాజోరగాంతరే॥(157)<br>పుష్కరం తూర్యవ క్త్రే చ<br>కాండే ఖడ్గఫలేఽపి చ। | **పుష్కర** : న. ఇది పద్మముకును, ఆకసముకును, జలమునకును, గజతుండాగ్రమునకును, ఔషధ విశేషముకును, పుష్కర ద్వీపముకును, పు. సారస పక్షికిని, క్షేత్ర విశేషముకును, పుష్కరుడను రాజుకును, సర్పవిశేషముకును, న. మద్దెలమొదలగు వాటి ముఖముకును, బాణముకును, కత్తివాయికిని పేరు. |
| డింగరో డంగరే క్షేపే | **డింగర** : పు. ఇది ఖురాసానిపుచ్చ చెట్టుకును, చిమ్ముటకును పేరు. |
| సంగరోఽంగీకృతౌ యుధి॥(158)<br>విషాపదోః క్రియకారే<br>సంగరం తు శమీఫలే॥ | **సంగర**: పు. ఇది అంగీకారముకును, యుద్ధముకును, విషముకును, ఆపదకును, నూతనముగా విద్యాభ్యాసముజేయువానికిని, న. జమ్మికాయకును పేరు. |
| గహ్వరం తు గుహా దంభ<br>నికుంజ గహనేష్వపి॥ | **గహ్వర** : న. ఇది గుహకును, కపటముకును, లతాగృహముకును, వనముకును పేరు. |
| కర్బురః కథితో వ్యాఘ్రే<br>శివాయామపి కర్బురీ। | **కర్బుర** : పు. ఇది పెద్దపులికిని, ఈ. స్త్రీ. పార్వతికిని పేరు. |
| చతుర శ్చాతుర (కవచ్చ) శ్చాపి<br>చక్రగండౌ నియంతరి॥ (160)<br>ఏతౌ స్యాతాము భౌనేత్ర<br>గోచరేచాటుకారిణి॥ | **చతుర, చాతుర**: పు. ఇది వర్తులాకారమగు తలగడాకును, రథసారథికిని, త్రి. దృశ్యమానమైన దానికిని, నేర్పరికిని పేరు. |
| ఈశ్వరో విభవైరాఢ్యే<br>శంభౌస్వామిని మన్మథే॥<br>పార్వత్యా మీశ్వరామాహు | **ఈశ్వర**: పు. అధికసంపదగలవానికిని, శివునకును, ప్రభువుకును, మన్మథునకును, స్త్రీ. పార్వతికిని పేరు. |
| ర్ద్వాపర స్సంశయే యుగే। | **ద్వాపర** : పు. ఇది సందేహముకును, ద్వాపర యుగముకును పేరు. |
| ఆకరో నివహో త్పత్తి | **ఆకర**: పు. ఇది సమూహముకును, పుట్టిన చోటు |

స్థాన శ్రేష్ఠఖనిష్వపి॥ (162)
భాస్కర స్తపనే వహ్నౌ
ప్రభాకరసమ స్మృతః।
పార్పరో భక్తసిక్థే స్యా
త్క్షినాశే రాజయక్ష్మణి॥ (163)
జరాటేఽపి కదంబస్య
కేసరేఽపి చ భస్మని।
శార్వరం త్వంధతమసే
శార్వరోఘాతుకేఽన్యవత్॥
ప్రాంతరం విపినే దూర
శూన్యవర్త్మని కోటరే।
శార్కరో దుగ్ధఫేనే పి
శర్కరాన్వితదేశవత్॥ (165)
శాక్వరో వృషభే ఛందో
విశేషే శాక్వరం మతం।
నాగరం ముస్తకే శుంఠ్యాం
విదగ్ధేనాగరోఽ న్యవత్॥(166)
శంసంతి నగరోద్భూతే
రతబంధే చనాగరం।
వాగరో వారకే శాణే
న్నిర్ణయే బాడబేవృకే॥ (167)
విశారదే ముముక్షౌ చ
గవామంకే చ వాగరం।
భ్రామరం గ్రావ మధునోః
పామరః ఖలనీచయోః॥
వాసరో దివసే నాగ
ప్రభేదేచాపి వాసరః।
కాంతారముప సర్గాదౌ

కును, శ్రేష్ఠముకును, రత్నాదుల గనికిని పేరు.

**భాస్కర, ప్రభాకర** : పు. ఇది సూర్యునకును, అగ్నికిని పేరు.

**పార్పర** : పు. ఇది అన్నకణముకును, యమున కును, క్షయరోగముకును, వృద్ధునకును, కడిమి చెట్టుకుయొక్క కేసరముకును, బూడిదెకును పేరు.

**శార్వర** : న. ఇది అంధకారముకును, త్రి. క్రూర మైన దానికిని పేరు.

**ప్రాంతర** : న. ఇది అరణ్యముకును, దూరమైన యడారిత్రోవకును, చెట్టుతొఱ్ఱకును పేరు.

**శార్కర** : పు. ఇది పాలనురుగకును, ఇసుముగల భూమికిని పేరు.

**శాక్వర** : పు. వృషభముకును, న. శాక్వరమను ఛందముకును పేరు.

**నాగర**: న. ఇది తుంగముస్తకును, శొంఠికిని, త్రి. నేర్పరికిని నగరమందు బుట్టిన దానికిని, న. స్త్రీలరత బంధవిశేషములకును పేరు.

**వాగర** : పు. ఇది కేచవిరిగి చెట్టుకును, ఒరుపుడు రాతికిని, నిశ్చయించుటకును, బడబానలము కును, తోడేలుకును, పండితునకును, మోక్షేచ్ఛగల వానికిని, న. పశురోగ విశేషముకును పేరు.

**భ్రామర** : న. ఇది రాతికిని, తెనెకును పేరు.

**పామర**: పు. దుర్మార్గునకును, నీచునకును పేరు.

**వాసర** : పు. ఇది పగటికిని, సర్పవిశేషముకును పేరు.

**కాంతార** : న. ఇది దైవాదులవలన సంభవించిన

వనే దుర్గమ వర్త్మని॥(169)
ఇక్షుప్రభేదే కాంతారః

యుపద్రవముకును, అరణ్యముకును, వెళ్ళరాని మార్గముకును పు. అడవి చెరుకునకును పేరు.

పదారః పాదధూళిషు
పాదాళిందేఽథ

**పదార:** పు. పాదములయందలి పరాగముకును, ఓడయొక్క అగ్రభాగముకును పేరు.

మందారః పారిభద్రార్క-
పర్ణయోః(170) సురద్రుమేఽపి

**మందార** : పు. ఇది బాడిదపు చెట్టుకును, జిల్లేడు చెట్టుకును, కల్పవృక్షముకును పేరు.

గాంధార స్సింధూరే
రాగదేశయోః।

**గాంధార** : పు. ఇది సింధూరముకును, రాగ విశేషముకును, గాంధార దేశముకును పేరు.

ఆధార శ్చాధికరణేఽ
ప్యాలవాలేఽంబుధారణే॥(171)

**ఆధార** : పు. ఇది ధరించి యుండుదానికిని, పాదునకును, తటాకాదులకును పేరు.

ఆసార స్స్యాత్ప్రసరణే
వేగవర్షే సుహృద్బలే।

**ఆసార** : పు. ఇది దండు విడుచుటకును, ధారా వర్షముకును, మిత్రసైన్యముకును పేరు.

కేదారః పర్వతే శంభౌ
క్షేత్రభేదాలవాలయోః॥(172)

**కేదార** : పు. ఇది ఈ పేరు గల పర్వతముకును, శివునకును, జలాధారమువలన వరిపండెడు భూమికిని, పాదునకును పేరు.

ఉదారో దాతృమహతో
ర్దక్షిణేఽప్యభిధేయవత్।

**ఉదార:** త్రి. ఇది దాతకును, అధికమైన దానికిని, తిన్నని బుద్ధిగలవానికిని పేరు.

మదారో ద్విరదే ధూర్తే

**మదార** : పు. ఇది ఏనుగుకును, విటునకును పేరు.

విదారో దారణే రణే॥(173)
విదారీ సాలపర్ణ్యాంచ
రోగభేదేక్షుగంధయోః।

**విదార:** పు. ఇదిఛేదించుటకును, యుద్ధముకును. ఈ. స్త్రీ. ముయ్యాకుపొన్న చెట్టుకును, భగంధర రోగముకును, తెల్లనేలగుమ్ముడు చెట్టుకును పేరు.

వికారో వికృతౌ రోగ

**వికార** : పు. రూపాంతరమును బొందుటకును, రోగవిశేషముకును పేరు.

ఆకార స్సంస్థితాంగయోః॥(174)

**ఆకార** : పు. ఇది మృతినొందిన వానికిని, శరీరముకును పేరు.

నికార స్స్యాత్పరిభవే
ధాన్యస్యోత్క్షేపణేఽపి చ।

**నికార** : పు. తిరస్కారముకును, రాశి చేయుటకై ధాన్యమును మీదికి చిమ్ముటకును పేరు.

ప్రకార స్సదృశే భేదే

**ప్రకార:** పు. ఇదిసామ్యముకును, భేదముకును పేరు.

టంకార శ్శింజినీ ధ్వనౌ॥(175)
విస్మయే చ ప్రసిద్ధౌచ

**టంకార** : పు. వింటినారి యొక్క ధ్వనికిని, ఆశ్చర్యముకును, ప్రఖ్యాతికిని పేరు.

దండార శ్శరయంత్రకే।
కులాలచక్రే వహనే
దండారో మత్తవారణే॥ (176)

**దండార**: పు. ఇది బాణయంత్రముకును, కుమ్మరి వానిచక్రముకును, వాహనముకును, మదపుటేనుగుకును పేరు.

పిండారః క్షపణే క్షేపే
మహిషీ రక్షకే ద్రుమే।

**పిండార** : పు. ఇది క్షపణ మతస్థునకును, చిమ్ముటకును, బఱ్ఱెలగాచువానికిని, వృక్షవిశేషముకును పేరు.

తుషారో హిమభేదేఽపి
శీకరే శీతలే హిమే ॥ (177)

**తుషార** : పు: ఇది తుంపురులుగా గురియుమంచుకును, తుంపురులకును, త్రి. చల్లని దానికిని, పు. మంచుకును పేరు.

సునారస్తు శునీస్తన్యే
సర్పాండ కలవింకయోః।

**శునార** : పు. ఇది కుక్కపాలకును, పాముగ్రుడ్డుకును, ఊరపిచ్చుకకును పేరు.

కుమారో బాలకే స్కందే
యువరాజేఽశ్వ(వా)చారకే॥(178)
శుకేఽపి వరుణద్రౌచ
కుమారం జాత్యకాంచనే।
కుమార రామ తరుణీ
నవమాల్యోర్నదీభిది॥ (179)
కన్యాపరాజితాగౌరీ
జంబూద్వీపేషు చస్మృతా।

**కుమార** : పు. ఇది బాలునకును, కుమారస్వామికిని, యువరాజున (నాట్యభాషయందు) కును, అశ్వశిక్షకునకును, చిలుకకును, ఉలిమిడి చెట్టుకును, న. మేలిమి బంగారుకును, ఈ. స్త్రీ. నల్లపిన్న గోరింట చెట్టుకును, విరజాజి లతకును, కుమారీ నదికిని, అవివాహిత స్త్రీకిని, విష్ణుక్రాంతపు లతకును, పార్వతికిని, జంబూద్వీపముకును పేరు.

ఆహారో భోజనే హారే
భవేదాహరణేఽపి చ ॥(180)

**ఆహార** : పు. ఇది భక్షించుటకును, అన్నముకును, హరించుటకును పేరు.

విహారో విభ్రమే స్కంధే
లీలాయాంసుగ తాలయే।

**విహార** : పు. ఇది తిరుగుటకును, భుజముకును, విలాసముకును, బౌద్ధాలయముకును పేరు.

కుటారం మైథునే విద్యా
త్కుటారం కంబళేఽపి చ॥

**కుటార** : న. ఇది రతికిని, గొంగళికిని పేరు.

కోట్టారో నాగరే కూపే
పుష్కరిణ్యా (ంచ) శ్చపాటకే।

**కోట్టార** : పు. ఇది శౌంఠికిని, నూతికిని, నలుచదరమైన కొలనుయొక్క ఒడ్డుకును పేరు.

కడారః పింగళే దాసే
సంభార స్సంభృతౌ గణే॥

**కడార**:పు. ఇది పింగళవర్ణముకును, దాసునకును పేరు.
**సంభార**: పు. ఇది పరికరముకును, సమూహముకును పేరు.

కేనారః కుంభినరకే
శిరఃక(పో) పాల సంధిషు।
సంకారో౽గ్నిచటాత్కారే
సమ్మార్జ న్యవమార్జితే॥ (183)
నవదూషితకన్యాయాం
సంకారీ క్వాపి దృశ్యతే।

**కేనార**: పు. కుంభీపాకమను నరకముకును, శిరస్సుకును, పుఱ్ఱెకును, సంబంధ ప్రదేశముకును పేరు.
**సంకార**: పు. ఇది అగ్నియొక్క చటుచటు ధ్వనికిని, చీపురుచేత నూడవబడిన పెంటకును, ఈ. స్త్రీ. క్రొత్తగా దూషితురాలగు కన్యకును పేరు.

పంకార శ్శైవలే సేతౌ
సోపానే జలకుబ్జకే॥ (184)

**పంకార**: పు. ఇది నాచుకును, కట్టకును, మెట్టుకును, నీటి నెమ్మిచెట్టుకును పేరు.

సంస్కారః ప్రతి యత్నేస్యా
త్సంకల్పే౽నుభవే౽పి చ।

**సంస్కార**: పు. ఇది ఒక వస్తువుకు గుణాతిశయము గలిగించుటకును, మనోవ్యాపారముకును, ఎఱుకకును పేరు.

పాలారం స్యాద్గస్తి నఖే
సోపానే పక్షిపంజరే॥ (185)

**పాలార**: న. ఇది పురద్వార సమీపమందు శత్రువులు లోన చొరకుండుటకై వేసిన మంటితిన్నెకును, మెట్టుకును, పిట్టల పంజరముకును పేరు.

కంజారో జఠరే సూర్యే
విరించౌ వారణే మునౌ।
మార్జార ఓతౌ ఖట్వాసే
భృంగారః కనకాలుకే॥ (186)
భృంగారీ ఝిల్లికాయాంస్యా
దంగారో౽లాత భౌమయోః।

**కంజార**: పు. ఇది జఠరాగ్నికిని, సూర్యునకును, బ్రహ్మకును, ఏనుగుకును, మునికిని పేరు.
**మార్జార**: పు. పిల్లికిని, జవ్వాదిపిల్లికిని పేరు.
**భృంగార**: పు. ఇది బంగారు జలపాత్రముకును, ఈ. స్త్రీ. చిమ్మెటకును పేరు.
**అంగార**: పు. కొరవి నిప్పునకును, అంగారక గ్రహముకును పేరు.

శృంగార స్సురతే నా(ట్యేరసే) ట్య
రసే౽పి గజమండనే॥ (187)
శృంగారం చూర్ణ సిందూర
లవంగకును మేషు చ।

**శృంగార**: పు. ఇది సురతముకును, శృంగార రసముకును, గజాలంకారముకును, న. బుక్కామొదలగు పరిమళ చూర్ణముకును, సింధూరముకును లవంగముకును పేరు.

| | |
|---|---|
| విస్తారో విస్తృతౌస్తంబ<br>ఉద్ధార శ్చోద్ధృతావృణే॥ | **విస్తార:** పు. ఇది విస్తరించుటకును, దుబ్బునకును పేరు.<br>**ఉద్ధార :** పు. ఎత్తుటకును, అప్పునకును పేరు. |
| మాఠరో ద్విజ భేదే స్యా<br>ద్వ్యాసేऽర్క పరిపార్శ్వకే। | **మాఠర :** పు. ఇది ఒక బ్రాహ్మణునకును, వేద వ్యాసునకును, సూర్యునిపార్శ్వమందుండెడు ఒక దేవునకును పేరు. |
| శాబరః కథ్యతే లోధ్రే<br>తథాపాపాపరాధయోః॥<br>శాబరీ శూకశింబ్యాం చ | **శాబర :** పు. ఇది లొద్దుగ చెట్టుకును, పాపముకును, నేరముకును, ఈ.స్త్రీ. దూలగొండి చెట్టుకును పేరు. |
| శారీరం దేహజే వృషే। | **శారీర :** త్రి. ఇది శరీర సంబంధమైన దానికిని, వృషభముకును పేరు. |
| కరీరః కలశే వృక్ష<br>భేదే వంశాంకురేऽపి చ॥ (190)<br>కరీరీ చీరికాయాం చ<br>దంతమూలే చ దంతినాం। | **కరీర:** పు. ఇది కుండకును, వెణుతురుచెట్టుకును, వెదురుబోడుకును, ఈ.స్త్రీ. చిమ్మెటకును, ఏనుగు దంతముయొక్క మొదటి భాగముకును పేరు. |
| శణీరం శోణమధ్యస్థ<br>పులినేదర్దురీతటే ॥ (191) | **శణీర :** న. శోణనదమధ్యమందలి యిసుము తిన్నెకును, దర్దురీనదియొడ్డుకును పేరు. |
| జంబీరః ప్రస్థపుష్పాఖ్య<br>శాకేదంతశఠేऽపి చ। | **జంబీర:** పు. ఇది మరువముకును, నిమ్మచెట్టుకును పేరు. |
| ఔశీరమాహు శ్చమరే<br>దండే చ శయనాసనే॥ | **ఔశీర:** న. ఇదిసురటీకిని, దుడ్డుకును, పానుపునకును, పీఠముకును పేరు. |
| సౌవీరం బదరే స్రోతే<br>ऽంజనే దేశే చ కాంజికే। | **సౌవీర :** న. ఇది రేగుపండుకును, సౌవీరాంజనముకును, పు. సౌవీరదేశముకును, పులికడుగునకును పేరు. |
| కి(మ్మీ)ర్మీరః కర్బురేదైత్య<br>రాక్షసాంతరయోరపి॥(193) | **కిర్మీర:** పు. ఇదికర్బురవర్ణముకును, రాక్షససామాన్యముకును, బకాసురుని తమ్మునకును పేరు. |
| కాశ్మీరం కుంకుమే ప్రోక్తం<br>టంక పుష్కరమూలయోః। | **కాశ్మీర :** న. ఇది కుంకుమముకును, పులికి పుష్కరమూలమనెడు గంధద్రవ్యముకును పే |
| పాటీరో వాతికేరంగే<br>మూలకేతితఉన్యపి॥ (194) | **పాటీర :** పు. ఇది సోమింత చెట్టుకును, సీ కును, ముల్లంగిదుంపకును, జల్లెడకును, |

ధారాధరేఽపి కేదారే
వేణుసారేఽపి చేష్యతే।

కును, వరిపంట భూమికిని, వెదురుగంధముకును పేరు.

అండీరః పురుషే శక్తే

**అండీర**: పు. ఇది పురుషునకును, సమర్థునకును పేరు.

హిండీరః పురుషే స్మృతః॥
ఫేనే వాతింగణే చాథ

**హిండీర**: పు. ఇది పురుషునకును, నురుగుకును, వంగచెట్టుకును పేరు.

ధూసరః పాండురే ఖరే।

**ధూసర**: పు. ధూసరవర్ణముకును, గాడిదకును పేరు.

కూబరః కుబ్జకే చారౌ
కూబరశ్చ యుగంధరే॥

**కూబర**: పు. ఇది నెమ్మిచెట్టుకును, త్రి. సుందరమైన దానికిని, పు. రథమునకును కాడికిని మధ్యనుండెడి నొగలుకును పేరు.

తూబరోఽశ్మశ్రుపురుషే
ప్రౌఢాశృంగవృషేఽపి చ।

**తూబర**: పు. పేడిమూతివానికిని, వయసుగలిగిన్ని కొమ్ములులేని యెద్దుకును పేరు.

స్యాన్నీవరో వణిజకే
వాస్తవ్యేఽపి చ నీవరః॥ (197)

**నీవర**: పు. ఇది వర్తకునకును, నివసించువానికిని పేరు.

పీవరః కచ్ఛపే స్థూలే

**పీవర**: పు. ఇది తాబేటికిని, త్రి. బలిసిన దానికిని పేరు.

ధీవరో లుబ్ధకే బుధే।

**ధీవర**: పు. జాలరివానికిని, విద్వాంసునకును పేరు.

కేసరం హింగుని ప్రోక్తం
కేసరో నాగకేసరే॥ (198)
సింహచ్ఛటయాం పున్నాగ
కింజల్క వకుళేష్వపి।

**కేసర**: న. ఇది ఇంగువకును, పు. నాగకేసరపు చెట్టుకును, సింహముమెడమీదనుండు జటుకును, పొన్నచెట్టుకును, పుష్పకింజల్కముకును, పొడ చెట్టుకును పేరు.

కిశోరస్త రుణావస్థే
హయశాబకసూర్యయోః॥ (199)

**కిశోర**: పు. ఇది బాలునకును, గుఱ్ఱపుపిల్లకును, సూర్యునకును, చందన వృక్షముకును పేరు.

తైలపర్ణ్యాం కుబేరస్తు
నందివృక్షే ధనాధిపే।

**కుబేర**: పు. నందిచెట్టుకును, కుబేరునకును పేరు.

కణేరు స్స్యాద్వశావేశ్యా
కర్ణికారే గణేరువత్॥

**కణేరు** : **గణేరు** : స్త్రీ. ఈ రెండును, ఆడు ఏనుగుకును, వెలయాలికిని, పు. కొండగోగుచెట్టుకును పేరు.

కోటీరశ్శక్రగోపేస్యా
చ్ఛక్రేపి నకులేపిచ।

**కోటీర** : పు. ఇది ఆర్ద్ర పురుగునకును, ఇంద్రునకును, ముంగిసకును పేరు.

అగురు స్స్యాచ్ఛింశుపాయాం

**అగురు** : పు. ఇది ఇరుగుడు చెట్టుకును, అగరు

| | |
|---|---|
| జోంగకే పి లఘున్యపి॥ | గంధముకును, లఘ్వక్షరముకును పేరు. |
| కింశారు స్సస్యశూకేః పి<br>సాయకే కంకపక్షిణి। | **కింశారు** : పు. వరిముల్లుకును, బాణముకును, రాబులుగుకును పేరు. |
| భార్యారు శ్శైలభేదే స్యా<br>న్మృగభేదే చ తత్ర చ॥(202)<br>క్రీడయా పరభార్యాయాం<br>పుత్రో యేనోపపాదితః। | **భార్యారు** : పు. ఇది పర్వత విశేషముకును, మృగ విశేషముకును, ఎవ్వడు పరస్త్రీయందు పుత్రుని గనెనో వానికిని పేరు. |
| కుతారుః పాదపే కీశే | **కుతారు** : పు. ఇది వృక్షముకును, కోతికిని పేరు. |
| కటప్రూ స్స్యాన్మహానటే॥(203)<br>విధ్యాధరే రక్షసి చ<br>కటప్రూరక్షదేవనే। | **కటప్రూః** : పు. ఇది శివునకును, విద్యాధరునకును, రాక్షసునకును, పాచికలాటకును పేరు. |
| దాసేరో దాసికా పుత్రే<br>దాసేర స్స్యాత్క్రమేళకే॥ | **దాసేర** : పు. ఇది దాసీపుత్రునకును, ఒంటెకును పేరు. |
| మయూరో బర్హిచూడాయా<br>మపామార్గే శిఖండిని। | **మయూర** : పు. స్థాణేయమను గంధ ద్రవ్యము కును, ఉత్తరేణి చెట్టుకును, నెమలికిని పేరు. |
| ఖర్జూరం రజతే విద్యా<br>ద్వృశ్చిక ద్రుమభేదయోః॥(205)<br>ఖర్జూరశ్చాథ | **ఖర్జూర**: న. ఇది వెండికిని, పు. తేలుకును, ఖర్జూర వృక్షముకును పేరు. |
| కర్బూరం శటీ<br>కాంచన యోరపి। | **కర్బూర** : న. ఇది గంట్లకచోరముకును, బంగారు కును పేరు. |
| సిందూర స్తరుభేదే స్యా<br>త్సిందూరం రక్తచూర్ణకే॥(206)<br>సిందూరీ రోచనీరక్త<br>చేలికా ధాతకీషు చ। | **సిందూర** : పు. ఇది సిందూరపు చెట్టుకును, న. సిందూరముకును, ఈ. స్త్రీ. కంపిల్లమనెడు గంధ ద్రవ్యముకును, ఎఱ్ఱని బట్టకును, ధాతకీపుష్ప మనెడి గంధద్రవ్యముకును పేరు. |
| వల్లూరం స్యా ద్వనక్షేత్రే<br>వాహనోషరయోరపి॥(207)<br>వల్లూరమాహు స్సంశుష్క<br>మాంస సూకరమాంసయోః। | **వల్లూర** : త్రి. ఇది అడవి భూమికిని, వాహనము నకును, చవిటి పఱ్ఱభూమికిని, ఎండిన మాంసము కును, పందిమాంసముకును పేరు. |

| | |
|---|---|
| ఏకాగ్ర మేకతానే స్యా<br>దేకాగ్రం త్రిష్వనాకులే॥(208) | **ఏకాగ్ర:** త్రి. ఇది నిశ్చలచిత్తునకును, ధైర్యశాలికిని పేరు. |
| నరేంద్రో వార్తికే రాజ్ఞి<br>విషవైద్యేఽపి కథ్యతే। | **నరేంద్ర** : పు. ఇది జాబులుమోయు వానికిని, రాజునకును, విషచికిత్సచేయు వానికిని పేరు. |
| మహేంద్రః పర్వతే శక్రే | **మహేంద్ర** : పు. మహేంద్ర పర్వతముకును, ఇంద్రునకును పేరు. |
| జలేంద్రో వరుణేఽంబుధౌ॥(209)<br>జంభలేఽపి జలేంద్రస్స్యా | **జలేంద్ర:** పు. ఇది వరుణదేవునకును, సముద్రముకును, నిమ్మచెట్టుకును పేరు. |
| త్సాముద్రం దేహలక్షణే<br>సాముద్రం చ సముద్రీయ<br>లవణాదిషు భేద్యవత్॥(210) | **సాముద్ర:** న. ఇది సముద్రునిచే జెప్పబడిన దేహలక్షణ శాస్త్రముకును, త్రి. సముద్రమందుబుట్టిన లవణాదులకును పేరు. |
| ఖండాభ్రమభ్రలేశే స్యా<br>త్స్త్రీణాం దంతక్షతాంతరే। | **ఖండాభ్ర:** న. ఇది మేఘశకలముకును, స్త్రీలదంతక్షత విశేషముకును పేరు. |
| కటిత్రం రశనాయాం స్యా<br>చ్చ(ద్వ)ర్మాంగే కటివాససి॥(211) | **కటిత్ర** : న. ఇది మొలనూలుకును, కటిప్రదేశమందుండెడు పటకా మొదలగువాటికిని, కటిప్రదేశమందలి వస్త్రముకును పేరు. |
| శిలీంధ్రం కదలీపుష్పే<br>కవకత్రిపుటాఖ్యయోః।<br>శిలీంధ్రఃకథితో ధీరై.<br>స్తరు మీన ప్రభేదయోః॥(212)<br>గండూపద్యాం మృది ప్రోక్తా<br>శిలీంధ్రీ విహగేభిదిః। | **శిలీంధ్ర:** న. ఇది అరటిపువ్వుకును, కుక్కగొడుగునకును, తెల్లతెగడకును, పు. నేలతాడిచెట్టుకును, మత్స్య విశేషముకును, ఈ. స్త్రీ. ఆడుకప్పకును, మంటికిని, పక్షివిశేషముకును పేరు. |
| తమిస్రం తిమిరే కోపే<br>తమిస్రా చ తమస్తతౌ॥ (213)<br>కృష్ణపక్ష నిశాయాం చ | **తమిస్ర** : న. ఇది చీకటికిని, కోపముకును, స్త్రీ. చీకట్లసమూహముకును కృష్ణపక్షరాత్రికిని పేరు. |
| త్వక్పత్రం తు వరాంగకే।<br>త్వక్పత్రీచైవ కారవ్యాం | **త్వక్పత్ర** : న. ఇది లవంగపు చెక్కకును, ఈ. స్త్రీ. ఇంగువచెట్టుకును పేరు. |
| కలత్రం శ్రోణి భార్యయోః॥(214) | **కలత్ర** : న. ఇది కటిప్రదేశముకును, భార్యకును, |

దుర్గస్థానేన్నృపాదీనాం

రాజునివసించెడు కోటకును పేరు.

పవిత్రం వర్షణే కుశే।
పవిత్రం తామ్ర పయసో
ర్మేధ్యే చాపి తదన్యవత్॥

**పవిత్ర**: న. ఇది వర్షముకును, దర్భకును, రాగికిని, జలముకును, త్రి. పవిత్రమైన దానికిని పేరు.

సావిత్ర శ్శంకరే ప్రోక్త
స్సావిత్రీ దేవతాంతరే।

**సావిత్ర** : పు. ఇది శివునకును, ఈ.స్త్రీ. దేవతా విశేషముకును పేరు.

దైత్యారి స్త్రిదశే విష్ణౌ

**దైత్యారి**: పు. ఇది దేవునకును, విష్ణువుకును పేరు.

తిత్తిరి ర్విహగే మునౌ॥

**తిత్తిరి**: పు. ఇది పక్షివిశేషముకును, తిత్తిరిమునికిని పేరు.

శాంకరి ర్విఘ్నపే స్కందే

**శాంకరి**: పు. ఇది పిళ్ళారికిని, కుమారస్వామికిని పేరు.

జసురిః పావకే పవౌ।

**జసురి**: పు. ఇది అగ్నికిని, వజ్రాయుధముకును పేరు.

మందురా వాజిశాలాయాం
సమీపార్థే చ వస్తుని॥ (217)

**మందురా** : స్త్రీ. ఇది గుఱ్ఱపుసాలకును, సమీపమందైన వస్తువుకును పేరు.

ఉర్వరా సర్వసస్యాఢ్య
భూమౌస్యాద్భూమిమాత్రకే।

**ఉర్వరా**: స్త్రీ. ఇది సస్యముతోగూడియున్న భూమికిని, సామాన్యభూమికిని పేరు.

అసురా రజనీ రాస్యో
రసురో దానవే రవౌ॥ (218)

**అసుర** : స్త్రీ. ఇది రాత్రికిని, ఆడుయొంటెకును, పు. రాక్షసునకును, సూర్యునకును పేరు.

వాసురా వాసితాయాం స్యా
ద్వాసరేయ్యాం మతాభువి।

**వాసురా** : స్త్రీ. ఇది స్త్రీసామాన్యముకును, రాత్రికిని, భూమికిని పేరు.

మసూరా మసురా వ్రీహి
ప్రభేదే పణ్యయోషితి॥(219)
మసూర మసురౌ చద్వా
వేతావ స్త్యేతయోర్మతౌ।

**మసూరా, మసురా**: పు. ఈరెండును, చిఱుసెనగలకును, వేశ్యకును పేరు.

శర్కరా ఖండవికృతా
వుపలా కర్ప రాంశయోః॥(220)
శర్కరాన్వితదేశేఽపి
రుగ్భేదే శకలేఽపి చ।

**శర్కరా**: స్త్రీ. ఇది పంచదారకును, మొరపరాతికిని, పుఱ్ఱెయొక్క భాగముకును, మొరపనేలకును, రోగవిశేషముకును, తునకకును పేరు.

కచ్చురా శూకశింబ్యాంచ
శటీ దుష్పర్శయోరపి॥ (221)

**కచ్చురా** : స్త్రీ. ఇది దూలగొండి చెట్టుకును, నల్లయతివసకును, పిన్నరేగటి దూలగొండి చెట్టు

| | |
|---|---|
| కచ్చురం వాచ్యవత్త్రాహుః పామనే పుంశ్చలేऽపి చ। | కును, త్రి. గజ్జిపట్టినవానికిని, జారునకును పేరు. |
| గాయత్రీ కథితా ఛందః ప్రభేదే ఖదిరేऽపి చ॥(222) | **గాయత్రీ** : స్త్రీ. ఇది గాయత్రీ ఛందముకును, చంద్ర చెట్టుకును పేరు. |
| సైరంధ్రీ పరవేశ్మస్థ శిల్పకృత్స్వ వశస్త్రియాం। వర్ణ సంకర సంభూత స్త్రీ మహల్లకయోరపి॥(223) | **సైరంధ్రీ**: స్త్రీ. పరుల గృహమందు పనులజేయుచూ స్వతంత్రముగా జీవించెడు స్త్రీకిని, సంకరవర్ణమందు బుట్టిన దానికిని, పు. అంతఃపురపరిచారకునకును పేరు. |
| ఖదిరీ శాకభేదేऽపి ఖదిరో దంతధావనే। (వాచ్యవత్సుందరం రమ్యే ప్రియే పత్యౌ తు సుందరః) సుందరీ స్త్రీ తరుభిదో | **ఖదిరీ** : స్త్రీ. ఇది శాక విశేషముకును, పు. పెనిమిటికిని ఈ. స్త్రీ. స్త్రీకిని, వృక్షవిశేషము కును పేరు. |
| శ్శర్వరీ రాత్రి యోషితోః॥(224) హరిద్రాయాం చ | **శర్వరీ**: స్త్రీ. ఇది రాత్రికిని, స్త్రీసామాన్యముకును, పసపునకును పేరు. |
| కబరీ కేశశాకవిశేషయోః। కబరం లవణేऽమ్లేచ తుంబురీశరమర్దయోః॥ | **కబరీ**: స్త్రీ. ఇది కొప్పునకును, శాకభేదముకును, న. ఉప్పునకును, పులుసునకును, పు. కొత్తిమిరి కిని, ఓషధి విశేషముకును పేరు. |
| మంజరీ వల్లరీ స్థూల ముక్తా తిలక శాఖిషు। | **మంజరీ** : స్త్రీ. ఇది పూలగుత్తికిని, పెద్ద ముత్యము కును, తిలక వృక్షముకును పేరు. |
| మర్మరీ పీతదారౌ స్యా ద్వస్త్ర భేదేऽపి మర్మరః॥ | **మర్మరీ** : స్త్రీ. ఇది మానిపసపునకును, పు. వస్త్ర విశేషముకును పేరు. |
| టట్టరీ స్యాన్మృషావాదే లంపా పటహయోరపి। | **టట్టరీ**: స్త్రీ. ఇది అబద్ధపుమాటకును, లంపావాద్య ముకును, ఢక్కావాద్యముకును పేరు. |
| శక్వరీ మేఖలా నద్యో శ్ఛందో భేదేऽపి శక్వరీ॥ | **శక్వరీ** : స్త్రీ. ఇది మొలనూలుకును, నదీ విశేషము కును, **14**వ ఛందముకును పేరు. |
| ఝల్లరీ ఝలరీ చద్వే హుడుక్కే (బాలచక్రకే) కేశ వక్రకే। | **ఝల్లరీ, ఝలరీ**: స్త్రీ. ఇది జేగంటకును, చక్రాకార మైన వెండ్రుకలకును పేరు. |

| | |
|---|---|
| కావేరీ స్యాత్పురిద్భేదే<br>పణ్యానారీ హరిద్రయోః॥ | **కావేరీ:** స్త్రీ. కావేరీ నదికిని, వెలయాలికిని, పసపున కును పేరు. |

★ అథరాంతశ్చతుర్వర్ణః ★

| | |
|---|---|
| భవేత్పరికరో వ్రాతే<br>పర్యంక పరివారయోః।<br>ప్రగాఢ గాత్రికాబంధే<br>వివేకా రంభయోరపి॥ (229) | **పరికర:** పు. ఇది సమూహముకును, శయ్యకును, పరిజనముకును, గాఢాలింగన విశేషముకును, జ్ఞానముకును, ప్రారంభముకును పేరు. |
| వ్యతికర స్సమాఖ్యాతో<br>వ్యసన వ్యతిషంగయోః। | **వ్యతికర:** పు. ఇది దుఃఖముకును, పరస్పరసంమేళ నముకును పేరు. |
| విభాకరోఽగ్నౌ తపనే | **విభాకర :** పు. ఇది అగ్నికిని, సూర్యునకును పేరు. |
| వస్కరో గుహ్యగూఢయోః॥(230) | **అవస్కర :** పు. మర్మాంగముకును, రహస్యము కును పేరు. |
| కర్మకరస్తు కీనాశే<br>భృత్యే వేతన జీవిని।<br>కర్మకరీతు మూర్వాయాం<br>బింబికా యామపిక్వచిత్॥(231) | **కర్మకర :** పు. ఇది యమునకును, సేవకునకును, జీతగానికిని, ఈ. స్త్రీ. చాగచెట్టుకును, పు. దొండ చెట్టుకును పేరు. |
| అరుష్కరో వ్రణకరే<br>భల్లాతే చాప్యరుష్కరం। | **అరుష్కర:** త్రి. పుండుచేయుదానికిని, న. జీడిగింజ కును పేరు. |
| భవేత్సహచరో ఝింట్యాం<br>వయస్యే ప్రతిబింబకే॥ (232) | **సహచర :** పు. ఇది నల్ల పెద్ద గోరింటచెట్టుకును, చెలికానికిని నీడకును పేరు. |
| నిశాచరః పేచకా హి<br>యాతుధానేషు ఫేరవే।<br>నిశాచరీ పాంసు (శు) లాయాం | **నిశాచర :** పు. ఇది గుడ్లగూబకును, పాముకును, రాక్షసునకును, నక్కకును, ఈ. స్త్రీ. రంకు లాడికిని పేరు. |
| భవేత్ప క్షచరో విధౌ॥ (233)<br>యూథభ్రష్ట పృథక్చారి<br>వార ణేపి ప్రకీర్తితః। | **పక్షచర :** పు. చంద్రునకును, కదుపునుంచి విడి యొంటరిగా సంచరించు యేనుగుకును పేరు. |
| చరాచరం స్యాజ్జగతి<br>వాచ్యవజ్జంగ మేంగయోః॥ | **చరాచర:** న. ఇది ప్రపంచముకును, త్రి. మనుష్య పశుపక్ష్యాదులకును, భావసూచకములగు భ్రూభం |

గాదులకును పేరు.

విదు ర్దశపురం దేశే
ముస్తాయాం పట్టణేఽపి చ

**దశపుర** : న. ఇది మాళవ దేశమందలి యొక భాగముకును, తుంగముస్తకును, పట్టణవిశేషముకును పేరు.

అభిమరో వధే యుద్ధే
తథాస్వబలసాధ్వసే॥ (235)

**అభిమర** : పు. ఇది చంపుటకును, యుద్ధముకును, స్వపక్ష సైన్యమువలని భయమునకును పేరు.

ఆహుఃప్రతిసరం హస్త
సూత్రే మాల్యే చ మండనే।
వ్రణశుద్ధౌ చమూపృష్ఠే
నియోజ్యారక్షకంకణే॥ (236)
మంత్రభేదే

**ప్రతిసర** : న. ఇది దీక్షాదులయందు కట్టిన హస్తసూత్రముకును, పూలదండకును, అలంకారముకును, వ్రణములను శుద్ధిచేయుటకును, సేన యొక్క వెనుక భాగముకును, పు. భృత్యునకును, ఏనుగు కుంభస్థలముయొక్క క్రింది భాగముకును, కడియముకును, మంత్ర విశేషముకును పేరు.

ఽప్యవసరో వర్ష
ప్రస్తావయోరపి।

**అవసర** : పు. ఇది వానకును, కార్యోచిత సమయముకును పేరు.

స్మృతఃపరిసరో మృత్యౌ
దైవేఽపాంత ప్రదేశయోః॥

**పరిసర** : పు. ఇది మృత్యువుకును, దైవముకును, గ్రామాదుల సమీప ప్రదేశముకును పేరు.

దిగంబర స్స్యాత్క్షపణే
నగ్నే తమసి శంకరే।

**దిగంబర** : పు. ఇది క్షపణ మతస్థునకును, వస్త్రవిహీనునకును, చీకటికిని, శివునకును పేరు.

పీతాంబరః పద్మనాభే
భవేత్పీతాంబరో నటే॥ (238)

**పీతాంబర** : పు. ఇది విష్ణువుకును, నాట్యగానికిని పేరు.

కాదంబరం తు దధ్యగ్రే
మధ్యభేదే చ సీధుని।
కాదంబరీ పరభృతా
భారతీశారికాసు చ॥ (239)

**కాదంబర** : న. ఇది పెరుగుమీగడకును, కదంబ పుష్పములచేత జేయబడిన కల్లుకును, సామాన్యపు కల్లుకును, ఈ. స్త్రీ. ఆడుకోయిలకును, సరస్వతికిని, గోరింకకును పేరు.

ఉదుంబరస్తు దేహ ల్యాం
వృక్షజాతౌ చ షండకే।
ఉదుంబరం స్మృతం తామ్రే
కుష్ఠభేదేఽప్యుదుంబరః॥

**ఉదుంబర** : పు. ఇది గడపకును, మేడి చెట్టుకును, నపుంసకునకును, న. రాగికిని, పు. కుష్ఠరోగ విశేషముకును పేరు.

ఔదుంబర శ్శ్రాద్ధ దేవే

**ఔదుంబర** : పు. యమునకును, రోగ విశేషము

| | |
|---|---|
| రోగభేదే చ కథ్యతే। | కును పేరు. |
| నీలాంబరః ప్రలంబఘ్నే | **నీలాంబర**: పు. ఇది బలరామునకును, రాక్షసున |
| కోణపే క్రూరలోచనే॥ | కును, శనైశ్చరునకును పేరు. |
| ఆడంబర స్సమారంభే | **ఆడంబర** : పు. తొందరపాటుకును, బృంహిత |
| గజగర్జిత తూర్యయోః। | ధ్వనికిని, చతుర్విధవాద్య ధ్వనికిని పేరు. |
| నిషద్వరస్తు జంబాలే | **నిషద్వర**: పు. ఇది అడుసునకును, ఈ. స్త్రీ. రాత్రి |
| నిశాయాంచనిషద్వరీ॥ (242) | కిని పేరు. |
| ఉపహ్వారం సమీపే స్యా | **ఉపహ్వార** : న. ఇది సమీపముకును, రహస్యము |
| దేకాంతే చాప్యుపహ్వారం। | కును పేరు. |
| ఇందీవరం కువలయే | **ఇందీవర**: న. ఇది కలువకును, ఈ. స్త్రీ. పిల్లి పిచ్చ |
| వర్యా మిందీవరీ మతా॥(243) | రకును పేరు. |
| కాలంజరో యోగిచక్ర | **కాలంజర**: పు. ఇది యోగులు సంఘముగా గూడి |
| మేళకే భైరవే గిరౌ। | యుండుటకును, శివునకును, పర్వతవిశేషము |
| | కును పేరు. |
| విశ్వంభరోఽచ్యుతేశక్రే | **విశ్వంభర**: పు. ఇది విష్ణువుకును, ఇంద్రునకును, |
| తథావిశ్వంభరా భువి। | స్త్రీ. భూమికిని పేరు. |
| దురోదరో ద్యూతకారే | **దురోదర**: పు. ఇది జూదమాడువానికిని, న. పందె |
| పణే ద్యూతే దురోదరం। | ముకును, జూదముకును పేరు. |
| లంబోదరో స్స్యా (దుధ్మాతే)దాద్యూనే | **లంబోదర** : పు. ఇది తనపొట్టను మాత్రము |
| గణానా మధిపేఽపి చ ॥ (245) | పోషించుకొనువానికిని, విఘ్నేశ్వరునకును పేరు. |
| అనుత్తర స్స్మృత శ్రేష్ఠే | **అనుత్తర**: త్రి. ఇది శ్రేష్ఠమైనదానికిని, ప్రత్యుత్తరము |
| ప్రతిజల్ప వివర్జితే। | లేని వాక్యముకును పేరు. |
| తులధరస్తులారాశౌ | **తులాధర** : పు. ఇది తులారాశికిని, వర్తకునకును |
| భవేద్వాణిజకేఽపి చ॥ (246) | పేరు. |
| భవేత్తోయధరో మేఘే | **తోయధర**: పు. ఇది మేఘముకును, చెంచలి కూర |
| సునిషణ్ణౌష ధావపి। | కును పేరు. |
| ధురంధరో ధవతరౌ | **ధురంధర**: పు. వృక్షవిశేషముకును, త్రి. భారవాహ |
| ధూర్వహేఽపి ధురంధరః॥ | కునకును పేరు. |

| | |
|---|---|
| చక్రధరో హరౌ సర్పే<br>వాచ్యవ ద్గ్రామజాలిని। | **చక్రధర** : పు. ఇది విష్ణువుకును, పాముకును, త్రి. అనేక గ్రామములను పాలించువానికిని పేరు. |
| అశ్వతరో వేసరే చ<br>నాగ రాజాంతరేఽపి చ ॥(248) | **అశ్వతర**: పు. ఇది కంచర గాడిదకును, దేవయోని, సర్పవిశేషముకును పేరు. |
| విదుర్వీరతర శ్శ్రేష్ఠే<br>శరవీరణయోరపి। | **వీరతర**: పు. ఇది సమర్థునకును, బాణముకును, న. ఆవురు గడ్డికిని పేరు. |
| నభశ్చరో ఘనే వాతే<br>విద్యాధర విహంగయోః॥ | **నభశ్చర** : పు. ఇది మేఘమునకును, వాయువుకును, విద్యాధరులను దేవయోని విశేషులకును, పక్షికిని పేరు. |
| ఉద్ధంతుర స్స్యాదుత్తుంగే<br>కరాళో త్కటదంతయోః। | **ఉద్ధంతుర**: త్రి. పొడవైన దానికిని, భయంకరమైన దానికిని, మిట్టపండ్ల దానికిని పేరు. |
| ద్వైమాతురో జరాసంధ<br>వారణాన నయోర్మతః॥ | **ద్వైమాతుర**: పు. ఇది జరాచంధునకును, విఘ్నేశ్వరునకును పేరు. |
| పరంపరః ప్రపౌత్రాదౌ<br>మృగభేదే పరంపరః।<br>పరంపరా పరీపాఠ్యాం.<br>సంతానేఽపి వధే క్వచిత్॥(251) | **పరంపర** : పు. ప్రపౌత్రుడు మొదలుగా గల సంతతికిని మృగవిశేషముకును స్త్రీ. అనుక్రమమునకును, సంతతికిని, వధకును పేరు. |
| అవతారోఽవతరణే<br>తీర్థేజన్మని చేష్యతే। | **అవతార**: పు. ఇది దాటుటకును, నీళ్ళరేవునకును, పుట్టుగకును పేరు. |
| ధరాధరః క్ష్మాభృతి చ క్రపాణౌ | **ధరాధర**:పు. ఇది పర్వతమునకును, విష్ణువుకును పేరు. |
| ధారాధర స్తోయధరే కృపాణే | **ధారాధర** : పు. మేఘముకును, ఖడ్గముకును పేరు. |
| పయోధర స్స్యాత్కుచ<br>కోశకారక శేరు<br>కాంభో ధరనారికేళే॥ (252) | **పయోధర** : పు. ఇది కుచమునకును, చెరుకుల లోని భేదముకును, తుంగముస్తకును, మేఘముకును, టెంకాయకును పేరు. |
| కలికారః కరంజేస్స్యా<br>ద్ధ్వామ్యాటే పీతమస్తకే। | **కలికార**: పు. ఇది దుర్గంధముగల క్రానుగు చెట్టు కును, కూకటి.మూగపిట్టకును, బంగారు పిచ్చుక కును పేరు. |
| అలంకార స్తూపమాదౌ<br>హారకేయూరకాదిషు॥(253) | **అలంకార**: పు. ఇది ఉపమాదికావ్యాలంకారములకును, హారాది దేహాలంకారములకును పేరు. |

కర్ణికారశ్చ శంపాకే
కర్ణికారో ద్రుమోత్పలే।

**కర్ణికార** : పు. ఇది రేల చెట్టుకును, కొండగోగు చెట్టుకును పేరు.

రథకారస్తు మాహిష్యా
త్కరణీ జేచతక్షణి॥ (254)

**రథకార** : పు. ఇది వడ్లవానికిని, వజ్రముచేయు వానికిని పేరు.

చర్మకార స్మృతః పాదూ
కృతి చర్మకషౌషధా।
చర్మకారీతి కథితా

**చర్మకార**: పు. ఇది చెమారివానికిని, ఈ. స్త్రీ. సంబ రేణియను ఓషధికిని పేరు.

ప్రతికార స్సమే భటే॥ (255)

**ప్రతికార** : పు. ఇది సమానమునకును, యుద్ధ భటునకును పేరు.

ఘనసారస్తు కర్పూరే
దక్షిణావర్తపారదే।

**ఘనసార** : పు. ఇది కర్పూరమునకును, పాద రసములోని భేదముకును పేరు.

కృష్ణసారస్స్నుహీవృక్షే
శింశుపామృగభేదయోః॥ (256)

**కృష్ణసార**: పు. ఇది జెముడు చెట్టుకును, నల్లయిరుగుడు చేవచెట్టుకును, చిత్రవర్ణముగల ఇఱ్ఱికిని పేరు.

గిరిసారో భవేల్లోహే
లింగేమలయపర్వతే।

**గిరిసార** : పు. ఇది ఇనుమునకును, శివలింగము నకును, మలయపర్వతమునకును పేరు.

పీతసారో మలయజే
గోమేధికమణావపి॥ (257)

**పీతసార** : పు. ఇది మంచిగంధపు చెట్టునకును, గోమేధిక మణికిని పేరు.

(సా) శాలసారో ద్రుమేహింగౌ

**శాలసార**: పు. ఇది వృక్షమునకును, ఇంగువకును పేరు.

సూత్రధార శ్శచీపతౌ।
నాంద్యనంతర సంచారి
పాత్ర శిల్పి ప్రభేదయోః॥ (258)

**సూత్రధార**: పు. ఇంద్రునకును, నాంద్యంతమందు నాటక కథాసూచన జేయు పాత్రవిశేషమునకును, శిల్పి జాతివిశేషముకును పేరు.

దండధరో యమే భూపే

**దండధర**: పు. ఇది యమునకును, రాజునకును పేరు.

సంప్రహారో రణే .తా।

**సంప్రహార**: పు. ఇది యుద్ధమునకును, గమనము నకును పేరు.

ప్రతిహార ప్రతీహా(ర్యా) రౌ
ద్వాస్థేద్వారేఽప్యనంతరే॥ (259)

**ప్రతిహార, ప్రతీహార**: పు. ఇది ద్వారపాలునకును, ద్వారమునకును, వ్యవధి లేకుండుటకును పేరు.

అభిహారో భియోగే చ
చౌర్యే సన్నహనేఽపిచ।

**అభిహార** : పు. అవమానితుడై ప్రభువులయొద్ద ఫిర్యాదు చేయుటకును, దొంగతనమునకును,

సిద్ధముగానుండుటకును పేరు.

వ్యవహారో ద్రుభేదే చ
వ్యవహారః పణేస్థితౌ॥ (260)

**వ్యవహార :** పు. ఇది వృక్షవిశేషముకును, పందెమునకును, ఉనికికిని పేరు.

అవహారస్స్మృతశ్చౌరే
ద్యూతయుద్ధాదివిశ్రమే।
నిమంత్రణో హనేతవ్య
ద్రవ్యేగ్రాహాఖ్యయాదసి॥ (261)

**అవహార:** పు. ఇది దొంగకును, జూదము మొదలగు వాటియందు విశ్రమించుటకును, నియోగించుటకును, గ్రహించదగిన వస్తువునకును, మొసలికిని పేరు.

పరివారః పరిజనే
ఖడ్గకోశే పరిచ్ఛదే।

**పరివార :** పు. ఇది పరిజనమునకును, కత్తి వరకును, కప్పియుండు వస్త్రాదులకును పేరు.

పారావారస్సముద్రేచ
పారావారం తటద్వయే॥ (262)

**పారావార :** పు. సముద్రమునకును, న. ఆవలీవలి గట్లకును పేరు.

అకూపారస్సముద్రేఽపి
కూర్మరాజేఽపికీర్తితః॥

**అకూపార :** పు. ఇది సముద్రముకును, ఆది కూర్మమునకును పేరు.

శిశుమారోఽంబుసంభూత
జంతౌ తారాత్మకాచ్యుతే॥ (263)

**శిశుమార :** పు. ఇది పిడక మొసలికిని, ధ్రువనక్షత్ర సమీపమందుండు నక్షత్రరూపమగు విష్ణువుకును పేరు.

సుకుమారస్తుపుండ్రేక్షౌ
కోమలే త్వభిధేయవత్।

**సుకుమార :** పు. ఇది నామాల చెరుకునకును, త్రి. మృదువైన దానికిని పేరు.

ధుంధుమారశ్శక్రగోపే
గృహధూమే పదాలికే॥ (264)

**ధుంధుమార:** పు. ఇది ఆర్ద్రపురుగునకును, ఇంటి పొగకును, అనేక పాదములు గల జంతు విశేషముకును పేరు.

కర్ణపూరోఽవతంసే స్యా
న్నీలోత్పలశిరీషయోః॥

**కర్ణపూర :** పు. ఇది కర్ణాలంకారమునకును, న. నల్లకలువకును, దిరిశెన పువ్వునకును పేరు.

కరవీరః కృపాణేచ
దైత్యభేదా శ్వమారయోః॥(265)
శ్రేష్ఠగవ్యాం పుత్రవత్యా
మదితౌకరవీర్యపి।

**కరవీర :** పు. ఇది కత్తికిని, ఈ పేరుగల రాక్షసునకును, వాడగన్నేరు చెట్టుకును, ఈ.స్త్రీ. ఉత్తమ గోవునకును, పుత్త్రులుగల స్త్రీకిని, దేవమాతకును పేరు.

మహావీరః పవౌతార్క్ష్యే
శూరే సింహే చ కోకిలే॥(266)

**మహావీర:** పు. ఇది వజ్రాయుధమునకును, గరుడునకును, శూరునకును, సింహమునకును, కోయి

మఖానలే చ కర్కే చ
మహావీరో జరాటకే।
ఆత్మవీరః ప్రాణవతి
స్యాలే పుత్రే విదూషకే॥(267)
బార్బటీర స్త్రపా వామ్రా
ష్ట్యంకురే గణికా సుతే।
చిత్రాటీరో విధౌ ఫాల
మంకితం యేన తత్రచ॥ (268)
ఘంటాకర్ణో పహారాయ
హతఛాగాస్రబిందుభిః।
పాత్రటీరో బుధైరుక్తో
ముక్తవ్యాపారమంత్రిణి॥ (269)
లోహకాంస్య రజత్పాత్రే
సిం(ఘా) హాణే పా వకేऽపిచ
ధారాంకురస్తునాసీరే
సీకరేచ ఘనోపలే॥ (270)
సముద్రారు స్మృతో గ్రాహే
సేతుబంధే తిమింగిలే।
విశ్వకద్రుస్మృతో ధ్వానే
స్యాదాఖేటికకుర్కురే॥ (271)
అసిపత్రో భవేత్కోశ
కారే చ నరకాంతరే।
శతపత్రో రాజకీరే
దార్వాఘాట మయూరయోః॥(272)
రాజీవే శతపత్రంతు
వాతపుత్రోహనూమతి।
మహాధూర్తే చ భీమే చ
లక్ష్మీపుత్ర స్స్మరే హయే॥(273)

లకును, యజ్ఞసంబంధమగు అగ్ని విశేషముకును, తెల్ల గుఱ్ఱముకును, సంచానపక్షికిని పేరు.

**ఆత్మవీర** : పు. ఇది ప్రాణికిని, భార్య తోడబుట్టిన వానికిని, పుత్రునకును, విదూషకునకును పేరు.

**బార్బటీర** : పు. ఇది తగరమునకును, మామిడి టెంకకును, మొలకకును, వేశ్యాపుత్రునకును పేరు.

**చిత్రాటీర** : పు. చంద్రునకును, ఘంటాకర్ణుడను దేవుని బలికొరకు నరకబడిన పశురక్తముచేత నంకితమైన ఫాలముగల వానికిని పేరు.

**పాత్రటీర** : పు. ఇది అధికారమును విడిచిన మంత్రికిని లోహపాత్రమునకును, కంచుగిన్నెకును, వెండిగిన్నెకును, గాజుగిన్నెకును, అగ్నికిని పేరు.

**ధారాంకుర** : పు. ఇది సేనయొక్క ముందరి భాగమునకును, జలకణమునకును, వడగలికిని పేరు.

**సముద్రారు** : పు. మొసలికిని, కట్టకును (వారధి యని వాడుదురు) తిమింగిలమను చేపకును పేరు.

**విశ్వకద్రు** : పు. ఇది దుష్టునకును, ధ్వనికిని, వేటకుక్కకును పేరు.

**అసిపత్ర** : పు. ఇది చెరుకు చెట్టుకును, నరక విశేషమునకును పేరు.

**శతపత్ర** : పు. ఇది చిలుకలలోని భేదమునకును, వడ్రంగి పిట్టకును, నెమలికిని, న. పద్మమునకును పేరు.

**వాతపుత్ర** : పు. ఇది హనుమంతునకును, మిక్కిలి మోసగానికిని, భీమునకును పేరు.

**లక్ష్మీపుత్ర** : పు. మన్మథునకును, అశ్వమునకును పేరు.

పూర్ణపాత్రం వస్తుపూర్ణ
పాత్రే వర్ధాపకేఽపి చ।

**పూర్ణపాత్ర**: న. ఇది వివాహోద్యుత్సవములయందు వస్త్రాలంకరణాదులచేత నిండింపబడిన పాత్రమునకును, నాడీ విభాగముజేయువానికిని పేరు.

మహామాత్రస్సమృద్ధే స్యా
న్మాత్యే హస్తిపకాధిపే॥ (274)

**మహామాత్ర** : పు. ఇది పరిపూర్ణునకును, మంత్రికిని, మావటివానికిని పేరు.

బిందుతంత్రంవిదుస్సారి
ఫలకే చ తురంగకే।

**బింధుతంత్ర** : న. ఇది సొగటాలబల్లకును, పు. అశ్వముకును పేరు.

రాగసూత్రం తులాసూత్రే
పట్టసూత్రేఽపిదృశ్యతే॥ (275)

**రాగసూత్ర**: న. ఇదితక్కెడ త్రాటికిని, పట్టుదారమునకును పేరు.

తాళపత్రంతుతాటంకే
వందాయాంతాళపత్ర్యపి।

**తాళపత్ర** : న. ఇది చెవికమ్మకును, ఈ. స్త్రీ. ఎలుక చెవి చెట్టుకును పేరు.

అగ్నిహోత్రోఽగ్నిహవిషో

**అగ్నిహోత్ర** : పు. ఇది అగ్నికిని, హోమార్థమైన యన్నమునకును పేరు.

ర్వీతిహోత్రోఽనలార్కయోః॥(276)

**వీతిహోత్ర** : పు. ఇది అగ్నికిని, సూర్యునకును పేరు.

వీరభద్రోఽశ్వమేధాశ్వే
వీరశ్రేష్ఠే చవీరణే।

**వీరభద్ర**: పు. ఇది అశ్వమేధమందు విడచిన గుఱ్ఱమునకును, మహావీరునకును, అవురు గడ్డికిని పేరు.

పారిభద్రస్తు మందార
నింబ పాదపయోర్మతః॥ (277)

**పారిభద్ర** పు. ఇది పారిజాతవృక్షమునకును, బాడిదపు చెట్టునకును పేరు.

బలభద్రో రౌహిణేయే
త్రాయమాణౌషధావపి।

**బలభద్ర**: పు. బలరామునకును, స్త్రీ. కలుత్రానుగు చెట్టునకును, కలబంద చెట్టునకును పేరు.

బలభద్రాకుమార్యం స్యా
దర్ధచంద్రస్తు చంద్రకే॥ (278)
గళహస్తే బాణభేదే
స్త్రీ చంద్రాత్రివృద్ధిది।

**అర్ధచంద్ర** : పు. నెమలికన్నునకును, మెడపట్టి గెంటుటకును, అర్ధచంద్రాకృతియైన అలుగుగల బాణ మునకును, స్త్రీ. నల్ల తెగడకును పేరు.

ధార్తరాష్ట్రే సితాస్యాంఘ్రి
హంస కౌరవభోగిషు॥ (279)

**ధార్తరాష్ట్ర** : పు. నల్లని ముక్కును, కాళ్ళును గల హంసమునకును, ధృతరాష్ట్రుని పుత్రునకును, సర్పమునకును పేరు.

ధృతరాష్ట్రస్తురాజ్ఞిస్యా

**ధృతరాష్ట్ర** : పు. ఇది శ్రేష్ఠమైన రాజునకును, పక్షి

త్వక్షి క్షత్రియభేదయోః। విశేషమునకును, ధృతరాష్ట్రునకును, ఈ. స్త్రీ.
ధృతరాష్ట్రీహంసపత్న్యాం ఆడు హంసకును పేరు.
స్థిరదంష్ట్రో భుజంగమే॥ (280) **స్థిరదంష్ట్ర**: పు. ఇది సర్పమునకును, ఆదివరాహ
వరాహాకృతివిష్ణౌచ మూర్తికిని పేరు.
వక్రనక్రశ్శుకే ఖలే। **వక్రనక్ర**: పు. చిలుకకును, దుర్మార్గునకును పేరు.
కటంభరా ప్రసారణ్యాం **కటంభరా** : స్త్రీ. ఇది గొంతెమగొమరు చెట్టున
రోహిణ్యాం గజయోషితి॥(281) కును, కటకరోహిణికిని ఆడుయేనుగకును, తూటి
కలంబికాయాంగోలాయాం కూరకును, మణిశిలకును, కప్పకును, చాగచెట్టున
వర్షాభూమూర్వయోరపి। కును పేరు.
మణిచ్ఛిద్రాతు మేదాయా **మణిచ్ఛిద్రా** : స్త్రీ. ఇది మేదయను గంధద్రవ్యము
వృషభాఖ్యౌషధేఽపిచ॥ (282) నకును, ఋషభమను ఓషధికిని పేరు.
తుంగభద్రానదీ భేదే **తుంగభద్రా** : స్త్రీ. ఇది నదీవిశేషమునకును, పు.
తుంగభద్రో మదోత్కటే। మదపుటేనుగునకును పేరు.
దండయాత్రా దిగ్విజయే **దండయాత్రా** : స్త్రీ. ఇది దిక్కులను జయించుట
సంయానవరయాత్రయోః॥(283) కును, జంతికెలకును, తోలువారునకును పేరు.
దేహయాత్రా భోజనే స్యా **దేహయాత్రా** : స్త్రీ. ఇది భోజనమునకును, యమ
త్కృతాంత గమనేఽపి చ। పురికి బోవుటకును పేరు.
విభావరీ హరిద్రాయాం **విభావరి** : స్త్రీ. ఇది పసపునకును, రాత్రికిని,
రజన్యాంచ విభావరీ॥ (284) వివాదమునకును, పటకుటీరమునకును (డేరా)
వివాదేవస్త్ర కుట్యాంచ తార్పుడుకత్తెకును, ఆడుచక్రవాకమునకును పేరు.
కుట్టన్యాంచక్రయోషితి।
కుంభకారీకులాల్యాంస్యా **కుంభకారీ** : స్త్రీ. కుమ్మరి దానికిని, పు. కుమ్మరి
త్కుంభకారఃకులాలకే॥ (285) వానికిని పేరు.
తుండికేరీతు కార్పాస్యాం **తుండికేరీ** : స్త్రీ. ఇది ప్రత్తిచెట్టునకును, దొండ
బింబికాయామపీష్యతే। చెట్టునకును పేరు.

★ అథరాంతః పంచవర్ణః ★

పాంశుచామర ఇత్యేష **పాంశుచామర**: పు. ఇది గరికిమొలచిన భూమికిని,
దూర్వాంచిత తటీభువి॥ (286) నాడీవిభాగముజేయు వానికిని, స్తుతికిని, రెక్కల

వర్ధాపకే ప్రశంసాయాం
పురోటౌధూళిగుచ్ఛకే।
స్యాత్పాదచ(తు) త్వరశ్చాగే
సైకతే పిప్పలేఽపిచ ॥ (287)
కరకే పరదోషైక
భాజిపూరుషకేఽపి చ।

యొక్క ఝుంకారధ్వనికిని, వస్త్రములను పరిమళింపజేయు పరిమళచూర్ణమునకును పేరు.

**పాదచత్వర**: పు. ఇదిమేకకును, ఇసుకతిన్నెకును, రావిచెట్టుకును, వడగలికిని, పరులదోషముల నెంచెడి వానికిని పేరు.

విప్రతీసారమిచ్ఛంతి
కాకృత్యేఽనుశయే రుషి॥ (288)

**విప్రతీసార**: న. ఇదిచెడుకార్యమునకును, పశ్చాత్తాపమునకును, దీర్ఘక్రోధమునకును పేరు.

సమభిహారో.భృశార్థే
చ పౌనః పున్యేఽపి కథ్యతే।

**సమభిహార** : పు. మిక్కిలియనుటకును, మాటిమాటికి యనుటకును పేరు.

పీతకావేరమిచ్ఛంతి
పిత్తళే కుంకుమేఽపి చ॥ (289)

**పీతకావేర**: న. ఇది ఇత్తడికిని, కుంకుమమునకును పేరు.

తాలీసపత్రం తాలీశే
తా మలక్యామపి స్మృతం।

**తాలీసపత్ర**: న. తాళిసపత్రికమునకును, నేలవుశిరిగ చెట్టునకును పేరు.

భవేదుత్పలపత్రంతు
తద్దళే స్త్రీనఖక్షతే॥ (290)

**ఉత్పలపత్ర** : న. కలువరేకునకును, స్త్రీల నఖక్షత విశేషమునకును పేరు.

తమాలపత్రం తాపించే
పత్రకే తిలకేఽపి చ।

**తమాలపత్ర**: న. ఇది చీకటిమానుకును, మకరికాపత్రమునకును, నుదుటి బొట్టునకును పేరు.

సర్వతోభద్ర ఇత్యుక్తః
కావ్యచిత్రే గృహాంతరే॥ (291)
నింబేఽపి సర్వతోభద్రా
గంభారీ నటయోషితోః।

**సర్వతోభద్ర**: పు. ఇదిసర్వతోభద్రమనెడిపద్యబంధమునకును, నలువైపులను చావిళ్ళుగల భవంతికిని, వేపచెట్టుకును, స్త్రీ. గుమ్మడు చెట్టునకును, నాట్యస్త్రీకిని పేరు.

వస్వోకసారా శ్రీదస్య
శక్రస్య నళినీ పురోః॥ (292)

**వస్వోకసారా**: స్త్రీ. ఇది కుబేరుని నదికిని, అలకాపట్టణమునకును, ఆకాశ గంగకును, అమరావతికిని పేరు.

భవేత్కపిలధారాఖ్యా
స్స్వర్ణదీ తీర్థభేదయోః।

**కపిలధారా** : స్త్రీ. ఇది ఆకాశగంగకును, తీర్థవిశేషమునకును పేరు.

★ అథలాంతో ద్వివర్ణః ★

బలం గంధరసే రూపే

**బల**: న. ఇది బాలింత బోలునకును, రూపమున

స్థామని స్థౌల్యసైన్యయోః।
బలో హలాయుధేదైత్య
భేదే బలిని వాయసే॥ (1)
వాట్యాలకే బలాతూక్తా

కును, శరీరసామర్థ్యమునకును, లావునకును, రథాది చతురంగసైన్యమునకును, పు. బలరామునకును, బలాసురునకును, బలవంతునకును, కాకికిని, స్త్రీ. ముత్తవ పులగపు చెట్టుకును పేరు.

పలం తూన్మాన మాంసయోః।

**పల** : న. ఇది నాలుగు కర్షముల యెత్తు తూనికె గుండు మొదలగువాటికిని, మాంసమునకును పేరు.

ఫలం హేతుసముత్థే స్యా
త్ఫలకే వ్యుష్టి లాభయోః॥ (2)
జాతీఫలేఽపి తక్కోలే
సస్య బాణాగ్రయోరపి।
ఫలిన్యాంతు ఫలాప్రాహు
స్త్రీఫలాయాం ఫలంక్వచిత్॥ (3)

**ఫల**: న. ఇది హేతువువలన పుట్టిన ప్రయోజనమునకును, సొగటాలబల్లకును, ఫలమునకును, లాభమునకును, జాజికాయకును, తక్కోలఫలమునకును, సస్యమునకును, అలుగునకును, స్త్రీ. ప్రేంకణపు చెట్టునకును, పు. కరక ఉసిరిక తాణికకును పేరు.

జలం గోకలిలే నీరే
హ్రీబేరే చ జడేఽన్యవత్।

**జల**: న. ఇది గోవుయొక్క గర్భమందలి శుక్లశోణిత మిశ్రమగు పిండమునకును, ఉదకమునకును, కురువేరునకును త్రి. స్తబ్ధునకును పేరు.

ఖలం భూస్థాన కల్కేషు
క్రూరే నీచేఽధమేఖలః॥ (4)

**ఖల** : న. ఇది భూమికిని (కళ్ళము) ప్రదేశమునకును, 12 విధములగు శారీర మలమునకును, త్రి. దుర్మార్గునకును, అల్పునకును, అధమునకును పేరు.

గళ స్సర్జ రసే కంఠే

**గళ**: పు. యక్షధూపమనెడి ధూపద్రవ్యమునకును, కంఠమునకును పేరు.

చలః కం(ప్రే) పే చలాశ్రయే।

**చల**: పు. ఇది వణకునకును, త్రి. చలించుదానికిని పేరు.

దళం శస్త్రీఛదోత్సేధ
తద్ద్రవ్యేఖండ పర్ణయోః॥

**దళ** : న. ఇది కత్తివరకును, ఔన్నత్యమునకును, త్రి. ఉన్నతమైన దానికిని, న. తునకకును, ఆకునకును పేరు.

నలః పోటగళే రాజ్ఞి
పితృదేవే కపీశ్వరే।
నళీమన శ్శిలాయాంతు
కమలే తు నళంమతం॥ (6)

**నల**: పు. ఇది కిక్కిసగడ్డికి, నలమహారాజునకును, పితృదేవతలలో నొకనికిని, నలుడను వానరునకును, ఈ. స్త్రీ. మణిశిలకును, న. పద్మమునకును పేరు.

తలం స్వరూపాధరయోః

**తల** : న. ఇది ఆకృతికిని, క్రింది భాగమునకును,

| | |
|---|---|
| ఖడ్గముష్టిచపేటయోః<br>జ్యాఘాతవారణేऽపిస్యా<br>త్తలస్తాళతరావపి॥ (7) | పు. కత్తిపిడికిని, చెంపకాయకును, నారిదెబ్బ తగలకుండ చేతికి కట్టుకొనెడి యుడుముతోలు నకును, తాడిచెట్టునకును పేరు. |
| మలంకిట్టేపురీషే చ<br>పాపే చ కృపణేమలః। | **మల** : న. ఇది 12 విధములగు శారీర మలము నకును, పురీషమునకును, పాపమునకును, పు. లోభికిని పేరు. |
| శలంతుశల్ల కేలోమ్ని<br>శలో భృంగే గణే విధౌ॥ (8) | **శల** : న. ఇది ఏదుముంటికిని, పు. తుమ్మెదకును, సమూహమునకును, బ్రహ్మకును పేరు. |
| ఖిలం భవేదప్రహతే<br>సారసంక్షిప్తవేధసోః। | **ఖిల** : న. దున్నని భూమికిని (బీడు), సారమును గ్రహించి క్లుప్తముగా జేయబడిన దానికిని, విష్ణువు నకును పేరు. |
| బిలం ఛిద్రే గుహాయాంచ<br>బిల ఉచ్చైశ్రవాహయే॥ | **బిల** : న. ఇది రంధ్రమునకును, గుహకును, పు. ఉచ్చైశ్రవమను ఇంద్రాశ్వమునకును పేరు. |
| ఛలం తు స్ఖలితే వ్యాజే | **ఛల** : న. యుద్ధమందు వెనుదీయుటకును, మిష కును పేరు. |
| ఫులం తు విపులేऽన్యవత్।<br>ఫులస్త్యేత్పులకే చాపి | **ఫుల**: త్రి. ఇది విస్తారమైనదానికిని, పు. గగుర్పాటు నకును పేరు. |
| కులం జనపదే గృహే॥ (10)<br>సజాతీయగణే గోత్రే<br>దేహే పికథితం కులం। | **కుల** : న. ఇది దేశమునకును, గృహమునకును, సజాతీయప్రాణిసంఘమునకును, వంశమున కును, శరీరమునకును పేరు. |
| కాలో మృత్యౌ మహాకాలే<br>సమయే యమ కృష్ణయోః॥(11)<br>కృష్ణత్రివృతి కాలాతు<br>నీలిమంజిష్ఠయోరపి।<br>కాళీగౌర్యాంక్షీరకీటే<br>కాళికామాతృభేదయోః॥ (12)<br>నవాంబువాహబృందేऽపి<br>ప(రి) రీవాదేऽపి చ క్వచిత్। | **కాల** : పు. ఇది మృత్యువునకును, శివునకును, కాలమునకును, యమునకును, నీలవర్ణమున కును, స్త్రీ. నల్లతెగడకును, నీలిచెట్టుకును, మంజిష్ఠ యను గంధద్రవ్యమునకును, ఈ. స్త్రీ. పార్వతికిని, పాలవలనబుట్టు క్రిమి విశేషమునకును, కాళికాదేవి కిని (అనగా పార్వతి లలాటమందు బుట్టుశక్తి) మాతృకావిశేషమునకును, నూతన మేఘమాల కును, అపవాదమునకును పేరు. |

భా(ఫా)లం లలాట మహసోః
కాలస్కంధ మహీరుహే ॥ (13)
శాలో హాలనృపే మత్స్య
ప్రభేదే సర్జ క ద్రుమే।
శాలాగృహే తరుస్కంధ
శాఖాగారైక దేశయోః॥ (14)
మాలంక్షేత్రే జనేమాలో
మాలాపుష్పాదిదామని।
సాలః పాదపమాత్రేపి
ప్రాకారేసర్జకద్రుమే॥ (15)
తాలః కరతలేऽంగుష్ఠ
మధ్యమాభ్యాం చ సమ్మితే
గీతకాల క్రియామానే
తాలః ఖడ్గాదిముష్టిషు॥(16)
ద్రుమభేదే కరాస్ఫాలే
తాళంతు హరితాళకే।
వాద్యభాండేపికాంస్యస్య
తాళచ్ఛదిషి కంపనే ॥ (17)
జాలం గవాక్ష ఆనాయే
కోరకే దంభబృందయోః।
జాలో నీపద్రుమే జాలీ
కోశాత క్యాముదాహృతా॥
వ్యాళో భుజంగమే క్రూరే
శ్వాపదేదుష్టదంతిని।
నాళందండే సరోజాదే
ర్నాళీ శాకక(డం)లంబకే॥(19)
స్థాలం భాజనభేదేऽపి
స్థాలీస్యాత్పాటలోఖయోః।

**భాల:** న. ఇది నుదుటికిని, తేజస్సునకును, చీకటి మానునకును పేరు.

**శాల:** పు. ఇది శాలివాహనుడను రాజునకును, ఉరుజమీనునకును, ఏపిచెట్టుకును, స్త్రీ. గృహమునకును, చెట్టు మొదటి కొమ్మకును, చావడికిని పేరు.

**మాల:** న. ఇది ఈ పేరుగల మెట్టుభూమికిని, పు. మనుజునకును, స్త్రీ. పుష్పాదులదండకును పేరు.

**సాల:** పు. ఇది వృక్షసామాన్యమునకును, ఆవరణమునకును, ఏపి చెట్టునకును పేరు.

**తాల:** పు. ఇది హస్తపుటమునకును, లొడితెడు ప్రమాణమునకును, అటాది తాళములకును, కత్తి మొదలగువాటి పిడికిని, తాడిచెట్టునకును, చేతులు చరచుటకును, న. అరదళమునకును, వాయించు కుండకును, కంచుతాళపు చిప్పకును, చలించుటకును పేరు.

**జాల:** న. ఇది కిటికీకిని, వలకును, మొగ్గకును, కపటమునకును, సమూహమునకును, పు. కడిమి చెట్టునకును, ఈ. స్త్రీ. పొట్లతీగకును పేరు.

**వ్యాళ:** పు. ఇది సర్పమునకును, క్రూరునకును, పెద్ద పులికిని, దుష్ట స్వభావముగల యేనుగునకును పేరు.

**నాళ:** న. ఇది పద్మాదుల కాడకును, ఈ. స్త్రీ. శాకములతొడిమెకును పేరు.

**స్థాల:** న. ఇది భోజనపాత్రమునకును, ఈ. స్త్రీ. కలిగొట్టు చెట్టునకును, వంటకుండకును పేరు.

ఫాలం సీరోపకరణే
కార్పాసాదికవాససి॥ (20)
బాలః కచే శిశౌ మూర్ఖే
హ్రీబేరే శ్వేభపుచ్ఛయోః।
అలంకారాంత రే మేధా
బాలీ బాలాత్రుటిస్త్రియోః॥(21)
చేలో నీచేఽన్యవచ్చేల
మంశుకే గర్హితేఽన్యవత్।
భేలః ప్లవే భీరుకే చ
నిర్బుద్ధిమునిభేదయోః॥(22)
కోలః కపాలఉత్సంగే
భేలకే పోత్రిచిత్రయోః।
కోలాకణాయాం చవ్యే చ
కోలం తు బదరీఫలే॥(23)
శైలో భూభృతి శైలంతు
శైలేయే తార్క్ష్యశైలకే।
శీలం స్వభావే సద్వృత్తే
నీలః కృష్ణేనగాంతరే॥ (24)
నీలః కపీశ్వరే నీలీ
వృక్షలాంఛనభేదయోః।

కూలంస్తూపే తటాకేచ
సైన్యపృష్ఠప్రతీరయోః॥ (25)
తూలః పిచౌ భవేత్తూలం
బ్రహ్మదారు విహాయసోః।
మూలమాద్యేశిఫాయాంస్యా
ద్భనికుంజాంతికేషు చ॥(26)

**ఫాల** : న. ఇది నాగటి కఱ్ఱునకును, నూలు మొదలగువాటితో నేసిన వస్త్రమునకును పేరు.

**బాల**: పు. ఇది జుట్టునకును, త్రి. పిల్లవానికిని, మూర్ఖునకును, కురువేరునకును, పు. గుఱ్ఱపుతోకకును, ఏనుగుతోకకును, ఈ. స్త్రీ. ఉంగరమునకును, మేడితోకకును ఆ. స్త్రీ. త్రుటికాలమునకును, స్త్రీకిని పేరు.

**చేల** : స్త్రీ. అధమునకును, న. వస్త్రమునకును, త్రి. నిందింపదగిన దానికిని పేరు.

**భేల** : పు. ఇది తెప్పకును, స్త్రీ. భయ స్వభావము గలవానికిని, బుద్ధిహీనునకును, భేలమునికిని పేరు.

**కోల** : పు. ఇది పుఱ్ఱెకును, ఉపరిభాగముకును, తెప్పకును, పందికిని, చిరుత పులికిని, స్త్రీ. నల్లజీలకఱ్ఱకును, చవ్యమను గంధద్రవ్యమునకును, న. రేగు పండునకును పేరు.

**శైల** : పు. ఇది పర్వతమునకును, న. రాతి పువ్వునకును, రసాంజనమునకును పేరు.

**శీల**: న. ఇది స్వభావమునకును, సద్వ్యాపారమునకును పేరు.

**నీల** : పు. ఇది నలుపునకును, నీల పర్వతమునకును, నీలుఁడను వానరునకును, ఈ. స్త్రీ. నీలిచెట్టుకును, చిహ్నమునకును పేరు.

**కూల**: న. ఇది దిబ్బకును, చెరువునకును, సేనకు వెనుకటి భాగమునకును, ఒడ్డునకును పేరు.

**తూల**: పు. ఇది దూదికిని, న. గంగరావిచెట్టుకును, ఆకాశమునకును పేరు.

**మూల**: త్రి. ఇది మొదటి దానికిని, న. వేరునకును, మూలా నక్షత్రమునకును, పొదరింటికిని, సమీపమునకును పేరు.

శూలం ప్రహరణేమృత్యౌ
కేతనే రోగయోగయోః।
శూలా దుష్టవధార్థాయ
కీలకే పణ్యయోషితి॥ (27)
స్థూలం స్యాత్పీవరే కూటే
నిష్ప్రజ్ఞే పునరన్యవత్।
అమ్లోరసప్రభేదే స్యా
దమ్లీచాం గేరికౌషధౌ॥ (28)
శుక్లోయోగాంతరే శ్వేతే
శుక్లం రజత రేతసోః।
మల్లః పాత్రే కపోలే చ
మత్స్యభేదే బలీయసి॥ (29)
భల్లోభల్లీ చ బాణే స్యా
ద్భల్లో భల్లూక-ఇష్యతే।
భల్లాతక్యాం చ (ఫ) భల్లీస్యా
త్కాల అర్ద్రే చ సూరణే॥(30)
చుల్లచిల్లౌ మతౌక్లిన్న
నేత్రే క్లిన్నాక్షి పిల్లవత్।
ఆతాపి నిభవే చ్చిల్ల
శ్చిల్లీస్యాద్గాడవాస్తుకే॥ (31)
చుల్లీ చితాయాముద్ధానే
క్వచిద్వాద్యే ప్యుదీరితా।
వల్లీ వీరుధి సంతానే
వల్కలే కుసుమాంతరే॥(32)
ఖల్లీ హస్తపాదావ
మర్ద నాఖ్యరుజి స్మృతా।
ఖల్లో వస్త్రప్రభేదేస్యా
న్నిమ్నే చర్మణి చాతకే॥(33)

**శూల:** న. ఇది శూలాయుధమునకును, మృత్యువునకును, ధ్వజమునకును, శూలరోగముకును, 5వ పంచాంగ యోగమునకును, స్త్రీ. కొఱతవేయు శూలమునకును, వెలయాలికిని పేరు.

**స్థూల:** త్రి. ఇది బలిసిన దానికిని, న. సమూహము నకును, మందబుద్ధికిని పేరు.

**అమ్ల:** పు. ఇది పులుసునకును, ఈ. స్త్రీ. పులిచింత కును పేరు.

**శుక్ల:** పు. ఇది పంచాంగయోగ విశేషమునకును, తెలుపునకును, న. వెండికిని, రేతస్సునకును పేరు.

**మల్ల :** పు. ఇది ప్రమిదెకును, గండ ప్రదేశమున కును, మత్స్యవిశేషమునకును, జెట్టివానికిని పేరు.

**భల్ల:** స్త్రీ. ఇది బాణమునకును, పు. ఎలుగునకును, ఈ. స్త్రీ. జీడి చెట్టునకును, కాలమునకును, అల్లమునకును, కందగెడ్డకును పేరు.

**చుల్ల, చిల్ల, పిల్ల :** స్త్రీ. ఈ 3ను పుసికండ్లవానికిని, పుసికండ్లకును పేరు. ఇందు **చిల్ల :** పు. ఇది చింద పిట్టకును పేరు. **చిల్లి :** స్త్రీ. ఇది చక్రవర్తికూరకు పేరు.

**చుల్లి :** స్త్రీ. ఇది చితికిని, పొయ్యికిని, వాద్య విశేష మునకును పేరు.

**వల్లి:** స్త్రీ. ఇది లతకును, సంతతికిని, నారచీరకును, పుష్ప విశేషమునకును పేరు.

**ఖల్లి :** స్త్రీ. ఇది రోగవిశేషమునకును, పు. వస్త్ర విశేషమునకును, పల్లమునకును, తోలునకును, చాతక పక్షికిని పేరు.

ఆలు ర్గలంతికాయాం చ
కందభేదేఽపి భేలకే।

**ఆలు** : పు. గఱిగ పిడతకును, న. ఈ పేరుగల దుంపకును, తెప్పకును పేరు.

పీలు ర్గజే ద్రుమే కాండే
పరమాణు ప్రసూనయోః॥(34)
పీలుస్తాలా స్థిఖండే చ

**పీలు**: పు. ఇది ఏనుగునకున, గోగుచెట్టునకును, బాణమునకును, లోకమందు దేనికంటె చిన్న వస్తువులేదో దానికిని, పుష్పమునకును, తాటితుం డునకును పేరు.

మాలుః పత్రలతా స్త్రియోః।

**మాలు**: పు. ఇది మకరికాపత్రమునకును, స్త్రీకిని పేరు.

(సా) శాలుః కషాయద్రవ్యే,స్యా
చ్చోరకాఖ్యౌషధేఽపి చ॥(35)

**శాలు**: పు. ఇది వగరు వస్తువునకును, చోరకమను ఓషధికిని పేరు.

బలి శ్చామరదండే (ఽపి) చ
జరయా శ్లథచర్మణి।
ఉదరావయవే దైత్యే
కరపూజో పహారయోః॥(36)
గృహదారు విశేషే చ
గంధకే చ క్వచిన్మతః।

**బలి**: పు. ఇది సురటీ కర్రకును (పిడి) స్త్రీ. ముదిసిన చర్మమునకును, కడుపుమీది ముడతలకును, పు. బలిచక్రవర్తికిని, పన్నునకును, పూజార్థమైన ద్రవ్య మునకును, పంచమోపు కఱ్ఱకును, గంధకము నకును పేరు.

డోలా యానాంతరే నీల్యాం

**డోలా** : స్త్రీ. ఇది ఉయ్యాలకును, నీలిచెట్టుకును పేరు.

మేలాస్యాన్మేలకేమషౌ॥ (37)

**మేలా** : స్త్రీ. కలయికకును, మసికిని పేరు.

ఇలా కళత్రే సౌమ్యస్య
ధరిత్ర్యాం గవి వాచిచ।

**ఇలా** : స్త్రీ. ఇది బుధుని భార్యకును, భూమికిని, గోవునకును, వాక్కునకును పేరు.

కీలా కఫోణినిర్ఘా తే
శంకౌ జ్వాలే చ కీలవత్॥(38)

**కీలా** : స్త్రీ. మోచేతిదెబ్బకును, మేకునకును, స్త్రీ. అగ్నిజ్వాలకును పేరు.

శిలా కునట్యాం దృషది
ద్వారాధస్థితదారుణి।
శిలంశిలీ భవేదుంఛే
గండూపద్యాం యథాక్రమం॥(39)

**శిలా** : స్త్రీ. ఇది నేపాళమణిశిలకును, రాతికిని, గుమ్మము క్రింది త్రొక్కుడు పలకకును, న. ఉంఛవృత్తికిని, ఈ. స్త్రీ. ఆడుయెఱ్ఱకును పేరు.

తులా పలశతే రాశౌ
భాండే సాదృశ్య మానయోః।
గృహాణాం దారుబద్ధాయాం

**తులా** : స్త్రీ. ఇది నూరుపలములయెత్తు తూనిక గుండునకును, తులారా కుండకును, సామ్య మునకును, త్రాసునకును, ఇంటి దూలముల

పీఠికా యామపీష్యతే॥ (40)

అడుగునవేసెడి పీటదిమ్మకును పేరు.

వేలా కాలే చ జలధే
స్తీర నీర వికారయోః।
అక్లిష్ట మరణే రాగే
సీమ్నివాచి బుధస్త్రియాం॥(41)
భోజనే పీశ్వరాణాం స్యా

**వేలా :** స్త్రీ. ఇది సమయమునకును, చెలియలి కట్టకును, ఉప్పెనకును, అనాయాసమరణమునకును, అనురాగమునకును, పొలిమేరకును, వాక్కునకును, బుధుని భార్యకును, ప్రభువుల యొక్క భోజనమునకును పేరు.

ఝ్ఝులా దుహితరిస్మృతా।
ఆతపోర్మ్మె జలూకాయాం
ఝూలీ క్వాపి విలోక్యతే॥ (42)

**ఝులా :** స్త్రీ. కుమార్తెకును, ఎండమావులకును, ఈ. స్త్రీ. జలగకును పేరు.

కలా స్యాన్మూలరైవృద్ధౌ
శిల్పాదా వంశమాత్రకే।
షోడశాంశే చ చంద్రస్య
కలనా కాలభేదయోః॥(43)
కలం శుక్రే కలోऽ జీర్ణే
ప్యవ్యక్తమధురధ్వనౌ।

**కలా :** స్త్రీ. ఇది వడ్డీకిని, శిల్పము మొదలగు విద్యలకును, భాగమునకును, చంద్రునియందు **16**వ భాగమునకును, కూర్పుటకును, **9** ఘడియల కాలమునకును, న. రేతస్సునకును, పు. అజీర్ణరోగమునకును, అవ్యక్తమధుర ధ్వనికిని పేరు.

లోలా జిహ్వాకమలయో
ర్లోల శ్చలసతృష్ణయోః॥ (44)

**లోలా :** స్త్రీ. ఇది నాలుకకును, లక్ష్మికిని, త్రి. చంచలమైన దానికిని, అభిలాషతోగూడిన దానికిని పేరు.

లీలాం విదుః కేళి
విలా స ఖేలా శృంగార।
భావ ప్రభవక్రియాసు
హేలా మవజ్ఞాన విలాసయోశ్చ

**లీలా :** స్త్రీ. ఇది ఆలింగనాది క్రీడకును, చిత్తవిక్రియా విశేషమునకును, వినోదార్థమైన యాటకును, శృంగార చేష్టకును పేరు.

**హేలా :** స్త్రీ. ఇది తిరస్కారమునకును, స్త్రీల విలాసమునకును పేరు.

హాలా సురాయాం నృపతౌ చ హాలః॥(45)

**హాలా :** స్త్రీ. ఇది కల్లునకును, హాల రాజునకును పేరు.

గోలా సఖీ వర్తులయో
ర్గోలం లక్ష్యానుసారతః।
పత్రాంజనే కునట్యాం చ
గోదావర్యాం చ మండలే॥ (46)

**గోలా :** స్త్రీ. ఇది చెలికత్తెకును, త్రి. వర్తులమైన దానికిని న. పత్రాంజనమునకును, (మసి) నేపాళ దేశపు మణిశిలకును, స్త్రీ. గోదావరీ నదికిని, న. మండలాకారమునకును పేరు.

అళిస్సురాపుష్పలిహోః

**అళి :** స్త్రీ. ఇది కల్లునకును, తుమ్మెదకును పేరు.

ఆళిస్తు విశదాశయే।
ఆళిః పంక్తౌ చ సఖ్యాం చ
సేతౌ చ పరికీర్తితా॥ (47)

**ఆళి :** ఇది నిర్మలాంతఃకరణము గల వానికిని, స్త్రీ. వృక్షాదులవరుసకును, చెలికత్తెకును, ప్రవాహాది బంధనమునకును పేరు.

కలి స్స్యాత్కలహే శూరే
కలిరంత్యయుగే యుధి।
ధూళి స్సంఖ్యాంతరే రేణౌ

**కలి :** పు. ఇది వివాహమునకును, శూరునకును, కలియుగమునకును, యుద్ధమునకును పేరు.
**ధూళి:** స్త్రీ. ఇది సంఖ్యాభేదమునకును, పరాగమునకును పేరు.

దులిస్తు కమఠే మునౌ॥ (48)
మౌళిః కిరీటే ధమ్మిల్లేకం
కేళిద్రుమ చూడయోః।
శాలిస్తు గంధమార్జారే
కలమాదిషు చ స్మృతః॥ (49)
పాళిః కర్ణలతాగ్రే ऽ శ్రౌ
పంక్తావంక ప్రదేశయోః।
పాళిః ప్రస్థే చ యూకాయాం
జాతశ్మశ్రుస్త్రియామపి॥(50)
ఝిల్లీ స్యాదాతపరుచౌ
వర్త్యా ముద్వర్తనాంశుకే।
వల్లీ స్యాదజమోదాయాం
పుష్పభేదే ऽపి వీరుధి॥(51)
పల్లీ కుటీ గ్రామకయోః
పల్ల స్స్యాలకుసూలకే।
తల్లీ తలున్యాం తల్లస్తు
జలాధారాంతరే ऽపి చ॥ (52)

**దులి :** పు. ఇది తాబేటికిని, దులి మహామునికిని పేరు.
**మౌళి :** ఇది కిరీటమునకును, కొప్పునకును, పు. అశోక వృక్షమునకును, మగవాని జుట్టునకును పేరు.
**శాలి :** పు. ఇది జవ్వాది పిల్లికిని, వరి మొదలగు సస్యములకును పేరు.
**పాళి:** స్త్రీ. ఇది చెవి తమ్మికిని, ఆయుధ ధారకును, వరుసకును, ప్రదేశమునకును, కొండ చరియకును, పేనుకును, ముఖరోమములు గల స్త్రీకిని పేరు.
**ఝిల్లి :** స్త్రీ. ఇది యెండయొక్క కాంతికిని వత్తికిని, వస్త్ర విశేషమునకును పేరు.
**వల్లీ :** స్త్రీ. ఇది ఓమమునకును, పుష్ప విశేషమునకును, లతకును పేరు.
**పల్లీ:** స్త్రీ. ఇది గుడిశెకును, అల్పగ్రామమునకును, అ. ధాన్యపు పాణకకును పేరు.
**తల్లి :** స్త్రీ. ఇది యౌవన స్త్రీకిని, అ. పు. తటాకమునకును పేరు.

★ అథ లాంత త్రివర్ణః ★

కమలం సలిలే తామ్రే
జలజే క్లోమ్ని భేషజే।

**కమల:** న. ఇది జలమునకును, రాగికిని, పద్మమునకును, వక్షమందలి కుడి ప్రక్కనుండు మాంస

మృగభేదేఽపి కమలః
కమలా శ్రీవరస్త్రియోః॥ (53)

విశేషమునకును, పు. జింకలలోని భేదమునకును, స్త్రీ. లక్ష్మికిని, ఉత్తమ స్త్రీకిని పేరు.

చపలః పారదే మీనే
చోరకే ప్రస్తరాంతరే।
చపలో వానరే నీచే
దుర్వినీతేఽనవస్థితే॥ (54)
చపలం క్షణికే శీఘ్రే
చపలశ్చికురే చలే।
చపలా కమలా విద్యు
త్పుంశ్చలీ పిప్పలీషు చ॥ (55)

**చపల :** పు. ఇది పాదరసమునకును, చేపకును, చండయను గంధద్రవ్యమునకును, ఒక విధమగు జాతికిని, కోతికిని, స్త్రీ. నీచునకును, దుర్మార్గున కును, సంచరించు దానికిని, న. క్షణమునకును, శీఘ్రమునకును, పు. జుట్టునకును, త్రి. చలించు దానికిని, స్త్రీ. లక్ష్మికిని, మెఱుపునకును, కులట కును, పిప్పలితీగకును పేరు.

ఉపలః ప్రస్తరే రత్నే
శర్కరాయాం స్మృతోపలా

**ఉపల :** పు. ఇది జాతికిని, రత్నమునకును, స్త్రీ. మొఱపజాతికిని పేరు.

ఉత్పలం మాంసశూల్యే స్యా
త్కుష్ఠేం దీవరయోరపి॥ (56)

**ఉత్పల :** న. ఇది కాల్చుటకైమాంసపు ఖండమును గ్రుచ్చినయినుపశలాకకును, కుష్ఠరోగమునకును, నల్ల కలువకును పేరు.

అనలో వసుభేదే గ్నా
వనిలో వసువాతయోః।

**అనల :** పు. అష్టవసువులలో నొకనికిని, అగ్నికిని పేరు.
**అనిల :** పు. అష్టవసువులలో నొకనికిని, వాయువున కును పేరు.

శకలం త్వచి ఖండే స్యా
ద్రాగవస్తుని వల్కలే॥ (57)

**శకల :** న. ఇది చర్మమునకును, తునకకును, రంజక ద్రవ్యమునకును, నారచీరకును పేరు.

గరళం తు విషే మానే
గరళం తృణపూలకే।

**గరళ :** న. ఇది విషమునకును, పరిమాణమున కును, గడ్డిమోపునకును పేరు.

తరళ శ్చపలే షిద్గే
హారమధ్యమణావపి॥ (58)
భాసురే చాథ తరళా
యవానీ సురయోర్మతా।

**తరళ :** త్రి. చంచలమైన దానికిని, జారునకును, పు. నాయకమణికిని, త్రి. మెఱయునట్టి దానికిని స్త్రీ. గంజికిని, కల్లునకును పేరు.

సరళః పూతికాష్ఠే స్యా
దుదారా వక్రయోరపి॥ (59)

**సరళ :** పు. ఇది సరళదేవదారు చెట్టునకును, త్రి. గంభీరమైన దానికిని, తిన్నని దానికిని పేరు.

కపిలో మునిభేదే స్యా
త్పావకే పారతంత్రకే।
కపిలా శింశుపాయాం చ
రేణుకా గోవిశేషయోః॥ (60)
పుండరీక కరిణ్యాం చ
పింగే తు కపిలోఽన్యవత్।

**కపిల :** పు. ఇది కపిలమహామునికిని, అగ్నికిని, కుక్కకును, స్త్రీ. కంపుయిరుగుడు చెట్టుకును, రేణుకయను గంధద్రవ్యమునకును, కపిలగోవునకును, పుండరీకమను, దిగ్గజముయొక్క భార్యకును, త్రి. కపిలవర్ణముగల దానికిని పేరు.

పలలం తిలచూర్ణే స్యా
త్పలలం పంకమాంసయోః॥ (61)
పలలో యాతుధానే స్యాత్

**పలల :** న. ఇది తెలకపిండికిని, బురదకును, మాంసమునకును, పు. రాక్షసునకును పేరు.

పటలం ఛదిషి వ్రజే।
పిటకే నేత్రరోగే చ
తిలకే చపరిచ్ఛదే॥ (62)

**పటల:** న. ఇది ఇంటికప్పునకును, సమూహమునకును, కురుపు బొబ్బకును, నేత్రరోగమునకును, నుదుటిబొట్టునకును, పరివారమునకును పేరు.

జగలః పిష్టమద్యే చ
మేదకే మదనద్రుమే।
కితవే

**జగల:** పు. ఇది పిండిచేత జేయబడిన కల్లునకును, కల్లుమడ్డికిని, మంగచెట్టునకును, త్రి. మోసగానికిని పేరు.

ఛగల శ్ఛాగే
ఛగలీ ఛాగమాతరి॥ (63)
వృద్ధదారక భైషజ్యే
ఛగలం నీలవాససి।

**ఛగల:** పు. ఇది మేకకును, ఈ. స్త్రీ. ఆడుమేకకును బొద్దిచెట్టునకును, న. నల్ల బట్టకును పేరు.

పిప్పలో బోధివృక్షే స్యా
త్పక్షిభేదే నిరంగుళే॥ (64)
పిప్పలం వసనచ్ఛేద
ప్రభేదే సలిలే మతం।
కణాయాం పిప్పలీప్రోక్తా

**పిప్పల:** పు. రావిచెట్టునకును, పక్షివిశేషముకును, (బాతు అని కొందరు) వ్రేళ్లు లేని వానికిని, న. గుడ్డకును, ఉదకమునకును, ఈ. స్త్రీ. పిప్పలి తీగకును పేరు.

ధవళ స్సుందరే సితే॥ (65)
మహోక్షే చాథ ధవళీ.
సౌరభేయ్యా ముదీరితా।

**ధవళ :** స్త్రీ. ఇది సుందరమైన దానికిని, తెల్లని దానికిని, పు. ఆబోతునకును, ఈ. స్త్రీ. తెల్లని యావునకును పేరు.

కువలం చోత్పలే ముక్తా
ఫలేఽపి బదరీఫలే॥ (66)

**కువల :** న. ఇది కలువకును, ముత్తెమునకును, రేగుపండునకును పేరు.

కుశల శ్శిక్షితే క్షేమ
పర్యాప్తి సుకృతేషుచ। కుశలం
ముసలం తుస్యాదయోఽగ్రే
ముసలీ మతా॥(67) తాళమూల్యా
మాఖుపర్ణీ గృహగోధికయోరపి
నిచుళో హిజ్జలతరౌ
నిచుళస్తు నిచోలకే॥ (68)
నిచుళః కవిభేదే స్యా
ద్వానీరే స్థలవేతసే।
పిచులో ఝూబుకేతూలే
హిజ్జలే జలవాయసే॥ (69)
విపులః పృథులేఽగాధే
మేరు పశ్చిమ భూధరే।

**కుశల** : త్రీ. ఇది నేర్పరికిని, న. క్షేమమునకును, సమృద్ధికిని, పుణ్యమునకును పేరు.
**ముసల** : న. ఇది రోకలికిని, ఈ. త్రీ. నేలతాడి చెట్టునకును, ఎలుకచెవిచెట్టునకును, బల్లికిని పేరు.

**నిచుళ**: పు. ఇది గన్నేరుచెట్టునకును, గవిసెనకును (బురకా) నిచుళకవికిని, నీటి ప్రబ్బ(లి) చెట్టునకును, మెట్టప్రబ్బ చెట్టుకును పేరు.

**పిచుల**: పు. ఇది సన్నపాకుల ప్రక్కె చెట్టునకును, దూదికిని, గన్నేరుచెట్టునకును, నీటి కాకికిని పేరు.
**విపుల** : త్రీ. ఇది విస్తారమైన దానికిని, లోతైన దానికిని, పు. మేరు పశ్చిమభాగమందలి విపుల పర్వతమునకును పేరు.

తుములః కలివృక్షే స్యా
త్తుములం రణసంకులే॥(70)
బహుళః కృష్ణపక్షేఽగ్నా
వసితే బహుళాగవి।
ఏలాయాం నీలికాయాం చ
బహుళాః కృత్తికాసుచ॥ (71)
బహుళం ప్రాజ్య నభసో
ర్మాతులో మదనద్రుమే।
మాతుర్భ్రాతరి ధుత్తూరే
వ్రీహిభేదేఽపి మాతులః ॥ (72)
కుటిలం వాచ్యవద్భుగ్నే
కుటిలా సరిదంతరే।
జటిలస్తు జటాయుక్తే
జటిలా మాంసి కాషధౌ॥ (73)

**తుముల** : పు. ఇది తాండ్ర చెట్టునకును, న. యుద్ధమందలి గొల్లునకును పేరు.
**బహుళ** : పు. ఇది కృష్ణపక్షమునకును, అగ్నికిని, నలుపువర్ణమునకును, త్రీ. గోవునకును, ఏలకిలతకును, నీలిచెట్టునకును, నిత్య బహువచనమునకును, కృత్తికానక్షత్రమునకును, త్రి. విస్తారమైన దానికిని, న. ఆకాశమునకును పేరు.
**మాతుల**: పు. ఇది మంగచెట్టునకును, మేనమామకును, ఉమ్మెత్తచెట్టునకును, ధాన్య విశేషమునకును పేరు.
**కుటిల** : త్రి. ఇది వంకరయైన దానికిని, త్రీ. నదీ విశేషమునకును పేరు.
**జటిల** : త్రి. ఇది జటలుగల దానికిని, త్రీ. జటామాంసికిని పేరు.

సుతల ప్రతలౌ చేతి
పాతాలభువనద్వయే।
స్యాతామట్టాలికాబంధే
తలాంగుళికరే క్రమాత్॥ (74)

**సుతల :** పు. ఇది సుతలమనెడి యధోలోకమునకును, కోటవాకిటిమీది యింటికిని పేరు. **ప్రతల:** పు. ఇది ప్రతలమనెడి యధోలోకమునకును, చాచిన వ్రేళ్ళుగల హస్తమునకును పేరు.

పిత్తళం త్రై జసద్రవ్యే
పిత్తళః పిత్తసంగతే।
పిత్తళాతో యపిప్పల్యాం
నిస్తలంవర్తు లే చలే॥(75)

**పిత్తళ :** న. ఇది ఇత్తడికిని, త్రి. పైత్యోద్రేకముగల వానికిని, స్త్రీ. నీటిపిప్పలికిని పేరు.

**నిస్తల :** త్రి. ఇది వట్రువమైన దానికిని, చలించు దానికిని పేరు.

కుంతల స్స్యాద్యవే దేశే
కేశ లాంగలయోరపి।
కంబళో నాగరాజేస్యా
ద్గజప్రావరణే కృమౌ॥(76)
కంబళశ్చోత్తరాసంగే
కంబళం సలిలే మతం।

**కుంతల:** పు. ఇది యవధాన్యమునకును, కుంతల దేశమునకును, వెంట్రుకలకును, నాగలికిని పేరు.
**కంబళ :** పు. సర్పవిశేషమునకును, ఏనుగుమీద పరచెడు చిత్రకంబళికిని, కంబళీపురుగునకును, ఉత్తరీయమునకును, న. ఉదకమునకును పేరు.

శంబళం కూల పాథేయ
మత్సరేషు సమీరితం॥ (77)

**శంబళ:** న. ఇది ఒడ్డునకును, దారిబత్తెమునకును, పరశ్రేయమును సహించకుండుటకును పేరు.

కందళంతు కపాలే స్యా
దుపరాగే నవాంకురే।
కలధ్వనౌ కందళీతు
మృగవృక్ష విశేషయోః॥(78)

**కందళ:** న. ఇది పుఱ్ఱెకును, సూర్యాదిగ్రహణమునకును, క్రొత్తమొలకకును, అవ్యక్తమధురధ్వనికిని, ఈ. స్త్రీ. జింకలలోనిభేదమునకును, వృక్షవిశేషమునకును పేరు.

పింగళ స్స్యాన్మునౌ రుద్రే
చండాంశోః పారిపార్శ్వకే।
నిధి భేదే క పావగ్నౌ
పింగళః కపిలే ఽన్యవత్॥(79)
కర్ణికాయాం చ వేశ్యాయాం
పింగళాకుముదస్త్రియాం।

**పింగళ:** పు. ఇది పింగళమునికిని, ఈశ్వరునకును, సూర్యుని పార్శ్వమందలి దేవతావిశేషమునకును, కుబేరుని నిధి విశేషమునకును, కోతికిని, అగ్నికిని, త్రి. పింగళవర్ణమైన దానికిని, స్త్రీ. తామరదుద్దునకును, వేశ్యకును, దక్షిణ దిగ్గజముయొక్క భార్యకును పేరు.

జంగలో జలనిర్ముక్త

**జంగల:** పు. ఇది మరుభూమికిని, న. మాంసమున

దేశేమాంసేచ జంగలం॥(80)
మంగళంశ్రేయసి శ్వేత
దూర్వాయామపి మంగళా।
సర్వార్థ రక్షణే చాపి
మంగళం మంగళః కుజే॥(81)
కుండలంవలయే పాశే
కుండలం కర్ణ వేష్టనే।
గుడూచ్యాంకాంచ (నా) నద్రౌ చ
కుండలీసముదీరితా॥(82)
స్యాన్మండలంద్వాదశ రాజకేచ
దేశేచ బింబేచ కదంబకేచ
కుష్ఠ ప్రభేదేఽప్యుప సూర్యకే చ
భుజంగ భేదేశుని మండలస్స్యాత్॥(83)

స్యాదర్గళం తు కల్లోలే
దండే చాంతః కవాటయోః।
నిర్మలం విశదే విద్యా
న్నిర్మాల్యాభ్రకయోరపి॥ (84)
శౌష్కలశ్శుష్కమాం సస్య
పణికే పిశి తాశిని।
పాంసులః పుంశ్చలే శంభౌ
ఖట్వాంగే పాంసులా భువి॥ (85)
సంకులం వాచ్యవద్వ్యాప్తేఽ
విస్పష్టార్థ వచస్యపి।
ఉజ్జ్వలో దీప్త శృంగార
విశదేషు వికాశిని॥ (86)

వంజులో వేతసా

కును పేరు.

**మంగళ:** న. ఇది శ్రేయస్సునకును, త్రీ. తెల్లగరిక కును, న. సర్వధనమును రక్షించుకొనుటకును, పు. అంగారక గ్రహమునకును పేరు.

**కుండల:** న. ఇది చక్రాకారమునకును, పాశము నకును, చెవియాభరణమునకును, ఈ. త్రీ. తిప్ప తీగకును, ఎఱ్ఱకాంచనపు చెట్టునకును పేరు.

**మండల:** న. ఇది ద్వాదశరాజమండలమునకును, 20 యోజనములు వైశాల్యముగల దేశమునకును, సూర్యాదిబింబమునకును, సమూహమునకును, కుష్ఠరోగ విశేషమునకును, పరివేషమునకును, పు. సర్పవిశేషమునకును, కుక్కకును పేరు.

**అర్గళ :** న. ఇది పెద్ద తరంగమునకును, తలుపు గడియకును పేరు.

**నిర్మల :** త్రీ. ఇది స్వచ్ఛమైన దానికిని, పూజచేసి విడిచిన పుష్పాదులకును, అభ్రకమునకును పేరు.

**శౌష్కల:** పు. ఇది ఎండిన మాంసముల నమ్మువాని కిని, రావణుని పురోహితునకును పేరు.

**పాంసుల :** పు. ఇది విటునకును, శివునకును, శివుని యాయుధవిశేషమునకును, త్రీ. భూమికిని పేరు.

**సంకుల :** త్రీ. ఇది వ్యాపించిన దానికిని, స్పష్టము కాని వాక్యమునకును పేరు.

**ఉజ్జ్వల :** త్రీ. ప్రకాశించు దానికిని, పు. శృంగార రసమునకును, త్రీ. స్వచ్ఛమైన దానికిని, వికసించు దానికిని పేరు.

**వంజుల:** పు. ఇది ప్రబ్బచెట్టునకును, అశోక వృక్ష

శోకలిని శ్లేష్మఘ

మునకును, నెమ్మిచెట్టునకును పేరు.

మంజులం। నికుంజే శబలే
మంజౌ జలరంకౌ తు మంజులః॥(87)

**మంజుల:** న. ఇది పొదరింటికిని, త్రి. శబలవర్ణమైన దానికిని, సుందరమైన దానికిని, పు. కూకురు గడ్డంగి పిట్టకును పేరు.

పింజలం తు హరిద్రాభే
కుశపత్రేఽపి పింజలం।

**పింజల :** త్రి. ఇది పచ్చని కాంతి గలదానికిని, న. దర్భగడ్డికిని పేరు.

పుద్గల స్సుందరాకారే
పుద్గల శ్చాత్మ దేహయోః॥(88)

**పుద్గల :** త్రి. సౌందర్యాకృతిగల దానికిని, పు. పరమాత్మకును, శరీరమునకును పేరు.

జంభలో దేవతాభేదే,
జంబీరే చాపి జంభలః।

**జంభల:** పు. ఈ పేరుగల బుద్ధదేవునకును, నిమ్మ చెట్టునకును పేరు.

కుంభిల శ్శ్యాలకే చోరే
శ్లోక చ్ఛాయాహరే ఝషే॥(89)

**కుంభిల :** ఇది భార్యతో బుట్టిన వానికిని, కన్నపు దొంగకును, శ్లోకార్థములను దొంగిలించిన వానికిని, మత్స్య విశేషమునకును పేరు.

చండిలో, నాపితేఖ్యాతో
హరవాస్తుక శాకయోః।

**చండిల:** పు. ఇది మంగలివానికిని, శివునవునకును, చక్రవర్తి కూరకును పేరు.

గ్రంధిలో గ్రంధిసహితే
కరీరద్రౌ వికంకతే॥ (90)

**గ్రంధిల:** త్రి. కణుపులు గల దానికిని, పు. వెణుతురు చెట్టునకును, పుల్ల వెలగ చెట్టునకును పేరు.

వామిలో దాంభికే వామే
రామిలో రమణే స్మరే।

**వామిల:** త్రి. డాంబికునకును, ఎడమవైపుదానికిని పేరు.

**రామిల :** పు. ఇది భర్తకును, మన్మథునకును పేరు.

వార్దలం దుర్దినే మేలానం
దాయామపి వార్దలః॥(91)

**వార్దల:** న. ఇది మేఘావరణమైన దినమునకును, పు. మసిపాత్రమునకును పేరు.

తండు(లాఖ్యా)లస్తువిడంగే స్యా
ద్ధాన్యాదినికరేఽపిచ

**తండుల :** పు. ఇది వాయువిగండమునకును, బియ్యమునకును పేరు.

వృషలః కథిత శ్శూద్రే
చంద్రగుప్తే చ వాజిని॥ (92)

**వృషల:** పు. ఇది శూద్రునకును, చంద్రగుప్తుడను రాజునకును, అశ్వమునకును పేరు.

నిష్కలస్తు కలాశూన్యే
నష్టబీజే తు వాచ్యవత్।

**నిష్కల :** త్రి. ఇది తేజోవిహీనమైన దానికిని, వీర్యపటుత్వము లేని వానికిని పేరు.

పాకలం కుష్ఠభైషజ్యే,

**పాకల:** న. ఇది చెంగలి కోష్టునకును, పు. ఏనుగు

పాకలో కుంజర జ్వరే॥(93)
పాచలో సాధన ద్రవ్యే
ప్యనలా నిలయోరపి।
మాచలోవంది చౌరేస్యా
ద్గ్రాహే రక్షసి చామయే॥(94)
పాటల శ్శ్వేతరక్తే స్యా
దాసుప్రీహౌ చ పాటలః।
పాటలౌ పాటలాపి స్యా
దస్యాః పుష్పేఽపిపాటలం॥(95)

నకు వచ్చెడు జ్వరమునకును పేరు.
**పాచల:** పు. సాధనమైన వస్తువునకును, అగ్నికిని, వాయువునకును పేరు.
**మాచల :** పు. ఇది స్తుతిపాఠకునకును, దొంగకును, మొసలికిని, రాక్షసునకును, రోగమునకును పేరు.

**పాటల :** పు. ఇది శ్వేతాధిక రక్తవర్ణమునకును, ఎఱ్ఱజిలమ ధాన్యమునకును, స్త్రీ. కలిగొట్టుచెట్టునకును, న. దీని పుష్పమునకును పేరు.

లోహల శ్శృంఖ లాచార్యే
భవేదవ్యక్త వాచిని।
కోహళో వాద్య భేదేస్యా
త్కోహళశ్చమునావపి॥(96)
తైతిలో గండకే ప్రోక్త
స్తైతిలం కరణాంతరే।
హేమల స్స్వర్ణకారేస్యా
త్కృకలాసేశిలాంతరే॥(97)
శ్యామలో మేచకే శ్వద్ధే
కోమలం మృదులే జలే।

**లోహల:** స్త్రీ. ఇది గొలుసుచేత కట్టబడినదానికిని, స్పష్టముగామాటలాడని వానికిని పేరు.
**కోహళ :** పు. ఇది వాద్యవిశేషమునకును, నాట్యశాస్త్రమును చేసిన కోహళమునికిని పేరు.
**తైతిల :** పు. ఇది ఖడ్గమృగమునకును, న. నాల్గవ పంచాగకరణమునకును పేరు.
**హేమల :** పు. ఇది కంసాలికిని, తొండకును, బంగారుగీటు పెట్టు రాతికిని పేరు.
**శ్యామల :** త్రి. నల్లని దానికిని, పు. రావి చెట్టునకును పేరు. **కోమల:** త్రి. మృదువైన దానికిని, న. జలమునకును పేరు.

కామలః కాముకేరోగే
మరుదేశ వసంతయోః॥(98)
పేశలోరుచిరే దక్షే
గోకిలోముసలే హలే।
కోకిల స్స్యాత్పరభృతి
కోకిలంబదరీఫలే॥(99)
గొరిలో లోహచూర్ణే స్యా

**కామల:** పు. విటునకును, కామలారోగములకును, నిర్జలభూమికిని, వసంత ఋతువునకును పేరు.
**పేశల:** త్రి. సుందరమైనదానికిని, సమర్థునకును పేరు.
**గోకిల :** పు. రోకటికిని, నాగటికిని పేరు.
**కోకిల:** పు. ఇది కోయిలకును, న. రేగుపండుకును పేరు.
**గొరిల :** పు. ఇది ఉక్కు పొడుమునకును, తెల్లా

| | |
|---|---|
| ద్గారిలో గౌరసర్షపే। | వాలకును పేరు. |
| ఫేనిల స్స్యాదరిష్టేఽపి | **ఫేనిల :** పు. ఇది కుంకుడు చెట్టునకును, న. రేగు |
| ఫేనిలంబదరీఫలే॥ (100) | పండునకును, ఉమ్మెత్త కాయకును, త్రి. నురుగు |
| మదనస్యఫలే చాపి | కలదానికిని పేరు. |
| వాచ్యవత్ఫేనవత్యపి। | |
| శీవల్లాఖ్యాచ శైవాలేయే | **శీవల :** న. ఇది నాచునకును, రాతిపువ్వునకును |
| శైలేయేఽపి చ శీవలం॥ (101) | పేరు. |
| శైవలం పద్మకాష్ఠేవ | **శైవల :** న. ఇది తామరకాడకును, నాచునకును |
| శైవలంచ జలాంచలే। | పేరు. |
| శీతలంపుష్పకాసీసే | **శీతల :** న. ఇది పర్వత ధాతువిశేషమునకును, |
| శైలజే మలయోద్భవే॥ (102) | రాతిపువ్వునకును, చందనమునకును, పు. |
| భవే దాసనపర్ణ్యాంచ | సోమెదపుచెట్టునకును, త్రి. చల్లని దానికిని పేరు. |
| శీతల శ్శిశిరేఽ న్యవత్। | |
| కల్లోలో హర్ష ఉల్లో లే | **కల్లోల:** పు. సంతోషమునకును, గొప్ప తరంగము |
| కల్లోలః పరి పంథిని॥ (103) | నకును, త్రి. శత్రువునకును పేరు. |
| పటోల మోషధీవస్త్ర | **పటోల:** న. ఇది ఓషధి విశేషమునకును, ఘూర్జర |
| భిదోర్జ్యోత్స్న్యాం పటోల్యపి | దేశపు పట్టు వస్త్రమునకును, ఈ.స్త్రీ. చేతిపొట్ల |
| | చెట్టుకును పేరు. |
| కాకోలో విషభేదే స్యా | **కాకోల :** పు. ఇది గరళ విశేషమునకును, బొంత |
| ద్ద్రోణకాక కులాలయోః॥ (104) | కాకికిని, కుమ్మరివానికిని పేరు. |
| తమాల స్తిలకేఖడ్గే | **తమాల:** పు. ఇది నుదుటిబొట్టునకును, ఖడ్గమృగమున |
| తాపింఛే వరుణ ద్రుమే। | కును, చీకటి మానికిని, ఉలిమిడి చెట్టునకును పేరు. |
| సువేలః ప్రణతే శాంతే. | **సువేల :** త్రి. ఇది నమ్రమునకును, శాంతునకును, |
| సువేలః పర్వతాం తరే॥ (105) | పు. సువేలాద్రికిని పేరు. |
| అవేల స్త్వపలాపే స్యా | **అవేల:** పు. ఇదిమోసపు మాటకును, పోకచెక్కల |
| దవేలా పూగచూర్ణకే। | గుండకును పేరు. |
| కపాలంశిరసో ఽస్థ్ని స్యా | **కపాల:** న. ఇది పుఱ్ఱెకును, కుండమొదలగు వాటి |
| ద్ఘటాదే శ్శకలే వ్రజే॥ (106) | పెంకునకును, సమూహమునకును, కుష్ఠరోగ |

కుష్ఠరోగవిశేషే చ
గోపాలో గోప భూపయోః।
కిట్టాల స్తామ్రకలశే
కిట్టాలో లోహగూథకే॥(107)
పాతాళం నాగలోకేస్యా
త్పాతాళం బడబానలే।
ప్రవాళో వల్లకీదండే
విద్రుమే నవపల్లవే॥ (108)
అరాళః కుటిలేసర్జ
రసేసమదదంతిని।
కరాళో దంతురే తుంగే
కరాళం చ కుఠేరకే॥(109)
కరాళా ధూణాతైలేఽపి
కరాళో భీషణేఽన్యవత్।
శృగాలో జంబుకే దైత్యే
శృగాలీండమరే విదుః॥(110)
కులాలః కుంభకారే స్యా
త్కుక్కుభే కౌశికే పి చ।
కుద్దాలో యుగపత్రే స్యా
త్కుద్దాలో భూమిదారకే॥(111)
బిడాలో నేత్రపిండే చ
బిడాలోఽపిమృగాంతరే।
జంబాలం శైవలే పంకే
కీలాలంరుధిరేజలే॥(112)
వంతాలశ్శూరయుద్ధే స్యా
న్నౌకాయాం చ ఖనిత్రకే।
ఆభీలం చైవ కృచ్ఛ్రే స్యా
దాభీలం చ భయానకే॥(113)

భేదమునకును పేరు.

**గోపాల** : పు. గొల్లవానికిని, రాజునకును పేరు.

**కిట్టాల** : పు. ఇది రాగిపాత్రమునకును, ఇనుప చిట్టమునకును పేరు.

**పాతాళ**: న. ఇది పాతాళలోకమునకును, బడబాగ్నికిని పేరు.

**ప్రవాళ**: పు. ఇది వీణాదండమునకును, పగడమునకును, చిగురుటాకునకును పేరు.

**అరాళ**: త్రి. వక్రమైనదానికిని, పు. ధూపద్రవ్యమునకును, మదపుటేనుగునకును పేరు.

**కరాళ**: త్రి. ఇది మిట్టపండ్ల వానికిని, ఉన్నతమైన దానికిని, న. గగ్గెరచెట్టునకును పేరు. పు. అందుగ బంకవలన దీయబడిన నూనెకును, త్రి. భయంకరమైన దానికిని పేరు.

**శృగాల** : పు. ఇది నక్కకును, రాక్షసునకును, ఈ. స్త్రీ. దేశోపద్రవమునకును పేరు.

**కులాల** : పు. ఇది కుమ్మరి వానికిని, గంపపులుగునకును, గుడ్లగూబకును పేరు.

**కుద్దాల** : పు. ఇది దేవకాంచనపు చెట్టునకును, గుద్దలికిని పేరు.

**బిడాల**: పు. ఇది కనుగ్రుడ్డునకును, పిల్లికిని పేరు.

**జంబాల**: న. ఇది నాచునకును, బురదకును పేరు.

**కీలాల** : న. ఇది నెత్తురునకును, జలమునకును పేరు.

**వంతాల** : పు. ఇది శూరుల యుద్ధమునకును, ఓడకును, తవ్వుగోలకును పేరు.

**ఆభీల**: న. ఇది కష్టమునకును, భయానక రసమునకును పేరు.

| | |
|---|---|
| నాభీలం నాభిగర్భాండే | **నాభీల** : న. ఇది నాభిలోని కంతికిని, ఉత్తమ |
| వంక్షణేచోత్త మస్త్రియాం। | స్త్రీలయొక్క యూరుసంధికిని పేరు. |
| ఉత్ఫుల్లః కరణే స్త్రీణా | **ఉత్ఫుల్ల** : పు. స్త్రీల రతి బంధవిశేషమునకును, త్రి. |
| ముత్తాలే చ వికస్వరే॥ (114) | అధికమైన దానికిని, వికసించిన దానికిని పేరు. |
| శయాళు స్స్యా దజగరే | **శయాళు** : పు. ఇది కొండచిలువకును, త్రి. నిద్రించు |
| నిద్రాశీలేఽ పి కుక్కురే। | స్వభావము గల దానికిని, కుక్కకును పేరు. |
| శ్రద్ధాళు ర్దో హదిన్యాంచ | **శ్రద్ధాళు** : స్త్రీ. ఇది వేవిళ్ళుగల స్త్రీకిని, త్రి. శ్రద్ధగల |
| శ్రద్ధావతి తువాచ్యవత్ ॥ (115) | దానికిని పేరు. |
| లాంగూలం మేహ నే పుచ్ఛే | **లాంగూల** : న. ఇది శిశ్నమునకును, తోకకును పేరు. |
| శార్దూలో రాక్షసాంతరే। | **శార్దూల** : పు. ఒక రాక్షసునకును, పెద్ద పులికిని, |
| వ్యాఘ్రే చ పశుభేదే చ | శరభమృగమునకును, సమాసోత్తరపదమైనపుడు |
| సత్త మేతూత్తరస్థితః॥ (116) | శ్రేష్ఠునకును పేరు. |
| వాతూలో వాత సంఘాతే, | **వాతూల** : పు. ఇది వాయుసమూహమునకును, |
| వాతలే మారుతాసహే। | త్రి. వాతపదార్థమునకును, వాయువును సహించని దానికిని పేరు. |
| కుకూలం శంకు సంకీర్ణ | **కుకూల** : న. పశువులను కట్టుటకై గసిగతో నాటిన |
| శ్వభ్రే చాపితుషానలే ॥ (117) | గుంటకును, పు. ఉమకనిప్పునకును పేరు. |
| కుకూల స్స్యాద్దుకూలంతు | **దుకూల** : న. ఇది పట్టుబట్టకును, సన్నపు బట్టకును |
| క్షామే సూక్ష్మాంశుకేఽ పిచ। | పేరు. |
| జంబూలో జంబు విటపే | **జంబూల** : పు. ఇది నేరేడు చెట్టునకును, మొగలి |
| జంబూలః క్రకచ ఛదే ॥ (118) | చెట్టునకును పేరు. |
| చత్వాలో హోమ | **చత్వాల** : పు. హోమకుండమునకును, గర్భము |
| కుండేస్యా ద్గ(ర్తే) ర్భే | నకును పేరు. |
| చోత్తాల ఉత్కటే। శ్రేష్ఠేఽపి | **ఉత్తాల** : త్రి. అధికమైన దానికిని, శ్రేష్ఠమైన దానికిని, |
| వికరాళేఽపి స్యాదుత్తాల ప్లవంగమే। | మిగుల విశాలమున్ను, పొడవున్ను, గలదానికిని పేరు. |
| చూడాలా తూచ్చటాయాం స్యా | **చూడాల** : త్రి. ఇది గుండ్రతుంగముస్తకును, త్రి. |
| చ్చూడావతి తు వాచ్యవత్। | జుట్టుగల దానికిని పేరు. |
| విశాలాత్విం ద్రవారుణ్యాం | **విశాలా** : స్త్రీ. ఇది పెద్దపాపర చెట్టునకును, |

విశాలోజ్జ యినీపురి॥(120)
విశాలో వృక్షభేదేఽపి
విశాలః పృథులే న్యవత్।

ఉజ్జయినీ పట్టణమునకును, పు. వృక్ష విశేషమునకును, త్రి. విస్తారమైన దానికిని పేరు.

మేఖలా ఖడ్గ బంధే స్యా
త్కాంచీ శైలనితంబయోః॥(121)

**మేఖలా :** స్త్రీ. జారకుండుటకు చేతికిని కత్తిపిడికిని గట్టిన త్రాటికిని, మొలనూలికిని, పర్వత మధ్య భాగమునకును పేరు.

శృంఖలాపుంస్కటీవస్త్ర
బంధేఽపి నిగళే ఽపి చ।

**శృంఖల :** స్త్రీ. ఇది పురుషుల మొలత్రాటికిని, (లేక, పటుకా) గొలుసునకును పేరు.

కుచేలా విద్ధపర్ణ్యాంస్యా
త్కుచేలస్తు కువాససి॥ (122)

**కుచేలా :** స్త్రీ. ఇది పాట చెట్టునకును, పు. పాత గుడ్డకును పేరు.

అచలా వసుధాయాంస్యా
దచలశ్శైల కీలయోః।

**అచలా :** స్త్రీ. ఇది భూమికిని, పు. పర్వతమునకును, ఆవునుకట్టెడు కొయ్యకును పేరు.

చంచలాతు తటిల్లక్ష్మ్యో
శ్చంచలః కాముకే ఽనిలే ॥(123)

**చంచలా :** స్త్రీ. ఇది మెఱుపునకును, లక్ష్మికిని, పు. విటునకును, వాయువునకును పేరు.

ఇల్వలా స్తారకాభేద
ఇల్వలో దైత్యమత్స్యయోః।

**ఇల్వలాః :** స్త్రీ. (నిత్యబహువచనం) మృగశిరా నక్షత్రమునకు మీదనుండు 5చుక్కలకును, పు. ఇల్వలుడను రాక్షసునకును (వాతాపిసోదరుడు), మత్స్య విశేషమునకును పేరు.

పిచ్ఛిలా శాల్మలీసింధు
భేద పోతకి కాసు చ॥ (124)
పిచ్ఛిలాశింశుపాయాంచ
పిచ్ఛిలో విజిలే ఽన్యవత్।

**పిచ్ఛిలా :** స్త్రీ. ఇది బూరుగ చెట్టునకును, పిచ్ఛిలా నదికిని, ఆడుపిచ్చుకకును, ఇరుగుడు చెట్టునకును, త్రి. జిడ్డుగల దానికిని పేరు.

సప్తలా పాటలాగుంజా
నవమాలిక యోరపి॥ (125)

**సప్తలా :** స్త్రీ. ఇది కలిగిగొట్టు చెట్టునకును, పూసగురివెందచెట్టునకును, విరజాజిచెట్టునకును, సంబరేణి చెట్టునకును పేరు.

భవేచ్చర్మ కషాయాంచ
మహిళా భీరు గుంద్రయోః।

**మహిళా :** స్త్రీ. ఇది స్త్రీకిని, ప్రేంఖణపుచెట్టునకును పేరు.

సిధ్మలామత్స్య చూర్ణస్యా
త్సిధ్మలశ్చ కిలాసిని ॥ (126)

**సిధ్మలా :** స్త్రీ. ఇది రొయ్యపప్పునకును; త్రి. శోబెల రోగికిని పేరు.

సంధిలాతుసురంగాయం

**సంధిలా :** స్త్రీ. ఇది కన్నమునకును, నదికిని

నదీ మందిరయోరపి।

గృహమునకును పేరు.

రసాలామార్జితాయాంస్యా
జ్జిహ్వో దూర్వా విదారిషు॥(127)
రసాలం స్సిల్ల కే చోలే
రసాల శ్చేక్షుచూతయోః।

**రసాలా :** స్త్రీ. ఇది పెఱుగులో ననేక ద్రవ్యములు గూర్చి చేసిన భోజన పదార్థమునకును, నాలుకకును, గరికెకును, తెల్లనేలగుమ్ముడు చెట్టునకును, న. అందుగ బంకతో జేసిన ధూపద్రవ్యమునకును, బాలింత బోలునకును, పు. చెఱుకునకును, మామిడి చెట్టునకును పేరు.

విమలా శీతలాయాంస్యా
ద్భువో భేదే చ నిర్మలే॥(128)

**విమలా :** స్త్రీ. ఇది సోమెంద చెట్టునకును, నిర్మలమైన భూవిశేషమునకును, త్రి. నిర్మలమైన దానికిని పేరు.

విమలేచామలా లక్ష్మ్యా
మమలం విశదే భ్రకే।

**అమలా :** స్త్రీ. ఇది లక్ష్మికిని, త్రి. స్వచ్ఛమైన దానికిని, న. అభ్రక ధాతువునకును పేరు.

శ్రీఫలీ నీలికా ధాత్ర్యో
ర్మాలూరే శ్రీఫలస్మృతః॥(129)

**శ్రీఫలీ :** స్త్రీ. ఇది నీలిచెట్టునకును, ఉసిరిగ చెట్టునకును, అ.పు. మారేడు చెట్టునకును పేరు.

పాతిలీవాగురాయాం స్యా
న్నారీమృత్పాత్రభేదయోః।

**పాతిలీ :** స్త్రీ. ఇది వలకును, స్త్రీకిని, మంటికుండల లోని భేదమునకును పేరు.

జాంగలీ శూకశింబ్యాంస్యా
జ్జాంగలశ్చ కపింజలే॥(130)

**జాంగలీ :** స్త్రీ. ఇది దూలగొండి చెట్టునకును, పు. కాటుగ పిట్టకును పేరు.

లాంగలీ జలపిప్పల్యాం
లాంగలంకుసుమాంతరే।
సీరేఽపి లాంగలం తాళ
గృహదారువిశేషయోః॥(131)

**లాంగలీ :** స్త్రీ. నీటి పిప్పలికిని, న. పుష్ప విశేషమునకును, నాగటికిని, తాడి చెట్టునకును, ఇంటి దూలములలోని భేదమునకును పేరు.

అంగుళీ కరశాఖాయాం
కర్ణికాయాం గజస్య చ।

**అంగుళీ:** స్త్రీ. ఇది వ్రేలికిని, గజతుండాగ్రభాగమునకును పేరు.

జాంగులీ విషవిద్యాయాం
జాంగులం జాలినీఫలే॥(132)

**జాంగులీ :** స్త్రీ. ఇది విషమును దింపెడి మంత్ర విద్యకును, న. బీరకాయకును పేరు.

కదళీ వైజయంత్యాం చ
రంభాయాం హరిణాంతరే।

**కదళీ :** స్త్రీ. ఇది టెక్కెమునకును, అరటి చెట్టునకును, జింకలలోని భేదమునకును, ఆ. స్త్రీ. బూరుగ

కదళాశాల్మలీ బ్రాహ్మీ
డింబికా సు చ కథ్యతే॥ (133)
నకులీ కుక్కుటీ మాంస్యో
ర్నకులః పాండవే పశౌ।
నాకులీకుక్కుటీ కందే
నాకులీచవ్యరాస్నయోః॥(134)
నైపాళీ నవమాలీ మ
నశ్శిలాసువహాసు చ।

చెట్టునకును పొన్నగంటి కూరకును, దుండిగపు చెట్టునకును పేరు.

**నకులీ:** త్రీ. ఇది కోడి పెట్టకును, జటామాంసికిని, అ. పు. నకులునకు, ముంగిసకును పేరు.

**నాకులీ :** త్రీ. ఓషధి విశేషమునకును, చవ్యమను గంధద్రవ్యమునకును, దుంపరాష్ట్రమునకును పేరు.

**నైపాళ :** త్రీ. ఇది విరజాజి చెట్టునకును, నేపాళ దేశపు మణిశిలకును, నల్లిపువ్వుల వావిలి చెట్టునకును పేరు.

తాంబూలీ నాగవల్ల్యాంచ
తాంబూలం క్రముకేఽపిచ॥(135)
పాంచాలీ పుత్రికారీత్యోః
పాంచాలో జన దేశయోః।

**తాంబూలీ:** త్రీ. ఇది ఆకు తీగకును, న. పోకచెక్కకును పేరు.

**పాంచాలీ :** త్రీ.ఇది వస్త్రాదులచేత జేయబడిన బొమ్మకును, పాంచాలీరీతికిని, అ. పు. పాంచాల దేశపు మనుష్యునకును, ఆ దేశమునకును పేరు.

శాల్మలీ తరుభేదే స్యా
ద్ద్వీపభేదేఽపి శాల్మలీ॥ (136)
కేవలీ జ్ఞానభేదే స్యా
త్కేవలం చైక కృత్స్నయోః।
నిర్ణీతే కేవలం ప్రోక్తం
కేవలః కుహనే క్వచిత్॥ (137)
కాహళీ తు తరుణ్యాం స్యా
త్కాహళం భృశ శుష్కయోః।
వాద్యభాండ విశేషే తు
కాహళా కాహళః ఖలే॥ (138)
గండోలీ వరటా భద్రా
శరీషు కథితా బుధైః।
అంజలీం కుడుపే విద్యా
దంజలిః కరసంపుటే॥(139)

**శాల్మలీ :** త్రీ. ఇది బూరుగ చెట్టునకును, శాల్మలి ద్వీపమునకును పేరు.

**కేవలీ :** త్రీ. ఇది జ్ఞానవిశేషమునకును, న. ఒక్కటి యనుటకును, అంతయుననుటకును, త్రి. నిర్ణయింపబడిన దానికిని, పు. కుత్సితునకును పేరు.

**కాహళ :** త్రీ. ఇది యౌవన స్త్రీకిని న. అతిశయము నకును, త్రి. ఎండిన దానికిని, త్రీ. వాయించు కుండకును, త్రి. దుర్మార్గునకును పేరు.

**గండోలీ:** త్రీ. ఇది కందిరీగకును, భద్రముస్తకును, ఉమ్మెత్త చెట్టునకును పేరు.

**అంజలీ :** త్రీ. ఇది మానెడు ప్రమాణమునకును, దోసిలికిని పేరు.

★ అథలాంత శ్చతుర్వర్ణః ★

మదకల స్స్యాన్మత్తేభే
మదేనావ్యక్త వాచి చ।

**మదకల:** పు. ఇది మదపుటేనుగునకును, మదము చేత వ్యక్తముగాని మాటకును పేరు.

భవేత్కలకల స్సర్జ
రసే కోలాహలేఽపి చ॥ (140)

**కలకల :** పు. ఇది యక్షధూపమునకును, కోలాహల ధ్వనికిని పేరు.

స్మృతో విచికిలో మల్లీ
ప్రభేదే దమనేఽపి చ।

**విచికిల :** పు. ఇది మల్లి చెట్లలోని భేదమునకును, దమనమునకును పేరు.

బృహన్నలో గుడాకేశే
మహాపోటగళేఽపి చ॥ (141)

**బృహన్నల:** పు. అర్జునునకును, పెద్దకిక్కిసగడ్డికిని పేరు.

పరీమళో విమర్దే చ
స్యాన్మనోహరగంధవత్।
రతోప మర్దవికస
ద్దేహరాగాది సౌరభే॥ (142)

**పరిమళ:** పు. పరిమళద్రవ్య సమ్మేళనమునకును, సువాసనకును, రతిసమ్మర్దమువలన పుట్టిన చందనాదుల పరిమళమునకును పేరు.

యవఫలస్స్మృతో వేణౌ
మాంసీకుటజయోరపి।

**యవఫల:** పు. ఇది వెదురునకును, జటామాంసికిని, కొడిశచెట్టునకును పేరు.

ముక్తాఫలం తు కర్పూరే
మౌక్తికేలవలీఫలే॥ (143)

**ముక్తాఫల:** న. ఇది కప్పురమునకును, ముత్తెమునకును, వెన్నెలతీగయొక్క పండునకును పేరు.

సదాఫల స్స్కంధఫలే
నారికేళేప్యుదుంబరే।

**సదాఫల:** పు. ఇది కుక్కమేడిచెట్టునకును, కొబ్బరిచెట్టునకును, మేడి చెట్టునకును పేరు.

విదుః కర్మఫలంకర్మ
రంగ కర్మవిపాకయోః॥ (144)

**కర్మఫల :** న. ఇది కర్మరంగ ఫలమునకును, కర్మఫలమునకును పేరు.

మృత్యుఫలో మాహాకాలే
కదళ్యాం మృత్యుఫల్యపి।

**మృత్యుఫల:** పు. ఇది ముషిణిచెట్టునకును, ఈ. స్త్రీ. అరటి చెట్టునకును పేరు.

భవేద్వాయుఫలం శక్ర
కార్ముకే కరకేఽపి చ॥ (145)

**వాయుఫల:** న. ఇది ఇంద్రధనస్సునకును, వడగలికిని పేరు.

హాలాహలో విషే జ్యేష్ఠ్యాం
హయలాలాహ్వయోరగే।

**హాలాహల :** పు. ఇది విషమునకును, బల్లికిని, నల్లకెళ్ళపామునకును పేరు.

కుతూహలం కౌతుకే స్యా

**కుతూహల :** న. ఇది ఉత్సాహమునకును, త్రి.

| | |
|---|---|
| త్రిశస్తే చ కుతూహలం। (146) | శ్రేష్ఠమైన దానికిని పేరు. |
| దళామళం దమనకే తథామరువకేऽపి చ। | **దళామల:** న. ఇది దమనమునకును, మరువము నకును పేరు. |
| మహాబలం సీసకేऽపి బలాఢ్యేऽపి సమీరణే॥ (147) భవేదతి బలాయాం చ | **మహాబల:** న. ఇది సీసమునకును, త్రి. బలవంతున కును, పు. వాయువునకును, స్త్రీ. అతిబలయను చెట్టునకును పేరు. |
| ఖతమాలో బలాహకే। ధూమేऽపి | **ఖతమాల :** పు. ఇది మేఘమునకును, పొగకును పేరు. |
| కందరాళ స్త్వ్యత్పర్కటీ గర్ద భాండయోః॥ (148) | **కందరాళ :** పు. ఇది జువ్విచెట్టునకును, కలజువ్వి చెట్టునకును పేరు. |
| మహాకాళస్త్రిణయనే కింపాకే ప్రమథాంతరే। | **మహాకాళ :** పు. ఇది శివునకును, ముషిణి చెట్టు కును, ప్రమథ గణములో నొకనికిని పేరు. |
| మహానీలో భృంగరాజే మణి నాగవిశేషయోః॥ (149) | **మహానీల :** పు. ఇది గుంటగలగరచెట్టునకును, నీలమణికిని, మహానీలమను దేవయోని సర్పము నకును పేరు. |
| భవేద్బహుఫలాభిఖ్యా మల(పూ)యూ నీప వృక్షయోః। | **బహుఫల :** పు. ఇది బ్రహ్మమేడిచెట్టునకును, కడిమిచెట్టునకును పేరు. |
| జలాంచలం స్మృతం వారి నిర్గ మే శైవలేऽపి చ॥ (150) | **జలాంచల:** న. ఇది నీరుపోయెడి తూమునకును, నాచునకును పేరు. |
| గండశైలో లలాటే స్యా చ్చ్యుతస్థూలోపలే గిరేః। | **గండశైల:** పు. ఇది నుదుటికిని, పర్వతమునుంచి జారిన పెద్దఱాతికిని పేరు. |
| ఉలూఖలం గుగ్గులు ద్రౌ ఖండన్యర్థేऽప్యులూఖలం॥ (151) | **ఉలూఖల:** న. ఇది గుగ్గిలపు చెట్టునకును, ఱోటి కిని పేరు. |
| చక్రవాళోऽద్రిభేదేస్యా చ్చక్రవాళం తు మండలే। | **చక్రవాళ:** పు. లోకాలోక పర్వతమునకును, న. వర్తులాకారమునకును పేరు. |
| స్మృతః పోటగళః కాశే నళే పోట గళో ఝుషే॥ (152) | **పోటగళ :** పు. ఇది రెల్లునకును, కిక్కిస గడ్డికిని, చేపకును పేరు. |
| హస్తిమల్లోऽభ్రమాతంగే | **హస్తిమల్ల:** పు. ఇది ఐరావతమునకును, విఘ్నేశ్వ |

| | |
|---|---|
| హస్తి మల్లో వినాయకే | రునకును పేరు. |
| భస్మతూలో గ్రామకూటే। | **భస్మతూల**: పు. ఇది గ్రామసమూహమునకును, |
| పాంశువర్షే హిమేఽపి చ॥(153) | తుంపుఋలవర్షమునకును, మంచునకును పేరు. |
| వాతకేళిః కలాలాపే | **వాతకేళి** : పు. ఇది తుమ్మెదకును, విటులయొక్క |
| షిద్గానాం దంతలేఖనే। | దంతక్షతమునకును పేరు. |
| కమండలు స్స్యాత్కరకే | **కమండలు**: పు. ఇది సన్యాసుల యుదకపాత్రము |
| పర్కటీ పాదపేఽపి చ॥ (154) | నకును, జువ్విచెట్టునకును పేరు. |
| అక్షమాలాక్ష సూత్రేస్యా | **అక్షమాలా** : స్త్రీ. ఇది రుద్రాక్షమాలికకును, |
| దరుంధత్యా మపి స్మృతా। | అరుంధతికిని పేరు. |
| మణిమాలా స్మృతా హారే . | **మణిమాలా** : స్త్రీ. రత్నమాలికకును, స్త్రీల దంత |
| స్త్రీణాందంతక్షతాంతరే॥(155) | క్షతాభేదమునకును పేరు. |
| ధ్వనిలాలా స్మృతా వేణౌ | **ధ్వనిలాలా**: స్త్రీ. ఇది వెదురునకును, బూరాకును, |
| కాహళా వీణయోరపి। | వీణకును పేరు. |
| రజస్వలాపుష్పవత్యాం | **రజస్వలా** : స్త్రీ. ఇది రజస్వలా స్త్రీకిని, పు. దున్న |
| సైరిభేతు రజస్వలః॥(156) | పోతునకును పేరు. |
| ఏకాష్ఠీలా మపి ప్రాహు | **ఏకాష్ఠీలా** : స్త్రీ. ఇది ఒక పుష్పపు చెట్టునకును, |
| శ్శివమల్ల్యోషధీభిదోః। | పాటుచెట్టునకును పేరు. |
| అతిబలా బలాభేదే | **అతిబలా** : స్త్రీ. ఇది చిట్టాముదపు చెట్లలోని |
| ప్రబలే తిబలో మతః॥(157) | భేదమునకును, త్రి. బలవంతునకును పేరు. |
| భద్రకాళీ తు గంధోళ్యా | **భద్రకాళీ** : స్త్రీ. ఇది కందిరీగకును, పార్వతికిని, |
| ముమాయా మోషధీభిది। | ఓషధి విశేషమునకునుపేరు. |
| హరితాళీనభోరేఖా | **హరితాళీ**: స్త్రీ. ఇది ఆకాశపురేఖకును, గరికెగడ్డికిని, |
| దూర్వాఖడ్గలతాసు చ॥(158) | పెద్ద కత్తికిని పేరు. |
| అంకపాళీస్మృతా కోట్యాం | **అంకపాళీ** : స్త్రీ. ఇది వేదికయును శాకవిశేషమున |
| ధాత్రికా పరిరంభయోః। | కును, పెంపుడు తల్లికిని, ఆలింగమునకును పేరు. |
| గంధఫలీ ప్రియంగౌస్యా | **గంధఫలీ** : స్త్రీ. ఇది ప్రేంకణపు చెట్టునకును, |
| త్కోరకే చంపకస్య చ॥(159) | సంపంగి మొగ్గకును పేరు. |

★ అథలాంతః పంచవర్ణః ★

అసుతీబల ఇత్యాఖ్యా
కన్యాపాలక యజ్వనోః।

**అసుతీబల**: పు. ఇది శూద్రజాతివిశేషమందు పుట్టిన కన్యాపాలుడనువానికిని, యజ్ఞముజేసిన వానికిని పేరు.

స్యాత్పాండు కంబలశ్శ్వేత
కంబలే చ శిలాంతరే॥ (160)

**పాండుకంబల** : పు. ఇది తెల్లని కంబళికిని, శిలా విశేషమునకును పేరు.

ఏకకుండల ఇత్యేష
సౌనందిని ధనాధిపే।

**ఏకకుండల** : పు. ఇది బలరామునకును, కుబేరునకును పేరు.

భవే దుద్దండ పాలస్తు
సర్ప మత్స్య ప్రభేదయోః॥(161)

**ఉద్దండపాల**: పు. ఇది సర్పవిశేషమునకును, మత్స్యవిశేషమునకును పేరు.

కృపేట పాలమిచ్ఛంతి
కేనిపాతసముద్రయోః।

**కృపేటపాల**: పు. ఇది ఓడతెడ్డునకును, సముద్రమునకును పేరు.

భవేత్సురత తాళీ తు
దూతికాయాం శిరస్స్రజి॥(162)

**సురతతాళీ** : స్త్రీ. ఇది తార్పుడకత్తెకును, శిరమున ధరించు పుష్పమాలకును పేరు.

★ అథవాంత ఏకవర్ణః ★

వం ప్రచే తసిజానీయా
దివార్థే చ తదవ్యయం।

**వ** : పు. ఇది వరుణదేవునకును, అవ్య. ఇవార్థమునకును పేరు.

స్వం జ్ఞాతా వాత్మ ధనయో
రాత్మీయే చ ప్రచక్షతే॥ (1)

**స్వ** : ఇది జ్ఞాతికిని, ఆత్మకును, (తాను) ధనమునకును, త్రి. తనసంబంధమైన దానికిని పేరు.

★ అథవాంతో ద్వివర్ణః ★

భవస్సం సార సంప్రాప్తి
శ్రేయ శ్శంకరజన్మసు।

**భవ**: పు. ఇది సంసారమునకును, పొందుటకును, శుభమునకును, శివునకును, పుట్టువునకును పేరు.

దవో దావ ఇవఖ్యాతో
వనాగ్నివన యోరపి॥ (2)

**దవ, దావ**: పు. ఈరెండును అరణ్యమందుబుట్టెడు దవానలమునకును, వనమునకును పేరు.

ద్రవః ప్రద్రావరసయో
ర్గతౌ నర్మణివిద్రవే।

**ద్రవ** : పు. ఇది పరుగెత్తుటకును, నీరుగా నుండు పదార్థమునకును, గమనమునకును, స్త్రీపురుషుల విహారక్రీడకును, పరిహాసమునకును పేరు.

ధవః పత్యౌనరే ధూర్తే

**ధవ** : పు. ఇది పెనిమిటికిని, మనుష్యునకును,

వృక్షభేదేऽపి కీర్తితః॥ (3)

విటునకును, నందివృక్షమునకును పేరు.

జవో వేగిని వేగేస్యా
దోడ్రపుష్పే జవామతా।

**జవ** : త్రి. ఇది వేగముగలదానికిని, పు. వేగమునకును, స్త్రీ. దాసాని చెట్టునకును పేరు.

లవో లేశే విలాసే చ
ఛేదనే రామనందనే॥(4)

**లవ** : పు. ఇది స్వల్ప పరిమాణమునకును, విలాసమునకును, తుంపుటకును, రాముని పుత్రునకును పేరు.

ప్లవః కారండవే భేకే
కులకే బేలకే కపౌ।
శబ్దేప్లుత గతౌ ప్లక్షే
చండాల జలకాకయోః॥ (5)
ప్లవం గంధతృణే ప్రోక్తం
కైవర్తీ ముస్తకేऽపి చ।

**ప్లవ** : పు. ఇది నీటికోడికిని, కప్పకును, పుష్పవృక్ష విశేషముకును, తెప్పకును, కోతికిని, ధ్వనికిని, దాటుటకును, జువ్విచెట్టుకును, మాదిగవానికిని, నీటికాకికిని, న. వాసన గడ్డికిని, తుంగముస్తలలోని భేదమునకును పేరు.

హవో యజ్ఞేతథా హ్వానే
నిదేశేऽపి హవో మతః॥ (6)

**హవ** : పు. ఇది యజ్ఞమునకును, పిలుచుటకును, ఆజ్ఞకును పేరు.

శవో మృతే శవం నీరే

**శవ** : పు. ఇది పీనుగునకును, నీటికిని పేరు.

సవ స్పంధానయజ్ఞయోః।

**సవ** : పు. ఇది కూర్చుటకును, యజ్ఞమునకును పేరు.

క్షవః క్షుతే రాజికాయాం

**క్షవ** : పు. ఇది తుమ్మునకును, నల్లావాలకును పేరు.

నవంనవ్యే స్తవే లిదుః॥ (7)

**నవ** : త్రి. ఇది నూతనమైన దానికిని, న. స్తుతికిని పేరు.

ధృఃకీలే శివేశంకౌవ
సౌయోగే వటే మునౌ।
ధ్రువామూర్వాశాల పర్ణ్యో
ర్గీతి స్రుగ్భేదయోరపి॥ (8)
ధ్రువంతు నిశ్చితే తర్క్యే
నిశ్చలే శాశ్వతేऽన్యవత్।

**ధ్రువ** : పు. ఇది మేకునకును, శివునకును, మొరడునకును, అష్టవస్తువులలో నొకనికిని, ధ్రువనామ యోగమునకును, మఱ్ఱిచెట్టునకును, ధ్రువమునికిని, స్త్రీ. చాగచెట్టునకును, ముయ్యాకుపొన్నచెట్టునకును, ధ్రువాగానమునకును, వటపత్రాకారమగు యజ్ఞపాత్ర విశేషమునకును, త్రి. నిశ్చయింపబడిన దానికిని, ఊహింపబడిన దానికిని, చలించని

దానికిని, స్థిరమైన దానికిని పేరు.

స్రువాఖ్యా సల్లకీమూర్వా
స్రుగ్భేదేషు చ విశ్రుతః॥ (9)

**స్రువ :** పు. ఇది అందుగు చెట్టుకును, చాగచెట్టున కును, హోమపాత్ర విశేషమునకును పేరు.

శివం మోక్షే సుఖేభద్రే
సలిలే చ శివోహరే।
వేదే యోగాంతరే కీలే
వాలుకే గుగ్గులావపి॥(10)
పుండరీక ద్రుమే చాథ
శివా ఝాటమలౌషధౌ।
అభయామలకీగౌరీ
క్రోష్ట్రీ సక్తుఫలాసు చ॥ (11)

**శివ :** న. ఇది మోక్షమునకును, సుఖమునకును, మంగళమునకును, జలమునకును, పు. శివున కును, వేదమునకును, శివనామయోగమున కును, మేకునకును, ఇనుమునకును, గుగ్గిలపు చెట్టునకును, పుండరీక మను వృక్షమునకును, స్త్రీ. ఓషధి విశేషమునకును, కరక చెట్టునకును, ఉశిరిగచెట్టునకును, పార్వతికిని, ఆడు నక్కకును, జమ్మి చెట్టునకును పేరు.

దివంస్వర్గేఽంత రిక్షే చ

**దివ :** న. ఇది స్వర్గమునకును, ఆకసమునకును పేరు.

క్లీవష్షండేఽప్యపౌరుషే।

**క్లీవ :** పు. ఇది నపుంసకునకును, పౌరుషహీనున కును పేరు.

జీవో వృక్షప్రభేదే స్యా
జ్జీవః ప్రాణిని గీష్పతౌ॥ (12)
జీవః ప్రాణే ప్రాణధృతౌ
జీవాత్మ న్యపి కీర్తితః।
జీవాజీవంతికా భూమీ
మౌర్వీశింజత వృత్తిషు॥(13)
వచాయా మపి జీవా స్యా
జ్జీవం స్యాజ్జీవితేఽ పి చ।

**జీవ :** పు. ఇది వేగిమ్రానికిని, ప్రాణముగల దానికిని, బృహస్పతికిని, ప్రాణమునకును, ప్రాణ ములను ధరించుటకును, జీవాత్మకును, స్త్రీ. పాల కూరకును, భూమికిని, వింటినారికిని, భూషణ ధ్వనికిని, జీవనార్థవ్యాపారమునకును, వసకును, న. బ్రతుకుటకును పేరు.

భావ స్వభావేఽ భిప్రాయే
చేష్టాసత్తా త్మజన్మసు॥ (14)
క్రియాలీలా పదార్థేషు
బుధ జంతు విభూతిషు।

**భావ :** పు. ఇదిస్వభావమునకును, అభిప్రాయము నకును, చేష్టకును, ఉండుటకును, ఆత్మకును, పుట్టుగకును, క్రియకును, విలాసమునకును, శబ్దార్థమునకును, విద్వాంసునకును, జంతువున కును, సంపదకును పేరు.

| | |
|---|---|
| దేవ స్సురే ఘనే రాజ్ఞి<br>దేవ మాఖ్యాతిమింద్రియే॥(15)<br>దేవీ భట్టారికాయాం చ<br>తేజనీ స్పృక్క యోరపి। | **దేవ** : పు. ఇది దేవతలకును, మేఘమునకును, రాజునకును, న. ఇంద్రియమునకును, ఈ. స్త్రీ. రాణికిని, చాగ చెట్టునకును, స్పృక్కయను గంధ ద్రవ్యమునకును పేరు. |
| సత్త్వంగుణే పిశాచాదౌ<br>బలేద్రవ్య స్వభావయోః॥ (16)<br>ఆత్మత్వే వ్యవసాయే చ<br>చిత్తే ప్రాణేషు జంతుషు। | **సత్త్వ** : న. ఇది సత్త్వగుణమునకును, పిశాచాదులకును, బలమునకును, పృథివ్యాది ద్రవ్యములకును, స్వభావమునకును, తానగుటకును, ప్రయత్నమునకును, మనస్సునకును, ప్రాణములకును, జంతు వులకును పేరు. |
| సాంత్వం సామనిదాక్షిణ్యే | **సాంత్వ** : న. ప్రియవాక్యములు పలుకుటకును, పరోపకారాసక్తికిని పేరు. |
| కణ్వం పాపే మునౌ విదుః॥ (17) | **కణ్వ** : న. ఇది పాపమునకును, పు. కణ్వమునికిని పేరు. |
| కిణ్వం పాపే సురాబీజే | **కిణ్వ** : న. ఇది పాపమునకును, కల్లుతీయు ద్రవ్యమునకును పేరు. |
| బిల్వంతు శ్రీఫలే శలే। | **బిల్వ**: న. ఇది మారేడుకాయకును, ఏదుముంటికిని పేరు. |
| తత్త్వం వాద్యప్రభేదే స్యా<br>త్స్వరూపే పరమాత్మని॥(18) | **తత్త్వ**: న. ఇది వాద్యవిశేషమునకును, ఆకారమునకును, పరమాత్మకును పేరు. |
| హ్రస్వఖర్వావిమౌశబ్దా<br>వల్పార్థే వామనార్థకే। | **హ్రస్వ, ఖర్వ**: పు. ఇవి స్వల్పమైన దానికిని, కుఱుచయైన దానికిని పేళ్ళు. |
| విశ్వంసమస్తే జగతి<br>విశ్వే దేవేఽపినాగరే॥(19)<br>విశ్వాచాతి విషాయాం స్యా<br>దశ్వః పుంభేద వాజినోః। | **విశ్వ** : ఇది సమస్తమునకును, జగమునకును పు. విశ్వేదేవులను గణదేవతలకును, శొంఠికిని, స్త్రీ. అతివసకును పేరు.<br>**అశ్వ**: పు. ఇది అశ్వజాతి పురుషునకును, గుఱ్ఱమునకును పేరు. |
| పార్శ్వః కక్షాధరే చక్రా<br>ప్రాంతే పర్శుగణేఽపి చ॥(20) | **పార్శ్వ** : ఇది చంకలక్రింది భాగమునకును, న. చక్రముయొక్క ప్రాంతభాగమునకును, వెన్నెము |

కల గుంపునకును పేరు.

ప్రాధ్వం సుప్రణతేచాతి
దూరవర్త్మని బంధనేI

**ప్రాధ్వ** : త్రి. ఇది అనుకూలమైన దానికిని, న. మిక్కిలి దూరమార్గమునకును, కట్టుటకును పేరు.

పక్వంపరిణతేఽపి స్యా
ద్వినాశాభిముఖేఽపి చII(21)

**పక్వ** : త్రి. ఇది పండిన దానికిని, నశించుటకు సిద్ధమైన దానికిని పేరు.

ద్వంద్వం రహస్యే కలహే
ద్వంద్వం మిధునయుగ్మయోఃI

**ద్వంద్వ** : న. ఇది రహస్యమునకును, ద్వంద్వ యుద్ధమునకును, స్త్రీపురుషులజోటికిని, జోటికిని పేరు.

ఊర్ధ్వం స్యాదు (త్థితే) చ్ఛ్రితేతుంగే
చో పరిష్టాదపిస్మృతంII(22)

**ఊర్ధ్వ** : త్రి. ఇది పుట్టిన దానికిని, ఉన్నతమైన దానికిని, మీదైన దానికిని పేరు.

ద్యువద్యోస్స్వర్గ లోకేఽపి
గగనేఽపి ప్రచక్షతేI

**ద్యు** : న. ఇది స్వర్గమునకును, **ద్యో** : స్త్రీ. అంతరిక్షమునకును పేరు.

అవిశ్శైలే రవామేషే
భవేన్మూషికకంబళేII(23)

**అవి**: పు. ఇది పర్వతమునకును, సూర్యునకును, మేకకును, కంబళ్ళలోని భేదమునకును, స్త్రీ. రజస్వలా స్త్రీకిని పేరు.

ఋతుమత్యామపిప్రోక్తా
శి(బి)వి ర్భూర్జే నృపాంతరేI

**శి(బి)వి** : పు. భుజపత్రి చెట్టునకును, శిబి చక్రవర్తికిని పేరు.

కవిః కావ్యకరే సూరౌ
కవి ర్వాల్మీకి శుక్రయోఃII (24)

**కవి** : పు. ఇది కావ్యమును రచియించిన వానికిని, పండితునకును, వాల్మీకి మునికిని, శుక్రాచార్యునకును, స్త్రీ. కళ్ళెమునకును పేరు.

కవీ ఖలీనే కథితా
ఛవిశ్శోభారుచోర్మతాI

**ఛవి** : స్త్రీ. ఇది శోభకును, కాంతికిని పేరు.

గ్రీవా తు కంధరాయాంస్యా
త్తచ్ఛిరాయామపిస్మృతాII (25)

**గ్రీవా** : స్త్రీ. ఇది కంఠమునకును, మెడనరమునకును పేరు.

లట్వాకరంజ భేదే స్యా
త్ఫలే వాద్యే ఖగాంతరేI

**లట్వా**: స్త్రీ. ఇది క్రానుగుచెట్లలోనిభేదమునకును, బొంగరమునకును, వాద్యవిశేషమునకును, ఊర పిచ్చుకకును పేరు.

నీవీపరిపణే గ్రంథౌ
స్త్రీణాంజఘనవాససఃII(26)

**నీవి** : స్త్రీ. ఇది మూలధనమునకును, (పెట్టుబడి సొమ్ము) స్త్రీలకటియందలి పోకముడికిని పేరు.

| | |
|---|---|
| పృథ్వీ భూమావృథాహింగు<br>పత్రికా కృష్ణజీరయోః।<br>లఘ్వీహ్రస్వవివక్షాయాం<br>ప్రభేదే స్యందనస్యచ॥(27) | **పృథ్వీ :** స్త్రీ. ఇది భూమికిని, విస్తారమైన దానికిని, ఇంగువచెట్టునకును, నల్లజీలకఱ్ఱకును పేరు.<br>**లఘ్వీ :** స్త్రీ. ఇది హ్రస్వ పరిమాణముగల దానికిని, రథ విశేషమునకును పేరు. |
| ★ అథవాంత త్రివర్ణః ★ | |
| ప్రభవో జలమూలే స్యా<br>జ్జన్మ భూమౌ పరాక్రమే।<br>ఆద్యోప లబ్ధయే స్థానే<br>విభవోనివృతౌ ధనే॥ (28) | **ప్రభవ :** పు. నీరుపుట్టిన చోటునకును, జన్మస్థానమునకును, పరాక్రమమునకును, ప్రథమ జ్ఞానస్థానముకును పేరు.<br>**విభవ :** పు. ఇది వివాహాద్యుత్సవమునకును, ధనమునకును పేరు. |
| ప్రసవస్తు ఫలే పుష్పే<br>వృక్షాణాం గర్భమోచనే।<br>తోకోత్పాదేచ | **ప్రసవ :** పు. ఇది ఫలమునకును, పువ్వునకును, బిడ్డగనుటకును, స్త్రీపుంరూపసంతాన జననమునకును పేరు. |
| సచివ స్సహాయేమంత్రిణిస్మృతః॥ | **సచివ :** పు. ఇది సహాయునకును, మంత్రికిని పేరు. |
| కితవో ధూర్త వన్మత్తే<br>వంచకే కనకాహ్వయే।<br>త్రిదివ స్త్రిదశావాసే<br>త్రిదివా సరిదంతరే॥(30) | **కితవ :** పు. ఇది ధూర్తశబ్దమువలెను, మదించినవానికిని, మోసగానికిని, ఉమ్మెత్త చెట్టునకును పేరు.<br>**త్రిదివ :** పు. ఇది స్వర్గమునకును, స్త్రీ. త్రి దివానదికిని పేరు. |
| వల్లవ స్సూపకారే స్యా<br>ద్భీమసేనే చ గోదుహి।<br>పల్లవ స్స్యాత్కిసలయే<br>విటపే విస్తరే బలే॥(30)<br>శృంగారేఽలక్తరాగే చ | **వల్లవ :** పు. ఇది వంటలవానికిని, భీమునకును, గొల్లవానికిని పేరు.<br>**పల్లవ :** ఇది చిగురునకును, కొమ్మకును, విస్తారమునకును, బలమునకును, శృంగారమునకును, లాక్షారాగమునకును పేరు. |
| విద్రవస్తు పలాయనే।<br>యుద్ధేచ | **విద్రవ :** పు. ఇది పఱుగెత్తుటకును, యుద్ధమునకును పేరు. |
| పుంగవ శ్శ్రేష్ఠే<br>వృషభే భేషజాంతరే॥(32) | **పుంగవ :** పు. ఇది సజాతీయ సమూహ శ్రేష్ఠునకును, ఎద్దునకును, ఓషధి విశేషమునకును పేరు. |

ఉద్ధవో మాతులే విష్ణో
రుత్సవే క్రతుపావకే।
ఉత్సవో మహ ఉత్సేక
ఇచ్ఛాప్రసరకోపయోః॥ (33)
కేశవో వాసుదేవే స్యా
త్పున్నాగే కేశవత్యపి।
కైతవం తు ఛలే ద్యూతే
ఫేరవో జంబుకే క్రపే॥ (34)
రౌరవో నరకే ఘోరే

**ఉద్ధవ:** పు. ఇది కృష్ణునిమేనమామకును, వివాహోద్యుత్సవమునకును, యజ్ఞమందలియగ్నికిని పేరు.

**ఉత్సవ :** పు. వివాహాదులకును, గర్వమునకును, ఆశించుటకును, కోపమునకును పేరు.

**కేశవ:** పు. ఇది విష్ణువునకును, పొన్నచెట్టునకును, త్రి. మంచి కేశములు గల వానికిని పేరు.

**కైతవ**: న. ఇది మిషకును, జూదమునకును పేరు.

**ఫేరవ**: పు. ఇది నక్కకును, రాక్షసునకును పేరు.

**రౌరవ :** పు. నరకవిశేషమునకును, త్రి. భయంకరమైన దానికిని పేరు.

కైరవః కితవే రిపౌ।
కైరవం కుముదే చోక్తం
చంద్రికాయాంతు కైరవీ॥ (35)
భైరవం భీషణేభర్గే
భైరవ స్త్వఘుదాహృతః।
సైంధవో మాణి(మంథే)బంధే స్యా
త్సింధు దేశోద్భవాశ్వయోః॥(36)

**కైరవ :** పు. ఇది జూదరికిని, శత్రునకును, న. తెల్లకలువకును, ఈ. స్త్రీ. వెన్నెలకును పేరు.

**భైరవ:** త్రి. భయంకరమైనదానికిని, పు. ఈశ్వరునకును పేరు.

**సైంధవ :** ఇది సైంధవ లవణమునకును, పు. సింధుదేశమందుబుట్టిన దానికిని, గుఱ్ఱముకును పేరు.

బాడ(బం)వం కరణే స్త్రీణా
మౌర్వేవిప్రేపి బాడవః।
బాడవం బడబాసంఘే
బాడవో రాగనాగయోః॥ (37)
బడవాశ్వా కుంభదాస్యో
స్త్రీ విశేషే ద్విజస్త్రియాం।

**బాడ(బ)వ :** న. ఇది స్త్రీల రతి బంధ విశేషమునకును, పు. బడబాగ్నికిని, బ్రాహ్మణునకును, న. అశ్వసంఘమునకును, పు. రాగవిశేషమునకును, పాతాళమునకును పేరు.

**బడవా:** స్త్రీ. ఆడుగుఱ్ఱమునకును, నీళ్ళుమోసెడు దాసికిని, స్త్రీ విశేషమునకును, బ్రాహ్మణ స్త్రీకిని పేరు.

ఆశ్రవస్స్యాత్ప్రతిజ్ఞానే
క్లేశే చ వచనస్థితే॥ (38)

**ఆశ్రవ :** పు. ఇది అంగీకారమునకును, కష్టమునకును, త్రి. లెస్సగావాక్యమును వినువానికిని పేరు.

శాత్రవం భావ సంహత్యో
శ్శత్రూణాం శాత్రవో ద్విషి।

**శాత్రవ:** న. ఇది శత్రుత్వమునకును, శత్రు సంఘమునకును, పు. శత్రువునకును పేరు.

మాధవస్తు వసంతే స్యా
ద్వైశాఖే గరుడ ధ్వజే॥(39)
మాధవీ మదిరాయాం చ
కుట్టన్యా మతిముక్తకే।
మధున శ్శర్కరాయాం చ

**మాధవ:** పు. ఇది వసంతునకును, వైశాఖమాసమునకును, విష్ణువునకును, ఈ. స్త్రీ. కల్లునకును, తార్పుడు కత్తెకును, పూలగురివెందలతగును, కల్లు బెల్లమునకును పేరు.

గాలవో ముని లోధ్రయోః॥(40)

**గాలవ :** పు. ఇది గాలవుడనుమునికిని, లొద్దుగ చెట్టునకును పేరు.

ఆర్తవం త్వృతుసంభూతే
స్త్రీరజః పుష్పయోరపి।

**ఆర్తవ :** త్రి. ఋతువునందు బుట్టిన దానికిని, న. ముట్టురక్తమునకును, పువ్వునకును పేరు.

భార్గవః పర్శురామే చ
గజే శుక్రే సుధన్వని॥ (41)
భార్గవీ హైమవత్యాం చ
కమలా సితదూర్వయోః।

**భార్గవ :** పు. ఇది పరశురామునకును, ఏనుగునకును, శుక్రాచార్యునకును, మంచి విలుకానికిని, ఈ. స్త్రీ. పార్వతికిని, లక్ష్మికిని, నల్లగరికెకును పేరు.

ఆహవ స్సంగరే యాగే

**ఆహవ :** పు. ఇది యుద్ధమునకును, యజ్ఞమునకును పేరు.

రాఘవో రఘువంశజే॥(42)
మహామీన ప్రభేదే చ,
జలధే రాఘవ, స్మృతః।

**రాఘవ :** పు. ఇది రఘువంశపురాజులకును, సముద్రమందలి గొప్ప చేపకును పేరు.

తాండవం కథితం నాట్యే
తృణభేదేఽపి తాండవః॥(43)

**తాండవ:** ఇది పురుషనాట్యమునకును, పు. కసవులోని భేదమునకును పేరు.

నిహ్నవం నికృతౌ విద్యా
దవిశ్వాసా పలాపయోః।

**నిహ్నవ:** పు. ఇది తిరస్కారమునకును, కపటమునకును, మోసపు మాటకును పేరు.

సంభవః కధితో హేతా
వుత్పత్తౌ మేళకేఽపి చ॥(44)
ఆధారా నతిరి క్తత్వ
ఆధేయస్య చ, సంభవః।

**సంభవ:** పు. ఇది కారణమునకును, పుట్టుగకును, కాంతికిని, ఆధేయమాధారము నతిక్రమించకుండుటకును పేరు.

| | |
|---|---|
| బాంధవో బంధు సుహృదోః | **బాంధవ** : పు. ఇది జ్ఞాతికిని, స్నేహితునకును పేరు. |
| పంచత్వం నిధనే స్మృతం॥(45) | **పంచత్వ** : న. ఇది మరణమునకును, అయిదగుటకును పేరు. |
| పంచానామపి భావేఽథ ప్రభావశ్శక్తి తేజసోః। | **ప్రభావ**: పు. ఇది సామర్థ్యమునకును, ప్రతాపమునకును పేరు. |
| అభావ స్స్యాదసత్తాయా మభావో నిధనేఽపి చ॥ (46) | **అభావ** : పు. ఇది లేకపోవుటకును, మరణమునకును పేరు. |
| విభావ స్స్యాత్పరిచితౌ కామస్యోద్దీపనేఽపి చ। | **విభావ**: పు. ఇది పరిచయమునకును, కామోద్దీపకమగు, ఆలంబనాది విభావములకును పేరు. |
| నిష్పావ శ్శూర్పపవనే రాజమాషే కడంగ రే॥(47) పవనే శింబికాయాం చ, నిష్పావో నిర్వికల్పకే। | **నిష్పావ** : పు. ఇది చేటుగాలికిని, బొబ్బర్లకును, పొల్లునకును, తూర్పెత్తుటకును, కాయధాన్యముల పొట్టునకును, త్రి. వికల్పములేని దానికిని పేరు. |
| సుగ్రీవ శ్శోభనగ్రీవే సుగ్రీవో వానరాధిపే॥ (48) | **సుగ్రీవ** : త్రి. సుందరమైన మెడగల దానికిని, కిష్కింధాధిపతికిని పేరు. |
| రాజీవాఖ్యా మృగే మత్స్యే పద్మే రాజోపజీవిని। | **రాజీవ** : పు. ఇది జింకలలోని భేదమునకును, పెద్ద కన్నులగల చేపకును, న. పద్మమునకును, త్రి. రాజువలన జీవించువానికిని పేరు. |
| గాండీవం గాండివం జిష్ణోః కోదండే కార్ముకేఽపి చ॥(49) | **గాండీవ, గాండివ** : న. ఈరెండును, అర్జునుని ధనస్సునకును, సామాన్యధనస్సునకును పేర్లు. |
| అక్షీ(బం)వం వశిరే విద్యాదమత్తేఽక్షీవ మన్యవత్। | **అక్షీవ** : న. ఇది తనకు తానే పుట్టిన సాముద్రలవణమునకును, త్రి. మత్తతలేని వానికిని పేరు. |
| పార్థివో నృపతౌ భూమి వికారే పార్థివోఽన్యవత్॥(50) పార్థివీ స్యాత్ క్షమాయాం చ | **పార్థివ**: పు. ఇది రాజునకును, త్రి. మృద్వికారమైన దానికిని, స్త్రీ. భూమికిని పేరు. |
| దీదివి ర్ధిషణాఽన్నయోః॥ | **దీదివి** : పు. ఇది బృహస్పతికిని, అన్నమునకును పేరు. |

| | |
|---|---|
| ప్రసేవః కథితో ధీరై<br>ర్వీణాంగ స్యూతయోరపి॥ (51) | **ప్రసేవ:** పు. ఇది వీణకరిదికిని, దాగగరకును పేరు. |
| కారవీ మధురా దీప్య<br>త్యాక్స్త్రీ కృష్ణజీరకే। | **కారవీ:** స్త్రీ. ఇది పెద్ద సదాపచెట్టునకును, ఓమము నకును, ఇంగువచెట్టునకును, నల్ల జీలకఱ్ఱకును పేరు. |
| సుషవీ కారవల్యాం చ<br>కృష్ణజీరక జీరయోః॥ (52) | **సుషవీ:** స్త్రీ. ఇది కాకరతీగకును, నల్లజీలకఱ్ఱకును, జీలకఱ్ఱకును పేరు. |

★ అథ వాంత శ్చతుర్వర్ణః ★

| | |
|---|---|
| భవేదభిష వ, స్స్నా నే<br>మద్యసంధాన యజ్ఞయోః। | **అభిషవ :** పు. ఇది స్నానమునకును, కల్లుదీయుటకు మాగబెట్టిన ద్రవ్యమునకును, యజ్ఞమునకును పేరు. |
| ఉపప్లవ స్సైంహికేయే<br>విప్లవోత్పాతయోరపి॥ (53) | **ఉపప్లవ :** పు. ఇది రాహుగ్రహమునకును, ఉపద్రవమునకును, ధూమకేతువుమొదలగువాటికిని పేరు. |
| పరిప్లవ శ్చంచలే స్సా<br>దాకులేऽపి పరిప్లవః। | **పరిప్లవ :** త్రి. ఇది చలించుదానికిని, చెదరిన దానికిని పేరు. |
| కుశీలవస్తు వాల్మీకా<br>నట యాచకయోరపి॥ (54) | **కుశీలవ :** పు. ఇది వాల్మీకి మహామునికిని, నాట్యగానికిని, యాచకునకును పేరు. |
| అపహ్నవోऽపలాపేచ<br>స్నే హేచా పహ్నవోమతః। | **అపహ్నవ :** పు. ఇది గూఢాభిప్రాయ వాక్యమునకును, స్నేహమునకును పేరు. |
| పరాభవ స్తిరస్కారే<br>వినాశేऽపి పరాభవః॥ (55) | **పరాభవ:** పు. ఇది తిరస్కరించుటకును, నశించుటకును పేరు. |
| భవేత్పారశవో పారస్త్రైణే<br>శూద్రాసుతే ద్విజాత్ శస్త్రే। | **పారశవ:** పు. ఇది పరస్త్రీయందు బుట్టిన వానికిని, బ్రాహ్మణుని వలన శూద్రస్త్రీయందు బుట్టిన వానికిని, గండ్రగొడ్డటికిని పేరు. |
| స్యాదీనవో దోషే పరి<br>క్లిష్టే దురంతయోః॥ (56) | **దీనవ:** పు. ఇది దోషమునకును, కష్టమునకును, స్త్రీ. అంతమందు దుఃఖముగలదానికిని పేరు. |
| పుమః శీతశివ శ్శమ్యాం | **శీతశివ:** పు. ఇది జమ్మిచెట్టునకును, న. రాతిపువ్వు |

శైలేయ శత పుష్పయోః।
సైంధవేऽ పి
పుటగ్రీవో గర్గరీ
తామ్రకుంభయోః॥(57)
ధామార్గవ స్త్వపామార్గే
మహాజాల్యా మపి స్మృతా।
అనుభావః ప్రభావే స్స్యా
న్నిశ్చయే భావసూచనే॥(58)

నకును, పు. పెద్దసదాపచెట్టునకును, న. సైంధవ లవణమునకును పేరు.

**పుటగ్రీవ:** పు. ఇది కవ్వమునకును, రాగిపాత్రము నకును పేరు..

**ధామార్గవ :** పు. ఇది ఉత్తరేణిచెట్టునకును, చేతి బీరచెట్టునకును పేరు.

**అనుభావ :** పు. ఇది సామర్థ్యమునకును, నిశ్చయ మునకును, భ్రూభంగకటాక్షాదులచేత మనోభావ మును సూచించుటకును పేరు.

బలదేవ స్మృతో వాతే
కాళిందీ భేదనేऽపి చ।
బలదేవామపి ప్రాహు
స్త్రాయమాణౌషధే బుధా॥(59)

**బలదేవ :** పు. ఇది వాయువుకును, బలరాముస కును, స్త్రీ. కలుక్రానుగు చెట్టునకును పేరు.

జలబిల్వస్తు పంచాంగే
కర్కటే జలచత్వరే।
రో(లో)హితాశ్వో బృహద్భానౌ
హరిశ్చంద్ర నృపాత్మజే॥(60)

**జలబిల్వ :** పు. ఇది తాబేటికిని, పీతకును, నీరు నిలచిన ప్రదేశమునకును పేరు.

**రోహితాశ్వ :** పు. ఇది అగ్నికిని, హరిశ్చంద్రుని పుత్రునకును పేరు.

సహదేవా బలాదండో
త్పలాశారిబ భేష జే।
సహదేవీతు సర్పాక్ష్యాం
సహదేవశ్చ పాండవే॥(61)

**సహదేవా:** స్త్రీ. ఇది ముత్తవ పులగపుచెట్టునకును, తెల్లపువ్వుల సహదేవిచెట్టునకును, నల్లసుగంధిపాల చెట్టునకును, ఈ.పొన్నగంటికూరకును, పు. సహ దేవునకును పేరు.

జీవంజీవశ్చ కోరే స్యా
ద్ద్రుమ పక్షివిశేషయోః।
ఆశితంభవ మన్నాద్యే
తృప్తావప్యా శితంభవః॥(62)

**జీవంజీవ :** పు. ఇది చకోరపక్షికిని, వృక్షవిశేషము నకును, పక్షివిశేషమునకును పేరు.

**ఆశితంభవ:** న. ఇది అన్నము మొదలగు వాటికిని, పు. తృప్తికిని పేరు.

★ అథశాంతో ద్వివర్ణః ★

వశ(మా) ఆయత్తతాయాంస్స్యా
ద్వశ మిచ్ఛా ప్రభుత్వయోః।

**వశ:** పు. ఇది అధీనమగుటకును, న. కోరికకును, ఆధిపత్యమునకును, స్త్రీ. గొడ్రాలికిని, కూతున

వశా వంధ్యాసుతా యోషా
స్త్రీగవీకరిణీషు చ॥ (1)

కును, ఆడుదానికిని, గోవునకును, ఆడుయేనుగు
నకును పేరు.

కుశో రామసుతే దర్భే
యోక్త్రే ద్వీపే కుశం జలే।
కుశీ ఫాలేఽపి వల్గాయాం
కుశా పాపిష్ట మత్తయోః॥ (2)

**కుశ** : పు. ఇది శ్రీరాముని పుత్రునకును, దర్భ
కును, పలుపు త్రాటికిని, కుశద్వీపమునకును,
న. జలమునకును, ఈ.స్త్రీ. నాగటి కఱ్ఱునకును,
ఆ.స్త్రీ. కళ్ళెపువాగెకును, త్రి. పాపాత్మునకును,
మదించిన వానికిని పేరు.

కుశో వాచ్యవదాఖ్యాతః
స్పశః ప్రణిధి యుద్ధయోః।

**స్పశ**: పు. ఇది దూతకును, యుద్ధముకును పేరు.

శశో గంధరసే లోధ్రే
స్యాత్పశౌ పురుషాంతరే॥ (3)

**శశ** : పు. ఇది బాలింత బోలునకును, లొద్దుగ
చెట్టునకును, చెవులపిల్లికిని, శశజాతిపురుషునకును
పేరు.

దర్శస్తు సంగమే సూర్య
చంద్రయోః రవలోకనే।
పక్షాంతే వైదికవిధా
దర్శశ్చ సముదాహృతః॥(4)

**దర్శ**: పు. ఇది అమావాస్యకును, చూచుటకును,
దుర్శేష్టికిని పేరు.

స్పర్శో రుజాయాం దానే చ
స్పర్శనే స్పర్శకేఽపి చ।

**స్పర్శ**: పు. ఇది రోగమునకును, ఈవికిని, తాకుట
కును, త్రి. స్పృశించు దానికిని పేరు.

విట్ స్మృతో వైశ్యమనుజ
ప్రవేశేషు మనీషిభిః॥ (5)

**విట్** : పు. ఇది కోమటికిని, మనుష్యునకును,
ప్రవేశించుటకును పేరు.

పాశః కచాంతే సంఘార్థః
కర్ణాంతే శోభనార్థకః।
ఛాత్రాద్యంతే చ, నింద్యార్థః
పాశః పక్ష్యాదిబంధనే॥ (6)

**పాశ** : పు. ఇది కేశార్థకపదాంతమందుండెనేని
సమూహార్థమునకును, కర్ణార్థకపదాంతమందుడె
నేని యోగ్యార్థమునకును, ఛాత్రాదిపదాంత
మందుండెనేని నిందార్థకమునకును, ఉచ్చు త్రాటి
కిని పేరు.

నాశః పలాయనే ప్రోక్తో
నిధనాఽను పలంభయోః।

**నాశ** : పు. ఇది పఱుగెత్తుటకును, మరణము
నకును, ఎఱుగకుండుటకును పేరు.

కాశస్తృణే స్యాత్ క్షవధా
వారణాస్యాం తుకాశ్యపి॥(7)

**కాశ**: పు. ఇది రెల్లుగడ్డికిని, దగ్గునకును, ఈ. స్త్రీ.
కాశీ క్షేత్రమునకును పేరు.

కేశో దైత్యాంతరే వాలే
హ్రీబేరే చ ప్రచేతసి।
కీశో దిగంతరే ప్రోక్తః
కీశ శ్శాఖామృగేऽపి చ॥ (8)
ఈశః ప్రభౌ శంకరేస్యా
దీశా లాంగలదండకే।
వేశో వేశ్యాగృహే ప్రోక్తో
నేపథ్యే గృహమాత్రకే॥ (9)
క్లేశో దుఃఖేऽపి రాగాదౌ
వ్యవసాయేऽపి చ క్వచిత్।
వంశో వేణౌ కులే వర్గే
పృష్ఠస్యావయవేऽపి చ॥ (10)
దంశస్స్యాత్ఖండనేదోషే
దంశో మర్మణి కీర్తితః।
సర్పక్షతే ऽపి సన్నాహ
వనమక్షికయోరపి॥ (11)
అంశుర్లేశే రవౌ రశ్మౌ

వాశు వ్రీహౌచ సత్వరే।

పాంశుర్ధూళిషు సస్యార్థ
చిర సంచిత గోమయే॥ (12)
దృగ్దర్శనే లోచనే దృ
గ్బుద్ధౌ వీక్షకేऽన్యవత్।
దశావర్తా వవస్థాయాం
వస్త్రాంతే స్యుర్దశా అపి॥(13)
నిశా దారుహరిద్రాయాం
స్యాత్త్రియామా హరిద్రయోః।

**కేశ :** పు. ఇది కేశుడను రక్కసునకును, జుట్టునకును, కురువేరునకును, వరుణనకును పేరు.

**కీశ :** పు. ఇది దిక్కులనడిమి భాగమునకును, కోతికిని పేరు.

**ఈశ :** పు. ఇది ప్రభువునకును, శివునకును, ఏడికోలకును పేరు.

**వేశ :** పు. ఇది వేశ్యాగృహమునకును, వేషమునకును, గృహసామాన్యమునకును పేరు.

**క్లేశ :** పు. ఇది రోగాదులవలని దుఃఖమునకును, రాగద్వేషాదులకును, ప్రయత్నమునకును పేరు.

**వంశ :** పు. ఇది వెదురునకును, కులమునకును, సమూహమునకును, వెన్నెముకకును పేరు.

**దంశ:** పు. ఇది ఖండించుటకును, దోషముకును, ఆయుము పట్టునకును, పాముకాటునకును, కవచమునకును, అడవియీగకును పేరు.

**అంశు :** పు. ఇది కొంచెమునకును, సూర్యునకును, కిరణమునకును పేరు.

**ఆశు :** పు. ఇది ఎఱ్ఱజిలమవడ్లకును, వేగమునకును పేరు.

**పాంశు :** పు. ఇది దుమ్మునకును, పంటచేలో వోయు గెత్తమునకును పేరు.

**దృక్ :** స్త్రీ. ఇది చూచుటకును, నేత్రమునకును, బుద్ధికిని, త్రి. చూచువానికిని పేరు.

**దశా :** స్త్రీ. ఇది దీపపు వత్తికిని, అవస్థకును, నిత్యబహువచనాంతము, బట్టచివరబద్దికిని పేరు.

**నిశా :** స్త్రీ. ఇది మానిపసపునకును, రాత్రికిని, పసపునకును పేరు.

| | |
|---|---|
| ఆశా తృష్ణేదిశోః ప్రోక్తా,<br>రాశి ర్మేషాది పుంజయోః॥(14) | **ఆశా :** స్త్రీ. ఇది ఆశకును, దిక్కునకును పేరు.<br>**రాశి:** పు. ఇదిమేషాది రాసులకును, సమూహము కును పేరు. |
| పేశీ పలలపింద్యాం చ<br>మాంస్యాం ఖడ్గపి ధానకే।<br>అండభేదే ऽపి పేశీ స్యా<br>త్సుపక్వకణికే ऽపి చ॥(15) | **పేశీ:** స్త్రీ. ఇది మాంసపు ముద్దకును, జటామాంసి కిని, కత్తివరకును, గ్రుడ్డునకును, బాగుగా పండిన వరిపండునకును పేరు. |
| వాశోऽటరూషేऽపి ప్రోక్తో।<br>వాశీతక్ష్ణాంచసాధనే | **వాశ :** పు. ఇది అడ్డసరపు చెట్టునకును, ఈ. స్త్రీ. వడ్లవాని బాడిశికిని పేరు. |

★ అథశాంత త్రివర్గః ★

| | |
|---|---|
| కపిశ స్త్విల్ల కేశ్యామే<br>మాధవ్యాం కపిశీ మతా॥(16) | **కపిశ :** పు. అందుగ బంకకును, త్రి. నలుపు పసపుగూడిన వర్ణమునకును, ఈ. స్త్రీ. ఖండిగురి విందలతకును పేరు. |
| కులిశో మత్స్య భేదేస్యా<br>ద్దం భోళా కులిశం మతం।<br>వివశస్స్యాద వశ్యాత్మా<br>రిష్టదుష్టధియోరపి॥(17) | **కులిశ :** పు. ఇది మత్స్య విశేషమునకును, న. వజ్రాయుధమునకును పేరు.<br>**వివశ :** త్రి. ఇది పరవశమైన దానికిని, కీడు సంభవించుటవలన వికలమైన చిత్తముగల దానికిని పేరు. |
| నిస్త్రింశో నిర్దయే ఖడ్గే | **నిస్త్రింశ :** త్రి. దయలేనివానికిని, 32 అంగుళము లకంటె పెద్ద కత్తికిని పేరు. |
| సదృశ స్స్యాచితే సమే। | **సదృశ :** త్రి. యోగ్యమైన దానికిని, సమమైన దానికిని పేరు. |
| బాలిశ శ్శాబకే మూర్ఖే | **బాలిశ :** త్రి. ఇది పిల్లవానికిని, మూఢునకును పేరు. |
| లోమశో. లోమ సంయుతే॥(18)<br>ఏడకే చాపి కాసీస<br>సృగాలీ జటిలాసు చ।<br>లోమశా శూక శింబ్యాంచ | **లోమశ:** త్రి. తఱుచుగా రోమములు గలదానికిని, పు. గొఱ్ఱెకును, స్త్రీ. అన్నభేదికిని, గొలిమిడిచెట్టున కును, నల్లయతివసకును, దూలగొండి చెట్టున కును, తీగగ్రానుగు చెట్టునకును, వెలుమసంధి |

| | |
|---|---|
| మర్కటీ కాక జంఘయోః॥(19) | చెట్టునకును, మహామేదయను చెట్టుకును, పెద్ద |
| మహామేథా తిబలయో | ముత్తవ పులగపు చెట్టునకును, తోటకూరలోని |
| శ్శాకినీభిది చేష్యతే। | భేదమునకును పేరు. |
| వికాశో విజనే వ్యక్తౌ. | **వికాశ** : పు. ఇది రహస్యమునకును, వికసించు టకును పేరు. |
| సకాశ స్సదృశేఽంతికే॥(20) | **సకాశ**: త్రి. సమానమైన దానికి, సమీపమునకును పేరు. |
| ప్రకాశోఽతి ప్రసిద్ధేస్యా త్ప్రహాసాత పయోస్ఫుటే। | **ప్రకాశ**: త్రి. ఇది ప్రసిద్ధమైన దానికిని, పు. వికసించుటకును, ఎండకును, త్రి. స్పష్టమైన దానికిని పేరు. |
| నీకాశో నిశ్చయే తుల్యే | **నీకాశ**: పు. నిశ్చయమునకును, సామ్యమునకును పేరు. |
| హతాశో నిర్దయేఽబలే॥(21) | **హతాశ**: త్రి. దయలేనివానికిని, బలహీనునకును పేరు. |
| కీనాశః (కర్కశే) కర్షకే క్షుద్రే కృతాంత పశుఘాతినోః। | **కీనాశ** : పు. ఇది దున్నుకొను వానికిని, నీచునకును, యమునకును, గొడారి వానికిని పేరు. |
| సుఖాశో రాజతినిశే శోభనాశ ప్రచేతసోః॥(22) | **సుఖాశ**: పు. ఇది నెమ్మిచెట్లలోని భేదమునకును, సుఖముగా భుజించువానికిని, వరుణునకును పేరు. |
| పింగాశో మత్స్యభేదేస్యా త్తథా పల్లీపతావపి। పింగాశీ నీలికాయాంచ పింగాశంజాత్యకాంచనే॥(23) | **పింగాశ** : పు. ఇది మత్స్యవిశేషమునకును, పల్లెటూరి యధికారికిని, ఈ. త్రీ. నీలిచెట్టునకును, మేలిమి బంగారునకును పేరు. |
| పలాశః కింశుకే శట్యాం హరితే రాక్షసేఽపి చ। పత్రే పలాశం | **పలాశ**: పు. ఇది మోదుగ చెట్టునకును, నల్లయతీ వసకును, ఆకుపచ్చరంగునకును, రాక్షసునకును, న. ఆకునకును పేరు. |
| సంవేశ శ్శయనే | **సంవేశ** : పు. ఇది నిద్రకును, పీఠమునకును పేరు. |

చాసనేఽపి చ॥(24)
నివేశ శ్శిబిరో ద్వాహ
విన్యాస సదనేష్వపి।
నిర్వేశో మూర్ఛనే భోగే
నిర్వేశో వేతనేఽపి చ॥ (25)
ప్రదేశో దేశమాత్రే స్యా
త్తర్జన్యంగుష్ఠ సమ్మితే।
భిత్తావపి ప్రదేశస్స్యా
త్సదేశోఽభ్యర్ణ దేశయోః॥(26)

**నివేశ** : పు. ఇది దండువిడిచిన చోటునకును, పెండ్లికిని, ఉంచుటకును, గృహమునకును పేరు.
**నిర్వేశ** : పు. ఇది మూర్ఛకును, అనుభవమునకును, జీతమునకును పేరు.
**ప్రదేశ** : పు. ఇది స్థానమునకును, లొడితెడు ప్రమాణమునకును, గోడకును పేరు.
**సదేశ** : త్రి. ఇది దేశకాలములచేత సమీపమైన దానికిని, పు. స్థానమునకును పేరు.

నిర్దేశ శ్శాసనో పాంత
భాషణేషు ప్రయుజ్యతే।
ఆదర్శో దర్పణే టీకా
ప్రతిపుస్తక యోరపి॥(27)

**నిర్దేశ** : పు. ఇది ఆజ్ఞకును, సమీపమునకును, చెప్పుటకును పేరు.
**ఆదర్శ** : పు. ఇది అద్దమునకును, వ్యాఖ్యాన గ్రంథమునకును, ఒక్కటే గ్రంథముయొక్క వేరొక ప్రతికిని పేరు.

కర్కశః(కఠినే)పరుషేక్రూరే
కృపణే నిర్దయే దృఢే।
ఇక్షౌ సాహసికే కాస
మర్దకంపిల్లయోరపి॥(28)

**కర్కశ** : త్రి. ఇది కఠినమైన దానికిని, క్రూరమైన దానికిని, లోభికిని, దయాశూన్యునకును, దృఢమైన దానికిని, పు. చెరుకునకును, క్రూరకృత్యములయందు వెనుదీయనివానికిని, కసింత చెట్టునకును, కంపిల్లమను గంధ ద్రవ్యమునకును పేరు.

గిరీశో వాక్పతౌ రుద్రే
గిరీశోఽద్రిపతావపి।
ఉడ్డీశో గ్రంధభేదే స్యా
దుడ్డీశ శ్చండి కాపతౌ॥ (29)
తుంగీశ శ్శంకరే చంద్రే
పక్షీశ స్తార్క్ష్య కృష్ణయోః।

**గిరీశ** : పు. ఇది బ్రహ్మకును, శివునకును, పర్వతరాజునకును పేరు.
**ఉడ్డీశ** : పు. ఇది ఆగమశాస్త్ర గ్రంథ విశేషమునకును, శివునకును పేరు.
**తుంగీశ** : పు. శివునకును, చంద్రునకును పేరు.
**పక్షీశ** : పు. ఇది గరుడునకును, కృష్ణునకును పేరు.

ఉపాంశు ర్జపభేదే స్యా
దుపాంశు ర్విజనేऽవ్యయం॥(30)
దుస్స్పర్శాఖ్యా ఖరస్పర్శే
కంటకార్యాం చ వాసకే।

**ఉపాంశు:** పు. ఇది జపవిశేషమునకును, అ. రహస్యమునకును పేరు.

**దుస్పర్శ:** త్రి. ఇది తీవ్రముగా స్పృశించుదానికిని, స్త్రీ. వాకుడు చెట్టునకును, పు. పిన్నరేగటి దూలగొండి చెట్టునకును పేరు.

విపాశాఖ్యా సరిద్భేద
పాశవర్జి తయోర్మతా॥(31)
వికేశీ పటవర్తా స్యా
ద్వికేశీ విధవస్త్రియామ్।

**విపాశా :** స్త్రీ. ఇది విపాశానదికిని, త్రి. పాశాయుధములేనివానికిని పేరు.

**వికేశీ :** స్త్రీ. ఇది గుడ్డవత్తికిని, విధవకును పేరు.

భూకే(శీబల్బ)శ్యవల్లుజేऽపి స్యా
ద్భూకేశశ్చైవలేవటే॥ (32)
జలేశో వరుణే వార్ధా
వభీశుః ప్రగ్రహేద్యుతౌ।

**భూకేశీ :** స్త్రీ. ఇది క్రాలుగచ్చ చెట్టునకును, పు. నాచునకును, మఱ్ఱిచెట్టునకును పేరు.

**జలేశ:** పు. వరుణునకును, సముద్రమునకును పేరు.

**అభీశు:** పు. పగ్గమునకును, కిరణమునకును పేరు.

★ **అథశాంత చ్చతుర్వర్ణః** ★

అపదేశ స్స్మృతో లక్ష్యే
నిమిత్త వ్యాజయోరపి॥(33)
జీవితేశో యమే కాంతే
జీవాతౌ జీవనాధిపే।

**అపదేశ :** పు. ఇది గుఱికిని, కారణమునకును, మిషకును పేరు.

**జీవితేశ :** పు. ఇది యమునకును, పెనిమిటికిని, బ్రతికించెడి యౌషధమునకును, జీవనాధారమగు ప్రభువునకును పేరు.

ఆశ్రయాశో హుతవహే
భవేదాశ్రయ నాశకే ॥ (34)
నాగపాశ స్స్మృతః స్త్రీణాం
కరణే వరుణాయుధే।
పురోడాశో హవిర్భేదే
చ మస్యాం పిష్టకస్య చ ॥ (35)
రసే సోమలతాయాశ్చ
హుతశేషేऽపి కీర్తితః।

**ఆశ్రయాశ:** అగ్నికిని, స్త్రీ. ఆశ్రయమును చెఱచువానికిని పేరు.

**నాగపాశ:** పు. ఇది స్త్రీల రతిబంధవిశేషమునకును, వరుణదేవుని యాయుధమునకును పేరు.

**పురోడాశ :** పు. ఇది హోమ ద్రవ్యవిశేషమునకును, పిష్టపాత్రమునకును, సోమరసమునకును, హోమశేషమునకును పేరు.

| | |
|---|---|
| పరివేశః పరివృత్తౌ<br>భానోస్సవిధమండలే॥(36) | **పరివేశ :** పు. ఇది ఆవరణమునకును, సూర్యపరివేషమునకును పేరు. |
| ప్రతిష్కశ స్సహాయే స్యా<br>ద్వార్తాహర పురోగయోః। | **ప్రతిష్కశ :** స్త్రీ. ఇది సహాయునకును, జాబులు మోయువానికిని, ముందుగా నడచువానికిని పేరు. |
| ఉపస్పర్శ స్స్పర్శమాత్రే<br>స్నానాచమనయోరపి॥(37) | **ఉపస్పర్శ :** పు. ఇది స్పృశించుటకును, స్నానమునకును, ఆచమనమునకును పేరు. |
| భూమి స్పృగ్వైశ్య నరయోః | **భూమిస్పృక్ :** పు. ఇది కోమటికిని, మనుష్యునకును పేరు. |
| క్రూరదృక్స్యాత్ఖలే శనౌ। | **క్రూరదృక్ :** పు. దుర్జనునకును, శనికిని పేరు. |
| అపభ్రంశోऽ పశబ్దే స్యా<br>ద్భాషా భేదా వపాతయోః॥ (38) | **అపభ్రంశ :** పు. వ్యాకరణ సంస్కార శూన్యమగు శబ్దమునకును, గ్రామ్య భాషకును, పడుటకును పేరు. |
| ఉపదంశోऽ వదంశే స్యా<br>న్మేఢ్రరోగేऽపి కీర్తితః। | **ఉపదంశ :** పు. ఇది సురాపానసమయమున తినెడునంజుడు మాంసమునకును, సుఖరోగమునకును పేరు. |
| ఖండపరశుః పరశు<br>రామేశంకరే చూర్ణలేపిని॥(39)<br>ఖండామలకభైషజ్యే<br>సింహికాతనయేऽపి చ। | **ఖండపరశు :** పు. ఇది పరశురామునకును, శివునకును, గంధవడి పూయువానికిని, ఖండామలకమను ఔషధమునకును, రాహుగ్రహమునకును పేరు. |
| పాదపాశీ ఖడ్గు(ఖట్వి)కాయాం<br>శృంఖలాకటకేऽపి చ॥(40) | **పాదపాశీ :** స్త్రీ. ఇది ఘంటకును, గొలుసుకడియమునకును పేరు. |
| స్మృతా పంచదశీ పౌర్ణ<br>మాస్య మావాస్యయోరపి। | **పంచదశీ :** స్త్రీ. ఇది పున్నమకును, అమావాస్యకును పేరు. |
| ధూర్జటౌ ఖండపరశు<br>ర్జామదగ్న్యే విధుంతుదే ॥ (41)<br>ఖండామలక భైషజ్యే<br>చూడాల్యేऽపి స్మృతా బుధైః। | **ఖండపరశు :** పు. ఇది శివునకును, పరశురామునకును, రాహువుకును, ఖండామల కౌషధమునకును, గుంద్రతుంగముస్తకును పేరు. |

